# వ్యాస కదంబం

ఆచార్య కె. సర్వోత్తమరావు
తెలుగు అధ్యయనశాఖ
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

పారిజాత ప్రచురణలు
6-7-554, హరేకృష్ణ రోడ్
తిరుపతి-7

# వినతి

'వ్యాస కదంబం' అనే పుస్తకంలో 13 వ్యాసాలున్నాయి. ఈ వ్యాసాలలో కొన్ని ఆలిండియా రేడియో తిరుపతి, ఆలిండియా రేడియో కడప ద్వారా ప్రసారానికి నోచుకొన్నాయి. మరికొన్ని స్రవంతి, ఆంధ్ర జ్యోతి, సద్గురువాణి, వాఙ్మయి పత్రికలలో వచ్చాయి. మరికొన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో చదివినవి,

రేడియోలో ప్రసంగం విన్నవారు, పత్రికలలో నా వ్యాసాలు చదివినవారు వేదికమీద కూర్చుని ప్రసంగించగా శ్రద్ధతో విన్నవారు ఈ వ్యాసాలన్నీ ఒక పుస్తక రూపంలో వస్తే బాగుంటుందని భావించారు. కొందరు ఉత్తరాలు కూడా వ్రాశారు. ప్రత్యేకించి కొందరు బలవంతం కూడా చేశారు. అందరి అభిమానాలు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహకారంవల్ల ఈ 'వ్యాస కదంబం' అచ్చు రూపంలో వచ్చింది. ఈ వ్యాసాలు సమగ్రమని చెప్పలేను. అసమగ్రమని అంగీకరించలేను. ఇవి సామాన్యుల కోసం సామాన్యుడు వ్రాసిన వ్యాసాలు.

ఈ పుస్తకాన్ని అందంగా, అతి తక్కువ కాలంలో ముద్రించిన శ్రీ జి. వీరబ్రహ్మం - భాగ్యం క్వాలిటీ ప్రింటర్స్, మదరాసు వారికి నా కృతజ్ఞతలు.

తిరుపతి
'శ్రీముఖ' ఉగాది

కె. సర్వోత్తమరావు

# విషయసూచిక

# మహాభారతం నాడు - నేడు

భారతీయులకు రామాయణ భారతాలు రెండూ రెండు కళ్ళలాంటివి. ఈ గ్రంథాలు వ్రాసిన వ్యక్తులు మహర్షులు. మహాకవులు. తాము తమ జీవితములో దర్శించిన దృశ్యాలను అక్షరబద్ధం చేసినవారు. అంతేకాదు ఆనాటి చరిత్రలో ప్రత్యక్షపాత్ర వోషించినవారే. భారతకాలంనాటి పాత్రలతో సన్నిహితసంబంధం కలవారు. త్రేతాయుగంనాటి రాజకుమారుని జీవితమార్గం రామాయణంలో కనిపిస్తే ద్వాపరయుగంనాటి సాంఘిక రాజకీయచరిత్ర భారతంలో కనిపిస్తుంది. మానవ మనస్తత్వచిత్రణ, ధర్మచిత్రణ రెంటిలోను ప్రధానమయినప్పటికి రామాయణం ఆదర్శమార్గాన్ని చిత్రించింది. భారతం స్వాభావికస్థితిని వర్ణించింది. భారతీయ జీవనతత్త్వాన్ని అర్థంచేసుకోవాలంటే రామాయణ భారతాలు తప్పక చదవాలి, ఈ అభిప్రాయాన్నే చక్రవర్తి రాజగోపాలాచార్యులవారు

One may tour all over India and see all things; but one cannot understand Indian way of life unless one has read the Ramayana and Maha Bharata అని స్పష్టంచేశారు.

'వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి' అనడం తెలుగునాట అందరినోట పలికేమాట. భారతం కేవలం కౌరవ పాండవుల కథమాత్రంకాదు. కొందరికిది ధర్మశాస్త్రం. వేదాంతగ్రంథం. మహాకావ్యంకూడా. మహాభారతం కొన్ని వేలసంవత్సరాలనాటి కథ కావచ్చుగాని ఆ కథకు మరణంలేదు. యుగాలు గడచినా, జగాలుమారినా ఆ కథలోని మౌలికసత్యం ఇపుడుకూడా కళ్ళకు కనిపిస్తూ వుంటుంది.

స్థూలదృష్టితో పరిశీలిస్తే భారతకథ 'ఆస్తిపంపకానికి సంబంధించిన కథ' ఆస్తికోసం అన్నదమ్ములు కొట్లాడుకోవడం, పెద్దమనుష్యులు పంచాయితీజరపడం, అదీ విఫలమయితే కోర్టుకెక్కడం ఈరోజుల్లో సర్వత్రా కనిపించేదృశ్యం. అలాగే పిత్రార్జితమయిన రాజ్యభాగంకోసం పాండవులు ప్రయత్నించారు. రాయబారాలు నడిపారు. చివరకు అన్నీ వ్యర్థమయితే పోరాడారు. చివరకు విజయం సాధించారు.

సృష్టిలో స్త్రీపురుషులు సమానులు. కాని పురుషాధిక్యతకలిగిన సమాజంలో స్త్రీలు అణచివేయబడడం, అనుమానాలు భరించడం, అత్యాచారాలకు గురికావడం ఆనాటి కథమాత్రంకాదు. ఈనాటిదికూడా. దీనికి ప్రధానమయిన కారణం స్త్రీల సైజమయిన అజ్ఞానం, కొంత అవేశప్రవృత్తికూడా. సాంఘికంగా కనిపించే భద్రతారాహిత్యం, శారీరకమయిన ప్రవృత్తి, వీటివల్ల స్త్రీలు ఇబ్బందులకు లోను కావడం మనకు తెలిసిందే.

భారతకథలో 'స్త్రీపురుష సంబంధాలు' చాల చిత్రంగా కనిపిస్తాయి. తల్లి తండ్రిలేని వేళ, ఆలనాపాలనా చూసేవారు దూరమయిన వేళ, ఏకాకిగావున్న సుందరాంగిని పలుకరించి, నమ్మించి, ఆశలతోరణాలు కట్టించి, మాటల మంగళ సూత్రంలో బంధించి, అనుభవించి అంతా అయ్యాక విస్మరించే 'జులాయి మగాళ్ళ' సంగతి మనకు తెలిసిందే. భారతంలోని దుష్యంతుడుచేసిన పనికూడా ఇదే. తనకేమీ కాబట్టనట్టు వెళ్ళిపోయాడు విశ్వామిత్రుడు. నిర్దాక్షిణ్యంగా కడుపు బరువు 'దించుకుని' చక్కాపోయింది మేనక. పెంచినవాడు కణ్వుడు. కణ్వుడు లేనివేళ అంటే యజమాని లేనివేళ ఆశ్రమప్రాంతంలోనికి వచ్చిపోయి 'అవాకులు చవాకులు' పలికి అతిలోకసుందరిని బుట్టలోవేసుకున్నాడు దుష్యంతుడు.

అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య అకాలమరణంపాలయితే లేదా సంసారానికి పనికిరానివిధంగా రోగగ్రస్తురాలయితే, లేదా మరోవ్యక్తి మోజులోపడి ఇంటిగడప దాటితే మరోపెళ్లికి ముస్తాబుకావడం మామూలే. కట్టుకున్నవాడు భార్యావియోగం సహించలేక, ఆవిడతోడి అనుబంధాన్ని మరవలేక, అడుగడుగున ఆవిడ స్మృతులు వెంటాడుతుంటే 'ఎలిజీలు' వ్రాసుకోవడంకూడా మనం చూస్తూనేవున్నాం. కాని చెట్టంత కొడుకుండగా కొడుకు బాగోగులుచూడడం మానేసి, తామే పెళ్ళికొడుకుగా తయారుకావడం ఈ లోకంలో చెదురుమదురుగా కనిపించే దృశ్యం. భారతంలోని శంతనమహారాజు చేసిన నిర్వాకం ఈలాంటిదే. గంగావియోగంవున్నా, సత్యవతిని చూచేసరికి సర్వస్వం మరచిపోయాడు. బలవంతుడు, గుణవంతుడు, యువకుడు కన్నకుమారుడయిన భీష్ముని మరచిపోయాడు. రాచరికం మరచిపోయాడు. సాంఘికపు కట్టుబాట్లను విస్మరించాడు. చివరకు కొడుకే పెళ్ళిపెద్దయితే మరో వివాహం చేసుకున్నాడు.

ఇష్టంలేని వివాహం జరిగినా, కట్టుకున్న భార్య అనుకూలవతి కాకపోయినా మగవాడు మరో దాని వలలో పడటం ఖాయం. భారతంలోని యయాతి చరిత్ర ఈలాంటిదే. శుక్రాచార్యుల ఆజ్ఞ ప్రకారం యయాతి దేవయానిని వివాహమాడినాడు. కాని శర్మిష్ఠను చూశాక అతని మనసు తిరగబడింది. దేవయానితో గడిపిన సాంసారిక జీవితంలోని అసంతృప్తులు గుర్తుకు వచ్చాయి. శర్మిష్ఠ అందం, చందం అతణ్ణి ఉక్కిరి బిక్కిరి చేశాయి. దేవయానికి శర్మిష్ఠ దాసి అయినా యయాతి ఆమెవైపే మొగ్గాడు. చివరకు దాసీ సాంగత్యం చేశాడు.

'ఏ వయసుకు ఆ ముచ్చట' అంటారు పెద్దలు. కన్నడంలో ఒక మంచి సామెత వుంది. ఇల్లు, పొలం, కన్నకూతురు కనీసం తన్ను ఒకసారయినా కన్నెత్తి చూడమని యజమానిని ప్రార్థిస్తుందట. చూస్తుండగనే ఎదిగిపోయి యుక్తవయస్కురాలయిన అమ్మాయిల బాగోగులు చూడకపోతే అనర్థాలు రావడం ఖాయం. వయసుపెట్టే తొందర, పరిసరాల ప్రభావం, అజ్ఞానం, ఆడవారిని అథః పాతాళానికి నెట్టివేస్తాయి. కన్య గర్భవతి కావడం, ఆపై బాధపడటం అందరికి తెలిసిందే. భారతంలోని 'కుంతి' అచ్చం ఈలాంటి ప్రవృత్తి కలిగిన కన్య. దుర్వాసుడు అనుగ్రహించిన వరాన్ని పరీక్షించాలనుకోవడం, సూర్యుడు ప్రత్యక్షం కావడం, కుంతిని అనుగ్రహించడం, కర్ణుడు జన్మించడం, చివరకు ఎవరికీ చెప్పుకోలేక 'వదలించుకోవడం' జరిగింది. అక్రమ సంతానంవల్ల కలిగే సంతానం పడేపాట్లు కర్ణునిలో కనిపిస్తాయి.

వయసు బట్టి కుటుంబంలో వివాహాలు చేయడం మన అందరికి తెలిసిందే. కాని ఈ నియమం ఆడవారిపట్ల మినహాయింపు. చెల్లెళ్ళకు వివాహం చేసి అన్నయ్యలు పెళ్ళాడడం తప్పు కాదు. కాని అన్నలుండగా తమ్ముడు వివాహం చేసుకోవడం అరుదుగా కనిపించే దృశ్యం. చాల సందర్భాలలో ఈలాంటి వాటికి 'అన్న' అంగీకారం వుంటుంది. భారతంలో లాక్షాగృహ దహనానంతరం పాండవులు అరణ్యవాసం చేసే వేళ 'హిడింబ' భీముని చూచి మరులుగొంటుంది. తన మనసులోని మాటను వాచ్యం చేస్తుంది. చివరకు తల్లి సమ్మతిస్తే, ధర్మరాజు అంగీకరిస్తే భీముడు 'హిడింబను' వివాహమాడాడు. ఘటోత్కచుని జన్మకు కారణమయ్యాడు.

సాహిత్యం సమాజానికి దర్పణం లాంటిది. సాంఘికాంశాలు సాహిత్యంలో ఏదో రూపంలో కనిపిస్తాయి. మేధావులు తమ కేపీ పట్టనట్లు వూరుకోవడం ఈ శతాబ్దంలో మరీ ఈ పదేళ్ళలో చూస్తున్నాం. భారతకాలంలో భీష్మ, ద్రోణ, కృపాచార్య మొదలయిన పెద్దలు దుర్యోధనుని చేతలు ధర్మవిరుద్ధమని తెలిపినా ఏమీ చేయలేకపోయారు. అందువల్లనే కృష్ణుడు

'సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచే
బారము పొందలేక చెడబారిన దైనయవస్థ దక్షులై
వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగు గాని'

గట్టిగా ఖండలించాడు.

ఎవడో ఒక వ్యక్తి అపకారం చేస్తే ఆ వ్యక్తి కులాన్ని, అవ్యక్తి అనుయాయి వర్గాన్ని పీడించడం మనం చూస్తున్నాం. పరీక్షిత్తు మరణానికి తక్షకుడు కారణం, ఆ కోపంతో జనమేజయుడు 'సర్పయాగం' చేయడానికి సిద్ధమయ్యాడు. అలాగే పరశురాముడు రాజకులాన్ని వెదకి వెదకి చంపాడు.

గృహదహనాలు, హత్యలు, లూఠీలు 20వ శతాబ్దంలో రోజూ వినే వార్తలు. భారతకాలంలోని 'లాక్ష గృహదహనం' ఈలాంటిదే. అమాయకులయిన వారు అడవిలో పయనం చేస్తుంటే దారి కాచి, పీడించినట్లు హిడింబాసురుడు అందరిని అడ్డుకున్నాడు. పనీ పాట లేక, దబాయింపులతో, ఇతరుల శ్రమల్పై బ్రతికే రౌడీమూక దొరలున్నట్లే, బకాసురుడు గ్రామీణుల్ని అణచి హాయిగా కడుపారా తినేవాడని చెప్పవచ్చు. కనికరం లేక, నిద్ర పోతున్నారనే కాసంత ఇంగితం లేక, ఊచకోత కోసిన సన్నివేశంలాగే అశ్వత్థామ 'ఉప పాండవుల్ని' పరలోకం పంపించారు.

వెలది, జూదం, వేట, పానం మొదలయిన వాటిని సప్తవ్యసనా లనడం పరిపాటి. ఈ వ్యసనాల కారణంతో తమకున్న ఆస్తిని కర్పూరహారతి చేయడం, అనర్థాలు కోరి తెచ్చుకోవడం, అగడు పడడం, వీధుల్లో పడడం అందరికీ తెలిసిందే. పాండురాజు వేటవల్ల, శుక్రాచార్యులు పానంవల్ల, ధర్మరాజు జూదంవల్ల, కీచకుడు వనితామోహంవల్ల పడరాని పాట్లు పడ్డారు.

'సుతవ్యామోహమ్మది నై జమేరికిని' అన్నాడొక మహాకవి. కన్న మమకారం ఏ పనికయినా సిద్ధపడుతుంది. రాముని మీది మమకారం దశరథుణ్ణి, దుర్యోధనుని మీది మమకారం ధృతరాష్ట్రుణ్ణి ముప్పుతిప్పలు పెట్టింది. చివరకు విధ్యుక్తధర్మంలో అడుగడుగునా అడ్డు వచ్చి అధర్మానికి 'సై' అంది.

తల్లిదండ్రులు లేకపోతే పిల్లలు పడే కష్టం మనకందరికి తెలిసిందే. పాండురాజు మరణించాడు. పాండవుల్ని పట్టించుకున్న వారు లేరు. చివరకు ఋషులు వారిని కౌరవసభకు చేర్చారు. తల్లీ తండ్రీ తెలియని కర్ణుడు పడ్డ ఇబ్బందులెన్నో.

'వెట్టి చాకిరి' ఈనాడు సర్వత్రా గ్రహిస్తున్న అంశం. ఆలనాడు వినత, గరుత్మంతుడు కద్రువకు వారి సంతానానికి 'వెట్టిచాకిరి' చేసినవారే. గరుత్మంతుడు బలవంతుడయినా బలహీనులు, అసమర్థులయిన నాగులకు 'ఊడిగం' చేయవలసి వచ్చింది. చివరకు అమృతభాండం తెచ్చియిచ్చినట్టు నటించి ఋణవిముక్తుడయ్యాడు.

ఇంక విద్య, వైద్యం గురించి కొన్ని సామ్యాలు చూద్దాం. ఒక 'కుండలో' గర్భాన్ని వుంచి కాపాడడం, పిల్లలు పుట్టడం భారతంలో కనిపించే అంశం. ఇది యించుమించు 'టెస్ట్ ట్యూబ్ బేబీ'లను తలపించే అంశం. విపరీతమయిన లైంగిక సంపర్కంవల్ల ఆరోగ్యం దిగజారుతుందని, ఎయిడ్స్ లాంటి వ్యాధులు వస్తాయని నేటి నిర్ధారణ. విచిత్ర వీర్యుడు అర్ధాయుష్కుడు కావడం, పాండురాజు పాండురోగ పీడితుడు కావడం, అతిరిక్త శృంగార కార్యకలాపాల వల్లనే అనడం తప్పుకాదు.

ఒక ప్రభుత్వ ఉద్యోగి ఆ ప్రభుత్వానికి విధేయుడుగా వుండడం విధ్యుక్తధర్మం. అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే 'కాండక్ట్ కోడ్' ప్రకారం శిక్షార్హుడు. కురుపాండవ కుమారులకు విద్యాబోధన చేయడాని కోసం 'ద్రోణుడు' నియుక్తుడయ్యాడు. కులద్వేషంతో కాకుండా 'ఏకలవ్యుని' విధ్యుక్తధర్మం కారణంగా శిష్యునిగా అంగీకరించలేదు. అర్జునునికి అన్ని రహస్యాలు చెప్పాడు. తన

కుమారుడయిన అశ్వత్థామను కూడా పక్కకు నెట్టి పార్థునికి పరమార్థం ఉపదేశించాడు.

ఈ రోజుల్లో 'నకిలీ సర్టిఫికేట్ల' భాగవతం తరచూ వింటున్నాం. ఆదాయం విషయంలో, కులంవిషయంలో ఈ దాగుడు మూతలు కనిపిస్తాయి. ఈలాంటివారు పట్టుబడితే నిరుత్తరులవుతారు. పరశురాముడు ఒక కులం వారికి తప్ప మరొకరికి విద్యనేర్పనని చెప్పాడు. ఒకసంస్థ వ్యక్తిగతమయినప్పుడు అతణ్ణి శాసించే హక్కు లేదు. కర్ణుడు తప్పుడుకులం పేరు చెప్పి శిష్యునిగా చేరాడు. చివరకు పట్టుబడ్డాడు. అందరికీ అన్ని అవకాశాలుంటే కర్ణుడు ఈలాగా చేయనవసరం లేదు.

ఈ రోజుల్లో తెలివి తేటలున్నవాడు పేదవాడుగా, అసమర్థుడుగా చెలామణి అవుతాడు. పైగా దారిద్ర్య బాధతో క్రుంగిపోతుంటాడు. మేధావుల ఆర్థిక దారిద్ర్యానికి ద్రోణుడు ప్రతీక. కన్నకొడుకు అశ్వత్థామ ఆకలిని తీర్చలేని దుర్భర జీవితం గడిపాడు. చివరకు ఆశ్రయమిచ్చిన వారికి అమ్ముడయిపోయాడు. బలహీనుల్ని ఉద్ధరించడం తప్పుకాదు కాని ఆ పేరుతో మేధాసంపత్తి వున్నవారిని అణచివేయాలనుకోవడం సామాజిక శ్రేయోమార్గం కాదు.

ఇక రాజకీయ సంబంధాలు, అసెంబ్లీలలో పార్లమెంటులలో ప్రతిపక్షాలు 'వాక్ అవుట్' చేయడం దినపత్రికల్లోచూస్తున్న విషయం. తనకు నచ్చని విషయం తీర్మానం చేసినప్పుడు, తన వాదనకు తగినంత సంఖ్యాబలం లేనప్పుడు ఆవేశంతో వూగిపోతూ నిరసన తెలియజేస్తూ బయటికి నడవడం వింటూ వుటాం. శ్రీకృష్ణునికి ఆతిథ్యం ఇవ్వడానికి ధర్మరాజు సిద్ధమయినపుడు భీష్మాదులు ధర్మరాజును ప్రోత్సహించినపుడు శిశుపాలుడు తన మందీమార్బలంతో నిష్క్రమించాడు.

రాజకీయాలలో నిరంతర శత్రువులు, నిరంతర మిత్రులు లేరు. కృష్ణుని బంధించాలనుకున్న దుర్యోధనుడు యుద్ధం తప్పదని తెలుసుకున్నాక కృష్ణుని సాహాయ్యం కోరాడు. ఎన్నికల్లాంటివి వచ్చినపుడు గ్రామం, నగరం రెండూ సమర క్షేత్రాలయినట్టు, తమ కనుకూలమయిన సర్దుబాట్లు చేసుకున్నట్లు ఆనాటి రాజులు కొందరు కౌరవపక్షం చేరారు. మరికొందరు పాండవపక్షం శ్రేయస్కరమని అనుకున్నారు.

రాయబారాలు ఈనాటివి కావు. అనాదిగా వుండేవి. భారతంలోని ద్రుపద పురోహితుని రాయబారం, సంజయ రాయబారం, శ్రీకృష్ణుని రాయబారం లాంటివి. ఆయా దేశాలమధ్య విద్వేషం రగిలేవేళ చేసుకునే ప్రయత్నాల వంటివే.

తమకు భద్రతలేనివేళ, అజ్ఞాతంలోకి వెళ్ళిపోవడం రాజకీయ నాయకులకు అలవాటయిన విషయం. పాండవుల అజ్ఞాతవాసంకూడా ఈలాంటిదే. కాకపోతే జూదంలోని షరత్తుకూడా. ఆలాగే దుర్యోధనుడు మడుగులోకి దూకడం, భద్రత చేసుకోవడం. రాజులసమర్థులయినవేళ అతణ్ణి ఆశ్రయించినవారు అకృత్యాలకు ఎగబడుతుంటారనడానికి 'కీచకుని' వృత్తాంతం సాక్ష్యం.

ఇంక యుద్ధాలజోలికివస్తే కొన్ని సామ్యాలను గుర్తించవచ్చు. వారుణాస్త్రం ప్రయోగిస్తే వర్షాలుకురవడం. ఆగ్నేయాస్త్రం ప్రయోగిస్తే నిప్పులుకురవడం భారతంలో కనిపించే అంశాలు. సుదూరంలోవున్న ఒక లక్ష్యాన్ని భేదించడం 'మిసల్స్' ప్రయోగంలాంటిదే. అర్జునుడు సైంధవుణ్ణికొట్టి ఆ తల అతని తండ్రి చేతిలోపడేటట్లు చేశాడట. ఆలాగే అశ్వత్థామ 'బ్రహ్మశిరోనామక' అస్త్రాన్ని ప్రయోగించి 'ఉత్తరగర్భాన్ని' నిష్ప్రయోజనం చేశాడట. పొగవాయువు వదిలితే (బాష్పవాయువు) ఊపిరాడక చతికిలబడడం పేపర్లలో వింటున్నాం. ఉత్తర గోగ్రహణసందర్భంలో సమ్మోహనాస్త్రం ప్రయోగిస్తే ఒకరిద్దరుతప్ప తక్కిన వాళ్ళంతా వివశులుకావడం ఈలాంటిదే.

ఈనాడు ఆటల పోటీలు జరుగుతున్నా, వినోదకార్యక్రమాలు జరుగుతున్నా ప్రత్యక్షవ్యాఖ్యానం చేసేవిధంగా సంజయుడు ధృతరాష్ట్రునికి సమరవిశేషాలను 'రన్నింగ్ కామెంటరీ'లాగా వినిపించాడు. ఇంధన వనరులు తగ్గిపోయిన ఈ రోజుల్లో 'సోలార్ ఎనర్జీ' గురించి విస్తృతంగా ప్రచారం చేస్తున్నాం. ఇది సహజసిద్ధమయింది. ద్రౌపది అరణ్యవాసంలోవుండగా సూర్యుని అనుగ్రహంతో లభించిన అక్షయపాత్ర యించుమించు ఈలాంటిదే.

ఇక మానసికసంబంధాలను పరిశీలిస్తే అనాటి వ్యక్తులస్వభావాలు ఈనాటి వ్యక్తులలోకూడా కనిపిస్తాయి. అన్నీ వున్నవారు కాలవైపరీత్యంవల్ల పోగొట్టుకుని నిస్సహాయస్థితిలోవుంటే వారిని హేళనచేసేవిధంగా దాయాదులు వారిముందు డాబు

దర్పం ప్రదర్శిస్తుంటారు. పాండవులు అరణ్యవాసం చేసేవేళ దుర్యోధనుడు మందీమార్బలంతో పాండవులున్నచోటికివెళ్ళి ప్రవర్తించినతీరు ఈలాంటిది. ఈలాగే అనుకూల్యశత్రుత్వం. స్నేహితునిలాచేరి వుబ్బించి వ్యూహంలోపడవేసి ఆపై తప్పించుకుని నమ్మినవారిని నట్టేటముంచడం ఎన్నికలలో, వ్యాపారాల లావాదేవీలలో చూస్తున్న విషయం. ఆలాగే శల్యుడు కర్ణుని సారథ్యానికి ఒప్పుకుని రథాన్ని నడిపిస్తూ పగవారిని పొగడుతూ కర్ణుని నిర్వీర్యుణ్ణిచేస్తూ అతని ఉత్సాహాన్ని దెబ్బతీశాడు.

లోకంలోని వ్యక్తులు రెండురకాలవారు. ఆదర్శం 'ఒంటబట్టించుకుని' చివరిదాకా బతికేవారు కొందరు. వాస్తవాన్ని గుర్తించి సర్దుకుపోయేవారు కొందరు, భీష్ముడు మొదటిరకంవాడు. అతడొక కర్మవీరుడు. గాంధీ, జయప్రకాశ్‌నారాయణ్, కామరాజ్‌లాంటి ఆదర్శజీవి.

ఉమ్మడికుటుంబ వ్యవస్థలో పెద్దవానికి పెద్దపీట. ఈ వ్యవస్థ కనుమరుగైపోతున్న వ్యవహారం. పొరపొచ్చాలున్నా సర్దుకుపోవడం ఈ వ్యవస్థలోని సజీవ గుణం. ఈ వ్యవస్థకు బద్ధులయినవారు పాండవులు. అందువల్ల తప్పంతా 'ధర్మరాజుదే' అయినా భీమాదులు ఉమ్మడిబాధ్యత వహించారు. అష్టకష్టాలుపడ్డారు.

సృష్టిలో స్త్రీ అబలకాదు. అవసరమయితే సబల. పామయినా పగ మరచిపోతుంది కాని భామిని పగ మరచిపోదు. పురుషులకంటె దృఢంగా రాజకీయాలు నడపడం ఆడవారికి చేతయినవిషయం. స్వర్గీయప్రధాని ఇందిరాగాంధీ ఇందుకు సాక్ష్యం. భారతంలో ద్రౌపదికున్న కార్యనిష్ఠ అలాంటిది.

భారతం పుక్కిటిపురాణంకాదు. సాగుతున్న మానవజాతి చరిత్ర. పెల్లుబికే ఆవేశాలకు అద్దంపట్టిన చరిత్ర. వారసత్వాన్ని అడుగడుగునా గుర్తింపచేసే సాంఘికచరిత్ర. సంగ్రహంగా చెప్పాలంటే భారతం ఒక విజ్ఞానకోశం.

ఆల్ ఇండియా రేడియో,
తిరుపతి.
14-12-81

# తెలుగు సాహిత్యం - ఆళ్వారుల ప్రసక్తి

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో వీరశైవ సాహిత్యాన్ని ప్రత్యేక విభాగంగా గుర్తించి పరిశోధన చేసినవారున్నారు. పఠన పాఠనాదులలో ఆ సాహిత్యం ప్రత్యేకతలను నిరూపించినవారున్నారు. కాని వైష్ణవ సాహిత్యాన్ని అందులోను ఆళ్వారుల వాఙ్మయాన్ని విస్తృతంగా సాధికారికంగా పరిశోధన చేసినవారు చాల తక్కువ. పఠనపాఠనాదులలో ఆ వాఙ్మయం ప్రత్యేకతలను స్పష్టంగా నిరూపించినవారు లేరని చెప్పవచ్చు. ఆళ్వారుల వాఙ్మయం చాలవరకు తమిళంలో వుండడం, తెలుగు కవులలో చాలమందికి తమిళంతో పరిచయం నామమాత్రం కావడం కారణాలు కావచ్చు. ప్రాచీనాంధ్రయుగంలో శైవ ప్రాబల్యం ఎక్కువ కావడం కూడ కారణం కావచ్చు. కాని విజయనగర రాజుల కాలంనుండి ప్రత్యేకించి రాయలయుగంనుండి వైష్ణవం ఆంధ్రదేశంలో వ్యాప్తి కావడంతో వైష్ణవ సాహిత్యం వెలుగులోకి వచ్చింది.

1. ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో ఆళ్వారుల ప్రసక్తి :

ఆంధ్ర వాఙ్మయంలో మొట్టమొదట ఆళ్వారుల ప్రసక్తి కృష్ణమాచార్యుల (13 వ శతాబ్ది) సింహగిరి వచనాలలో కనిపిస్తుంది "దేవా! శ్రీ రామానుజుల సిద్ధాంతమునుబోలు మఱి సిద్ధాంతము లేదు. పరమాచార్యులంబోలు మఱి యాచార్యులు లేరు. పరమ భాగవతులంబోలు మఱి సమ్మోదపరులు లేరు. వారి కైంకర్య పరులంబోలు మఱి కైంకర్యపరులు లేరు. 'అస్మద్గురుభ్యో నమః' అను మంత్రంబునకు సరి మంత్రంబు లేదు. పరమ రహస్యంబునుంబోలు మఱి రహస్యంబు లేదు. స్వామీ సింహగిరి నరహరి నమోనమో దయానిధీ"! (సింహగిరి వచనములు - 17 వ వచనము).

ఆపై పదకవితా పితామహుడు 32 వేల సంకీర్తనలు వ్రాసినవాడు. శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తుడయిన తాళ్ళపాక అన్నమాచార్యుల (15 వ) సంకీర్తన వాఙ్మయంలో ఆళ్వారుల ప్రసక్తిని గుర్తించవచ్చు.

"కారి మారసుతుని చక్కని మాటలకు చొక్కి
చూరగా వేదాల గుట్టు చూచినవాడు
తీరని వేడుకతో తిరుమంగయాళవారి
ఆరడి ముచ్చిమి గూడి కానపడ్డవాడు
పెరియాళవారి బిడ్డ పిసికి పై వేసిన
విరుల దండల మెడ వేసినవాడు"

అని అన్నమయ్య నమ్మాళ్వారును, తిరుమంగై ఆళ్వారును, పెరియాళ్వారును, గోదాదేవిని ప్రస్తావించాడు. అహోబలంలో ఆదివన్ శఠగోపయతుల దగ్గర శిష్యరికం, తిరుమలవాసం, నాలాయిర దివ్యప్రబంధ శ్రవణం, వైష్ణవమతాను రక్తి వీటికి కారణాలు కావచ్చు.

2. ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో పన్నిద్దరాళ్వారుల కావ్యాలు :

ఆళ్వారులు పన్నిద్దరు. వీరిని గురించి ఒకచోట ప్రస్తావించి వారి చరిత్రలను విపులంగా వర్ణించిన ప్రసిద్ధ ప్రాచీన కవులు తాళ్ళపాక చిన్నన్న, సిద్ధిరాజు తిమ్మరాజు, నంబూరి కేశవాచార్యులు. ఈ ముగ్గురు కవులు విష్ణు భక్తులయిన పన్నిద్దరాళ్వారుల చరిత్రలనేగాకుండా వైష్ణవమతవ్యాప్తి గావించిన యామునాచార్య, రామానుజాచార్యుల చరిత్రలను గూడా తమ గ్రంథాలలో విపులంగా వర్ణించారు. వీరిలో మొదటివాడయిన తాళ్ళపాక చిన్నన్న క్రీ. శ. 1498 – 1561 నాటివాడు. పెద తిరుమలయ్య నాలుగవ కుమారుడు. అన్నమాచార్య చరిత్రం, పరమయోగివిలాసం, అష్టమహిషీ కల్యాణం, ఉషాపరిణయం గ్రంథాలను వ్రాసినవాడు. ద్విపద కవిత్వానికి గౌరవాదరాలు పెంచిన కవి. అందువల్లనే 'చిన్నన్న ద్విపదకెరగు' అని ప్రసిద్ధి ఏర్పడింది. ఇతనికి చిన్న తిరు వేంగళనాధయ్య, చిన తిరువెంగళయ్య, తిరువెంగళనాధయ్య, తిరువెంగళ నాధయ్యంగార్, వెంగళార్య, తిరు వేంకటనాథయ్య, తిరువేణాధర్, తిరు వేణాధయ్యర్ అనేవి నామాంతరాలు.

'పరమయోగి విలాసం'లో ఎనిమిది ఆశ్వాసాలున్నాయి. 6377 ద్విపద లున్నాయి. అలమేలుమంగ వేంకటేశ్వరులకు ఈ గ్రంథం అంకితం. వేంకటే శ్వరుడు వైష్ణవాకారం దాల్చి ప్రసాదం అనుగ్రహించి

"పసుపడ ద్రవిడ ప్రబంధంబు చూచి
తెలుగున రచియింపు ద్విపద రూపమున"

అని ఆదేశించగా పరమయోగి విలాసం వ్రాశాడు. ఈ గ్రంథం వ్రాసేవేళ చిన్నన్న కొంత తటపటాయించినట్లు కనిపిస్తుంది.

"వేదంబులెల్ల ద్రావిడముగా చేసి
వేదాంతవిదులు కోవిదులు నైనట్టి
గురుతరులగు పరాంకుశ ముఖ్యయోగి
వరుల వైభవము కావ్యము సేసినట్టి
అలఘు పూర్వాచార్యులగు వారి యెదుట
నిల నితరుడు కావ్యమెట్లు సెప్పెడిని
గావున తత్పాదకమల సేవకుడ
కావున వారి మార్గముననే యేను
జలజాతవాసిని చనుబాల ముట్టి
పలికెద నానేర్పు పరిపాటి నిప్పుడు"

అనడం దీనికి సాక్ష్యం. 'ద్రావిడాగమ సార్వభౌములైన మావారల ఆళువారు లను' అనడంలో ఆత్మీయత సువ్యక్తం.

చిన్నన్న పరమయోగి విలాసానికి సంస్కృతంలోని గరుడవాహన పండితుని దివ్యసూరి చరితమ్, అనంతాచార్యుని ప్రపన్నామృతమ్, తమిళం లోని పిన్‌బళగియ పెరుమాళ్ జీయర్ (ఆరాయిరప్పడి) (14 వ) గురుపరంపరా ప్రభావం, మణవాళమహాముని (14 వ శ.) ఉపదేశరత్నమాలలు ఆధారం కావచ్చు. అయితే చిన్నన్న వీటిలో కొన్ని మార్పులు చేశాడు.

మూలంలో భక్తిసారయోగి కథలో దృఢవ్రతుడు నాలుగవజాతికి చెందిన వాడు. భక్తిసారుడు మొదట శైవుడు. పాషాండ్ పంచముడు. నిజమయిన వైష్ణ

వుడు కులాలకు అతీతుడని భావించడంవల్ల చిన్నన్న ఈ 'కులాల రొంపి'లోకి దిగలేదు.

ఆలాగే కథాంశాలలో కూడా చిన్నన్న కొన్ని మార్పులు చేశాడు. భక్తిసారుడనే ఆళ్వారు చరిత్రలో వల్లవరాయడు తనకు పున్యయౌవనం కలిగేటట్లు స్వామినుద్దేశించి గానం చేయవలసిందిగా కణికృష్ణణ్ణి కోరాడని ఆధారగ్రంథాలు వర్ణిస్తే తనకు మరే కోరికలేనట్లు, కృష్ణుని కవితకు మెచ్చినట్లు, తనమీద పాట వినాలనే తలంపుమాత్రం వున్నట్లు చిన్నన్న మార్పుచేశాడు. బహుశః తన తాత 'అన్నమయ్య చరిత్ర' కారణం కావచ్చు.

కులశేఖరాళ్వార్ చరిత్రలో కులశేఖరుడు సైన్యాన్ని సమాయత్తపరచి తానే సమరానికి సిద్ధమయ్యాడు. మంత్రులు శ్రీ భట్టరుగారితో శ్రీరాముడు శత్రు సంహారంచేసిన ఘట్టాన్ని చదువవలసిందిగా కోరాడు. కులశేఖరుడు సంతోషించి సేనలను ఉపసంహరించినట్టు ఆధారగ్రంథాలలో వున్నది. రామాయణపారాయణం జరుగుతుండగా సీతాపహరణం విని కులశేఖరుడు రావణునిమీద దండెత్తడానికి సైన్యం సమాయత్తపరచాడట. తాను గుర్రమెక్కి లంకవైపు కదిలాడు. అపుడు గోవిందుడు విమానంలో తనతో తీసుకునివెళ్ళాడని చిన్నన్న మార్చాడు.

తిరుప్పాణార్ చరిత్రలోకూడా పాణార్ వరివెన్నులో శ్రీవత్స అంశంలో జన్మించాడని, మాతదాసుడనే పంచముడు పెంచుకున్నాడని ఆధారగ్రంథాలలో వివరణవుంది. లోకసారంగుడు రాళ్ళతో కొట్టినట్లు, రంగనాథుని నుదుటిపై రక్తం స్రవించినట్టు ఆధారగ్రంథాలలో వుండగా కులప్రసక్తిగాని, అఘాయిత్యంగాని చిన్నన్న వర్ణించలేదు.

ఆళ్వారుల చరిత్రలను సమగ్రంగా వర్ణించే మరొక కావ్యం పిద్దిరాజు తిమ్మరాజు 'పరమయోగి విలాసం'. ఇతడు కొండవీటిని పరిపాలించిన అళియ రామరాయని మేనల్లుడు. క్రీ. శ. 1564 నాటివాడు. తిమ్మరాజు తన పరమయోగి విలాసాన్ని మంగళగిరి నరసింహస్వామికి అంకితం చేశాడు. ఇదియొక చంపూ ప్రబంధం. ఐదు ఆశ్వాసాలగ్రంథం. ఇందులోని గద్యపద్యాల సంఖ్య 1381. తిమ్మభూపతి చిన్నన్న పరమయోగి విలాసం ఆధారంగా ఈ గ్రంథం వ్రాసినట్లు

కన్పిస్తుంది. ద్విపదరూపంలో ఉన్న గ్రంథానికి ఇది పద్యరూప పరివర్తనమని చెప్పవచ్చు. ఉదాహరణకు :

"ఘనతరంబైన చక్రము కేల బూని
చెనటి రక్కసుల ద్రుంచిన బడలికయొ
జలరాశి జొచ్చి రాక్షసుల గీటణచి
చెలగి వేదములు దెచ్చిన బడలికయొ
క్షీరసింధువు మథించియు గ్రుంగకుండ
జేరి మందరము మోచిన బడలికయొ
ఘుఖదంత కోరకమున జగత్త్రియము
నిఖిల భారంబు నానిన బడలికయొ
పైకొన్న యుక్కు కంబము గొనగోళ్ళ
జేకొని ప్రక్కలించిన బడలికయొ
జగము లీరేడును చక్కని యడుగు
చిగురుటాకున గొలిచిన బడలికయొ
గండగొడ్డట రాజ కంఠనాళములు
చెండి చెండాడి వైచిన బడలికయొ
దండకావనమున దనుజ వర్గంబు
జెండి వైచుచు జరిపించిన బడలికయొ
కౌరవాధిపునితోఁ గనలి తత్పురము
సీరాగ్రమున బెకల్చిన బడలికయొ
యలవి మీఱంగ గోపాంగనామణుల
చెలువంపురతులఁ దేల్చిన బడలికయొ
మేలిమి తురగంబు మీదట నెక్కి
లీల వయ్యాళిదోలిన బడలికయొ
నాయెడ నాతోడ నింతయు చెలియ
మాయన్న యెఱిగింపుమా"

సీ॥ "నిగమ చోరకుని ఖండించిన యలతయో
యబ్ధిలో గిరిమోచినట్టి యలతో
తెగి హిరణ్యాక్షు మర్దించిన యలతయో
యతని సోదరు జంపినట్టి యలతో
గుజ్జు రూపునకు మేన్గాలిపిన యలతయో
యడవి రాజుల జెండినట్టి యలతో
తొడరి రావణు తల్ద్రుంచిన యలతయో
యమున నాగట ద్రుచ్చినట్టి యలతో

గోపకాంతుల రతి పెనంకువల యలతో
యలఖలధ్వంసచింత బాటిలిన యలతో
యలఘు కృపతో నిమిత్తంబు దెలుపుమయ్య
నీవు పవళించుటకును నోదేవ దేవ!"

ఇలాగే చిన్నన్న 200 ద్విపదలతో 108 దివ్య తిరుపతుల్ని వర్ణించగా తిమ్మరాజు ద్విరదగతి రగడలలో వర్ణించాడు.

ఇక మూడవది ఆచార్య సూక్తి ముక్తావళి. ఈ గ్రంథకర్త నంబూరి కేశవాచార్య. ఈ గ్రంథం రామానుజాచార్యుల వారికి అంకితం. రచయిత తండ్రి వెంకటకృష్ణాచార్యులు. తల్లి అలమేల్మంగమ్మ. ఇతడు ప్రతివాది భయంకరా చార్యుల శిష్యుడు, మంగళగిరితో చేరిన 'నంబూరు' ఇతని నివాస స్థలము.

ఆచార్య సూక్తి ముక్తావళిలో పూర్వ భాగం, మధ్య భాగం, ఉత్తర భాగం అనే మూడు భాగాలున్నాయి. మొదటి దానిలో 6, రెండవ దానిలో 12, మూడవ దానిలో 6 ఉల్లాసాలున్నాయి. పూర్వ భాగం 19 ఉల్లాసాలలో ఆళ్వారుల చరిత్ర. ఆపై రామానుజాముల చరిత్ర, ఆచార్య పురుషుల చరిత్రములున్నాయి. ఇందులో ఆళ్వారుల కథలే గాక విశిష్టాద్వైత రహస్యాలు నిండివున్నాయి కవి గురు పరంపరా ప్రభావము, దివ్యసూరి చరిత్రము, ప్రపన్నామృతము, యతీంద్రప్రవణ ప్రభావం ఆధారంగా ఈ గ్రంథాలు వ్రాశాడు.

"ఈ పిన్న పాపచే యిల భట్టనాథుండు తులసీవనము ద్రవ్వ వెలసియుండె
నీ ముద్దు గుమ్మచే యిట సూరివరులకు బమగారికిని ముద్దుపట్టియయ్యె
నీ మందయానచే తాముందుగా దాల్చి విరులదండలు హరికొలి కొసంగె
నీ ముద్దురాలచే యిచ్చవ్రేఁదాగొల్ల పడతియై కృష్ణానుభావమొందె
దగుమ శ్రీరంగభర్త యీ తరుణి కతని కేసుభాంగియు దగునని యింతులనగ
భావమున రంగ నిలిచె"

(ఆచార్య సూక్తి ముక్తావళి)

తెలుగు కవులలో పన్నిద్దరాళ్వారులను కావ్యాదిలో స్తుతించిన కవి కృష్ణదేవరాయలు.

"అల పన్నిద్దరు సూరులందును సముద్యల్లీల గావున్న వె
గ్గలపుం దాపము బాప నా నిజ మనః కంజాత సంజాతపు
ష్కలమాధ్వీక ఝరి న్మురారి నొగియంగా జొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దరు సూరులం దలతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్"

ఆముక్తమాల్యద (1-10)

3. తెలుగు కవులకు నచ్చిన ఆళ్వారుల చరిత్రలు :

ఆళ్వారులు పన్నిద్దరైనప్పటికి తెలుగు కవులకు విప్రనారాయణుడు, ఆండాళ్ మాత్రమే నచ్చినట్టున్నారు. దీనికి రెండు కారణాలు. మొదటిది ఇతర ఆళ్వారులలో కంటె విప్రనారాయణుని కథలో శృంగార స్పర్శ ఎక్కువ కన్పించడం. భావుకతకు, కల్పనలకు, చిత్రణకు అవకాశం ఎక్కువ కావడం. పైగా రాజులు శృంగారప్రియులు కావడంవల్ల మెచ్చుకోవడానికి అవకాశం కలగడం. సమకాలీన రాజకీయ పరిస్థితులు కూడా అలాగే ఉండడం.

రెండవది ఆళ్వారులలో గోదాదేవి ఒక్కతె మాత్రం స్త్రీ. శైవంలో 'కారైక్కాల్ అమ్మయార్' అలాంటిది. గోదాదేవి భక్తితో రంగనాథుణ్ణి స్మరించి వరించడం సామాన్య స్త్రీలను కూడా ఆకర్షించే అంశం.

ఈ కారణాల వల్లనే తెలుగులో విప్రనారాయణునికి సంబంధించిన మూడు ప్రబంధాలు, మూడు యక్షగానాలు కన్పిస్తాయి. అయితే గోదాదేవికి సంబంధించిన ప్రాచీన వాఙ్మయం చాల తక్కువ.

### 3.1.1 ప్రబంధాలలో విప్రనారాయణ చరిత్ర :

ఆంధ్రులఃభిమానించిన ప్రక్రియ ప్రబంధ ప్రక్రియ. తెలుగులో విప్ర నారాయణ కథను ఆధారంగా చేసికొని ముగ్గురు కవులు ప్రబంధాలుగా తీర్చారు.

#### మొదటిది చదలువాడ మల్లన 'విప్రనారాయణ' చరిత్ర :

మల్లన ఎఱ్ఱన వంశంలోనివాడు. ఎఱ్ఱన చిన్నిమనుమడు. ఇతడు శైవాచార సంపన్నుడయినా విప్రనారాయణ కథను అభిమానించాడు. సాళువ మూకరాజు కుమారుడయిన తిరుమలరాజుకు అంకితమిచ్చాడు. కనుక ఇతడు 1680 నాటివాడు. చిన్నన్న 'పరమయోగి విలాసం' ఆధారంగా ఈ గ్రంథం వ్రాయబడింది.

#### రెండవది సారంగు తమ్మయ్య 'వైజయంతీ విలాసం' :

తమ్మయ్య వైష్ణవుడు. గోలకొండను పరిపాలించిన మహమ్మదు శాహి కాలంలో కరణంగా వుండేవాడు. ఇతడు భరద్వాజ గోత్రుడు. నృసింహమంత్రి కుమారుడు. తమ్మయ్య తన గ్రంథాన్ని శ్రీరామునికి అంకితం చేశాడు. ఇతని కాలం క్రీ. శ. 1600.

#### మూడవది పిడుగు వేంకటకవి 'విప్రనాయణ చరిత్ర' :

పిడుగు వేంకటకవి 'మల్లన' పుత్రుడు. అతులిత రస కవితాధార ఆదినారాయణ సోదరుడు. విబుధ జన విధేయుడు. ఇతని కృతి విప్రనారాయణ చరిత్ర. ఇందుతో 3 ఆశ్వాసాలే వున్నాయి. అసమగ్రం కూడా. లభ్య భాగం బట్టి తమ్మయ్య వైజయంతీ విలాసం ఆధారంగా వేంకటకవి ఈ గ్రంథం వ్రాసి నట్లు తెలుస్తుంది.

"శ్రీరంగంబున శేషశాయి యగుచున్ శ్రీరంగ నాచ్చారుతో
కారుణ్యాకర మూర్తియై వెలగి లోకంబెల్ల రక్షింప కా
వేరీ మధ్య నివాసుడై బరగు నా విశ్వేశు రంగేశ్వరున్
సారస్ఫూర్తిదలంతు నన్ను కృపచే చాలన్ విలోకింపగన్"

అనే ప్రార్థనవల్ల శ్రీరంగేశునికి అంకితమనవచ్చు.

3.1.2 యక్షగానాలలో 'విప్రనారాయణ చరిత్ర':

తెలుగు సాహిత్యంలో ప్రబంధాలు, శతకాల తర్వాత కవులభిమానించిన ప్రక్రియ 'యక్షగానాలు' మార్గ దేశి ప్రక్రియలకు కూడలి. ప్రదర్శన యోగ్యమయింది. పండిత పామర రంజకమయినది. తెలుగులో విప్రనారాయణ కథా పరములయిన యక్షగానాలు నాలుగు.

మొదటిది చక్రపురి రాఘవాచార్యుని 'విప్రనారాయణ చరిత్ర':

ఇతడు క్రీ. శ. 1545 ప్రాంతపు వాడని పలువురి భావము. ఇతడు కందుకూరి రుద్రకవికి సమకాలికుడుగాని లేదా కొంచెము ముందువాడుగాని కావచ్చును. ఇతని కథకు మూలం చిన్నన్న పరమయోగి విలాసం కావచ్చు. శ్రీ రంగేశుడు చోళరాజు సభలో సాక్షాత్కరించినపుడు అప్సరస స్త్రీలు ఏలలు పాడినట్టు కవి వర్ణించాడు.

రెండవది విజయరాఘవ నాయకుని 'విప్రనారాయణ చరిత్ర'

ఇతడు రఘునాథరాయల కుమారుడు. 1633-1673 నడుమ తంజావూరు పాలించిన రాజు. ఇతడు తన యక్షగానాన్ని 'విచిత్ర నాటకం' అని పేర్కొన్నాడు. గేయ ధర్మాన్ని తగ్గించి రూపక కళను ఈ నాటకంలో సంతరించినవాడు విజయరాఘవ నాయకుడు. కవి పరంపరగా వస్తున్న విప్రనారాయణుని కథలో కొన్ని మార్పులు చేయడం గుర్తించదగ్గది.

విప్రనారాయణుని ఆరాధ్యదైవం శ్రీరంగనాథుడు. కాగా విజయరాఘవ నాయకుడు మన్నారుగుడి రాజగోపాలుడని మార్చాడు. విప్రనారాయణుని సమకాలీన వ్యక్తిగా చిత్రీకరించడం మరొక మార్పు. శ్రీరంగం పాండవుల

వశంలో వుండడం, వారు తమకు శత్రువులు కావడం కారణం కావచ్చు విప్రనారాయణుడు బ్రహ్మచారిగా విఖ్యాతుడయితే విజయ రాఘవనాయకుడు ఏకపత్నీవ్రతునిగా చిత్రీకరించాడు.

మూడవది ఉత్తర రంగకవి 'భక్తాంఘ్రిరేణు చరిత్ర':

ఈ రచయిత యక్షగానం వ్రాసినా నాటకంగానే భావించాడు. కవిని గురించిన ఇతర వివరములు తెలియవు. పశ్చిమ రంగమున వెలసిన రంగనాథ స్వామికి అంకితంగా ఈ యక్షగానం వ్రాయబడింది. లిఖితప్రతి ప్రతిబట్టి 1772 పూర్వంనాటిదని చెప్పవచ్చు. 'పరమయోగి విలాసాన్ని' అనుసరించిన నాటకమయినా ఇందులో విటకంటికి వికటదాసరి సంవాదాలు రమ్యంగా వున్నాయి.

నాల్గవది గడ్డం రామదాసు 'విప్రనారాయణ చరిత్ర':

ఈ యక్షగానం కృతిభర్త మిట్టదొడ్డశౌరి. కవి 1873–1930 నాటివాడు. ఆశుకవి రత్న బిరుదాంకితుడు. కథలో మార్పులు కనిపించవు. ఈ గ్రంథాన్ని 1850 లో మద్రాసు వెస్టువార్డువారు ప్రకటించారు.

**3.1.3** విప్రనారాయణ కథలోని మార్పులు – చేర్పులు :

తాళ్ళపాక చిన్నన్న, తిమ్మభూపతి, మల్లన వీరి విప్రనారాయణ కథలు చాలవరకు ఒకే రకంగా కనిపిస్తాయి. కాని సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసంలో చాల మార్పులు చేశాడు. వాటిలో పేర్ల మార్పులు, కథాంశంలోని మార్పులు గమనించదగ్గవి.

ఆధార గ్రంథాలలో దేవదేవి అక్క 'అలివేణి' కాని చిన్నన్న, తిమ్మభూపతి, మల్లనలు దేవదేవి అక్క అని చెప్పారుగాని పేరు చెప్పలేదు. సారంగు తమ్మయ్య మధురకళా ప్రియ అయిన దేవదేవి అక్కకు "మధురవాణి" అని నామకరణం చేశాడు. ఆధార గ్రంథాలలో విప్రనారాయణునికి సేన మొదలియారు పంచ సంస్కారాలు చేసినట్లుండగా చిన్నన్న గురువుపేరు చెప్ప

లేదు. ఆధార గ్రంథాలలో విప్రనారాయణుని శిష్యునిపేరు రంగదాసుడని వుండగా చిన్నన్న 'కాంతోపయంతుడు' అని చెప్పాడు. తమ్మయ్య శిష్యుని పేరును 'రంగ'నిగా పరిచయం చేశాడు.

ఇక కథాంశాలలోని ప్రధానములయిన కొన్ని మార్పులు. శ్రీహరి వనమాలికాంశంతో ఒక వైష్ణవ గృహస్థునికి విప్రనారాయణుడు జన్మించాడని ఐతిహ్యముండగా సారంగు తమ్మయ్య లక్ష్మీనారాయణ దంపతులకు సంతానం లేదని, సంతానం లేని కారణంవల్ల ఒక వైష్ణవ యతీంద్రుడు భిక్షకు రావడానికి తిరస్కరించాడని, దంపతులు బాధపడ్డారని, కలలో లక్ష్మికే విష్ణువు కనబడి నలుపు తెలుపు రంగుల పూలదండను ప్రసాదించాడని, అదే వైజయంతి అని మార్పు చేశాడు.

దేవదేవి గయ్యాళి తల్లిపోరు పడలేక వేశ్యావృత్తి మాని విరక్తురాలయ్యేనని చిన్నన్న వ్రాయగా 'పింగళోపాఖ్యానం' విని విరక్తురాలయినట్లు సారంగు తమ్మయ్య వర్ణించాడు. అలాగే రంగడిచ్చిన గిన్నెను వేశ్యమాత పరీక్షించాలని అనుకొన్నదట. శంఖచక్రాలబట్టి ఆ గిన్నె గుడిలోనిదని గ్రహించి తలవరులకు తెలిపిందని తమ్మయ్య మార్పు చేశాడు. రాజు దేశబహిష్కరణ శిక్ష విధిస్తే విప్రనారాయణుడు దేహ త్యాగానికి సిద్ధమయినట్లు తమ్మయ్య మార్పు చేశాడు.

వైష్ణవాచార విధేయత చిన్నన్నలో, భక్తిరస ప్రాధాన్యం తిమ్మరాజు, మల్లనలలో, శృంగార ప్రాధాన్యం తమ్మయ్యలో చోటుచేసుకుంది.

### 3.2 ప్రాచీన ఆంధ్ర వాఙ్మయంలో 'గోదాదేవి':

వైష్ణవాంధ్ర సాహిత్యంలో ఆముక్తమాల్యదకు విశిష్ట స్థానముంది. ఈ గ్రంథానికి విష్ణుచిత్తీయమని కూడా పేరు. రచయిత వైష్ణవుడు. కృతిభర్త శ్రీనివాసుడు. కృతి కూడా వైష్ణవ సంబంధి. ఆంధ్ర ప్రబంధములలో ప్రౌఢము. ఇందులో అనేక కథలున్నా గోదాదేవి కథకే ప్రాధాన్యం. రాయలు తన కాలంనాటి వైష్ణవ గురుపరంపరా ప్రభావాన్ని తెలిపే కథల్ని పరిశీలించి కొన్ని మార్పులుచేసి ప్రబంధ రచన చేశాడు.

మొదటిది పేర్లకు సంబంధించినది. [ఆధార గ్రంథాలలో పాండ్యరాజుపేరు వల్లభదేవుడని వుండగా రాయలు మత్స్యధ్వజుడని చెప్పాడు. మూలంలో 'అను గ్రహ' గోదాదేవి చెలికత్తెకాగా రాయలు మరాళి, హారిణి, స్రగ్విణి చెలికత్తెలను జోడించాడు. గోదాదేవికి 'సూడికొడుత్త నాచ్చియార్' అనే పేరు ప్రసిద్ధికాగా దానికి తగినట్టు 'ఆముక్తమాల్యద' అని పేరుపెట్టాడు.

రెండవది కథాంశాలకు సంబంధించినది. మూలంలో తులసీవనంలో 'బాల కన్య' విష్ణుచిత్తునికి దొరికిందని వుండగా నెలదమ్మి బావికి దగ్గర తులసీవనసీమలో తిన్నెపై 'గోద' నిసుగుగా దొరికిందని రాయలు మార్చాడు. గోదాదేవి భూదేవి అవతారంగా చెప్పినా దానికి తోడు సత్యాదేవి అవతారమని కూడా రాయలు స్పష్టం చేశాడు. మూలంలో కుమార్తె దుఃఖాన్ని తండ్రి గుచ్చిగుచ్చి అడగడం, తాను రంగనాథుని వలచినానని చెప్పడం, ఆపై విష్ణుచిత్తుడు శ్రీరంగం వెళ్ళడం వంటివి ఆముక్తమాల్యదలో లేవు. గోదాదేవి విరహాన్ని గుర్తించిన చెలికత్తెలు ఉపచారాలు చేయడం, వ్రతదీక్షకు ప్రోత్సహించడం, కుమార్తె కృశిస్తుండగా విష్ణుచిత్తుడు మన్నారుస్వామిని ప్రార్థించడం రాయలు చేసిన మార్పులు. గోదాదేవి తాను పూలు ముడిచి విడిచిపెట్టడం తండ్రికి తెలియడం, తండ్రి నొచ్చుకోవడం, స్వామి తనకా పూలు సమ్మతమనడం మూలంలోని అంశాలు. కాని గోదాదేవి పూలు ముడిచి విడిచి వేయడం తండ్రికి కూడా తెలియదని రాయలు వర్ణించారు. మూలంలో శ్రీరంగనాథస్వామి గోదాదేవిని వరించి అంతర్ధానం చేశాడనివుండగా రాయలు మధ్య కొంత కథ నడిపినాడు. రంగనాథుడు గోదాదేవిని చూచి తమకంతో ఒక మాయా వధూటిని కల్పించాడు. పల్లకి ఎక్కినది తన బిడ్డ అనియే విష్ణుచిత్తుడు భావించాడు. కాని విడిదికి వెళ్ళి చూడగా అక్కడెవ్వరు కనబడలేదు. రంగనాథుడే మాయం చేశాడని తండ్రి తల్లడిల్లినాడు.] స్వామి భయపడి ఆమెను యథావిధిగా విడిదిలో ఉంచాడు. మూలంలోలాగే పరిణయంతో కథను రాయలు ముగించాడు.

తాళ్ళపాక చిన్నన్న పరమయోగివిలాసంలో 'గోదాదేవి కథ' ను చాల మూలవిధేయంగాను కొంతవరకు ఆముక్తమాల్యద ఆధారంగాను వ్రాశాడు. కొన్ని అంశాలలో పాతక్రొత్తల మేలుకలయిక కనిపిస్తుంది. ఉదాహరణకు ఆముక్త

మాల్యద ఆధారంగాను వ్రాశాడు. కొన్ని అంశాలలో పాతకొత్తల మేలుకలయిక కనిపిస్తుంది. ఉదాహరణకు ఆముక్తమాల్యద వృత్తాంతం ఆధార గ్రంథాలలో విష్ణుచిత్తుని స్వామి పుందలించాడు. రాయల గ్రంథంలో గోదాదేవి స్వామికై సిద్ధంగా వుంచిన పూలు ముడిచినట్టు పెరియాళ్వారుకు తెలియదు. కాని తలవని తలంపుగా విష్ణుచిత్తుడు తన కుమార్తె పూలు ముడుచుకోవడాన్ని చూసినట్టు చిన్నన్న వర్ణించాడు.

"జనకుండు వటపత్ర శాయికై యిడిన
ననగూడ లోని క్రొన్నన దండలెత్తి
యొనగూడు కొప్పున నొప్పుగా చుట్టి
నినుపారు బావిలో నీడ చూడంగ
నేమరపాటుగా నేతెంచి తండ్రి
కోమలి దిక్కు కన్గొని తల్లి! యిట్లు
హరి సమర్పణమున కమరించు పుష్ప
సరములు నీకు శేషము చేయ తగునే."

అని అప్పుడే పువ్వులు కోసి స్వామి కర్పించి స్వామివల్ల సర్వస్వం తెలుసు కున్నట్టు చిన్నన్న వ్రాశాడు.

యక్షగాన వాఙ్మయంలో విప్రనారాయణ చరిత్ర వున్నట్టే ఆండాళ్ చరిత్ర కూడా వుంది. ఈ చరిత్రను కొత్తూరు రంగనాయకమ్మ రచించింది. ఈమె గురువు, ఈచంబాడి శ్రీనివాసాచార్యులు. ఈ రచయిత్రి శ్రీ రంగనాథ పంగుణి ఉత్తర ఉత్సవ యక్షగానం కూడా రచించిందని పండితులు భావిస్తున్నారు. ఈ గ్రంథాన్ని రంగనాయకమ్మ మదరాసు శ్రీ రామానుజ విలాస ముద్రాలయంలో 1937 ముద్రించారు.

ఈ యక్షగానంలో ఆండాళ్ చరిత్ర ప్రధానమయినప్పటికీ ఆళ్వారుల చరిత్రలుకూడ కనిపిస్తాయి. ఆండాళ్ పెండ్లి వేడుకల పాటలు ఈ యక్షగానంలోని ప్రత్యేకత.

వధూవరులను సఖులు ఉయ్యాల లూచేవేళ 'ఊంజల్ పాట్టు పాడడం' తమిళదేశంలో వైష్ణవుల్లో ఇప్పటికీ కనిపించే ఆచారం.

"శ్రీ విల్లిపుత్తూరు పూంజల్ తొట్టి
చతుర్వేదంగళుం శంగల్ పూట్టి
ఆరుశాస్త్రంగళుం తూణ్గల్ నాట్టి
ఆండాళ మన్నారు ఆడినారూంజల్"

అనడంలో తమిళ వాతావరణం గమనించవచ్చు.

తెలుగులో ప్రత్యేకించి తిరుమంగ ఆళ్వారు చరిత్ర కావ్యాలు లేవు. కాని రెండు యక్షగానాలు మాత్రం కనిపిస్తున్నాయి. మొదటిది కోవెల తిరువేంగడ దాసుది. ఇతడు శ్రీరంగ తిరుమల శ్రీభట్టరార్యుని శిష్యుడు. నరసింహాచార్యుని కుమారుడితడు. వెంకటాచార్యుని మనుమడు. కవి మంగళగిరి నరసింహస్వామికి ఈ యక్షగానాన్ని అంకితం చేశాడు. ఇతని కాలం 1800-1850 కావచ్చని ఆచార్య యస్వీ జోగారావుగారి అభిప్రాయం.

రెండవది పరాశరం శేషాచార్యుల వారిది. ఇతడు వైఖానసుడు. వున్న మాంబా జోగయాచార్యుల పుత్రుడు. నివాసము తెనాలి తాలూకా పేరుకలపూడి. కృతిభర్త తమ్మపూడి నివాసి సూర్యదేవరజోగయ్య, ప్రచురణ టి. చెంగల్వరాయ నాయుని మురహరి ప్రెస్, మదరాసులో 1907 జరిగింది. కనుక కవి 1907 నాటి వాడని చెప్పవచ్చు.

4. జానపద వాఙ్మయంలో ఆళ్వారుల సాహిత్యం:

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు తన "తెలుగు జానపదగేయ సాహిత్య" మను సిద్ధాంత గ్రంథంలో "వైష్ణవమత సంబంధములు"ను శీర్షికలో 'శ్రీ ఆండాళ్ చరిత్రము'ను ఉదాహరించారు. జానపద సాహిత్యంలో ఇతర ఆళ్వారుల ప్రసక్తి కనిపించదు.

శ్రీ ఆండాళ్ చరిత్రం తోహరా రూపకంలో 600 పంక్తులున్న గ్రంథం. ఈ గ్రంథాన్ని వంగీపురం వెం. రంగాచార్యులు రచించారని శ్రీ రామరాజుగారు తెలియజేశారు. ఈ గ్రంథంలో భూదేవి ఆండాళ్‌గా, గరుడాళ్వారు పెరియాళ్వారుగా అవతరించడం, 108 దివ్య తిరుపతుల నామముల శ్రీరంగమాహాత్మ్యం, ఆండాళ్

తిరుమొళి సారాంశము శ్రీరంగనాయకుల కల్యాణవిభవం మొదలైనవి వున్నాయి. తెలుగులో ప్రసిద్ధమయిన రాయల ఆముక్తమాల్యదను శ్రీ రంగాచార్యులు పాట రూపంలో పలికారు.

ఆండాళ్ యుక్తవయస్కురాలయినపుడు విష్ణుచిత్తుడు వరాన్వేషణమునకు సిద్ధమయ్యాడు. కాని చూడికొడుత్త హరితో వివాహం చేయించమని ప్రార్థించినదట.

"ఏయే దేశములందు ముకుందుండేయే పేరులతోడన్
ఏయే రూపుల దాల్చియుండెన్ యెరుగ పల్కుమని వేడెన్"

అపుడు పెరియాళ్వారు దివ్య తిరుపతులను వర్ణించాడు. శ్రీ రంగేశు చరిత్రాన్ని విపులంగా వర్ణించమని గోవ కోరింది. పెరియాళ్వార్ శ్రీరంగమాహాత్మ్యం చెప్పగానే 'శ్రీరంగేశుని దక్క నన్యునిన్ స్వీకరింప పతిగాన్' అని శపథం చేసింది. మరి హరిపొందుకు ఉపాయం కోరింది. తండ్రి మార్గశిరవ్రతం చెప్పాడు. ఆమె

"తిరుగ ముప్పది పాశురయుతమగు తిరుప్పావు పాడి
వారిజనేత్రుడు రంగేశుండే వరుడగుటకు వేడి"

వ్రతం పూర్తి చేసిందట. శ్రీరంగడు స్వప్నంలో సాక్షాత్కరించి

"ప్రసన్నుడై యా రాత్రి యంతయును పతితోడ భోగించెన్"

ఆరోజే మనకు 'భోగి' అయినదని రంగాచార్యుల వివరణ గమనించదగ్గది. ఆండాళ్ సఖులతో తన అనుభూతిని చెప్పుకొన్నది. విష్ణుచిత్తుడు చింతాక్రాంతుడయ్యాడు. స్వామి స్వప్నంలో సాక్షాత్కరించాడు. శ్రీరంగానికి రావలసిందిగా పురమాయించాడు. ఆకాశవాణి ఆండాళ్ 'భూసతి' అని స్పష్టం చేసింది. శ్రీరంగేశుడు అర్చకులద్వారా విల్లిపుత్తూరుకు వెళ్ళి గోదాదేవిని తోడ్కొనిరమ్మని ఆదేశించాడు. పాండ్యరాజు వారి వివాహానికి సన్నాహాలు చేశాడు. మాధవుడు మానవాకృతితో వివాహమాడాడు. పెండ్లి ఐదురోజులు జరిగాయి. మరునటి రోజు చూడగా

# వ్యాస కదంబం


ఆచార్య కె. సర్వోత్తః

తెలుగు అధ్యయనశాఖ

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

తిరుపతి



పారిజాత ప్రచురణలు

6-7-554, హరేకృష్ణ రోడ్

తిరుపతి-7

"మరునాడుదయము వటకుటీరమును మగువయు మాధవుడున్
వరవిగ్రహరూపంబుల వెలసిరి నరులెల్లను గొలువన్"

పెరియాళ్వార్ పరితపించాడు. శిలారూపంలోనే శౌరి

"చెట్టబట్టి నీ తనయను నాయెద చేర్చితి మామయ్యా
గోదా కొరకై యిటు విలపించి కుందతగునె మదిలోనన్
ఛేదింపుము మమకార బంధమును చిత్తము జొరనీకన్
ఎపుడు నీ సుతను జూడ దలచెదవొ అపుడు నన్నుమదిలోన్
జపమును చేయుము మామా కోరిక సఫలంబగు నటులన్
తరుణి తోడనే దర్శన మొసగెద దయయుంచుము నమ్ము"

అని చెప్పాడు. విష్ణుచిత్తుడు అలాగే హరిని అరాధించి వైకుంఠం చేరాడు.

ఆళవందారు 'ఉయ్యాల పాట'లో వేదాంతం ముఖ్యమయినా ఆళ్వారుల ప్రసక్తి లేకపోలేదు.

"శ్రీమన్నారాయణుని ఉయ్యాలో చిత్తమందున నిలిపి ఉయ్యాలో
సౌఖ్యంబు గనవలె ఉయ్యాలో చక్కగా మనసులో ఉయ్యాలో
మూలాధారమందు ఉయ్యాలో మరి విష్వక్సేనుండు ఉయ్యాలో
భవిష్యదాచార్యులు ఉయ్యాలో భాష్యకార్లధిపతి ఉయ్యాలో.
ద్వయమంత్రరత్నము ఉయ్యాలో దర్శనంబాయెను ఉయ్యాలో

విశిష్టాద్వైతంబు ఉయ్యాలో విశదంబుగాజేసె ఉయ్యాలో
భక్తియోగముకన్న ఉయ్యాలో బలమే ప్రపత్తియు ఉయ్యాలో
రామానుజాచార్యులె ఉయ్యాలో రక్షించువారలు ఉయ్యాలో
పన్నిద్దరాళ్వార్లు ఉయ్యాలో పట్టిచూపిన నిష్ఠ ఉయ్యాలో"

ఏది ఏమయినా జానపదవాఙ్మయంలో వైష్ణవసంబంధ గేయాలు తెలంగాణంలోనే ఎక్కువ కనిపిస్తాయి. మహబూబ్‌నగరం, ఆదిలాబాదు, ఓరుగల్లుమండలాలు చెప్పుకోదగ్గవి. గ్రామాధికారులయిన రెడ్లు, వెలమలు, గోలుకొండ వ్యాపారులు అధికంగా వైష్ణవులుకావడమే దీనికి కారణం.

5. తిరునామములలో 'ఆళ్వారు' ప్రసక్తి :

శ్రీ వైష్ణవ సంప్రదాయానికి పరమప్రమాణాలు రెండు. మొదటిది పరాశర, పారాశర్యాది మునులు ప్రచురించిన సంస్కృత వేదాంతభాగం. రెండవది శఠకోపయతీంద్రులు గుర్తించిన ద్రావిడ వేదాంతభాగం. ఈ రెండవదాని అనుకరణ 'తిరునామములు'.

'తిరునామం' అనే పదం ప్రాచీనమయింది. శఠకోపుల తిరువిరుత్తంలో 'తిరునామచ్చొల్' ఉంది. తిరునామములు సంకీర్తనలయినా వాటిలో విశిష్టాద్వైత రహస్యాలుండడం ప్రత్యేకత. ఆంధ్రప్రాంతాలలోకంటె తెలంగాణప్రాంతంలో 'తిరునామాలకు' వ్యాప్తి ఎక్కువ.

"ఎంచ పళమౌనా ఆళ్వారుల గాంచ పళమౌనా
అంచితముగ శ్రీపతియు పుట్టించు జీవులుచేయు దుస్తర
సంచితార్థములెల్ల తామెడలించి మము రక్షించి రహహ"

అనడంలో ఆళ్వారుల సామూహిక స్తుతి కనిపిస్తుంది.

తిరునామములలో నమ్మాళ్వారును 'తెన్నరంగం పొన్నడి' అని వ్యవహరించారు. రంగనాథస్వామికి పాదుకాస్థానీయులని అర్థం. విష్ణ్వాలయాలలో భగవత్పాదుకలను 'శఠకోప' మంటారు. అందువల్ల భగవత్ పాదుకాస్థానీయులు శఠకోపులు. అంచేత ఇతర ఆళ్వార్లు అవయవస్థానీయులు.

"కారిమార కుమారా! మీకంటె ఘనులెవరయ్యా మున్మాటికి
ఘనులిక నెవ్వరయ్యా
శ్రీ రమాపతిశేషి యతనికి తిరుగల విగ్రహము మీరట
తెన్నరంగం పొన్నడనదగు
చెన్ను మీరు ముదలాళ్వారులట శిరము నెమ్మోము సర్వాంగము
సన్నుతిగాంచిన భక్తిసారులే స్తనయుగంబు మీకు
ఎన్ని చూడ భట్టనాథవర్యు లురము ఎంతో వైఖరిని విఖ్యాతి
గన్న శ్రీ యోగివాహనులె కంఠదేశమయ్యా కులశేఖరు

లన్న మి కరములు పరకా[illegible] సుదిరముట భ[illegible]రెయి
రెన్నగా సూరుపులట పన్నగా [illegible]భుర కొలు
వన్నెగల పాదపద్మములు వరయుడగు శ్రీరామానుజులు''

(తిరునామములు పుట-5?)

తిరునామములలో గోదాదేవి, నమ్మాళ్వారుల స్తుతి ఎక్కువగా వైవిధ్య పూరితంగా కనిపిస్తుంది. ఈ ఆళ్వారుల చరిత్ర కథనంతోపాటు ఆళ్వారులపట్ల తిరునామ రచయితలకున్న భక్తిభావం దాస్య, మధురభక్తిరూపాలలో కనిపిస్తాయి.

చరిత్ర కథనం :

"మంచి తులసి వనమందంచితముగ నుద
యించి శ్రీ విష్ణుచిత్తులగాంచి ప్రేమ మీరగ
పెంచి దానరుచిని మించి యించు బోణులతో
పంచబాణు గురినెంచి యాడి మది నెంచిన కొమ్మా
కట్టె పువుల దండలు పెట్టె ముంగ కొప్పున
జూటి విభుని కొరకు పెటి పంపిన బలుమేటి
శ్రీ విష్ణుచిత్తునిపట్టి
వట్టిమాటలిక కట్టిపెట్టి దయపట్టి
ఏలువారి హరి పట్టపు రాణి

(తిరునామములు పుట-28)

అలాగే నమ్మాళ్వారు చరిత్ర 'వన్నెమీర శఠగోపుల వైభవము వర్ణింపతరమా' అనే తిరునామములో వర్ణితం. తిరునామాలలో విప్రనారాయణ, తిరుమంగై ఆళ్వార్ల నుతులు కూడా వున్నాయి.

''చాలా ధన్యులమైతి మమ్మా
భాగవత పాదధూళి మనకు లభించెనమ్మా
దీని ప్రభావము తెలిసి భక్తపద
రేణుముని తదభిధానము గనెనట''

(తిరునామములు పుట-283)

"హరికిచ్చె వీరలే మునులనుచు
నిరంతరము పరగాలమని పూజన మిడుచు
పరిణయోక్త శ్రీ హరుల దోచి భా
స్వర భాగవతార్చనలు చేసిరట"

(తిరునామములు పుట 238)

భాగవతార్చనలో ఆళ్వారులలో తిరుమంగై ఆళ్వారు ఒకరు భాగవ తార్చన కోసం ఈ ఆళ్వారు తన ఆస్తిని వెచ్చించాడు. ప్రజాధనాన్ని విచ్చల విడిగా వాడాడు. దొంగతనం చేశాడు. దోపిడీలు చేశాడు. ఆదిదంపతులయిన శ్రీ మహావిష్ణువులు సామాన్యులుగా రాగా వారిని కూడా దోచడానికి సిద్ధమయ్యారు.

## 6 నాలాయిరం ఛాయలు :

వైష్ణవానికి నాలాయిరం నాలుగు స్తంభాలవంటివి. నాలాయిరం పాశురాలు సంగీత ప్రధానమయినవి. వీటిని మొదట సంకలనం చేసినవారు శ్రీనాథమునులు. అంతేకాదు దేవాలయాలలో, పర్వదినాలలో నాలాయిర పఠనానికి ఒక వ్యవస్థ ఏర్పరచినవారు కూడా వారే. వారు నియమించిన గాయకులే "అరయరులు". క్రమంగా ఈ ప్రబంధ పారాయణం వైష్ణవుల నిత్యజీవనంలోను భాగమయింది. వివాహ సందర్భంలో సీర్‌పాడల్, ధనుర్మాసవేళ 'నోము' ప్రాణోత్క్రమణ సమయంలో తిరువాయ్‌మొళిలోని ఒక నిర్దిష్టభాగ పఠనంలాంటిది వ్యాప్తిలోకి వచ్చింది. అందువల్ల వైష్ణవం వ్యాపించిన చోటల్లా నాలాయిరం విలదొక్కుకొన గలిగింది.

## 6.1 అన్నమయ్య సంకీర్తనలలో నాలాయిరం ఛాయలు :

పాశురాలకున్న గానయోగ్యతను గుర్తించిన అన్నమయ్య ప్రబంధాముల జోలికి పోకుండ సంకీర్తన యాగం మొదలు పెట్టాడు. ఆళ్వారులలాగా దివ్యదేశ సంచారం చేశాడు. నాలాయిరానికి నిత్యపూజాదుల్లోవున్న ప్రాధాన్యం గుర్తించి అలాగే పాటలు వ్రాశాడు. వాటిలో కొన్నిటిని చూద్దాం.

మేలుకొలుపు :

తొండరప్పొడియాళ్వార్ 'తిరుప్పళ్ళి ఎళుచ్చి' లో శ్రీరంగనాథుణ్ణి, పెరియాళ్వార్ 'ఆండాళ్' కృష్ణుణ్ణి మేలుకొలిపినట్టే అన్నమయ్య వేంకటేశ్వరునికి మేలుకొలుపులు గానం చేశాడు. వాటిలో 'హరికృష్ణ మేలుకొను (9-254) భోగి శయనమును బుసకొట్టెడిని (1-139) వారిధి శయన వటపత్ర పరియంక (11-170) మొదలయినవి చెప్పుకోదగ్గవి.

మంగళాశాసనం :

కులశేఖరాళ్వార్ ముకుందమాలలో 'జయతు జయతు దేవో దేవకీ నందనోయం' శ్లోకంలో, తిరుమంగై యాళ్వార్ కోషియుం కూడలుం కోయిల్ కొండ కోవలర్ (ఉరైయూర్ దక్షిణ మధురలను ఆలయంగా చేసికున్న గోపాలునిలాగా వున్నవానికి మంగళం)లో, పెరియాళ్వార్ పల్లాండులో, ఆండాళ్ తిరల్ పోట్రి, కషల్ పోట్రి, గుణం పోట్రీ (సామర్థ్యానికి మంగళం, పాదాలకు మంగళం, గుణాలకు మంగళం) అని కీర్తించినట్టుగా అన్నమయ్య మరలి మరలి జయమంగళం సొరిది నిచ్చలును శుభమంగళము (1-448) చేశాడు.

అలమేలుమంగ :

పెరియాళ్వార్ 'వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాళ్గిన్ర మంగయుం పల్లాండు' (నీ వక్షస్థలంలో కుడిభాగంలో మూర్తిమంతురాలై వసించు మంగమ్మకు ఎన్నో వత్సరాలు) అని ఆండాళ్ వేంగడత్తు తన్నాగ తిరుమంగై తంగియనేర్ మార్వర్కు (వేంకటగిరి శ్రీనివాస వక్షస్సునికి) అని కీర్తిస్తే అన్నమయ్య చాల చోట్ల అలమేల్మంగ నురమున నించుకొని (2-231) అని స్పష్టంగా చెప్పాడు.

వేంకటేశ్వర ప్రశంస :

ఆళ్వారుల ప్రబంధాలలో 108 దివ్య తిరుపతుల వర్ణనలున్నాయి. వీటిలో 'తిరువేంగడమ్' ఒకటి. తిరుమళిశై ఆళ్వార్ వెర్పెన్రు వేంగడం పాడినేన్ వీడాక్కి నిర్కిన్రేన్ (కొండ అంటూ వేంకటాద్రిని కొనియాడాను. అంతేకాదు మోక్షం సిద్ధమవి నిలిచాను) అని కీర్తించాడు. పొయ్‌గైయాళ్వార్ వెళ్ళత్తి

నుళ్ళానుం వేంగడత్తు మేయానుం ఉళ్ళత్తినుళ్ళానెన్ఱోర్ (పాలకడలిలో వున్న వాడు, వేంకటాచలంలో నిలిచినవాడు అయిన విష్ణువు నా మనసులోనున్నాడు) అని కీర్తించాడు. ఆళ్వారులలో పదిమంది స్వామిని సేవించడం గమనించదగ్గ అంశం. ఇక అన్నమయ్య శ్రీనివాస ప్రశంస చెప్పడం సూర్యుణ్ణి దీపంతో చూపడం లాంటిదే.

అణకువ ప్రదర్శన :

తిరుమళిశై తన్నునాయిగా, తొండిరడిప్పొడి పాపిగా, కులశేఖరాళ్వార్ క్రూరకర్మునిగా చెప్పుకున్నారు. తిరుమళిశై ఆళ్వార్ "కళలు నేర్చుకోలేదు, పంచేంద్రియాల ఇష్టం ప్రకారం నడిచాను. అవివేకిని". అని చెప్పుకొంటే, నమ్మాళ్వార్ 'యాచకులకు బిచ్చం పెట్టి ఎరగను. దప్పిగొన్నవారి దాహం తీర్చలేదు. పంచేంద్రియాలు ఎటుపోతే అలాపోయాను. పుష్పార్చన చేయలేదు. మూర్ఖుణ్ణి, కఠినుణ్ణి అని చెప్పినట్టుగా, ఆండాళ్ 'పాపిని క్షుద్రమనుజులమయిన మనం' అని చెప్పుకుంది. అలాగే అన్నమయ్య పసరమువంటి వాడను, శిశువు వంటి వాడను, వసుధలో రాయివంటి వాడను (10-23) అని చెప్పుకున్నాడు.

అన్యస్తుతి వైముఖ్యం :

పొయ్‌గై ఆళ్వార్ 'వాయవనై యల్లదు వాళ్తాదు' (నా నోరు వెన్నుని తప్ప అన్యుల్ని కీర్తించదు) తిరుమళిశై ఆళ్వార్ నాక్కొండు మానిడం పాడేన్ (ఈ నాలుకతో మనుష్యుల్ని పాడను) కులశేఖరాళ్వార్ 'జానామి నత్వాం మీ' అని కీర్తించినట్లే అన్నమయ్య

"హరి పుట్టించిన దేహి హరినే కొలువక
నరుల కొలుచుట అన్యాయమయ్య"

(8-67)

"నరహరి కీర్తన నానిన జిహ్వా
నరుల నుతింపగ నోపదు జిహ్వా" అన్నాడు.

మధురభక్తి:

కులశేఖరాళ్వార్ వాసుదేవాస్తున్ వరవు పార్తే (వాసుదేవా! నీ దారి కోసం చూసి) అంటే నమ్మాళ్వార్ 'అమరర్ పెరుమనైక్కుందు' లో చెలికత్తెను పురమాయించడం, అండాళ్ మేఘాలతో సందేశమంపడం లాంటివి కనిపిస్తే అన్నమయ్యలో హంస నంపడం, సఖీదౌత్యం కనిపిస్తుంది.

అండాళ్‌లో మన్మథ పూజా విధానం 'తాయుమై నెన్ట్రేను' లో కనిపిస్తే అన్నమయ్యలో వలపులై పొంతుల వనవిహారముల పొంతి కొవ్వులు మించ పువ్వులుగోసి అనే వర్ణనలో స్పష్టమవుతుంది.

అన్నిటికి మించి అన్నమయ్యలో నమ్మాళ్వార్ పాశురాల ఛాయలు, అనువాదాలు, అనుసరణలు ఎక్కువ కనిపిస్తాయి. మచ్చుకు నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళిలో తిరుమలను "ఒళివిల్ కాలమెల్లామ్" అనే పాశురంలో కీర్తించినట్లే అన్నమయ్య

"కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
తెట్టలాయ మహిమలే తిరుమల కొండ"

అని కీర్తించాడు.

(9–182)

తిరువాయ్‌మొళిలోని 'వాయ్‌కొండు' అనే పాశురంలో పతివ్రతాభక్తిని చెప్పినట్లే అన్నమయ్య

"నరహరి కీర్తన నానిన జిహ్వా
బయల మతింపగ నోపదు జిహ్వా"

అని కీర్తించాడు.

తిరువాయ్‌మొళిలో 'కులందాంగు' అనే పాశురంలో హరిభక్తిఉన్న చండాలుడైనా పూజనీయుడని చెప్పినట్లే

"పసురము తినెడి మాలయైనను వాడె
పరమాత్ము గొలిచినను బ్రాహ్మణోత్తముడు"

(11-3-117)

అని కీ ర్తించాడు.

తిరువాయ్ మొళిలో 'అడియార్గ్గలో' దాస్యభక్తిని చెప్పినట్లు అన్నమయ్య

"కందువ శ్రీ వేంకటేశ కడు నీ బంటు బంటను
సందడి బంటు నవ్వకే చాలదా నాకు"

(8-23)

లో కీర్తించాడు.

తిరువాయ్‌మొళిలో భగవద్భావనకు సంబంధించి 'అవరవర్' అనే పాశురంలో కీర్తించినట్లే అన్నమయ్య

''ఎంతమాత్రమున నెవ్వరు తలచిన''

(7-159)

అనే పాశురంలో ప్రస్తుతించాడు.

తిరువాయ్‌మొళిలోని 'మణివణ్ణా' 'యెన్మాణిక్యచ్చోదియై' 'కరుమాణిక్యమె' అనడానికి అనువాదప్రాయంగా 'మాణిక్యదీపమనై' 'మాణిక్యపు మన్మథ మన్మథుండితడే' 'పనివడి గొప్ప విడుపాటి నేరెడుబండు, కనుపట్టు పురుషాకారమైనట్టుండె' అని వర్ణించారు.

ఇవేకాకుండా ప్రాబోధిక స్తవం, మనసా, చిలుకా, సంబోధనాత్మకములు ఆళ్వారులలో కనిపించినట్టే అన్నమయ్యలోనూ, తాళ్లపాక కవులలోను కనిపిస్తాయి.

**6.2.** తాళ్లపాక చిన్నన్న రచనల్లో 'నాలాయిర దివ్యప్రబంధ' ఛాయలు :

పరమయోగి విలాసము కేవలం ఆళ్వారుల చరిత్రలుమాత్రం కావు. కనుకనే చిన్నన్న ఆళ్వారుల రచనలనుకూడా అక్కడక్కడ అనువదిస్తూ వైష్ణవ

విజ్ఞానసర్వస్వంగా వైష్ణవ ప్రచారకగ్రంథంగా తీర్చాడు. తఱమానికములాంటి పాశురాలను తెలుగులో అనువదించాడు.

మచ్చుకు.

1. పేయాళ్వారు వామనక్షేత్రస్వామి సందర్శనానంతరం భక్తిపార వశ్యంతో చెప్పిన పాశురాలను అనువాదప్రాయంగా

"సిరిగంటి చెన్నుమించిన మేనుగంటి గరమొప్పు వదనవికాసంబుగంటి
సల్లలితావనీ స్తనకుంభ కుంభ పల్లవంబులబోలు పాదముల్గంటి
సరసిజహల శంఖచక్రాంకుశాంక చరణముల్ జగదేక శరణముల్గంటి
దరణిబింబము చాయదరళంబు కనక సురుచి రాంశుకము నంశుకముగన్గొంటి

.... .... .... .... ....

శాతాంశు మండల శతకోటికోటి రీతి జూపట్టు కిరీటంబుగంటి
మలగులై తెల్లదామరల దామరల గలహించు నిడు వాలుగన్నులగంటి
మకరకుండల బాలమార్తాండ రుచుల వికసిత వదనారవిందంబుగంటి"

(పరమ. పుట-99)

2. తొండరడిప్పొడి యాళ్వారు తిరుప్పళ్ళియెళుచ్చిలో రంగనాథునికి మేల్కొలుపులు పాడినట్లే ఆ పాశురాలకు అచ్చమైన తెనిగింపుగా చిన్నన్న

"అరుణ బింబం బుదయాద్రిపై నిలిచె బలపలవేగి వీడ్వడ మబ్బులడగె
నలరుచు భూ దేవియల సొనగురిసె జాలించి కరుణచొప్పడ యోగనిద్ర
చాలించి శ్రీరంగశాయి మేల్కనవే....................
నిధులు నంబుధులును నిర్జర కపిలబుధులు నచ్చరలు దుంబురు నారదులును
మునులు నీ ముందర మొనసియున్నారు వనజాప్త కాంతితీవలు వాఱె దెసల
జాలించి కరుణ చొప్పడ యోగనిద్ర - జాలించి శ్రీరంగసాయి మేల్కనవె-
తమ్ములు వికసించె దరణియుం బొడమె - గొమ్మలు పసపాడి కోరిరావీడి
కట్టిరి పుట్టముల్ కావేరి నడుమ బుట్టక పుట్టిన పూసెజ్జనున్న
నీల నీరద వర్ణ! నీ యోగనిద్ర జాలించి శ్రీరంగ శాయి! మేల్కనవె!"

(పరమ. పుట - 363-66)

3. పెరియాళ్వారు తిరుప్పల్లాండు (మంగళా శాసనానికి) లక్షు అనువాద సారంగా తాళ్ళపాక చిన్నన్న వ్రాసిన ద్విపదపంక్తులు

"శ్రీ మాల్యకారునిచే దివ్యపుష్ప - దామముల్ తాల్చి యుద్ధ తరంగసీమ
జాణూరమల్లుని శమయించి మిగుల రాణించు శౌరి దొర్దండంబులకును
వలపల రవికోటి వడకించుకాంతి దలుకొత్తుచుండు సుదర్శనంబునకు
నల చెంతనని దైత్యులగలు నాదములు సలుపుచుండెడు పాంచ జన్యంబునకును

కెందామరల పస గిలుబాడు పసలయందంబు గలుగు నీ యడుగు దమ్ములకు
బాధికతోడ నెప్పుడు బంటనైన - యేమను నీవును నెరవింతలేక
యొనుగూడి యుండెడి యునికి కెంతయును నెనపి యుండంగ బె
క్కేండ్లు మంగళము............................"

(పరమ. పుట -

4. తిరుప్పాణ్ ఆళ్వార్ రంగనాథుని దర్శించి పాదాది కేశపర్యంతము వర్ణించి పాడిన 'అమలనాది పిరాన్' అనే పది పాశురాల ప్రబంధాలకు చిన్నన్న చేసిన అనువాదం

''రమణుడౌ వేంకటగ్రావేశుపాద - కమలముల్ నాకన్ను గవ నెలకొనియె
నలఘుప్రసన్నుడై యఖిల లోకములు - గొలిచి దైత్యుల గాథ కులముల నణకి
కౌతుకంబున నొప్పు కాకుత్స్థతిలకు - పీతాంబరమునం బెరసెనా తలపు
చక్కని వేంకటేశ్వరు బ్రహ్మగన్న - పొక్కిలియరసంజ పొలుపుల్లార్చి
సిరిమించు లొయ్యారి చెంగావి వలువ బరికింప నా ప్రాణప్రదమైతనర్చె

.... .... .... .... ....

ఎట్టి చిత్రమోకాని యిట్టె నా తలంపు గట్టిగా దనసొమ్ముగా జేసికొనియె
నవనీత చోరుండు నా మనోహరుడు - నవిరళ శుభమూర్తి యగు రంగరాయ
గనుగొన్న యాతన కనుదోయి యెందు - గనుకుందుగాక ....''

(పరమ. పుట - 213-15)

5. మధురకవి ఆళ్వార్ 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను పాశురాలకు అనువాదసారంగా చిన్నన్న వ్రాసిన ద్విపద పంక్తులు

"తామసాంభోరాశి తరియింపజేసి - శ్రీమించనను గటాక్షించినయట్టి
కరుకాధిపతియైన గురుపదాబ్జముల - నిరతంబు వసియించి నెలచెనా తలపు
వేతెరంగులనైన వేరొండెఱుంగ - వేదమంతయును ద్రావిడముగా జేయు
పరమ గురుండు నాపాలి దైవంబు.

(పరమ. పుట - 147)

6. తిరుమంగై యాళ్వార్ పెరియ తిరుమొళిలోని 1084 విశిష్టమయిన పాశురాలకి చిన్నన్న తెనిగింపు

"ఘనవిష జ్వాలలు గ్రక్కు-సర్పంబు - నొనగూడి
యొకయింట నుండు చందంబు
గడలి నెన్నడును భగ్నంబైన యోడి - వడకుచుండెడి యెడవాని చందమున
వడిగోపిపాటు ప్రవాహంబు చెంత బుడమినుండెడి మహాభూజంబు కరణి
నిడియంగ దుదమొదలేర్చు కాష్ఠంబు - నడుమ జీమలపంక్తి నడికుండు సరణి
నెడపకపాటు నక్టేటిలో జిక్కి- కడు భీతినొందు సృగాలంబు భాతి
తాఁపత్రయోర్మి సంతతుల నేపారు నాపూర్ణ సంసారమును పయోరాశి
లోలత మునిగి తేలుచున్న నన్ను బాలించి దరిచేర్చు పరమేశ"

(పరమ. పుట - 422)

7. తిరుమంగై ఆళ్వార్ సాష్టభుజకర నరసింహస్వామిని కీర్తించి గానం చేసిన పాశురాలకు తెనిగింపుగా చిన్నన్న వ్రాసిన ద్విపదలు

"కరుణ నాదైన యాకలి చూడలేక యరుదెంచి నా కమృతాన్నంబు పెట్టె
దన నామ మడిగిన దయతోడ నవ్వి పునుగ కెప్పుడు సాష్టభుజకరుడైన
హత హేమ కశిపుండననియె నేవేలు నతడె పంచేషు పంచాయుధాబ్జములు
ధరియించి యసుర డెందము విదారించి శిరము చేరిన నరసింహ విగ్రహుండు
నతడె శ్రీ వామనుడతడె విష్ణుండు నతడె నాకులదైవ మన్నియు నతడె"

(పరమ. పుట - 429)

మధ్యయుగ కాలం నాటి కొండ్రపేటి రామానుజాచార్యులు నమ్మాళ్వారు తిరువాయ్‌మొళిని ద్విపద కావ్యంగా వ్రాసినారు. చాలావరకతను చిన్నన్న పరమయోగివిలాసాన్ని అనుసరించినట్లు స్పష్టమౌతున్నది. మచ్చుకు

తిరువాయ్‌మొళిలోని 'ఎంబిరాన్తై' పాశురభావం

"తల్లియు దండ్రియు దానయై మనకు నెల్ల దాస్య సుఖంబులిచ్చిన ఘనుడు అవతార ముఖమున నతులితంబగుచు నవనీల మేఘంబు నగు మేనివాడు మన మిందఱమును సమ్మతి నాశ్రయింప ననఘుండు మననొప్పులన్నియు మాన్చు."
ఇదేగాక శ్రీ భండారు సుదర్శనార్యారయ్య 'తిరుప్పళ్ళాండు' అనే గ్రంథం కూడా వ్రాసినట్టు తెలుస్తుంది.

## 6.3 తిరునామములలో దివ్య ప్రబంధ ఛాయలు :

ఆళ్వారుల దివ్య ప్రబంధాలను ద్రావిడ వేదాలుగ చెప్పడం పరిపాటి. వేదాలు పరబ్రహ్మ ప్రతిపాదకమయినట్లే ద్రావిడ వేదాలు కూడా పరబ్రహ్మ సంధానానికి పరబ్రహ్మప్రాప్తికి అనువయినవి. తిరునామములలో 'ద్రావిడ వేద' ప్రసక్తి ఎక్కువ.

"అన్ని వేదముల వంటిది గాదమ్మా
ద్రావిడ వేదము
ఎన్ని వేదములనైన తానెదిరించి నిగ్రహించు
శేన యాగాది విధివాక్య సంతతి నిహ
భోగానుసరణ బోధమాని
పూని శాశ్వత సదానుభవంబిది
తా నాత్మేశుని దాస్యరూపమనె"

(తిరునామములు - 32)

తాను పరమాత్మకు దాసుడు. అస్వతంత్రుడు. అతనికి దాస్యం చేస్తూ శాశ్వత సుఖానుభూతి మార్గం చూపే మతం శ్రీ వైష్ణవం. తిరునామములలో నాలాయిర దివ్య ప్రబంధ ఛాయలెన్నో కనిపిస్తాయి. మచ్చుకు

పల్లాండు తిరునామం :

దండామని చెప్పరే నా స్వామీని దయవుంచమని యడుగరే
దండామని తమ దాసహృత్కమల మందుండి రక్షించు బ్రహ్మాండ నాయకునకు
ఇద్దరు భార్యలకు పెద్దైన మా యిందిర యనుబాలకు
ముద్దుమొగంబున ముదమొప్పగాను దిద్దిన కస్తూరి తిరుమణిరేఖకు
ఉరగ తల్పంబునకు అతడెక్కేటి గరుడ వాహనమునకు
అరుదుగ పన్నిద్దరాళ్వారులకెల్ల శరణని చాలగ సిరులవ్వమని దూరె
చారు భుజంబులకు మెప్పైన శ్రీ శంఖ చక్రంబులకు
హారకుండల మణిహార శృంగార శరీర సద్భక్త మందార భుజంబునకు

'రక్షక' అనడానికి బదులు 'దండము' అనేమాట ఇక్కడ వాడబడింది. ఇవేగాక నమ్మాళ్వార్ పాశురాలలోని స్త్రీత్వారోపణ. నారాయణ పరత్వం, భాగవత ప్రశస్తి, ఆచార్యప్రాధాన్యం, క్షేత్రప్రశస్తి, నవవిధ భక్తి భేదాలు, కుల నిరసనాదులు తిరునామములలో విరివిగాకనిపిస్తాయి. మచ్చుకు కొన్ని

స్త్రీత్వారోపణ :

"తాళగలనా నిముషము బాయగలనా
తాళగలనా లలన మా నమ్మాళ్వారుల దేవగానము"

క్షేత్ర ప్రశస్తి :

నమ్మాళ్వారు తిరువాయ్ మొళియందు 35 దివ్య దేశాలను కీర్తించారు. వాటిలో ప్రసిద్ధములు శ్రీరంగం, తిరుపతి మొదలగునవి. తిరునామములలో శ్రీరంగం, తిరుపతి, విల్లిపుత్తూరు క్షేత్ర ప్రసక్తి విరివిగా కనిపిస్తుంది.

కుల నిరసనాదులు :

"కులము కారణమేమి గుణమే ప్రధానము
కులములో నేమున్నది
పలుక నేటికి విష్ణుభక్తులై యుండేటి
పావనమగు చున్నది"

అనే తిరునామంలో వ్యాస, పరాశర, నారద, జటాయువు, విదురులను ప్రస్తా వించారు.

"కుల గోత్రములను గోతులలోబడి కూలలేవే
కులము కారణమని నిక్కకు

చదువులు చదువగనేమి విప్రజాతిని పుట్టగనేమి
మద మత్సరములన్ని వదలి దాసుల దాసిగా వలెను"

మొదలైనవి.

జానపద గేయ రీతులు నాలాయిరంలో కనిపించినట్టే తిరునామములలో కూడా మనసా, చిలుకా, హంసా, చందమామ పదాలున్నాయి. అలాగే మతం వ్యాప్తి కావడానికి వీలుగా వివిధ వృత్తుల సంకేతాలు కూడా తిరునామాలతో చోటు చేసుకున్నాయి. మచ్చుకు

పెరుగు పాట :

"పెరుగోయమ్మ పెరుగు
పెరిగిన దుర్గుణ మరుగు
అతి మధురంబిది పెరుగూ
దోషాదుల బిల్లలు కరుగూ
అతులితమ్ముగ ద్రావిడ వేదార్థము
యతిపతి దాసుల కతిమోదంబిడి

(తిరునామములు - 57)

చింత చిగురు పాట :

"చింత చిగురు గొనగదరె ఆళ్వారు
చింత చిగురు గొనగదరె"

(తిరునామములు - 40)

మనసా :

ఊరకే చదువుచు నీతల
యాచనేటికే యో మూఢ చిత్తమా''

(తిరునామములు - 37)

''వద్దు మనసా భాగవత దూషణ వలదు మనసా''

(తిరునామములు - 377)

ఒక్క వాక్యంలో చెప్పాలంటే తిరునామములలో దివ్య ప్రబంధాల అనుకరణ మాత్రం గాకుండా ముముక్షుప్పడి, వార్తామాల, ఆచార్య హృదయం, శ్రీవచనభూషణం, రామానుజ రచనల ప్రభావం అతివేలంగా వుందని చెప్పవచ్చు.

7. అధునిక యుగంలో ఆళ్వారుల వాఙ్మయం :

ఇరవయ్యవ శతాబ్దంలో వెలువడిన ఆళ్వారుల వాఙ్మయాన్ని ఐదు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది పద్యగద్య గేయ నాటకాలు మరి అనువాదాలు.

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు 'గోదా వైభవం' పద్య కావ్యంగా సంతరించినవారు. 13-11-71 లో మొదలుపెట్టి 29-12-71 లో ముగించారు. 30 దినాల అనుభూతిని 30 ఖండాలలో సువ్యక్తం చేశారు. భాగవత దశమ స్కంధ పారాయణంతో ముగ్ధులై ఈ కావ్యం వ్రాసినట్లు పీఠికలో తెలియచేశారు. శ్రీ ఆచార్యులవారు పరంపరగా వినబడే గోదాదేవి కథలో కొన్ని మార్పులు చేశారు.

విల్లిపుత్తూరు స్వామి వటపత్రశాయి కాదు. అతడు వేణుగోపాలుడు. గోదాదేవి స్నానం చేసి వస్తుండగా కృష్ణుడు స్పృశించినట్లు అనిపిస్తుంది. జడలో ముద్దబంతి పూవు మాయమవుతుంది. స్వామి వేణువుపై ఆ ముద్దబంతి పూవు కనబడుతుంది. స్వామి గోద కోసం ఆరాటపడడం దీనిలోని ప్రత్యేకత. గోద మేనమామ పెళ్ళి కోసం రాగా గోదాదేవి వేణుగోపాలుణ్ణి ప్రార్థిస్తుంది. వివాహం విల్లిపుత్తూరులోనే జరుగుతుంది.

గోదా కల్యాణం వ్రాసిన వారిలో మరొకరు శ్రీ పీసపాటి రంగాచార్యుల వారు. వీరు గోదా కల్యాణంతో బాటు తిరుప్పావైను అనువదించారు కూడా. ప్రథమాశ్వాసంలో 92, ద్వితీయాశ్వాసంలో 49, తృతీయాశ్వాసంలో 61 పద్యాలున్నాయి.

"పన్నిద్దరాళువారుల
సన్నిధుల న్మనమునందు సాష్టాంగముగా
పెన్నిధులని సేవింతును
పన్నగ శయనుని పవిత్ర పదముల గొల్తున్"

అని ఆళ్వారుల పట్ల తనకున్న భక్తి ప్రపత్తులను ప్రకటించుకున్నారు. తిరుప్పావైను 30 సీస పద్యాలలో తెనిగించారు. చివరగా

"కృతి కర్త రంగ దాసుడు
కృతిపతి రంగేశు డాత్మకృతి నీ గోదా
సతి చరితమ్ము నొసంగెను
కృత కృత్యుడగుచు పూర్వకృత సుకృతమునన్"

అని ముగించారు.

గోదాదేవి కథను గేయ కావ్యంగా తీర్చినవారు శ్రీ దివి రంగాచార్యులవారు. శ్రీ వల్లభరాయ గ్రంథమాల, చీరాలవారు 1981 లో ఈ గ్రంథాన్ని ముద్రించారు.

ఈ గ్రంథం మంజరీ ద్విపదలో రచితం. విష్ణుచిత్తుడు గోదాదేవి బాల్యం అర్చన పోలిక, వ్రతం, ఐక్యం, పెరియాళ్వారు అనే భాగాలు ఇందులో కనిపిస్తాయి. రచయిత చాల మార్పులు చేశారు. ఈ కథలో వివాహ ప్రసక్తులు లేవు. గర్భాలయంలో ప్రవేశించి 'గోద' అంతర్ధానమవుతుంది. ముగ్ధభక్తికి విష్ణుచిత్తుడు, మధురభక్తికి గోదాదేవి ప్రతీకలు. గోదాదేవి పొందినది మధురాద్వైత అర్థసిద్ధి. ఈ కథలో 'గోద' భూదేవి అంశ కాదు. శ్రీదేవి అంశ. గోదలో జీవాత్మ సందేశం కూడా కనిపిస్తుంది. గుణ, రూప, పూజ, స్మరణ, ఆత్మ నివేదన, విరహాదులున్నాయి.

''రాధికా లోలుండు రాదేల నేను
రాధ నేనే కాదె రసకేళి తేలం''

అనడం గోదాదేవి వంతు అయితే

"తన్ను యశోదగా తలపోయు నతడు
భక్తి యుక్తుండౌచు నను సత్యమున"

అనడం విష్ణుచిత్తుని వంతు. ఈ కావ్యంలో విష్ణుచిత్తునిది వైరాగ్యంతో కూడిన జ్ఞానభక్తి.

తెలుగులో తిరువాయ్మొళికి ఆంధ్ర పద్యానువాదం చేసిన అర్వాచీన కవి బ్రహ్మశ్రీ చెన్నపురాజు కొండనామాత్య దేశపాండ్యగారు. నమ్మాళ్వారు తిరునక్షత్ర సమయంలో కవికి ఆళ్వారు సాక్షాత్కరించి రచనకు ప్రేరేపించారు.

"ద్రావిడ వాణిఁబాడితిని రాజిల వేద చతుష్టయంబులన్
కోవిదులుల్లసిల్ల మనుగూర్చు తెనుంగున నీ ముఖంబునన్
భావుక మంద జెప్పెద ప్రబంధము నాంధ్రవచోనుభావనం
భావన లెస్సయని పల్కెడె కన్నడ రాయదర్మిలిన్"

అనే పద్యం దీనికి సాక్ష్యం. ఈ పుస్తకానికి నిడుదవోలు వేంకట్రావుగారు విపులమైన పీఠిక వ్రాశారు. ఇందులోని ఒక అనువాద పాశురము.

''మా పూర్వులకును పూర్వుడు
రూపింపగరాని సుగుణ రుచిరాంగుడు ని
త్యాపాదిత పూజార్హుడు
దాపుగ శ్రీ వేంకటాద్రి ధవుని దలంతున్''

ఇక రెండవది తెలుగు లిపిలో సంస్కృత ద్రావిడ భాషలలోని ఆళ్వారుల చరిత్రలకు సంబంధించిన గ్రంథాలను ముద్రించడం. ఈ మహోపకారాన్ని చేసిన వారు ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య స్వాములవారు. వారు అ. ము. శ్రీనివాసాచార్యులతో కలిసి గరుడవాహన పండితుడు రచించిన శ్రీ దివ్యసూరి చరిత్రాన్ని ముద్రించారు. అలాగే మణవాళప్పెరుమాళ్ నాయనార్ రచియించిన

ఆచార్య హృదయాన్ని 1972 లో ప్రకటించారు. భాష తమిళమయినా తెలుగు లిపిలో ముద్రించడం ఈ గ్రంథం ప్రత్యేకత.

ఇక మూడవది నాలాయిర దివ్య ప్రబంధాలకు టీకా తాత్పర్య భావ వివరణలు సమకూర్చడం. ఈ ప్రయత్నం చేసిన పెద్ద సంస్థలలో తిరుమల తిరుపతి దేవస్థానం. శ్రీ రామానుజ కీర్తి కౌముది గ్రంథమాల (గుంటూరు) శ్రీ గోదా గ్రంథమాల (ముసునూరు) ప్రసిద్ధాలు. ఇక వ్యక్తుల దృష్ట్యా చూసి నపుడు ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య స్వాములవారు, మాడభూషి రామానుజాచార్యులవారు ఇంకా ఎందరో పెద్దలు ఈ భారాన్ని సమర్థవంతంగా మోసినవారే. కె. టి. యల్. యన్. ఆచార్య తిరుప్పల్లాండు, కె. టి. యల్. నరసింహాచార్య తిరువాశిరియం, నాచ్చియార్ తిరుమొడి మొదలైనవి ఆళ్వారు వాఙ్మయ ప్రచారంలో మైలు రాళ్ళు. అయితే వీటిలో తి. తి. దేవస్థానం 'తిరువాయ్ మొళి' ప్రామాణికమయిన గ్రంథమనడంలో సందేహంలేదు. దివ్య ప్రబంధాలలో 'తిరుప్పావై'కు వచ్చిన వ్యాఖ్యాన గ్రంథాలు మరే దానికి రాలేదనవచ్చు. వీటిలో తి. తి. దేవస్థానం వారు శ్రీ సుదర్శనాచార్యుల వారి 'తిరుప్పావై' విస్తరం సమగ్రమని చెప్పవచ్చు.

ఇక నాల్గవది తెలుగులో ఆళ్వారుల వాఙ్మయ వైశిష్ట్యం గురించి నిరూపించే పరిచయ విమర్శ గ్రంథాలు. ఈ రంగంలో సాటిలేని కృషి చేసినవారు ఇద్దరు, టి. లక్ష్మణాచార్యులు, శ్రీ ధనకుధరం వరదాచార్యులవారు. వరదాచార్యులవారి 'ఆళ్వారులు - దివ్య ప్రబంధములు'. ఆళ్వారుల వాఙ్మయం చదివేవారికి 'కరదీపిక' లాంటిది. వీరేగాక శ్రీ రామానుజదాసులు విరచించిన దివ్యసూరి కథాసారం, మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ రచించిన దివ్యసూరి హృదయం, ఆచార్య పురుషుల చరిత్ర లాంటివి బాగా ప్రచారంలోని పుస్తకాలే. తిరుమల తిరుపతి దేవస్థానం వారు కూడా ఆళ్వారుల దివ్య వైభవము అనే పుస్తకాన్ని ప్రచురించారు. శ్రీ తిరువాయిపాటి రాఘవయ్య ఈ గ్రంథ రచయిత. శ్రీ రామానుజ కీర్తి కౌముది గ్రంథమాలలో పన్నిద్దరాళ్వారుల చరిత్రలు లఘుకావ్యాలుగా కూడా ముద్రితం.

ఇక ఐదవది శ్రీ వేంకటేశ్వర స్వామిపై ఆళ్వారులు పాడిన పాశురాల ప్రచురణ. తి. తి. దే. వారు 1947 లో తిరువేఙ్కడముడైయాన్ విషయముగ

ఆళ్వారుల మంగళాశాసనములు ఎ. జయరాం నాయుడు, బి. ఎ., వారిచే ప్రచురింపబడినది. అలాగే దేవస్థానం వారే చెలికాని అన్నారావుగారి ప్రోత్సాహంతో శ్రీ దివ్యసూరులు అనతిచ్చిన మంగళాశాసన పాశురములను 1957 లో ముద్రించారు. శ్రీ సుదర్శనాచార్య స్వామిగారు తెలుగులో టీకా తాత్పర్యాలతో ఈ పాశురాలకు చక్కని వ్యాఖ్యానం చేశారు. ఇవేగాక ఆళ్వారులకు సంబంధించి తెలుగులో సిద్ధాంత గ్రంథాలు పత్రికా వ్యాసాలు చాలా ఉన్నాయి. వీటిలో ప్రత్యేకించి ఆచార్య వేటూరి ఆనందమూర్తి వైష్ణవ వాఙ్మయం, డా॥ జె. మునిరత్నం అన్నమయ్య ఆళ్వారులు - తులనాత్మక పరిశీలన, డా॥ కిడాంబి నరసింహాచార్య తిరునామములు మొదలయినవి చెప్పుకోదగ్గవి.

శైవ సాహిత్యంలాగే ఆళ్వార్ వాఙ్మయం విశిష్టమయింది. మత ప్రాంత భాషా భేదాలను విస్మరించి ఈ సాహిత్యాన్ని సమగ్రంగా అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా వుంది. సంస్కృత ద్రావిడ భాషలలోని ఆళ్వార్ వాఙ్మయాన్ని తెలుగులో అనువదించి ఆ సాహిత్య మాధుర్యాన్ని అందించవలసిన బాధ్యత తిరుమల తిరుపతి దేవస్థానం వంటి వారికి తప్పక వుంది.

## ఉపకరించిన రచనలు


1. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర — డా॥ యస్వీ జోగారావు
2. ఆచార్య సూక్తి ముక్తావళి — నంబూరి కేశవాచార్యులు
3. ఆముక్తమాల్యదా సౌందర్యము — డా॥ టి. కోటేశ్వరరావు
4. ఆళ్వారుల దివ్య ప్రబంధం — ధనకుధరం వరదాచార్యులు
5. ఆళ్వారుల మంగళాశాసన పాశురములు — టీక కె. వి. సుదర్శనాచార్య
6. కృష్ణమాచార్యుని కృతులు పరిశీలన — సి. హెచ్. వెంకటేశ్వరరావు
7. తాళ్ళపాక కవుల కృతులు వివిధ సాహితీ ప్రక్రియలు — డా॥ వేటూరి ప్రభాకర శాస్త్రి
8. తిరునామములు - సమగ్ర పరిశీలనము — డా॥ కిడాంబి నరసింహాచార్య
9. తెలుగు జానపద గేయ సాహిత్యము — డా॥ బి. రామరాజు

10. ద్వాదశ సూరి చరిత్రము —కె. టి ఎల్. నరసింహాచార్యులు

11. ద్విపద వాఙ్మయము — డా॥ నాగయ్య

12. పరమయోగి విలాసము — తాళ్ళపాక చిన్నన్న

13. విష్ణుభక్తి తత్పరుడు - విప్రనారాయణుడు — డా॥ ఎడ్ల బాలకృష్ణారెడ్డి

14. వైష్ణవాంధ్ర వాఙ్మయము — డా॥ వేటూరి ఆనందమూర్తి

15. Golden Jubilee Celebration Souvenir T. T. D.
Collected Papers —Prof. N. Subbu Reddiar

[తిరుమల తిరుపతి దేవస్థానం దివ్య ప్రబంధ ప్రాజెక్ట్ ఏప్రిల్ 1991 లో నిర్వహించిన సెమినారులో చదివిన వ్యాసం]

# వి న తి

'వ్యాస కదంబం' అనే పుస్తకంలో 13 వ్యాసాలున్నాయి. ఈ వ్యాసాలలో కొన్ని ఆలిండియా రేడియో తిరుపతి, ఆలిండియా రేడియో కడప ద్వారా ప్రసారానికి నోచుకొన్నాయి. మరికొన్ని స్రవంతి, ఆంధ్ర జ్యోతి, సద్గురువాణి, వాఙ్మయి పత్రికలలో వచ్చాయి. మరికొన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో చదివినవి.

రేడియోలో ప్రసంగం విన్నవారు, పత్రికలలో నా వ్యాసాలు చదివినవారు వేదికమీద కూర్చుని ప్రసంగించగా శ్రద్ధతో విన్నవారు ఈ వ్యాసాలన్నీ ఒక పుస్తక రూపంలో వస్తే బాగుంటుందని భావించారు. కొందరు ఉత్తరాలు కూడా వ్రాశారు. ప్రత్యేకించి కొందరు బలవంతం కూడా చేశారు. అందరి అభిమానాలు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహకారంవల్ల ఈ 'వ్యాస కదంబం' అచ్చు రూపంలో వచ్చింది. ఈ వ్యాసాలు సమగ్రమని చెప్పలేను. అసమగ్రమని అంగీకరించలేను. ఇవి సామాన్యుల కోసం సామాన్యుడు వ్రాసిన వ్యాసాలు.

ఈ పుస్తకాన్ని అందంగా, అతి తక్కువ కాలంలో ముద్రించిన శ్రీ జి. వీరబ్రహ్మం - భాగ్యం క్వాలిటీ ప్రింటర్స్, మదరాసు వారికి నా కృతజ్ఞతలు.

తిరుపతి
'శ్రీముఖ' ఉగాది

కె.

# శ్రీనాథుని చాటువులలో సాంఘిక జీవన చిత్రణ

ప్రాచీనాంధ్ర కవులలో శ్రీనాథుని కొక ప్రత్యేక స్థానం ఉంది. ఆ మహా కవికి గీర్వాణమంటే ఎంత గౌరవమో తెలుగంటే అంత ప్రాణం. ఆ కవికి ప్రౌఢ ప్రబంధాలను వ్రాసి పండితుల్ని మెప్పించే సామర్థ్యం ఉన్నట్లే సామాన్యుల్ని మరపించే మురిపించే రచనలు చేసే నైపుణ్యం వుంది. అతడెంత రసికుడో అంతకు మించి భక్తుడు కూడా. ఎన్నో పదవుల రుచులు చూసినవాడైనా పామరులతో సమానంగా కష్టసుఖాలు పంచుకున్నవాడు శ్రీనాథుడు. అందువల్లనే ఇతరుల చాటువులలో కనిపించనంత సాంఘిక చిత్రణ శ్రీనాథుని పద్యాలలో కనిపిస్తుంది.

సాంఘిక చరిత్ర అంటే ప్రధానంగా ప్రజల చరిత్ర. అది సామాన్యుల సొంత కథ. సాంఘిక చరిత్రలో ప్రధానంగా నాలుగు అంశాలుంటాయి. మొదటిది అందరికి అవసరమయిన నీరు-కూడు-గుడ్డ-నివాసాలకు సంబంధించిన ప్రయాస. రెండవది ప్రజాజీవనం సాఫీగా సాగడానికి ఏర్పరుచుకున్న వర్ణవ్యవస్థ-కులవృత్తి వ్యవస్థ. ఇంక మూడవది సంఘములోని కొందరి వ్యక్తుల ప్రవృత్తులు. నాల్గవది రాచరికానికి సంబంధించిన విశేషాలు.

మనిషి మనుగడకు 'నీరు' చాల అవసరం. 'నీరే ప్రాణాధారము. నోరే రసభరితములగు నుడులకు నెల్లన్' అన్నాడొక కవి. నీటి పద్ధతి ఈనాడు ఎలా వుందో శ్రీనాథుని కాలంలోను అక్కడక్కడ వుండేవి. దేవునిమీద భారం వేసి, బావులు త్రవ్వుతూ, అందులో నీరు పడకపోగా, ఇంకాస్త త్రవ్వితే 'గంగ' పడుతుందేమోనని, ఈనాడు ప్రయత్నించినట్లే ఆనాటి పలనాటి వాస్తవ్యులు ప్రయాస పడేవారేమో. వారి ఆవేదనను అర్థం చేసుకున్న శ్రీనాథుడు,

"సిరిగల వానికి చెల్లును
తరుణులు పదియారు వేలుఁదగఁ బెండ్లాడన్
దిరుపమున కిద్దరాండ్రా
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్" అన్నాడు.

ఇది వెటకారము కాదు. అమాయకుల 'ఆస్తిక్యాన్ని' కాలరాచడం తప్పని కాలకంఠునికి హెచ్చరిక కూడా. 'అంగడి యూరలేదు' అనే చాటువులోకూడ 'నీటికై భంగపడంగ బ్రాల్పడు కృపాపరు లెవ్వరు లేరు' అని వర్ణించాడు.

నీరు తర్వాత మనిషికి అవసరమయింది 'ఆహారం.' ఈ ఆహారం ప్రాంతం బట్టి, ఆర్థికస్తోమత బట్టి, వ్యక్తి అభిరుచుల బట్టి మారుతూ వుంటుంది. రాకపోకల సాధనాలు అంతంత మాత్రంగా వున్నరోజుల్లో దొరికే వస్తువులతోనే అన్నీ సర్దుకోవడం అలవాటు. పలనాటి సీమలో జొన్న ముఖ్యమైన పంట. అక్కడివారికి "జొన్న కలి జొన్నయంబలి జొన్నన్నం జొన్న పిసురు" రోజూ వుండేదే. చింతచిగురు బచ్చలికూర కలిపిన కూడు వారికి విందు భోజనం లాంటిది. ఉన్నవారు లేనివారు జొన్నకూడుతో తృప్తి పడడం చూసి శ్రీనాథుడు 'కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్' అని విసురు విసిరాడు.

పలనాటి 'ఫలహారం' ఈలా అయితే అరవల వంటా వార్పు ఆంధ్రుల్ని అదరగొడుతుంది. తెలుగువారి వంటకంలో 'పప్పు' ప్రధానమయితే తమిళుల భోజనంలో 'చారు' ముఖ్యం. ఈ వంట వార్పుకు జడిసిపోయి

"తొలుతనే వడ్డింత్రు దోడ్డమిర్యపుఁ జారు
చెవులలోఁ బొగవెళ్ళ చిమ్మ రేఁగ
పలు దెఱంగుల తోడఁ బచ్చళ్ళు చవిగొన్న
బ్రహ్మరంధ్రము దాకఁ బారు నావ
వేపాకు నెండించి వేసిన పొళ్ళను
గంథాన గాంచినఁ గ్రక్కువచ్చు"

అని నమస్కారం పెట్టడం ఒక సన్నివేశం. ఇక 'కర్ణాటకప్రాంతంలో అయితే వెల్లుల్లి, తిలపిష్టం, చల్లా అంబలి' మొదలయినవి సామాన్య ఆహార నియమాలు.

ఇంక ఆర్థికస్తోమత బట్టి పరిశీలిస్తే శ్రీనాథుని చాటువులలో 'పేదవారి భోజనం'కూడ లేకపోలేదు.

"మూతిని ముట్టగా వెఱుతు ముద్దకు ముద్దకు గూటి లోపలన్
బాతికపాలు సైకతం పచ్చడి కొంచెము యూది నుండియు
చూతమటన్న లేదు." కాని కలవారి ఇండ్లలో పప్పన్నం,

పరమాన్నం, నేయి, పచ్చళ్ళు, పానకాలు, బొబ్బట్లు, ఊరగాయలు వగైరాలున్నట్లు 'అపూపసూప వప్తాంగ భంజనులార' పద్యం సాక్ష్యం పలుకుతుంది.

తిండితర్వాత మనిషికి అవసరమయింది మానసంరక్షణకోసం వస్త్రం. ఈ వస్త్రధారణకూడ ప్రాంతంబట్టి, ఆర్థికస్తోమతబట్టి, అభిరుచులబట్టి మారుతుం టుంది. గొంగలికప్పు, మేలుపచ్చడాలు, వంకరపాగాలు, మైఃకోకలు, నడుము వంగిన కత్తులు, మైసూరివారి వేషాలు, కుళ్ళాపెట్టుకోవడం, కోకచుట్టడం, మహా కూర్పాసం తొడగడం వారి గాంభీర్యానికి వన్నె చేకూర్చే అంశాలు.

శ్రీనాథుడు పురుషులవేషంకన్నా స్త్రీలవేషాన్ని విరివిగా చాటువులలో వర్ణించాడు. ఆనాటి స్త్రీలు మల్లియచీర, చెంగావిచీర, పాలవెల్లువవంటి చీర, కుసుమంబద్దిన చీర, సన్నపుచీర, మడిచీరలు కట్టేవారు. ఇక ఆనాటి రవికలలో ఎఱ్ఱరైక, యమునారైక, కావిరైక, కుట్టినీ రవిక, చందురు కావిరైకలుండేవి. చీర రైకలే కాకుండా ఆనాటి స్త్రీలు 'వన్నెల గాగరలు' అంటే రకరకాల రంగుల పావడాలుకూడ అందంగా ధరించేవారు. పైటల్లోకూడ నాచుపైట, దిగజారినపైట, బిరుసు పయ్యెదచెంగు, ఓరపయ్యెదకొంగు, మైజారు కోయలున్నట్లే కుచ్చెళ్ళలో కూడ పటువారు సందెడు కుచ్చెళ్ళు, జిగిమీఱు కుచ్చెళ్ళు, మోగాళ్ళ జీరాడు చీర, చుంగులుజారెడు కుచ్చెళ్ళు ఆనాటి అతివలు మెచ్చుకొనే అలంకరణలు. బొట్టులలో కూడ అగిసాకు బొట్టు, కుంకుమ చుక్కబొట్టు, విభూదిబొట్టు, సింధూరపు బొట్టు, కస్తూరిసోగ బొట్టు, భూతిరేఖలు, తిరుచూర్ణం ఉన్నాయి. ఆభరణాలలో గెలుకు మట్టెలు, మంజీరాలు, కనకపుటందియలు, మొలనూలు, పచ్చపూసలు, హారాలు, కమ్మలు, ముక్కునత్తు, అరవీసపు మంగళసూత్రమువంటివి కూడ కనిపిస్తాయి.

కూడుగుడ్డల తర్వాత మనిషికి 'నీడ' అవసరం. శ్రీనాథుని చాటువులలో 'ఆకాశ హర్మ్యాల' వర్ణనలు లేవు. పడమటిప్రాంతంలో సుద్దపైనపోసి కట్టిన వాటిని 'మిద్దె'లనడం పరిపాటి, ఇతరత్రా 'మిద్దె'లంటే 'భవంతు'లని ప్రసిద్ధి ఈ సోద్యాన్ని చూసి శ్రీనాథుడు,

"మిద్దెలు మిద్దెలన్నా మన మేడలకంటెను సొంపునించి బల్
విద్దపు సౌధజాలముల లీల వెలుంగునటంచు నెంచి నే నద్దిర మోసపోతి,"
అన్నాడు.

ప్రజాజీవనం సాఫీగా సాగడానికి ఏర్పరచిన కులవ్యవస్థ వర్ణవ్యవస్థ చాటువులలో ఎలావుందో చూద్దాం. శ్రీనాథుని చాటువులలో రాచకన్యలు బ్రాహ్మణులలో నియోగి భామలు, వైశ్యులు, తదితరుల వర్ణనలున్నాయి. ఆయా కులాలకంటె వృత్తులకు ప్రాధాన్యమిస్తూ కాలం గడుపుతున్న కాంతామణులే శ్రీనాథుని చాటువులలో ఎక్కువ. అంగడివీధిలో రసికుల్ని పూరించేవిధంగా పండ్లమ్మే జంగంవారి పిన్నది, ఆవందగ్గర కూర్చున్న "అందాల కుమ్మరిబాలిక, తమలపాకులమ్మే తరుణి, నూలు వడికే 'నూతన యౌవన' సాలె భామ. ఏకులు వడికే రంభలాంటి రామ, మొలలోతు తటాకంలో నిలబడి బట్టలుతికే చాకలి 'పిన్నది' వృత్తివ్యవస్థను నిలుపుకున్నవారే. ఈ వృత్తులేకాకుండా శ్రీనాథుని చాటువులలో చాలచోట్ల 'వేశ్యా జీవనం' కనిపిస్తుంది. వారి సుఖజీవనాన్ని చూసి శ్రీనాథుడంతటివాడుకూడా,

"కవితల్ చెప్పినఁబాడ నేర్చిన వృథాకష్టంబె యీ భోగపుం
జవరాండ్రేకద భాగ్యశాలినులు" అన్నాడు.

ఇంక శ్రీనాథుని చాటువులలోని వైయక్తిక అభిరుచులు. ఈ అభిరుచుల విషయంలో పెద్దాచిన్నా అనే అంతరువు కలవారు లేనివారు అనే గిర్రలుండవు. వేశ్యాప్రియత్వమన్నది ఆనాటి వ్యవస్థలో గౌరవానికి చిహ్నం. రసికత్వానికి పరాకాష్ఠ. 'చేతులో' చెయ్యేసి సంకేతస్థలం 'మరిమరి' గుర్తుచేసి అమవాస్య రాత్రివేళల్లో మాట నిలుపుకోలేని మగువను శ్రీనాథుడు మనసా

"హా సురత తంత్ర కళానిధీ! యెందువోయితే
రాజమహేంద్రవీధిఁ గవిరాజు ననున్ గికురించి"

అని తిట్టుకున్నాడు. అంతేకాదు అవసరానికి దగ్గరచేరిన వేశ్యల్ని గుర్తుంచుకోవడం, కుశలప్రశ్నలడగడం, ఔపచారికం కూడా. ఈ విషయాన్నే

"గుడి మీది క్రోతితోడను
గుడి లోపల నంబివారి కోడలి తోడన్
నడి వీధి లంజ తోడన్
నడిగొప్పుల హోరుగాలి నడిగితి ననుమీ'' స్పష్టంచేస్తుంది.

వారకాంతల వ్యవహారంమాత్రం కాదు. వారివల్ల వ్యవహరించే వ్యాధులు వైద్యాల వర్ణనకూడ చాటువులలో కనిపిస్తాయి.

'నగము బోలెడు మేను సగము చేసెనుగదా' అనే పద్యపాదం. ఉలివిరి చెక్కతో ఔషధం, పత్తెంగా రొట్టె, గాలి ఆడని ప్రదేశంలో మంచంమీద పడుకోవడంవంటివి సుఖరోగాదుల వైద్యంకూడా.

కలవారి ఇళ్ళల్లోను, హోదాతో కాలంగడిపేవారి ఇళ్ళల్లో గుట్టుచప్పుడుగా సాగే వ్యవహారంకూడా శ్రీనాథుని చాటువుల్లో చోటుచేసుకుంది. (అగ్గికోసం) వచ్చి అడియేన్ దాసోహమ్మంటు నమస్కరించిన పడతిపై ఒక జియ్యరుస్వామి చేసిన అత్యాచారం 'ఇంగల మంచువచ్చి' అనే చాటువులో కనిపిస్తుంది.

శ్రీనాథునికి నచ్చిన ప్రదేశం 'కుందుగడ్డ'

మందరాద్రి సములు మానవులందరు
చందమామ కూన అందుసుకులు
కందులేని మౌక్తికంబులు జొన్నలు
కుందనపు చెడ్డ 'కుందుగడ్డ'

ఇక ఆడపిల్లల తీరుతెన్నులు.

మేత గరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతు తనంబునన్ బందిపిల్ల
ఎల్లపనులను జరుపంగ బల్లిపిల్ల
అందమున కోతిపిల్ల యా యరవపిల్ల.

బహుశః శ్రీనాథుడు తాను చూసిన 'కొందరి అరవల స్వభావాలను' సార్వత్రికము చేసి వుండవచ్చు. అంతేకాని అరవలందరు అలా ఉంటారని కాదు.

ఇక రాజరికానికి సంబంధించిన విశేషాలు శ్రీనాథుని చాటువులలో సామాన్య ప్రజానీకానికి రాజులకు సంబంధించిన ప్రత్యేక వృత్తాంతాలేవీ కనిపించవు. కాని రాజులు పండిత ప్రియులు. కవిశేఖర మిత్రులు. భేషజాలకు పోకుండా కవి పండితులతో కలిపి తిరగడం, తినడం, విహరించడం వారికి అలవాటు. ఈ విషయాన్నే శ్రీనాథుడు

'కాశికా విశ్వేశు గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయడిచ్చు
రంభఁ గూడె దెనుంగు రాయ రాహుత్తుండు
కస్తూరి కే రాజు బ్రస్తుతింతు,
స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తి గలదు
కైలాసగిరి బండె మైలారు విభుఁడేగి
దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు"

అని స్పష్టం చేశాడు. శ్రీనాథుడు జీవించిన కాలంలో రెడ్డిరాజులు పోయి ఒడ్డెరాజులు వచ్చారు. రాసిక్యం తెనియనివారు, కవి పండితులంటే ఆదరణ లేనివారు కావడంవల్ల పన్ను చెల్లించలేదని శ్రీనాథునికే శిక్ష వేశారు. చేతికి వెదురు గొడియ తగిలించడం, నగరి వాకిటనుండే నల్లగుండును భుజాలకెక్కించడం, పాదాలకు సంకెళ్ళు బిగించడం, ఎదురెండలో పొగడదండ వేయించడం ఆనాటి శిక్షా విధానం.

ఇక పరిశిష్టం–మత విషయం ఆలోచిస్తే శ్రీనాథుని చాటువులలో వైష్ణవులు, శైవులు స్మార్తులు కనిపిస్తారు. 'ఇంగలమంచు' అనేపద్యంలో శఠగోపజియ్యరు దాయాదాల్పలె పద్యంలో విశ్వేశ్వరార్చనా వేళలో గిరిగిండ్లు వాయించే 'జంగమాంగన' 'మీగాళ్ళ జీరాడు' పద్యంలో మడిచీరతో తిరుచూర్ణం ధరించిన సాతాని కనిపిస్తారు.

శ్రీనాథుని చాటువులలో పలనాటి సీమలు – పలివెల, గురజాల, కడిదిపురం, రాచవీడులు, రాజమహేంద్రవరం, విద్యానగరం, సింహాద్రి, కడప మండలం

'కుందుగడ్డ'లు ప్రస్తావన ఉంది. అలాగే 'కాసలనాటి' వారు, వేపారివారు, వెల్గోటి వారు కనిపిస్తారు.

శ్రీనాథుని చాటువులలో మోతాదు మించిన శృంగారం మాత్రం కాదు. మురిపించే కుటుంబ చిత్రణంకూడ కనిపిస్తుంది. పలనాటి సీమలోని ఒక ఇల్లాలి ఇంటి వైనం—

"పువ్వులు కొప్పునం దుఱిమి ముందుగఁ గొనసి యాడుచుండగా
జివ్వనఁ జంగ సాఁచి యొకచేతను రోఁకలిపూని యొయ్యనన్
నవ్వు మొఖంబు తోడఁ దను నందనుఁ బాడుచు నాథుఁ జూచుచున్
సువ్వియ సువ్వియంచు నొక సుందరి బియ్యము దంచె ముంగిటన్"

పంట పండితే ఢోకా లేదుగాని ఆ ఏడు కరువుకాటకాలు. తిండిలేక కటకటలాడే రోజులు. ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. మగవారికి వ్యవసాయం పనుల్లేవు. మగడు ఊరుచుట్టి వచ్చాడు. ఉన్సురుమని గోడకాని కూర్చున్నాడు. ముత్తైదువు కదా అంటూ పువ్వులిచ్చింది. ఇక ధాన్యం దంచాలి. అంచేత పని తొందరగా తెమలడంకోసం చంటిపిల్లవాణ్ణి నేల పడుకోపెట్టింది. నవ్వుమొగంతో భర్తని, పాట పాడుతూ పిల్లవాణ్ణి, అలసట తీరేలా 'సువ్వి సువ్వి' అంటూ ధాన్యం దంచిందట. భార్య వయ్యారానికి భర్త, పాటకు పిల్లవాడు మురిసిపోయారు. ఎవరికీ ఇబ్బందిలేక ధాన్యం దంచడం పూర్తి అయింది. ఆ తరువాత 'వంట' చేసి బిడ్డను, భర్తను ఆ ఇల్లాలు మురిపించి వుంటుంది.

ఏమయినా తెలుగు కవులలో శ్రీనాథునికి సాటి రాదగినవారు లేరు. తన సుఖ దుఃఖాల్ని, లాభ నష్టాల్ని, మానావమానాల్ని తనకు తారసపడిన వారిని, తాను చూపిన దృశ్యాల్ని యథాతథంగా వర్ణించడం అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు.

ఆల్ ఇండియా రేడియో,
కడప, 1987.

# అప్పకవి రచనా వైశిష్ట్యం

తెలుగు వాఙ్మయంలో ఛందోగ్రంథాలకు కొదవలేదు. అయితే వాటిలో 'అప్పకవీయా'నికి ఉన్న ప్రచారం మరేదానికి లేదనడం అతిశయోక్తి కాదు అప్పకవి బహుగ్రంథకర్త.

"జగతి నాపస్తంబ శాఖోక్తి షట్కర్మ
పద్ధతి ఖండ నిబంధనంబు
కాలఖాలార్ణవాఖ్య జ్యోతిష గ్రంథ
సంహితా సుశ్లోక సంగ్రహంబు
శ్రీమదనంత ప్రసిద్ధ మహావ్రత
కల్పకథాంధ్రోక్తి కావ్యరచన
శ్రీనగాధీశ సుశ్లేష నిందాస్తుతి
భావగర్భిత సీస పద్యశతము
లలిత కవికల్పకాఖ్యాన లక్షణంబు
మహిత సాధ్వీజనౌఘ ధర్మద్విపదము
నంబికావాద నామక యక్షగాన
కృతియుఁజేసితి కాకనూరికులయప్ప"

పీ. ౧క-౧౯

అనే పీఠికాపద్యంబట్టి అప్పకవి ఎన్నో గ్రంథాలను వ్రాసినట్లు స్పష్టమవుతుంది. అయితే ఈ గ్రంథాలేవి నేడు దొరకడంలేదు. ఒక్క అప్పకవీయమనే లక్షణ గ్రంథం తప్ప. ఇదియొక లక్షణగ్రంథం. ఇందులో ప్రసిద్ధ గ్రంథాలనుండి అప్పకవి ఎన్నో ఉదాహరణాలిచ్చాడు. అయితే అక్కడక్కడ చమత్కారంకోసం అప్పకవి సొంత పద్యాలుకూడా చేర్చాడు. వాటిలో కొన్ని నీతిని, మరికొన్ని రసికతను, కొన్ని స్వానుభవాన్ని, ఇంకా కొన్ని పౌరాణికాంశాలను స్పష్టం చేస్తాయి. వాటిలో కొన్నిటిని చవిచూద్దాం.

అప్పకవి 'ఇష్టదేవతాస్తుతి' భాగంలో వినాయకుణ్ణి

"తన్మఁగని యొక్క యెత్తునసె
దక్షజయు న్నిటలాక్షుఁడు న్ముదం
బున నిరు చెక్కులం గదిసి
ముద్దుకొనంగ నొకింత నెమ్మొగం
బనువుగ వెన్కకుం దిగిచి
యత్నవిహీన పరాస్పరాస్య చుం
బనములు తల్లిదండ్రులకుఁ
బన్నఁగఁ గూర్చు గజాస్యు నెన్నెదన్"

అని ప్రార్థించాడు.

సాధారణంగా తల్లిదండ్రులకు 'తొలిచూలు'పై ఆప్యాయత ఎక్కువే వుంటుంది. వినాయకుడు దక్షజామాహేశ్వరుల తొలిచూలు. బిడ్డ ఎంతో ముద్దులు కురిపిస్తుంటే తల్లితండ్రులకు వల్లమాలిన వాత్సల్యం పెల్లుబుకుతుంది. తల్లిదండ్రుల మధ్య కుమారుడు తచ్చాడుతున్నాడు. ఒక చెక్కిలిపై పరమశివుడు మరోవైపు దక్షజ ముద్దెట్టుకున్నారు. అల్లరివాడయిన ఆ గజాననుడు మెల్లగా తల తిప్పు కున్నాడు. ఇది తల్లిదండ్రులు వూహించని పరిణామం. చివరకు బిడ్డను ముద్దెట్టు కొనబోయిన సతీపరమేశ్వరులు పరస్పరం చుంబించుకున్నారట.

సిద్ధఖండ బిందువు, సిద్ధపూర్ణ బిందువుల్ని వివరిస్తూ అప్పకవి కొన్ని ఉదాహరణలిచ్చాడు.

వెలఁది చెలఁగి నిన్నుదలఁచిన నన సిద్ధ
ఖండ బిందువయ్యెఁ గమలనాభ
పొంకమైన యింతి పొందు సొంపఁగు నన
సిద్ధ పూర్ణబిందు విద్ధచరిత 2_23

ఉదాహరణాల్ని ఉదాహరణాలుగా కాకుండా ఒక స్వరూపం కళ్ళకు ఆనేలా పదాలను జోడించడం ఇందులోని ప్రత్యేకత.

"కమలనాభ! ఒక తరుణి మనసారా నిన్ను వలచింది. ఆ అమ్మాయి అందగత్తె కూడా. ఆవిడను ఏలుకోవడం న్యాయం" అని పై పద్యం స్థూలార్థం.

వెల్(ది, చెల్(గి, తల్(చి మొదలయిన పదాలలో అరసున్నలున్నాయి. ఈ అర సున్నలు కోరికల అపూర్ణస్థితిని స్పష్టంచేస్తున్నాయి. వనిత వలచినంత లాభం లేదు. వనితామానస సూనసాయకుడు ఏలుకోవాలి. భగవంతునిపై భక్తి నిలపడం ముక్తికి సగందూరంలో వుండడంతో సమానం. ఆ తరుణి కోరిక సిద్ధించినట్టే. ఇంక 'పొంకమైన యింతిపొందు సొంపు' అనడం సాముద్రికశాస్త్రానికి, వాత్స్యాయన కామసూత్రాలకు సంబంధించిన అంశాలు. పొంకము, ఇంతిపొందు, సొంపు అనే మాటలు నిండుసున్నలున్న పదాలు. ఆ పదాలున్నట్లే నెలతకూడా నిండుగా వుండాలని భావం. గలగలపారే ప్రవాహంలో తానమాడడం, గరగరలాడే గారెల రుచి చూడడంలాగే పొంకమయిన అవయవాలున్న అంగనాసాంగత్యం విందని అప్పకవి తన రసికతను పరోక్షంగా వ్యక్తంచేశాడు.

> వనితయు( గవితయు( దానై
> చనుదెంచుట కలుగునేని సరసంబగు 1-56

అని అప్పకవి నిర్వచనం. 'సరస' శబ్దం సార్థకం. రసమంటే రసరాజమయిన శృంగారం. 'శృంగార ఏవ మధురః పరప్రహ్లాదన్ రసః' అని ఆలంకారికుల అభిప్రాయం. బలిమిని చెరపట్టిన స్త్రీల పొందు సరసం కాదు. తనంతతాను వలచి వచ్చిన వనిత సాంగత్యం సరసం. తనలో శృంగారభావం కలిగిస్తూ, ప్రియుని అలరించే వనితాసాంగత్యం సరసమని అప్పకవి స్పష్టంచేశాడు.

అప్పకవికి 'వెల్లుల్లి' అంటే పడదు కాబోలు. వైద్యగ్రంథాలలో 'వెల్లుల్లి' మాహాత్మ్యం కొండంతగా వుంది. అయినా అప్పకవి తన అయిష్టతను

> చందనోదకములను నిచ్చలును బెంప(
> బడియు వెల్లుల్లి తన కంపు( బాయనిగతి
> శుభగణము గూడియును నిజశూన్యఫలము
> తగణము త్యజింపదనియె 4-129

అనే పద్యాలలో చెప్పాడు.

మానవప్రవృత్తి చాల చిత్రమయింది. కొందరు తమ సుఖదుఃఖాల్ని బాహ్యం చేయరు. మనసులోనే దాచుకుంటారు. కొందరు 'బాహాటం' చేసుకుంటారు.

# విషయ సూచిక

ప్రత్యేకించి కోపం వచ్చేవేళ ఆంగికచలనాన్ని అదుపు చేయడం మరీకష్టం. ఉదాహరణకు తల్లి పిల్లల్ని కసరుకోవడం అందరికి తెలిసిందే. యశోద కన్నయ్యను కసరుతుంది.

చలము మాని కుడువు చట్ట కేశవ ప్రొద్దు
చాలనయ్యెఁ బసి వ్రజంబు వెడలె
జతలు గూడి వచ్చి సఖులు చీరెదరేల
జాగనంగ దంత జంబులయ్యె 2_119

చలము, చట్ట, చాల, జత, జాగు మొదలయినవానిని దంతజమని చెప్పడం లాక్షణికుని అభిప్రాయం. ఈ ఘట్టం కోప ప్రకటనకు సంబంధించినది. కోపం వచ్చేవేళ పండ్లు కొరకడం సహజాంగికం. సన్నివేశానికి, ఉదాహృత పదాలకు చక్కటి సమన్వయం కుదరడం ఇక్కడ విశేషం.

భక్తి విభేదాలలో 'వాత్సల్య భక్తి' ఒకటి. తమిళంలో పెరియాళ్వార్, హిందీలో సూరదాస్, కన్నడంలో పురందరదాసు ఈ వాత్సల్య భక్తిని అభిమానించి వర్ణించినవారిలో ప్రముఖులు. అప్పకవి ఏకతరయతి, సంయుతాసంయుతప్రాసలకు ఇచ్చిన ఉదాహరణలలో ఈ భక్తిభావం సుస్పష్టం.

రార బాలకృష్ణ రచ్చల గుమ్మిఁగూడి
బోగ యనుచు నిన్ను బవ్వఁబెట్టు
వాండ్ర యిండ్ల కేగి వాదేలఁ దెచ్చెద
వనిన నేకతరములై పొసంగు 3_86

పోఁడి ద్రచ్చగ నిమ్ము నా తండ్రి కృష్ణ
వేకు కొనియెద నందాకఁ బండ్లు దినుము
దుండగపు చేష్టలును నోటి గాండ్రతనము
మెండుఁగాఁ జొచ్చె నీకు నైదేండ్ల కన్నఁగ 3_315

తన్ను యశోదగా భావించడం ఈ పద్యాలలోని భావవిశేషం.

అప్పకవి 'ఆటవెలది' కి లక్షణం చెబుతూ రమణీయమయిన దృశ్యాన్ని పాఠకుల ముందుంచాడు.

'మేలు మేలటంచు మిత్రులు ముగ్గురు
వింత యనుచు విబుధు లిద్ద
అహహ యనుచు సూరులయిదుగురును మెచ్చ
నాట వెలఁది మూట నలరు సగము 4_35

,ఈ పద్యంలో ఒక 'నాట్యప్రదర్శన' సన్నివేశముంది. ఆ ప్రదర్శన చూడడానికి ధనవంతులు, సామాన్యులు, పండితులు, పామరులు వచ్చారు. నాట్యం జనరంజకంగా వుంది. రసికులు ఊగిపోయారు. 'మేలు మేలు' అని ప్రశంసించారు. 'వింత వింత' అంటూ విబుధులు పొగడినారు. కొందరు ఆనందపారవశ్యం అణచుకోలేక 'అహహ, అహహ' అంటూ ఆనందించడం తెలిపిందే.

అప్పకవి కాలంలో కూడా తెలుగన్నా, తెలుగు కవిత అన్నా ఒక చిన్న చూపు ఉండేదేమో. మాటవరుసకు తెలుగును మెచ్చుకొనేవారిని అప్పకవి మందలించాడు కూడా.

ఇంటిలోన హేమమెంతఁ గల్గిననేమి
తొడవు సేయకున్నఁ దొడుగరాదు
తెలుఁగు బాస యెంత తెలిసియుండిన
చదువకున్న కవిత చక్కఁగాదు.

అప్పకవి 'అనంతవ్రత కథను' విరచించినట్లు పీఠికా భాగములోని పద్యము (ప 85) స్పష్టం చేస్తున్నది. కాని ఈ గ్రంథం అలభ్యం. అప్పకవికి ఈ కథపట్ల ఆదరం ఎక్కువ అనడానికి 'పంచపద'కు ఉదాహరణగా అనంతుని కథను ఇవ్వడం గమనించదగ్గది.

ధన్య సుశీల యనన్విత
తత్పరతన్నది యొద్దునందు స
త్కన్యలు సేయు సువ్రతము
తానును వేడుక నాచరించి స
న్మాన్యత గట్టినట్టి నవ
మండిత తోర మసూయఁజేసి పె
న్దైన్యము నొంది కానల వి
ధాతృకృతంబయిన సంచరించు కౌం
డిన్య మహామునీశ్వరుఁ గ
డిందిగఁ బ్రోచిన రుక్మిణీశ్వరా" 4–280

అప్పకవీయం లక్షణ గ్రంథమయినా అందులో చమత్కారవంతమయిన పద్యాలున్నాయనడంలో సందేహం లేదు

—స్రవంతి, నవంబరు 74

# గురజాడ కన్యక పూర్ణమ్మ కథలు - తులనాత్మక పరిశీలన

రమణీయార్థక ప్రతిపాదకమయిన శబ్దం కావ్యమని ఒక అలంకారికుడంటే కాదు రసాత్మకమయిన వాక్యమే కావ్యమన్నాడు మరొక అలంకారికుడు. అనంతమయిన ఆవేశాన్ని అద్దంలో చూపించేటట్టు మహాకవి గురజాడ 'దేశభక్తి గేయంలో కవిత్వతత్వాన్ని విశదీకరించారు.

ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలుకవలె నోయి
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలె నోయి

అన్నదే గురజాడ నిర్వచనం. సర్వాలంకారికుల సారాంశం రంగరించి చెప్పిన మాటలివి. కవిత్వం వాచ్యం కారాదు. పూర్తిగా దురవగాహమూ కారాదు. కోయిల కుహూకుహూ రావం ఏలా ఆసక్తి జనకంగా, వీనులకు విందుగా వుంటుందో ఆలాగే కవిత్వం కూడా పండితులకు, పామరులకు ఆనందదాయకంగా వుండాలని కవి ఆశయం. ఆ కవిత్వం కూడా అభిమానాలను పెంచాలి. అభిమానాలను పెంచని కవిత్వం వ్యర్థం. ఈ అభిమానం ఏదయినా కావచ్చు. దేశాభిమానం, భాషాభిమానం, సమస్యాభిమానం వగైరాలు ఈ దృష్టితో గురజాడ రచనలలో కన్యక పూర్ణమ్మ కథలను పరిశీలిద్దాం.

స్థూలంగా కన్యక కథ. అందాలబొమ్మ అయిన ఒక సెట్టి కుమార్తె చెలికత్తెలతో నగర రాచవీథులలో వెళుతూ వుంటుంది. ఆ కన్నె సొగసుకు ఆ రాచవీథిలో విహారం చేసే మహారాజు కన్ను చెదరింది. ఏలాగయినా ఆమెను తనదానిగా చేసుకోవాలని అనుకున్నాడు. దుష్టమంత్రుల ప్రోత్సాహంతో నట్ట నడీ వీధిలో కన్యను చుట్టుముట్టారు. అప్పటికి చేయగలిగిందేమీ లేక దేవకార్యం తీర్చి వస్తానని, అందాక ఆగమని కన్యక ప్రార్థిస్తుంది. ఆలోగా కన్యక తండ్రీ రాజుతో

అగ్నిసాక్షిగా స్వీకరించమని, రాజు కోరడం కన్న మించిన భాగ్యం లేదని చెప్పాడు. కాని రాజు అహంకారి కావడంవల్ల పట్టమేలే రాచబిడ్డకు సెట్టి ధర్మ మార్గం చెప్పడమా. రాజు తలచింది ధర్మం. చెప్పింది శాస్త్రం. గడువు పెట్టక వెంటనే కన్యకను అర్పించవలసిందిగా దబాయించాడు. ఇక గత్యంతరం లేక దేవకార్యం తీర్చి రాచకార్యం తీరుస్తానని వినయంగా ప్రార్థించాడు. రాజు ఏలాగయితేనేం సరేనన్నాడు. కన్యకదుర్గను సేవించి, నగలను అమ్మవారికి అర్పించి, కులం పెద్దలకు రోషం వచ్చేలా మాట్లాడి, 'పట్టమేలే' రాజయితే పట్టవలసిందేగా అని అగ్నిగుండంలో పడి ఆత్మాహుతి చేసుకుంటుంది.

ఇక పూర్ణమ్మ కథ – పూజారింట పుట్టిన చిన్నది పూర్ణమ్మ. అందానికి అసలు నిర్వచనం పూర్ణమ్మ రూపం. పూర్ణమ్మకు దుర్గమ్మపై వుండే భక్తి మాటల్లో చెప్పలేం. పూర్ణమ్మ యుక్తవయస్కురాలయింది. తల్లిదండ్రులు డబ్బు ఆశతోనో లేక మరే కారణం వల్లనో ముసలిమొగుడుకు ముడివేశారు. ఆ పై వసంతకాలం వచ్చింది. వనంలో వసంత విజృంభణం చూసి పూర్ణమ్మ నిట్టూర్చింది. పూర్ణమ్మ జీవితంలో 'వసంతం' రాలేదు. ఈలోగా భార్యను తీసుక పోవడానికి భర్త నగలతో చీరలతో వచ్చారు. పదినెలు సింగారించారు. పూర్ణమ్మ పెద్దలకు నమస్కారం చేసింది. తల్లిదండ్రుల్ని జాగ్రత్తగా కాపాడవలసిందని ఇతరులకు చెప్పింది. దుర్గాదేవిని భక్తితో సేవించమని హితోక్తులు పలికింది. సాయంత్రం దుర్గను సేవించడానికి ఒంటరిగా వెళ్ళింది. ఆవులు, పెయ్యలు మందల చేరాయి. కాని దుర్గను సేవించడానికి వెళ్ళిన పూర్ణమ్మ రాలేదు.

ఈ రెండు కథలకు ఎన్నో సామ్యాలున్నాయి. ప్రధానంగా రెండు కథలు స్త్రీలకు సంబంధించినవి. స్త్రీలంటే గురజాడవారికి అమితమయిన గౌరవం. స్త్రీల సమస్యలంటే మహాకవికి వల్లమాలిన సానుభూతి. ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం కన్యాశుల్క నాటకరచన. ఇంక ముత్యాలసరాల సంకలనంలోని కన్యక పూర్ణమ్మ కథలు, సుభద్ర సత్యవతి మొదలయినవి. ఈ రెండుకథలు విషాదాంతాలు. కన్యక పూర్ణమ్మలిద్దరూ ఆత్మాహుతి చేసుకున్నవారే. పూర్ణమ్మ దేవాలయ ప్రాంగణంలో, కన్య అగ్నిగుండంలో. ఇద్దరు దుర్గమ్మ భక్తులుకావడం ఒక విశేషం. కాని కన్యక భక్తికన్నా పూర్ణమ్మ భక్తి ఒకవాసి ఎక్కువంటే తప్పులేదు. పూజారింట పూర్ణమ్మ పుట్టడంవల్ల సహజంగా ఆ వాతావరణంలో తిరగడంవల్ల పూర్ణమ్మకున్న

'భక్తి' కన్యక భక్తికంటే భిన్నం. నిరంతర సేవనంవల్ల మొగ్గలు తొడిగింది. పార్వతి తపస్సుకాలాన్ని అధిగమించిందని చెప్పడానికి నన్నిచోడుడు వరుసగా ఆరు ఋతువులను వర్ణించినట్లే పూర్ణమ్మ భక్తి కాలాతీతమని చెప్పడానికి

"ఏయే ఋతువుల పండే పళ్ళను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితో కొలిచెను"

అని అన్నాడా మహాకవి. ఆవిడ భక్తిలో ఏమాత్రం ఏమరుపాటులేదని నిరూపించడానికి

"ఏయే వేళల పూసే పువ్వుల
ఆయా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితో కొలిచెను"

అని తెలిపాడు. తీరా పుట్టిల్లు వదలివెళ్ళే సమయంలోకూడా 'బంగారు దుర్గను భక్తితో కొలవండి, ఆయావేళల పూసే పువ్వుల ఆయా ఋతువుల పళ్ళనీన్ని, భక్తినిగోసి శక్తికి ఇవ్వండి' అంటూ ప్రార్థించింది. ఇలాంటి భక్తి వాతావరణం కన్యక కథలో లేదు. బ్రాహ్మణవర్గానికి పూర్ణమ్మ, వైశ్యజాతికి కన్యకలు మాతృక లనడం సమంజసం. లేదా కలవారి కన్య లేనివారి లేమలుపడే ఇబ్బందులకు ప్రతీక లనడంకూడా సరిపోతుంది.

ఇంక రెండవ అంశం కన్యక పూర్ణమ్మల అందచందాలు. శుచిత్వంతో కూడిన శృంగారవర్ణన ఈ రెండు కథల్లోను కనిపిస్తుంది. గొప్ప చిత్రకారుడు అటూఇటూ గీసిన రేఖలలో ఒక రూపం మనకు గోచరించినట్టు మహాకవి సౌందర్యవర్ణన నడిచింది. కన్యక సౌందర్యాన్ని కవి కథాగేయం ప్రారంభంలోనే వర్ణించాడు. కాని పూర్ణమ్మ సౌందర్యాన్ని

కాసుకు లోనై అల్లుని కలచుటు
ఆనందించెను అమ్మొకతె

అని అనడంలో తండ్రి పిల్లగొంతుకోశాడని వ్యక్తమవుతుంది. అధికారానికి బలి అయిన అబల కన్యక అయితే, డబ్బుకు బలి అయిన తరుణి పూర్ణమ్మ. రాజ భయంతో సెట్టి కన్యకను రక్షించలేకపోయాడు. ధనాశతో పూజారి పూర్ణమ్మ జీవితానికి మంగళంపాడాడు. ఇదీ తేడా. ధర్మపద్ధతి వదలి, పదవులకై ఆశపడి, కాసు పీసం కలిగివుంటే చాలనుకునేవారికి కన్యక కథ మొట్టికాయలాంటిది. అతి వృద్ధవివాహంవల్ల కలిగే అనర్థాలేవో పూర్ణమ్మ కథ చెబుతుంది. రెండూ కరుణ రసపూరిత గేయాలుకావడం విశేషం.

కన్యక కథ పట్టణపరిసరాలలో పూర్ణమ్మ కథ గ్రామీణసీమలో సాగడం మరీ విశేషం. ఇంతేకాక వీరిద్దరిలోనూ తేడావుంది. కన్యక సహజధీర. రాజవీధిలో రాజు సమీపించగానే ఏమాత్రం అదరక బెదరక

ముట్టబోకుడు దేవకార్యం
తీర్చివచ్చెద నీవు పట్నం
ఏలు రాజవు

అని గదమాయించింది కూడా. చివర పాఠకుల మనోనేత్రంపై వుంచాడు. అలా వర్ణించడంలో ఎంతో ఔచిత్యంవుంది. మహారాజు కన్యక సౌందర్యానికి ముగ్ధుడు కావడం ప్రధానం. అంచేత కన్యక వర్ణన అనివార్యం.

తగటు బంగరు చీరకట్టి
కురుల పువ్వుల పదులుచుట్టి
నుదుట కుంకుమ బొట్టుపెట్టి

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నేరపగ
నడక లంచకు నడలు కరపగ

అనడంలో బాహ్యసౌందర్యం వ్యక్తం. చెలికత్తెలు చుట్టూవుండడంవల్ల రాజుకు ఆ కన్యక చుక్కలనడుమ చందురునట్లు కనిపించింది. కాని పూర్ణమ్మకు ఈ నగలు లేవు. పేదవారి బిడ్డ, సహజమయిన అందం ఆమెకు భగవంతుడిచ్చిన వరం.

అంచేతనే మాటిమాటికి గురజాడ 'పుత్తడిబొమ్మా పూర్ణమ్మా' అన్నాడు. కలువ కంటి, లావణ్యవతి, హంసగమన అని వాచ్యంచేయక చివరకు

కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి చేరెను మేని పసల్
హంసల చేరెను నడకల బెడగులు

అన్నాడు,

సంఘానికి అనర్థదాయకమయిన ఏవీగాని గురజాడ సహించలేదు. ఆయన కోరిందల్లా పూర్తి కొత్తదనమూ కాదు. బూజుపట్టిన పాతపద్ధతులూ కావు. కొత్త పాతల మేలుకలయిక కొమ్మెరుంగులు చిమ్మగా అనే మాట సాహిత్యంలోమాత్రం కాకుండా సమాజగతిలోను అన్వయించుకోవాలి. ఈ రెండు కథల్లోను కవి ఆశించింది ఇదే. కన్యక బతుకు బుగ్గిపాలుకావడానికి, పూర్ణమ్మ బతుకు గంగపాలు కావడానికి వారి తండ్రులు కారణం. అంచేత అగ్గిలో దూకడానికి ముందు కన్యకచేత

"అన్నలారా తండ్రులారా
ఆలకించం డొక్క విన్నప
మాలు బిడ్డల కామకొనుటకు
ఆశ లేదొక్కొ కులములోపల"

అని పలకరించాడు. ఆలాగే పూర్ణమ్మ కథలో 'కాసుకులోనై తల్లీతండ్రి నెనరూ న్యాయం విడనాడి, ముదుసలిమొగుడుకు ముడివేస్రీ' అని ప్రారంభంలో తల్లీ దండ్రులిద్దరూ కారణమని వ్రాసినా చివర

వగచిరి వదినెలు వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిపెట్టెన్

దుర్గ దేవాలయంలో 'పట్టమేలే రాజువైతే పట్టు నన్నిపుడని' మంటల్లో దూకింది. ఇలాంటి ధైర్యం పూర్ణమ్మకు లేదు. తల్లితండ్రులచాటున పెరిగిన బిడ్డ పూర్ణమ్మ.

అన్నల తమ్ముల కనుగ్గై అల్లారుముద్దుగా పెరిగిన బాల. అన్నిటికంటే మిన్నగా 'మొగుడు తాత' అని చెలికత్తెలు పరిహాసంచేస్తుంటే చివుక్కుమన్నా నోరు మెదపని అమ్మాయి. తల్లిదండ్రులు దీవిస్తే ఫక్కున నవ్వి 'అమ్మను అయ్యను కావండి' అని ఏడవలేక నవ్వింది.

పూర్ణమ్మ పేరుకుతగ్గట్టు నిండుకుండ. చిన్నతనంలో దుర్గమ్మను పూర్ణమ్మ ఏఏ కోరికలు కోరిందో పేరుకుతగ్గట్టు జీవించి చివరకు పూర్ణత్వంలో సంలీన మయింది. సాత్వికానికి పూర్ణమ్మ, రాజసానికి కన్యక ప్రతీకలనడం సమంజసం.

సందేశాన్ని ప్రసాదించడం కవిత్వలక్షణాలలో ఒకటి. ఈ రెండుకథల ద్వారా సమాజంలో చైతన్యంకలిగించిన గురజాడ నిజంగా మహాకవి.

ఆంధ్రజ్యోతి, 14-1-75.

# వేదం వారి 'ఎల్లి'

గురజాడ 'కన్యాశుల్కం' లాగే ఆంధ్రదేశంలో బాగా ప్రచారమందుకున్న నాటకం ప్రతాపరుద్రీయ నాటకం. నండూరి 'ఎంకి' లాగా వేదం వారి 'ఎల్లి' చాల ప్రసిద్ధి పొందిన పాత్ర.

ప్రతాపరుద్రీయ నాటకంలో ముఖ్యంగా మూడు స్త్రీ పాత్రలున్నాయి. ప్రతాపరుద్ర మహారాజు ధర్మపత్ని శర్వాణి. తల్లి ముమ్మడమ్మ. పేరయ్య పెండ్లాము 'ఎల్లి'.

కొన్ని పాత్రలపైన కొన్ని సమయాల్లో మాత్రం సానుభూతి కలుగుతుంది. ఉదాహరణకు రామాయణం తీసుకుందాం. సీతమ్మను పరిత్యజించడానికి రాముడు చాలా మథనపడ్డాడు. తన్ను శ్రీరామచంద్రుడు పరిత్యాగం చేశాడని తెలియక రథంలో కూర్చుని సీతమ్మ వెళుతున్నప్పుడు ఆ పాత్రపై సహజంగా సానుభూతి కలిగింది. ఆలా కాకుండా కొన్ని పాత్రలపైన కవి మొదటినుండి సానుభూతి పరంపరలు కుప్పిస్తాడు. అటువంటి పాత్రల్లో 'ఎల్లి' ఒకతె. ప్రతాపరుద్రీయ నాటకంలో వేదం వారు 'ఎల్లి'ని మహారాణి శర్వాణితో సమంగా చిత్రీకరించారు. ఇక కథకు వద్దాం.

ప్రతాపరుద్ర మహారాజు గోదావరి తీరంలో వేటాడుతూ అలసి సొలసి మర్రిచెట్టు నీడలో ఆదమరచి నిదరపోయాడు. సరిగ్గా ఆ సమయంలోనే వలీఖాన్ సైనికులు ఆ మహారాజును బంధించి ఢిల్లీకి తరలిస్తారు. ఈ విషయం తెలిస్తే పట్టణంలో కల్లోలం చెలరేగుతుందని జనార్దనమంత్రి ఒక ఉపాయం పన్నాడు. రాజు పోలికలున్న చాకలిపేరయ్యను ప్రచ్ఛన్నంగా అంతఃపురంలో బంధించాడు. తురకలు చాకలిపేరయ్యను తమ వెంట తీసుకుని వెళ్ళారని, మహారాజు క్షేమంగా వున్నారని వదంతి వ్యాపింపజేస్తారు. మహారాజుగారు వేటలో గాయపడ్డట్టు, అంతః పురంలో విశ్రాంతి తీసుకుంటున్నట్టు 'పుకారు' పుట్టిస్తారు. ఇదీ కథ.

తన ప్రాణేశ్వరులు గాయపడ్డారని తెలియగానే మహారాణి శర్వాణి దిగులు పడ్డది. రాజుగారిని చూడడానికి తహతహలాడింది. విద్యానాథుడు జగన్నాథాదులు

# మహాభారతం నాడు - నేడు

భారతీయులకు రామాయణ భారతాలు రెండూ రెండు కళ్ళలాంటివి. ఈ గ్రంథాలు వ్రాసిన వ్యక్తులు మహర్షులు. మహాకవులు. తాము తమ జీవితములో దర్శించిన దృశ్యాలను అక్షరబద్ధం చేసినవారు. అంతేకాదు ఆనాటి చరిత్రలో ప్రత్యక్షపాత్ర పోషించినవారే. భారతకాలంనాటి పాత్రలతో సన్నిహితసంబంధం కలవారు. త్రేతాయుగంనాటి రాజకుమారుని జీవితమార్గం రామాయణంలో కనిపిస్తే ద్వాపరయుగంనాటి సాంఘిక రాజకీయచరిత్ర భారతంలో కనిపిస్తుంది. మానవ మనస్తత్వచిత్రణ, ధర్మచిత్రణ రెంటిలోను ప్రధానమయినప్పటికి రామాయణం ఆదర్శమార్గాన్ని చిత్రించింది. భారతం స్వాభావికస్థితిని వర్ణించింది. భారతీయ జీవనతత్త్వాన్ని అర్థంచేసుకోవాలంటే రామాయణ భారతాలు తప్పక చదవాలి, ఈ అభిప్రాయాన్నే చక్రవర్తి రాజగోపాలాచార్యులవారు

One may tour all over India and see all things; but one cannot understand Indian way of life unless one has read the Ramayana and Maha Bharata అని స్పష్టంచేశారు.

'వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి' అనడం తెలుగునాట అందరినోట పలికేమాట. భారతం కేవలం కౌరవ పాండవుల కథమాత్రంకాదు. కొందరికిది ధర్మశాస్త్రం. వేదాంతగ్రంథం. మహాకావ్యంకూడా. మహాభారతం కొన్ని వేలసంవత్సరాలనాటి కథ కావచ్చుగాని ఆ కథకు మరణంలేదు. యుగాలు గడచినా, జగాలుమారినా ఆ కథలోని మౌలికసత్యం ఇప్పుడుకూడా కళ్ళకు కనిపిస్తూ వుంటుంది.

స్థూలదృష్టితో పరిశీలిస్తే భారతకథ 'ఆస్తిపంపకానికి సంబంధించిన కథ' ఆస్తికోసం అన్నదమ్ములు కొట్లాడుకోవడం, పెద్దమనుష్యులు పంచాయితీజరపడం, అదీ విఫలమయితే కోర్టుకెక్కడం ఈరోజుల్లో సర్వత్రా కనిపించేదృశ్యం. అలాగే పిత్రార్జితమయిన రాజ్యభాగంకోసం పాండవులు ప్రయత్నించారు. రాయబారాలు నడిపారు. చివరకు అన్నీ వ్యర్థమయితే పోరాడారు. చివరకు విజయం సాధించారు.

'అమ్మా ! కబళికా మంత్రము, మృతసంజీవనీ మంత్రప్రయోగము చేసితిమి. రెండిటికిని మూడు దినములు. స్త్రీల కంటను బాలుర కంటను పడ గూడదని నియమము' అని నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. కాని శర్వాణి నమ్మలేదు. అప్పుడావిడ 'మహిషాసుర మర్దని'లా కనిపించిందట.

'ఈ దేశ క్షోభంలో యుద్ధ సంరంభంలో మా ప్రాణేశ్వరులను మేము కనుటకు వీరి ఆటంకమా' అని రాణి తన జబర్దస్తీని స్పష్టంగా ప్రదర్శించింది. ఈలాగే తన మామను తురకలు బంధించినారని తెలియగానే ఎల్లి 'ఏకాఏకి' యుగంధర మహారాజు కడకుపోయి

'మహాప్రభో ! మీరే తల్లి, మీరే తండ్రి అన్ని మీరే సామి మీరే నారాయణమూర్తి అని మీ పాదాలు కొలుచుకుంటూవున్నందుకు నా మొగుణ్ణి తురక లకు తమరు పట్టిచ్చినారంట సామీ ! ఇక నాను బతకలేను మారాజా' అని వాపోయింది. మాటలు వేరుకావచ్చుగాని మనసులోని అభిప్రాయం ఇద్దరిదీ ఒకటే. కాకపోతే మహారాణి భాషలో హుందాతనం, ఎల్లి మాటల్లో సహజత్వం.

మరో సన్నివేశం. తన ప్రాణనాథులవారు క్షేమంగా ఓరుగల్లు చేరుకోవా లని, తన పసుపుకుంకుమలు పదికాలాలపాటు పదిలంగావుండాలని తాను మహారాణి కనుక 'గౌరీపూజ'ను శర్వాణి ఆడంబరంగా మొదలెట్టింది. మహారాణిచేసే పూజ కనుక పదిబళ్ళ పువ్వులు, నూటుబిందెల పన్నీరు, నూరుగిండ్ల అత్తరు, మోయ డానికి వీలులేనంత వరహాలు అవసరమయ్యాయి. కాకతీయ సామ్రాజ్యానికి మహారాణి కనుక ఒక బ్రాహ్మణుడు 'రాణమ్మ మధుర మీనాక్షిలావుం'దని తెగ పొగిడాడు, దానంపుచ్చుకున్న మరొక బ్రాహ్మణుడు 'శర్వాణి' అనసూయా అరుంధతుల్ని మించిందని ఆకాశానికెత్తాడు. వేరొకడు సాక్షాత్ 'ఆ కాశీ విశాలాక్షి' అని నమస్కారం పెట్టాడు.

ఇంతే కాదు. 'ఏలినవారు గడికోటకు వచ్చారని' ముందు తెలియజేసిన పరిచారికకు శర్వాణి మెడలోని హారం బహుమానంగా ఇచ్చింది. కలవారి ఇంట్లో ఏది జరిగినా సంబరంగా వుంటుంది మరి. కాని వేదం వారు 'ఎల్లికి' ఇటువంటి ఆర్భాటాలేవీ పెట్టలేదు. తన కష్టం చెప్పుతున్న ఎల్లితో యుగంధరుడు 'ఈ ధనం తీసుకో, ఈ నగలు తీసుకో' అన్నాడు. ఎల్లి మాత్రం 'నా కెందుకు రాజా !

యయ్యి ముండమోపికి' అని దిగాలుపడి నిట్టూరుస్తూ జవాబిచ్చింది. అంచేత యుగంధరుడు

"తప్పు మాట అనుకొనకు. చిరకాలము ముత్తయిదువుగానుందువు పో" అని బలవంతంగా ఆభరణాలిచ్చాడు. కాని ఎల్లి వాటిని తీసుకోలేదు. "నేను తమ లోగిట్లోనే గంజి తాగుతా నా కిష్టమైన పని పాట చేసుకొంటా పడుంటాను" అని మంత్రిని ప్రాధేయపడింది. ఇలా ప్రార్థించడంలో ఆంతర్యం వుంది. మంత్రిగారి ముందు తచ్చాడుతుంటే పేరయ్య విమోచనం గురించి పదేపదే గుర్తుకు తీసుకు రావచ్చు. కులం వారితో కలిసివుంటే సాటివాళ్ళ ఎత్తిపొడుపులనుండి దూరంగాను ఉండవచ్చు. ఈ ఘట్టంలో కూడా ఎల్లి రాణితో సమానంగా నిలబడ్డది. అంచేతనే యుగంధరుడు.

'ఎల్లి కష్టమే ఇట్లున్నదే! అంతఃపురంలో ఏమి అడావిడిగా వుందో!' అని తర్కించుకున్నాడు.

మరో సన్నివేశం చూద్దాం. మహారాజు వస్తున్నారని తెలియగానే రాణి ఏకవేణీధరయై కిటికీ వెనుక దాగి చూడ్డం మొదలెట్టింది. కాని పాపం ఎల్లికి మేడ లేదే? అంచేత నిచ్చెన వేసుకుని గోడమీద నిక్కి ఎదురుచూడ సాగింది. మహారాజు ఆగమనం తెలియగానే రాణెమ్మ నగరంలోని సువాసినుల కందరికి పూలు పన్నీరు సరఫరా చేసిందట. అయితే ఎల్లి అదేవేళ తన కులం వాళ్ళకు విందు చేసింది. మహారాజు అంతఃపురం చేరుకోగానే

'ఆహా! ఎంత కాలమునకు ఆర్యపుత్రులు ఈ కన్నుల కగపడుచున్నారు'

అని మనసులో అనుకుందట. కాని మనసొకటి మాటొకటి తెలియని ఎల్లి పేరయ్య కనబడగానే

'బతికున్నావా మావా!' అని గుండె బరువంతా ఒకసారి దిగదీసుకుంది.

అన్నీ సమానమే గాని – మహారాజు అంతఃపురం చేరుకోగానే శర్వాణి దుఃఖం పటాపంచలయింది. తన పూజ ఫలించిందని రాణి తెగ సంబరపడింది. కాని ఎల్లి కోరిక మాత్రం తీరలేదు. రాచనగరులో మర్యాదలు, హంగామాలు చూసిన పేరయ్య

"మురికి గుడ్డ బదికే కంపెల్లివి. ఇంక నాకు నువ్వు
పనికిరావు. నా నెల్లిపోతా! పెత్తాతదురద మగా
రాజు కేంటి కంపెల్లి పెళ్ళామేంటి"

అని పుల్లవిరుపుగా అంటే పాపం ఆ స్త్రీ హృదయం ఎంతగా గాయ పడిందో మరీ! అయినా ఎల్లి మనసులో విశ్వాసం అడుగంటలేదు.

"గవురమ్మ తల్లీ! నాను నోముకొంటే నా మామను తెచ్చియిచ్చినావు గదా! య్యెర్రి కుదిరిస్తివా నాకు పెద్ద మంతిరిగార్చిన నగలన్నీ నీకు నిలువు దోపిస్తాను అమ్మ తల్లీ" అంటూ ప్రార్థించింది.

ఆలాగే ఎల్లి పేరయ్యమీద ఫిర్యాదు చేసింది. రాజాస్థానంలో విచారణ మొదలయింది. ఉన్నట్టుండి విచారణ హద్దు మీరుతుందేమోనన్న భయం పట్టు కుంది ఎల్లికి.

'నా పిరాదు యిని ఆయన్నేమైనా శిచ్చ శేస్తారేమో మా రాజా!

ఫిరాదు చేసుకోను సామీ!' అని వాగ్దానం తీసుకుని ఎల్లి పేరిగాని నేరాలు ఏకరువు పెట్టింది.

"య్యెర్రోడో ఒల్లడో తెలదు మా రాజా! కూడు తినక యింటికి రాక ఒగ్గేశి ఎల్లిపోయినాడు" అని కంట తడిపెట్టింది. పేరయ్య మారాలని వుంది గాని పేరయ్యకు శిక్ష పడడం సుతరామూ ఇష్టం లేదు.

"వీడు చదువుకొన్నందున చాకళ్ళలో చెడిపోయాడు. కావున వీడే ఎల్లికి పనికి రాడు" అని విశ్వాసరావు మాట కోసం చెబితే

'నారాయణమూర్తీ! పనికొస్తాడు సామి! అని తనవాడెక్కడ దక్క కుండా పోతాడేమో అని ఆరాటపడింది.

ప్రతాపరుద్రమహారాజా ఎల్లి పేరయ్యల వ్యవహారం గుర్తించి సంబర పడ్డాడు. చివరకు నౌఖర్లతో

"వీరిం గొనిపోయి దీని నచ్చరవలె, వీనిని అమరేశ్వరునివలె కట్టించి తొడిగించి తెండి" అని ఆజ్ఞాపించాడు. తనకు నమస్కరించిన చాకలి దంపతుల్ని చూచి మహారాజు

"మంచి అనుకూల నాయకుడవు నీవు. స్వాధీన పతిక అది" అని ప్రశంసించాడు.

చెకుముకి శాస్త్రి, జనార్దనుడు, పెద్దసెట్టి ప్రభృతులు కూడా

"నీ వంటి వెర్రి కులస్త్రీల కందరికీ వుంటే తరించిపోతాం" అని మనసారా మెచ్చుకున్నారు.

పేరయ్య మాటవరుసకు ఎల్లిని కాస్త వుడికించాలని 'కంపెల్లి' అన్నాడను కోండి. ఎల్లి అంటే అతనికి ఆరవప్రాణం. చతుర్థాంకంలో విద్యానాథునితో పేరయ్య

'ఒకపాలి కలిచినా ఒకపాలి మంచి మాటాడుద్దండి' అని ఎల్లితో తనకున్న అనుబంధాన్ని చెప్పుకున్నాడు. ఈ అంకం చివర

'ఎల్లి నాతో గద్దె యెక్కుంటదీ - జాజి
మల్లి నాతో గద్దిమా నుంటదీ
పేరయ్య రాజంట - పేరెల్లి రాణంట
తనకు మావా వాళ్ళు దండ మెడతారంట'

అని కలలు కన్నాడు. రాజుగారు 'చాకళ్ళకు నీకు కులముపెద్ద, చాకలి దొర' అని చెప్పగానే ఎగిరి గంతేసినాడు.

గురజాడ వారన్నట్టు
'సతుల సౌరను కమలవనముకు
పతుల ప్రేమయె వేవెలుగు'
అన్న వాక్యం ఎల్లికి సరిగ్గా సరిపోయింది.

ఆంధ్రప్రభ (దినపత్రిక)
14-7-72.

# సి. పి. బ్రౌను సాహిత్యసేవ

అఖండ భారతదేశం ఔన్నత్యాన్ని అన్నివిధాల ఆంగ్లేయులు పాడుచేశారనే అభియోగం మనం తరచు వింటూవుంటాం. అయితే భాషాసాహిత్యవిషయంలోమాత్రం ఈ అభియోగం నిరాధారం. తమదికాని దేశంలో, తమదికాని భాషను నేర్చుకొని, పరిశ్రమించి, ఆ భాషామతల్లికి అపురూప నీరాజనం సమర్పించిన విదేశీయులెందరో వున్నారు. వారిలో సి. పి. బ్రౌన్ చిరస్మరణీయుడు.

ఆచార్య జి. యస్. రెడ్డిగారిమాటల్లో చెప్పాలంటే సి. పి. బ్రౌన్.

> "బహుభాషా దక్షిణ నాయకుడైనా, తెలుగుభాషను పట్టమహిషిగా వరించిన ధీరోదాత్తుడు; జీవితాంతం తెలుగుభాషాసాహిత్యాలు, తన వూపిరిగా జీవించిన యోగమూర్తి; ఆర్జించిన ప్రతిపైసాను తెలుగు సాహిత్యోద్ధరణకు, పండిత పోషణకు, గ్రంథప్రచురణకు వినియోగించిన త్యాగధనుడు. తెలుగు సాహిత్య పునరుజ్జీవనానికి, వికాసానికి బ్రౌన్ చేసిన సేవ అపూర్వం, అనితరం, బహుముఖం.

ఇంతగా ప్రసిద్ధిపొందిన సి. పి. బ్రౌన్ భారతదేశం కలకత్తాలో కౌలే, రెవరెండ్ డేవిడ్ బ్రౌను దంపతులకు 1798 వ సం॥ నవంబరు 10 వ తేది జన్మించాడు. తండ్రి ప్రోత్సాహంతో, భాషానురక్తితో బ్రౌన్ చిన్ననాటనే హీబ్రూ, సిరియన్, అరబ్బీ, పార్శీ, గ్రీక్, లాటిన్, హిందుస్తానీ భాషలతో పరిచయం పెంచుకొన్నాడు. 1814 లో ఇంగ్లాండులోని 'హెయిల్‌బరి' కళాశాలలో రెండేళ్లు చదువుకొన్నాడు. 1816లో Writers Rank అనే పట్టా పుచ్చుకొన్నాడు. 1817-20 ప్రాంతంలో మదరాసు కాలేజి విద్యార్థిగా తెలుగుపరిచయం పెంచుకొన్నాడు.

ఇక వుద్యోగజీవితం పరిశీలిస్తే బ్రౌన్ జీవితం చాల చిత్రమయింది. ఏ విదేశీయుడూ చేపట్టని రకరకాల వుద్యోగబాధ్యతల్ని బ్రౌన్ నిర్వహించాడు. 1829 నుండి 1869 దాక న్యాయాధిపతి, జిల్లా అధికారి, తంతి తపాలా అధికారి,

లాటరీ నిర్వహణాధికారి, లెక్కల తనిఖీదారు, విద్యాసంస్థల కార్యదర్శి, పత్రికా సంపాదకుడు, పరీక్షాధికారి, విశ్వవిద్యాలయ ఆచార్యుడు, ఐ.సి.ఎస్. పరీక్షాధికారిగా రాణించిన విచిత్రవ్యక్తి సి. పి. బ్రౌన్.

బ్రౌన్ సాహిత్యజీవితం సుసంపన్నమయింది. వీటిలో స్వీయరచనలు ప్రధానమయినవి. బ్రౌన్ ప్రధానంగా సంస్కృతం, ఆంధ్రం, ఆంగ్లభాషలలో రచనలు చేశాడని చెప్పవచ్చు, వీటిలో 2 తెలుగుభాషకు సంబంధించినవి. ఆంధ్ర గీర్వాణచ్ఛందము, వాక్యావళి, Dialogues in Telugu, తెలుగు వాచకము, ఇంగ్లీషు క్రియలు, (రేఫఱకార వచ్ఛద్ధ జ్ఞాపక లోకోపకారకము), ఇంగ్లీషు తెలుగు నిఘంటువు, మిశ్రభాషా నిఘంటువు, జిల్లా నిఘంటువు, పదనిధి, హైదరు చరిత్ర, మిరాసీవాదము, అనంతపురరాజుల చరిత్ర, తాతాచారి కథలు, లూకాచే వ్రాయబడిన శుభవర్తమానము, విస్తర రత్నాకరము, కీర్తనలు, వేమనపద్యముల ఆంగ్లాను వాదము, సుమతిశతక ఆంగ్లానువాదములు చెప్పుకోదగ్గవి.

బ్రౌన్ సాహితీసేవలో మరో మైలురాయి గ్రంథసంపాదకత్వం సమీక్షణ. ముద్రణాధిసౌకర్యాలులేక, కొందరికిమాత్రమే పరిమితమైపోయి అటకలమీద మగ్గి పోతున్న వేలాది తాళపత్ర గ్రంథాలను బ్రౌన్ సేకరించాడు. బ్రౌన్ వాటిని సేకరించకుండావుంటే ఎన్నో తెలుగు కావ్యాలు పేరుకుమాత్రం స్మరించుకోవలసి వచ్చేది. తన కాలంనాటికే బాగా శిథిలమైపోయిన తాళపత్రాలకు కాగితపు ప్రతులు వ్రాయించాడు. సొంత ఖర్చుతో పండితులకు జీతమిచ్చి పరిష్కరించి ప్రామాణిక ప్రతుల్ని సిద్ధపరిచాడు. అసలువిషయం చెప్పాలంటే గ్రంథపరిష్కరణ విద్యాభిక్ష పెట్టిన తొలి సాహిత్యవేత్త బ్రౌన్.

పద్యాలను పాదాలకనుగుణంగా విభజించడం, యతిస్థానం గుర్తించడం, పద్యాలకు వచనాలకు సంఖ్యలను నిర్దేశించడం, ద్విపద పాదాలను ఒకదానికింద మరొకటి వ్రాయడం, టీకలు వివరణలు సమకూర్చడం, పాఠాంతరాల ప్రదర్శించడం, పదసూచికల సంతరించడం మొదలయినవి బ్రౌన్ ప్రవేశపెట్టిన నూతన సంస్కరణలే. బ్రౌన్ గ్రంథసంపాదన – సమీక్షణలో మొట్టమొదటి రంగం పురాణేతిహాసాల పునరుద్ధరణ ప్రధానమయింది. రచనలో సారళ్యం, ప్రజాభిమానం దృష్టిలో పెట్టుకొని బ్రౌన్ పురాణాలను అభిమానించాడు. వాటిలో విష్ణుపురాణం,

భాగవతం, పద్మపురాణం, ఆంధ్ర మహాభారతం, శ్రీ కాళహస్తి మాహాత్మ్యం, ఉత్తర రామాయణం, హరివంశం, భాస్కర రామాయణం, కాశీఖండం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం చెప్పుకోదగ్గవి. వీటిలో భాగవతం, భారతం, భాస్కర రామాయణం, ఉత్తర రామాయణాలను మొట్టమొదట ముద్రించిన ఘనత బ్రౌన్ దొరదే.

బ్రౌన్ సాహితీ సేవలో రెండవ మైలురాయి శృంగార ప్రబంధాల సముద్ధరణ. 24 ప్రబంధాలను పరిష్కరించి, శుద్ధప్రతుల్ని వ్రాయించి కొన్నింటి వ్యాఖ్యలను కూర్చిన నేర్పు బ్రౌన్ దొరగారిదే. వీటిలో కుచేలోపాఖ్యానం, వైజయంతీ విలాసం, మనుచరిత్ర, వసుచరిత్రలను తానే ముద్రించాడు. పద్మ పురాణంలో అహల్యా వృత్తాంతాన్ని, విష్ణు పురాణంలో పెక్కు పదాల్ని, శశాంక విజయం పూర్తిగా ఆంగ్లంలో అనువదించడంలో అతని భాషానురక్తిని విశదం చేస్తుంది.

బ్రౌన్ సాహితీ సేవలో మూడవ మైలురాయి కథాకావ్యాల పరిష్కరణ. తెలుగు కథాకావ్యాలలో పంచతంత్రం, శుకసప్తతి, సింహాసన ద్వాత్రింశిక, హంసవింశతి గ్రంథాలను పరిష్కరించి కాగితపు ప్రతుల్ని తయారు చేయించాడు. ఇవేగాక భోజరాజీయం, విక్రమార్క చరిత్ర, సకల కథాసార సంగ్రహం, సకల నీతి కథావిధానమనే గ్రంథాలను సంపాదించి కాగితాల కెక్కించాడు. వ్యావహారిక పదజాలం కథాకావ్యాలలో కనిపించడంవల్ల బ్రౌన్ ఈ కావ్యసముద్ధరణకు పూనుకొన్నాడు.

బ్రౌన్ సాహితీ సేవలో నాల్గవ మైలురాయి ద్విపద కావ్య పరిశీలన. సుదీర్ఘ సమాసాలు లేకపోవడం, రచనలో సారళ్యం కనిపించడం. పాడుకోవడానికి వీలుకావడంవల్ల 'బ్రౌన్' ద్విపదల్ని అభిమానించాడు. ఇతడు 41 ద్విపద కావ్యాలను సముద్ధరించాడు. వీటిలో పదమూడింటిని పరిష్కరించాడు. సారంగధర చరిత్ర, బసవ పురాణము, రంగనాథ రామాయణం మొ॥ చెప్పుకోదగ్గవి. ద్విపద కావ్యాలు అమూల్య రత్నాలని, తెలుగుభాష నుడికారం ద్విపదకావ్యాల్లో సజీవంగా వుందని, భాష నేర్చుకొనేవారు ద్విపద కావ్యాలను తప్పనిసరిగా చదవాలని,

ఆచారవ్యవహారాలు ద్విపద కావ్యాలలో బాగా కనిపిస్తాయని గుర్తించినవాడు బ్రౌన్ మహాశయుడే.

బ్రౌన్ సాహితీ సేవలో ఐదవ మైలురాయి శతకాల సంస్కరణ. బ్రౌన్ 84 శతకాలను సేకరించాడు. సుమతి, భాస్కర శతకాలకు పద సూచికల్ని, వేమన, కవిచౌడప్ప శతకాలకు టీకల్ని సమకూర్చాడు. తెలుగు కవితా మాధుర్యాన్ని, తెలుగుభాష తియ్యదనాన్ని, ఆంగ్లభాష తెలిసిన వారందరికి పంచిపెట్టడానికోసం బ్రౌన్ వేమన, సుమతి శతకాలను ఆంగ్లంలో అనువదించాడు. తెలుగు కావ్యాలలో అనువదింపబడిన గ్రంథాలు 'శతకాలు' కావడం గుర్తించదగ్గ విషయం.

శిథిలావస్థలోని తెలుగు కావ్యాలను సముద్ధరించిన మాత్రాన కర్తవ్య నిర్వహణము పూర్తియైనట్లు బ్రౌన్ భావించలేదు. ప్రౌఢ ప్రబంధాలకు, పురాణేతిహాసాలకు, శతకాలకు, ద్విపదలకు వ్యాఖ్యానాలు అవసరమని గుర్తించి 25 కావ్యాలకు వ్యాఖ్యలు వ్యావహారిక భాషలో సమకూర్చాడు. ఇంతే కాకుండా తెలుగువారికి తెలియని 'పదసూచికా నిర్మాణం' తెలియజేసిన ఘనుడు బ్రౌను. అన్నిటికన్నా సాహిత్యచరిత్రకు ఎంతో వుపకరించే సమకాలీన లేఖల సంపుటాల సమకూర్చినాడు.

బ్రౌన్ వ్యక్తిత్వం చాల చిత్రమయింది. అవివాహితుడై, అహోరాత్రాలు తెలుగుభాష సముద్ధరణకు పాటుపడుతున్న బ్రౌన్‌ను, సమకాలీనులు పరిహసించినా పట్టుదల వదలిపెట్టక పరిశ్రమించినవాడు. ఎందరో నిరుద్యోగులకు పని కల్పించడం, పేదసాదలకు సహాయం చేయడం, కడప, మచిలీపట్టణం, మదరాసులలో పాఠశాలలు స్థాపించడం లాంటివి చెప్పుకోదగ్గ అంసాలు. ఇంతే గాకుండా హైందవమత సమాజ సంప్రదాయంలో ఏ మాత్రం జోక్యం కల్పించుకోకుండా, ఆంధ్ర ప్రజల మతాచారాలను మన్నించడం బ్రౌన్ ప్రత్యేకతగా గుర్తించవచ్చు. తన పరిచితుల్ని, సహాయపడినవారిని గురించి నిజాయితీతో వారిపేర్లను గ్రంథస్థం చేయడం బ్రౌన్ మంచి గుణానికి కీర్తిపతాక. జూలూరి అప్పయ్యశాస్త్రిని గురించి His patience, his humility and his good sense always commanded great respect' అన్నాడు. అలాగే అద్వైత బ్రహ్మశాస్త్రి గురించి 'my very learned friend Brahmayya' అని ఆత్మీయతతో చెప్పుకున్నాడు. రావిపాటి గురుమూర్తి శాస్త్రి గురించి 'I mention his name because his talents, learning and good sense always entitled his judgement to respect' అన్నాడు. అలాగే కడప బంగళాలోని

గ్రంథాలయాన్ని పరిరక్షిస్తూ, కావ్యపరిష్కరణ కార్యాన్ని శ్రద్ధగా జరిపిస్తున్న కృష్ణారెడ్డిని 'a most noble and excellent assistant' అని ప్రశంసించాడు. ఇంతేకాదు. 24 ఏళ్ళుగా తనకు సేవజేసిన సేవకురాలు సారానాట్‌కు 250 పౌన్లు, ఎమ్మా అగర్‌కు ఇంటిసామాన్లతో 25 పౌన్లు, యాన్ హెన్రిటా షెర్మన్‌ను 200 పౌన్లు చెందాలని వీలునామా వ్రాశాడు. తన తరువాత తన పుస్తకాలన్నీ ఇండియా ఆఫీస్ లైబ్రరికి చెందాలన్నీ, తను లైబ్రరికి తరలించుకొనిపోవడానికి ఖర్చులక్రింద 10 పౌన్లుకూడా వ్రాయడం అతని చిత్తశుద్ధికి నిదర్శనం.

బ్రౌన్ సాహిత్యసంపద అంతా లండన్ ఇండియా ఆఫీస్ లైబ్రరీలలో ముద్రితాలు, అముద్రితాలు అన్నీ చేరి 52 సంపుటాలు అసూర్యంపశ్యలుగా వున్నాయి. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభండాగారంలో వేలకువేల 'బ్రౌన్ సాహిత్యం' భద్రంగావుంది. తెలుగుదేశంలో వివిధప్రాంతాల పండితులతో, విద్వాంసులతో తాను సాగించిన ఉత్తరప్రత్యుత్తరాల్ని ఇంకా ఇతర రకాల జాబుల్ని 20 సంపుటాలలో ఒక్కొక్క సంపుటంలో సుమారు 400 పుటలున్న వాటిని బ్రౌన్ భద్రపరచిపోయాడు. బ్రౌన్ కృషిని కొంతవరకు వెలుగులోనికి తెచ్చిన ఘనుడు బంగోరె, ఆచార్య జి. యన్. రెడ్డిగారు. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో 1975 సెప్టంబరులో ఒక పరిశోధనవిభాగాన్ని రూపొందించి ఐదు పుస్తకాలను వెలువరించిన శ్రమ వీరిదే.

నిజానికి బ్రౌన్ ఒక వ్యక్తికాదు, ఒక సంస్థ. తన ఇల్లే ఒక సారస్వత సత్రంగాతీర్చిన మహనీయుడు. విశ్వవిద్యాలయాలలో చరిత్ర, సాంఘిక, రాజకీయాది విభాగాలు, భాషా సాహిత్య విభాగాలు వీటిమధ్య సమిష్టి అధ్యయనానికి బ్రౌన్ వాఙ్మయం ఒక సుక్షేత్రం. తన జీవితంలో ప్రతిక్షణాన్నీ, జీవితార్జనలో ప్రతిదమ్మిడీని తెలుగు భాషా సాహిత్యాలకు వినియోగించిన కర్మయోగి బ్రౌన్.

"నూరార్లు లెక్కసేయక,
పేర్లెక్కిన విబుధవరుల( బిలిపించుచు, వే
మార్లర్థమిచ్చు, వితరిణి,
వార్లెను ఫీలిప్పు బ్రౌను సాహెబు కరుణన్"

అని సమకాలీన పండితులచే కీర్తింపబడిన ధన్యుడు సి. పి. బ్రౌన్.

ఆల్ ఇండియా రేడియో,
కడప, 10-11-88.

# తెనుగు లెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

తమ దేశం, భాష, చరిత్ర, ప్రజలు, సంస్కృతులను గురించి కొండంతగా చెప్పుకున్నవారిలో వంగీయులు, తమిళులు ముందు శ్రేణిలో కనిపిస్తారు. ఈ ఇరవైయవ శతాబ్దం తొలి మూడు దశాబ్దాల కాలంలో తెలుగుజాతి కీర్తిని, తెలుగు వారి ప్రత్యేకతల్ని కావ్యస్థం చేసినవారు కొందరే. ఈ భావనల్ని మంత్ర పరంపరలుగా భావించి మననం చేసి జీవితాంతం ఉపాసన చేసిన వారిలో శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారొకరు. అవధానిగా, ఆశుకవిగా, సాంప్రదాయకములయిన రచనలు సాగించిన సమ్మాన్యమూర్తి చౌదరిగారు.

తెలుగు కవులలో గ్రామీణ వాతావరణం పట్టించుకున్నవారు కొందరే. దేశానికి వెన్నెముక అయిన రైతు జీవితాన్ని మనసారా అర్థం చేసుకున్న కవుల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. మండు టెండల్లో మలమల మాడుతూ, వానల్లో వరదల్లో నానుతూ, పంటలు పండించేవారే సార్థక జీవితం గడిపేవారు. ఇతరులంతా అతణ్ణి అనుసరించినవారని తమిళ జాతీయకవి భారతియార్ అన్నట్టే రైతన్నలపట్ల సానుభూతి ప్రకటిస్తూ చౌదరిగారు

'నీ సొమ్ము తిన్నవారె చూచుచున్నారు నిను గడ్డిపోచవలె' అంటూ
ధరలు పడిపోయె సేద్యంబు తక్కువాయె
శిస్తు మెండాయె నింకేమి సేయుటోయి
నిర్ధరారణ్యమే నీకు నెలవటోయి
కర్షకా యిది యేనాటి కర్మమోయి'

అని రైతన్న జీవితంపట్ల తనకున్న ఆర్తిని వ్యక్తం చేశారు. గ్రామీణవాతావరణాన్ని కనులకు కట్టే విధముగా పెద్ద కాపు, పరిగ పంట, పైర పంట, క్షేత్ర జీవి మొదలయిన ఖండకావ్యాల్ని వ్రాశారు. సంక్రాంతి పద్యాలలో తెలుగువారి విందు భోజనాల్ని, కోడిపందెముల రామణీయకాన్ని, రంగవల్లికల అందచందాల్ని అలవోకగా చిత్రీకరించారు.

సృష్టిలో స్త్రీపురుషులు సమానులు. కాని పురుషాధిక్యతకలిగిన సమాజంలో స్త్రీలు అణచివేయబడడం, అనుమానాలు భరించడం, అత్యాచారాలకు గురికావడం ఆనాటి కథమాత్రంకాదు. ఈనాటిదికూడా. దీనికి ప్రధానమయిన కారణం స్త్రీల సైజమయిన అజ్ఞానం, కొంత అవేశప్రవృత్తికూడా. సాంఘికంగా కనిపించే భద్రతారాహిత్యం, శారీరకమయిన ప్రవృత్తి, వీటివల్ల స్త్రీలు ఇబ్బందులకు లోను కావడం మనకు తెలిసిందే.

భారతకథలో 'స్త్రీపురుష సంబంధాలు' చాల చిత్రంగా కనిపిస్తాయి. తల్లి తండ్రిలేని వేళ, ఆలనాపాలనా చూసేవారు దూరమయిన వేళ, ఏకాకిగావున్న సుందరాంగిని పలుకరించి, నమ్మించి, ఆశలతోరణాలు కట్టించి, మాటల మంగళ సూత్రంలో బంధించి, అనుభవించి అంతా అయ్యాక విస్మరించే 'జులాయి మగాళ్ళ' సంగతి మనకు తెలిసిందే. భారతంలోని దుష్యంతుడుచేసిన పనికూడా ఇదే. తనకేమీ కాబట్టనట్టు వెళ్ళిపోయాడు విశ్వామిత్రుడు. నిర్దాక్షిణ్యంగా కడుపు బరువు 'దించుకుని' చక్కాపోయింది మేనక. పెంచినవాడు కణ్వుడు. కణ్వుడు లేనివేళ అంటే యజమాని లేనివేళ ఆశ్రమప్రాంతానికి వచ్చి పోయి 'అవాకులు చవాకులు' పలికి అతిలోకసుందరిని బుట్టలోవేసుకున్నాడు దుష్యంతుడు.

అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య అకాలమరణంపాలయితే లేదా సంసారానికి పనికిరానివిధంగా రోగగ్రస్తురాలయితే, లేదా మరోవ్యక్తి మోజులోపడి ఇంటిగడప దాటితే మరోపెళ్లికి ముస్తాబుకావడం మామూలే. కట్టుకున్నవాడు భార్యావియోగం సహించలేక, ఆవిడతోడి అనుబంధాన్ని మరవలేక, అడుగడుగున ఆవిడ స్మృతులు వెంటాడుతుంటే 'ఎలిజీలు' వ్రాసుకోవడంకూడా మనం చూస్తూనేవున్నాం. కాని చెట్టంత కొడుకుండగా కొడుకు బాగోగులుచూడడం మానేసి, తామే పెళ్ళికొడుకుగా తయారుకావడం ఈ లోకంలో చెదురుమదురుగా కనిపించే దృశ్యం. భారతంలోని శంతనమహారాజు చేసిన నిర్వాకం ఈలాంటిదే. గంగావియోగంవున్నా, సత్యవతిని చూచేసరికి సర్వస్వం మరచిపోయాడు. బలవంతుడు, గుణవంతుడు, యువకుడు కన్నకుమారుడయిన భీష్ముని మరచిపోయాడు. రాచరికం మరచిపోయాడు. సాంఘికపు కట్టుబాట్లను విస్మరించాడు. చివరకు కొడుకే పెళ్ళిపెద్దయితే మరో వివాహం చేసుకున్నాడు.

శ్రీ చౌదరిగారు భాషాపరంగా ఎంత సంప్రదాయబద్ధులో భావనాపరంగా అంత అభ్యుదయవాది. అందరికీ ఆహారనివాసాలు అందుబాటులో వుండాలని, సామాన్య వ్యక్తికి తిండి దక్కకపోతే ప్రపంచాన్నే కాల్చివేద్దామని తమిళకవి భారతియార్ ఆక్రోశం ప్రకటించినట్టే చౌదరిగారు

'సంఘమున హెచ్చుతగ్గులు సమయుదనుక
నెల్లరకుఁ గూడుగుడ్డ సంధిల్లు దనుక'

నవసమాజ స్థాపన జరుగదని ఢంకా బజాయించి చెప్పారు. ప్రజాస్వామ్యంలో 'మనమందరం రాజులం' అని భారతియార్ సామాన్య ప్రజల బలాన్ని వ్యంగ్యంగా చెప్పినట్లే

'మనము పేదవాని మఱచుట చేతనే
పెక్కు సంకటములఁ జిక్కినార
మతఁడె నేడు నారాధ్య దైవత
మతని కొల్చుటే సుఖావహమ్ము'

అని ప్రజాస్వామ్యనేతలని చెప్పుకునేవారికి చురకలు వేశారు. యుగయుగాలనుండీ ధనవంతులు నీతి లేక పాపభీతి లేక పేదలరక్తం జుర్రడం న్యాయం కాదని హెచ్చరించారు. గ్రామ రాజ్యం రైతు రాజ్యం, రైతు రాజ్యమే రామరాజ్యమని చెప్పడాని కోసమే

'హాలికుల నొక్కి జీవచ్ఛవాలఁ జేసి
యేలు వారేమి సాధింప నెంచినారొ
కాపణంగిన నే మొనగాడు నిల్చు
రైతు మూల్గిన నేవృత్తి రాణకెక్కు' అని ప్రశ్నించారు.

చౌదరిగారికి రైతన్నలే కాదు శ్రామికులన్నా గౌరవమే. 'శ్రమపడితే జాతికి సిరి, శ్రమపడమే రాజ్యానికి సంపద' అన్నదే వారి ధ్యేయం. అంచేతనే గోడలు కట్టేవారిని చూచి

'ఎవని యెముక లీ మేడల కిటుకలయ్యె
నెవని రక్తంబుచే గోడ లిట్లు బిగిసె' అని ప్రశ్నించారు.

చౌదరిగారు ఆంధ్రత్వాన్ని బాహాటంగా చెప్పుకుని ఆనందించిన వ్యక్తి. అయితే ఆంధ్రత్వంలో భారతీయతను మరచిపోని మహనీయుడు.

'ఆంధ్రుడవై జన్మించితి
వాంధ్రుడవై యనుభవించు మా యుర్వీభవం
బాంధ్రుఁడవై మరణింపుమి
యాంధ్రత్వము లేని బ్రతుకు నాశింపకుమీ'

అని చెబుతూ ఆంధ్రత్వాన్ని ప్రాణంగా, భారతీయ ధర్మాన్ని దేహంగా భావించ వలసిందని హెచ్చరిక చేశారు. ఆంధ్రత్వంతో భారతీయత కలసివుండాలని అలా వుంటే రాష్ట్రంలో రారాపులుండవని చెప్పడం ప్రాంతీయతను రెచ్చగొట్టే వారికి హెచ్చరిక గూడా.

తెలుగువారి పండుగల్ని ప్రత్యేకించి సంక్రాంతి పండుగల్ని విస్తరించి వ్రాసిన ఆధునిక కవులలో తుమ్మలవారు ప్రసిద్ధులు సంక్రాంతిలక్ష్మి మొఖానికి 'గుమ్మడి పూదుమారం' అద్దినదట. మిరియపుపండు బొట్టు పెట్టినదట. మంచుతెర చీరను సింగారించుకొందట. బంతి చేమంతుల్ని కొప్పులలో తురిమిందట. తెలి మబ్బు గొడుగునీడలలో 'భాగ్యాల కదలి'లాగా బయలుదేరిందట. సంక్రాంతిలక్ష్మి సౌందర్యాన్ని కళాదృష్టితో రమణీయంగా వ్రాసిన కవి తుమ్మలవారే. పండుగ లంటే పణ్యారముల ఆరగింపుమాత్రం కాదు. అంచేతనే తుమ్మలవారు

"మేడపక్క గుడిసె మేలిమి బంగారు
పట్టువలువ సరసఁ బ్రాఁతగోఁచి
తనివి చెంత నింత తరగని కన్నీరు
లేని పండువిది ఫలింపవలయు" అన్నారు.

తుమ్మలవారు అభినవ తిక్కనగా ప్రసిద్ధులు. కానీ చౌదరిగారికి ఇతర కవులపై ద్వేషంలేదు. పైపెచ్చు దేశభక్తులంటే ప్రాణం.

"తెలుగుబాస పెంపుతెలుప తిక్కన చాలు
అన్నమయ్య చాలు హాసుతెలుప
తిన్నదనము తీరుతెలుప వేమన చాలు
కేలుమోడ్తు వీరి మేలుములకు" అనడం దీనికి సాక్ష్యం.

తుమ్మలవారు గాంధీయవాదులు. కవితలోమాత్రం కాదు ఆచరణలోనూ. నిరాడంబరత. సత్యాహింసల పాలన, ఖద్దరు ధారణ, సామాజిక శ్రేయస్సుకే ప్రాధాన్యమివ్వడం మొదలయినవాటిల్లో తుమ్మలకు సాటిరాదగిన గాంధీయకవులు లేరు. తన్ను గాంధికవిగా పరిచయం చేసుకున్న కవి. మహాత్మ కథను, అమర జ్యోతిని వ్రాసి భక్తిప్రపత్తులు ప్రకటించుకున్న నిజాయితీపరుడు. పోతన 'పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట' అని చెప్పినట్టుగానే

"పలికెడిది గాంధి కథయట
పలికించెడివారు తెలుగు ప్రజలట"

అని పరమ పూజ్యత్వాన్ని నిలిపారు. కనుకనే కట్టమంచి రామలింగారెడ్డిగారు

'తుమ్మల సీతారామమూర్తి మహాత్మునియొక్క ఆస్థానకవి. ఆ స్థానము శాశ్వతము' అని నీరాజనం సమర్పించారు.

శ్రీ చౌదరిగారు నాస్తికులు కారు. కాని మాధవసేవకన్నా మానవసేవకు ప్రాధాన్యమిచ్చే సువ్రతులు. సుకవి లక్షణాలు చెప్పినప్పుడు చౌదరిగారు

"దేశభక్తునందు దీనునియందును
చెమటనోడ్చి బ్రదుకు జీవియందు
కరుణ సూనృతమ్ము కలవానియందును
వాసుదేవు చూచువాడు సుకవి" అని చెప్పారు.

గ్రంథాలను ఈశ్వరాంకితం చేయడాన్నికూడా నిరసిస్తూ

"ఈశ్వరుని చాటుగా మర్త్యుడెవ్వడు పీని
కైత కర్తదుబ్బు ననుటయుకల్ల కాన
హేమగిరికి వరాటిక నిచ్చినట్లు
నరుడు తన వచనమ్ము నీశ్వరునకిడుట" అన్నారు.

రాళ్ళు రువ్వినవారిమీద పూలు చల్లడం, ముండ్లుగుచ్చిన చేతిలో పండ్లు పెట్టడం, పరమశత్రువులో ఇష్టసఖుణ్ణి దర్శించడం, క్రోధాన్ని దిగమింగడం సుకవి లక్షణాలుగా చెప్పుకున్న చౌదరి జీవితంలోనూ సుకవి.

ఉత్తమ కవులు విశ్వశ్రేయస్సునే కోరుకుంటారనడానికి చౌదరిగారు కూడ ఉదాహరణ ప్రాయులే.

"హాస్తిన కరాచి చుట్టములైనవేళ
నమెరికా రషియా స్పర్ధలణిగినపుడు
లోకమున శాంతియొదవు నస్తోకమగుచు"

అనడం దీనికి నిదర్శనం. పీడితజాతిలో విప్లవం రాకతప్పదని వూహించిన దీర్ఘదర్శి

"దరిద్రులం ద్రోసిపుచ్చుకా
లము చనె విప్లవాగ్ని దెసలన్ గబళింపకముందె యందలా
లమరినవారు మేల్కొని యహంకృతి నుజ్జనసేత లగ్గగున్"

చౌదరిగారి గ్రంథరాశి అనంతం. వాటిలో ఆత్మార్పణం, రాష్ట్రగానం, అమరజ్యోతి, ఆత్మకథ, కదంబకైత, ఎక్కట్లు మొదలయినవి చాల ప్రసిద్ధాలు. 25-12-1901 లో పుట్టి రసవత్కావ్యాలు రచించి కనకాభిషేక గజారోహణ గండ పెండేరాది సన్మానాలంది అభినవ తిక్కనగా విఖ్యాతులై 21-3-1990 వ తేది అమరజీవి అయిన తుమ్మలవారు ఆంధ్రుల ఆత్మగౌరవానికి 'బావుటా'వంటి వారనడంలో సందేహంలేదు.

ఆల్ ఇండియా రేడియో
25-4-91.

# కన్నడ కావ్యాలలో 'కుకవి నింద'

ద్రావిడ భాషలలో తమిళం తర్వాత ప్రాచీన సాహిత్య సంపద కన్నడ భాషలోనే వుంది. కన్నడకవులు తమ కావ్యావతారికలలో సుకవిస్తుతితోబాటు 'కుకవి నింద' కూడా చేశారు. ఈ సంప్రదాయం సంస్కృత ప్రాకృత సాహిత్యంలో అక్కడక్కడ కనిపించినా కన్నడంలోనూ, తెలుగులోనూ ఈ 'కుకవి నింద' కావ్యావతారికలలో ఒక భాగమయిపోయింది. ఈ నియమం పాటించని కవులు చాలవరకు తక్కువే.

కన్నడ సాహిత్యంలో 'అకవుల్ని' నిందించిన మహాకవి పంపకవి (క్రీ శ. 941) అంద్రుకని చెప్పవచ్చు. ఆది పురాణం, విక్రమార్జున విజయం పంపమహాకవి రచనలు. ఆదిపురాణం ధార్మిక కావ్యమయితే విక్రమార్జున విజయం లౌకిక కావ్యం. మతాన్ని సాహిత్యాన్ని జోడు చేసి వ్రాసిన రచన ఆదిపురాణం. ఆదిపురాణం మొదటిరచన కావడం వల్లనో, సమకాలీనుల ఈర్ష్యాద్వేషాలకు విసిగి వేసారిపోయి పంపకవి అకవుల్ని నిందించడానిపిస్తుంది.

కోగిలెయ సర అరణ్యదొళ్
ఎగెయ్యదో మూర్ఖ జడజనారణ్యదొళ్ ఇం
పొగడిసిద కవి శబ్దం అ
దే గెయ్యుదు అరణ్యరుదితం అదుబగె వాగళ్

—ఆది పురాణం 1-23

దట్టమయిన అడవిలో కోకిల కుహుకుహూరావం అరణ్యరోదనం ఏలా అవుతుందో, మూర్ఖులు, జడులువున్న జనారణ్యంలో సత్కవి కావ్యపఠనం సుతరామూ పనికి రాదని భావం. రసవత్కావ్య నిర్మాత అయిన పంపమహాకవి అంతటివాడు విసిగి వేసారి 'శుష్కవ్యాకర్తలు, శుష్క తార్కికులు, మూర్ఖులు మొదలయానవారికి కావ్యరసాస్వాదనం దక్కదని (1-24) చెప్పాడు.

కన్నడ కవిత్రయంలో రెండవవాడు పొన్నకవి (క్రీ. శ. 939-968) ఇతడు కూడా శాంతిపురాణం అనే ధార్మిక కావ్యాన్ని వ్రాశాడు. శాంతిపురాణంలో

'ఉడుగిదుదు ఈగళిన కబ్బదొళ్ బట్టె ఈ
గడిన కవి వ్రజక్కె పదసంచయం అచిరమాదుదు'

అని కుకవులు వ్రాసిన కావ్యాలను నిందించాడు. 'ఈనాటి కావ్యాలలో సౌందర్యం ఆవంతయినా లేదు. ఈనాటి కవులకు ఏ మాత్రం పదసంపత్తి వున్నట్టు లేదు' అని ఈసడించాడు.

కన్నడ కవిత్రయంలో మూడవవాడు రన్నకవి. రన్న తాను రత్న పరీక్షకుడనని, కృతిరత్న పరీక్షకుడనని సగర్వంగా చెప్పుకున్నాడు. ఆదిశేషుని పడగలమీది రత్నాలతో తన కృతిరత్నం పోటీ పడుతుందని చెప్పుకున్నాడు. ఈతని రచనలు అజిత పురాణం, గదా యుద్ధం. అజిత పురాణం ధార్మికకావ్యం, ఈ గ్రంథంలో రన్నకవి కుకవుల్ని నిందించాడు. ఆ కుకవులు వాగ్దేవి గొంతుకల్ని నులిపేవారట. వాఙ్మాతకు ద్రోహం చేసినవారట. పూర్వకవులు మాత్రం ప్రతిభా సమన్వితులని ఈనాటి కవులు పనికిరానివారని భావించేవారు నా 'గదాయుద్ధం' చదివి పరీక్ష చేసుకోవచ్చు, అని ఆహ్వానించాడు కూడా.

నేమి చంద్రకవి క్రీ. శ. 1200 నాటివాడు. జైనుడు లీలావతి ప్రబంధ రచయిత. కవి రాజమల్ల, విద్యా వధూవల్లభ, శృంగార కారాగృహ, చతుర్భాషా చక్రవర్తి మొదలయిన బిరుదాలు కలవాడు.

'అనుం బుధ రొడనె నృపా
స్థాన దొళ్ ఇర్దప్పెన్ ఎందు కుకవి కదంబం
బానుద్ద అప్పుదేకె ! ఉ
ద్యానదొళ్ బడనె ఇరవె కాగెయుం కోగిలెయిం'

కుకవి సమూహం తాము విద్వాంసులతో రాజాస్థానాలలో వున్నామని విర్రవీగ వచ్చు. అయితే లాభం ఏమి ? ఉద్యానవనంలో కాకులు కోకిలలు కలిసివుండవా.

కన్నడ ప్రశస్తకావ్యాలలో 'జగన్నాథ విజయం' ఒకటి. రచయిత రుద్రభట్టు (క్రీ. శ. 1180) ఆరసికుల్ని మెప్పించడం చాల కష్టమని రుద్రభట్టు భావించినవాడు. వెన్నెలవల్ల చంద్రకాంతశిలలు కరుగుతాయి. గోరి రాళ్ళు కరుగు

తాయా? వసంతంలో మామిడిచిగురు తొడుగుతుంది. కాని మోడుమాను చిగిరిస్తుందా అని ప్రశ్నించినవాడు రుద్రభట్టు.

జన్నకవి వ్రాసిన ధార్మికకావ్యం 'అనంతనాథ పురాణం' ఇతని కాలం క్రీ. శ. 1230. కుకవుల్ని కూపమండూకాలుగా భావించినవాడు. వారికి పదవివ్యానం తెలియదు. స్వారస్యం తెలియదు. ప్రతిభను గుర్తుపట్టలేరు. కేవలం 'దురుక్ దురుక్' అంటూ రొదచేయడమే వారి ప్రవృత్తి. శ్రీనాథుడుకూడా అన్నం ఈలాగే.

కూప మండూకములట్లోలె గొంచమైజెగి
పండితం మన్యులైవ వైతండికులకు 1-13

అని భీమేశ్వరపురాణంలో చెప్పారు.

కన్నడంలో బాగా ప్రచారంలోవున్న సంకలన గ్రంథం 'సూక్తిసుధార్ణవం'. సంకలనకర్త మల్లికార్జునుడు. తన కాలంనాటి పండితుల చిత్తవృత్తిని సొగసుగా వర్ణించిన కవి మల్లికార్జునుడు.

కొందరు కవినిచూచి శాస్త్రజ్ఞానంలేదే అని అంటారట. శాస్త్రపరిచయం వున్నవారిని కవికాదని నిర్ధారిస్తారట. ఇంక కవులలో మరో తెగవారున్నారట. ఈ పద్యం ఏ ఛందస్సులోది అంటే కసరుకుంటారట. పద్యంలోని ఒక పద బంధాన్ని ఉదాహరిస్తూ ఈ ప్రయోగం ఈలాగవుందేమిటీ అంటే తిడతారట. ఏదయినా ఒక విచిత్రపదాన్ని ఉదహరిస్తూ అర్థమేమిటీ అంటే దురుసుగా వ్యవహరిస్తారట.

తెలుగులో తిక్కన భారతానికి ఎంత ప్రచారంవుందో అలాగే కన్నడంలో కుమార వ్యాసభారతానికి ప్రచారంవుంది. ఇతని కాలం 1400-1430. గదగ్‌లోని వీరనారాయణస్వామి కవి అని, తాను కేవలం లిపికారుడనని చెప్పుకున్నవాడు కుమారవ్యాసుడు. తన కావ్యాన్ని ఇతరులు ఈసడించుకున్నా నష్టంలేదని సాలంకారికంగా కవి చెప్పుకున్నాడు.

చోర నిందిసి శశియ బైదడె
క్షీరవను క్షయరోగి హళిదరె
వారణాసియ హోళెవ నిందిసి నక్కరే నహదు (1-22)

దొంగ చంద్రుణ్ణి, క్షయరోగి పాలును, కుంటివాడు కాలిని నిందించడంలో ఫలమేమి అని కుమారవ్యాసుని ప్రశ్న.

తెలుగులో పిల్లలమర్రి పినవీరన జైమినిభారతం వ్రాసినట్టే లక్ష్మీశ కవి (క్రీ. శ. 1550) కన్నడంలో జైమినిభారతం వ్రాశాడు. కావ్యం చదివేవారికి సహనమవసరం. సహనశీలికి కావ్యామృతపానసిద్ధి తథ్యం. కావ్యాలలో తప్పు లుండవచ్చు, కాని చివరిదాక చదివితే ఎన్నో అమూల్యాంశాలు స్పష్టమవుతాయి. అంచేత తప్పులనే లెక్క-పెట్టరాదు. మీగడకట్టిన పాలను వదలిపెట్టడంలేదు. పాలను చిలికి వెన్నతీసి లాభపడతాం. ఆ పాలలో చింతపులుసు పిండితే ప్రయో జనం ఏముంది ? అలాంటి పాలను పారవేయాల్సిందే. ఆ దోషం ఆవుకు అంట గట్టడంలో అర్థమేమిటి ?

కుకవులకు నమస్కా-రంచేసి తామే తప్పుకున్న కవులుకూడా లేకపోలేదు. వారిలో 'ధర్మామృతకర్త' ఒకడు. దుర్జనపర కవీశ్వరుల్ని వెదకివెదకి భక్తితో నమస్కా-రిస్తానన్నాడు 'ధర్మామృత' కావ్యకర్త. తెలుగు కవులలో రామరాజ భూషణుడు, కందుకూరి రుద్రకవి, పిండిప్రోలు లక్ష్మణకవి, కృష్ణకవి మొద లయినవారు కుకవులకు నమస్కా-రంచేసి తాము తప్పుకున్నారు.

ఒక కవి కవితాలక్షణం తెలుసుకోవడానికి 'కుకవి నింద'కూడా సహాయ పడుతుంది. కుకవులే లేకపోతే సుకవులకు ప్రసిద్ధిలేదు. కురూపులు లేకపోతే సురూపుల్ని గుర్తించేవారు చాల తక్కు-వే వుంటారు.

కన్నడాంధ్ర కవుల 'కావ్యావతారికల్ని' తులనాత్మకంగా పరిశీలించడం అవసరం.

స్రవంతి, జనవరి 76.

# తమిళంలో పొడుపు కథలు

జానపద వాఙ్మయం సువిస్తరమయింది. అందులో ఎన్నో శాఖ లున్నాయి. వాటిలో 'పొడుపు కథలు' అనే శాఖకు ప్రచారం మరీ ఎక్కువ. పొడుపు కథలనే ఆంగ్లంలో 'రిడిల్స్' అంటారు. సంస్కృతంలో ప్రశ్నోత్తరమని, కూటమని, సమస్య అని ఎన్నో పేర్లతో పొడుపు కథలను వ్యవహరించడం కనిపిస్తుంది. తమిళంలో పొడుపు కథల్ని పిశి, పుదిర్, విడుకతై అని పేర్కొన్నారు. కన్నడంతో 'ఒగటుగళు' అని వ్యవహారం. తెలుగులో విడి కత, పొడుపు కథలనే పేర్లకు వ్యాప్తి ఉంది. పొడుపుటలో విప్పుటలో ఆనందాన్ని కలిగించేవి పొడుపు కథలవుతాయి. వీటిలో వస్తువు గూఢంగా ఉండటమే గాక వినేవాళ్ళకు కుతూహలం కలుగుతుంది. పొడుపు కథలు చాల వరకు ఆలోచనాత్మకాలు. అందువల్ల గంభీరంగా కూడా ఉంటాయి. పొడుపు కథలు ఎన్నో రకాలు. ఇందులో రానివంటూ ఉండవు. సాహిత్యానికి సంబం ధించినవి, వినోదాత్మకంగా వుండేవి ప్రతి భాషల్లోనూ వున్నాయి. వీటివల్ల ఆ యా జాతుల ఔన్నత్యం కూడా తెలియడానికి వీలుంది. కల్పనాశక్తి, భావ ప్రకటనలో వారికున్న చాతుర్యం చూస్తుంటే చాల ఆశ్చర్యమేస్తుంది.

ప్రకృతికి సంబంధించిన పొడుపు కథలు ఇతర భాషలలో ఉన్నట్లే తమిళం లోనూ ఎక్కువగా కనిపిస్తాయి.

మా నాన్న డబ్బు లెక్కెట్టలేను
మా అమ్మ చీర మడతెట్ట లేను

డబ్బు అనడంలో అసంఖ్యాకములయిన నక్షత్రాలు, మడతపెట్టలేని చీర అనడంలో 'ఆకాశం' తెలుస్తూ వుంది. ఈలాంటిదే మరొకటి.

నల్లచీర చిన్నది నాజూకుగా వున్నది
ముగ్గు లెట్టుతున్నది ముద్దు లొలుకుతున్నది

అనడంలో రాత్రివేళ ఆకారం కనిపించే తీరు మనోహరంగా వర్ణితం.

అన్నను చూస్తే ఉక్రోషం
తమ్ముని చూస్తే సంతోషం

ఈ పొడుపు కథల్లో తీక్షణంగా మండే సూర్యుడు చూడగానే ముద్దొచ్చే చంద్రుడు స్ఫురిస్తారు.

ఏడు కొండల కావల
ఎను బోతు రంకె వేసింది

అనడంలో దూరంగా భయంకరంగా గర్జించే మేఘగర్జన జ్ఞప్తికి వస్తుంది.

దగ్గరికెడితే చాలు దాసిని నేనంటుంది
గుబులుతిరిగితే చాలు కౌగిలికి సై అంటుంది

ఈ పొడుపుకథకు 'అలిగిన అమ్మాయి' అనే అర్థంచెబితే విశేషాంశం ఏమీలేదు. కాని ఈ పొడుపుకథ అడిగిన వ్యక్తి ఆశించిన విషయం 'కదలి ఆల'. ప్రౌఢ కావ్యాలలోని సముద్రవర్ణనలకు ఇది ఏమాత్రం తీసిపోదు.

పొడుపుకథల్ని జీవనదితో పోల్చవచ్చు. కొత్తప్రవాహం వచ్చేసరికి సరికొత్తజీవితం మొదలవుతుంది. అలాగే సంఘం మారుతున్నకొద్ది, విజ్ఞాన ప్రయోజనాలు విస్తరించేకొద్ది కొత్తకొత్త పొడుపుకథల్ని మానవులు సృష్టించు కుంటారు. ఈలాంటివాటికి ఆలోచించకుండా సమాధానంచెబితే మనం తప్పటడుగు వేసినట్లే.

చిన్నచిన్న యింటిలో సిపాయి వీరులెందరో

ఈ పొడుపుకథకు తేనెటీగ సమాధానం కావచ్చుగాని ఆశించిన జవాబు అగ్గిపెట్టె.

అంగలార్చేవాడు
అందుకుంటే చాలు
అణగిపోయే వాడు

ఇష్టంలేని వివాహం జరిగినా, కట్టుకున్న భార్య అనుకూలవతి కాకపోయినా మగవాడు మరో దాని వలలో పడడం ఖాయం. భారతంలోని యయాతి చరిత్ర ఈలాంటిదే. శుక్రాచార్యుల ఆజ్ఞ ప్రకారం యయాతి దేవయానిని వివాహమాడినాడు. కాని శర్మిష్ఠను చూశాక అతని మనసు తిరగబడింది. దేవయానితో గడిపిన సాంసారిక జీవితంలోని అసంతృప్తులు గుర్తుకు వచ్చాయి. శర్మిష్ఠ అందం, చందం అతణ్ణి ఉక్కిరి బిక్కిరి చేశాయి. దేవయానికి శర్మిష్ఠ దాసి అయినా యయాతి ఆమెవైపే మొగ్గాడు. చివరకు దాసీ సాంగత్యం చేశాడు.

'ఏ వయసుకు ఆ ముచ్చట' అంటారు పెద్దలు. కన్నడంలో ఒక మంచి సామెత వుంది. ఇల్లు, పొలం, కన్నకూతురు కనీసం తన్ను ఒకసారయినా కన్నెత్తి చూడమని యజమానిని ప్రార్థిస్తుందట. చూస్తుండగనే ఎదిగిపోయి యుక్తవయస్కురాలయిన అమ్మాయిల బాగోగులు చూడకపోతే అనర్థాలు రావడం ఖాయం. వయసుపెట్టే తొందర, పరిసరాల ప్రభావం, అజ్ఞానం, ఆడవారిని అథః పాతాళానికి నెట్టివేస్తాయి. కన్య గర్భవతి కావడం, ఆపై బాధపడడం అందరికి తెలిసిందే. భారతంలోని 'కుంతి' అచ్చం ఈలాంటి ప్రవృత్తి కలిగిన కన్య. దుర్వాసుడు అనుగ్రహించిన వరాన్ని పరీక్షించాలనుకోవడం, సూర్యుడు ప్రత్యక్షం కావడం, కుంతిని అనుగ్రహించడం, కర్ణుడు జన్మించడం, చివరకు ఎవరికీ చెప్పుకోలేక 'వదిలించుకోవడం' జరిగింది. అక్రమ సంతానంవల్ల కలిగే సంతానం పడేపాట్లు కర్ణునిలో కనిపిస్తాయి.

వయసు బట్టి కుటుంబంలో వివాహాలు చేయడం మన అందరికి తెలిసిందే. కాని ఈ నియమం ఆడవారిపట్ల మినహాయింపు. చెల్లెళ్ళకు వివాహం చేసి అన్నయ్యలు పెళ్ళాడడం తప్పు కాదు. కాని అన్నలుండగా తమ్ముడు వివాహం చేసుకోవడం అరుదుగా కనిపించే దృశ్యం. చాల సందర్భాలలో ఈలాంటి వాటికి 'అన్న' అంగీకారం వుంటుంది. భారతంలో లాక్షాగృహ దహనానంతరం పాండవులు అరణ్యవాసం చేసే వేళ 'హిడింబ' భీముని చూచి మరులుగొంటుంది. తన మనసులోని మాటను వాచ్యం చేస్తుంది. చివరకు తల్లి సమ్మతిస్తే, ధర్మరాజు అంగీకరిస్తే భీముడు 'హిడింబను' వివాహమాడాడు. ఘటోత్కచుని జన్మకు కారణమయ్యాడు.

దీనికి 'ఏడుస్తున్న పిల్లవాడు' అనే జవాబుతోబాటు మోగుతున్న టెలిఫోను గుర్తుకువస్తుంది.

తాకితే అంటుకుంటుంది – కాని బంకకాదు
వదలిపెడితే పనిచేస్తుంది – కాని యంత్రంకాదు

ఈ కథకు గయ్యాళిభార్య సమాధానం కాదుగాని 'కరెంట్ షాక్' ఆశించిన సమాధానం.

మెడవుంది చేతుల్లేవు
పొలుకవుంది మాటల్లేవు
నోరువుంది కదల్లేదు
టోపీవుంది కుచ్చులేదు

దీనికి సమాధానం 'పేనా'.

ఊరిచివరి కెళ్ళాను
కొండచిలువ చూశాను
లాగి లాగి కొట్టాడు
వెర్రెత్తి కేకవేశాడు

ఈ కథలో వూరిచివరుండే రైల్వేస్టేషన్, చాలా బోగీలున్న రైలు, బయలు దేరేటప్పుడు రైలుకూత రమ్యంగా వర్ణితం.

నోరులేదు కాని అన్నీ చెబుతాను
ప్రాణంలేదు కాని వూర్లకు వెడతాను
కాలులేదు కాని ఇంటికి వస్తాను

అనడంలో పోస్ట్‌మేన్ అందించే ఉత్తరంముక్క స్పష్టమవుతుంది.

'రారండని పిలిచేది పోపొండని తరిమేది'

అనడంలో ఫ్యాక్టరీలోని సైరన్‌కూత సమాధానం.

తమిళంలో ఇంటికి, ఇంట్లోని వస్తువులకు సంబంధించిన పొడుపు కథలు చాల కనిపిస్తాయి. ఇవి చాలవరకు పిల్లలకు, స్త్రీలకు సంబంధించిన పొడుపుకథలు. వీటివల్ల పిల్లలకు ఇంట్లోనే ఆలోచించే శక్తికి తర్ఫీదు ఇవ్వడం జరుగుతుంది. వీటిలో కొన్నిటినిచూద్దాం.

అమ్మ పడుకుంది బిడ్డ పారాడుతుంది – మసాలరాయి

వింతయిన చెరువులో అందాల చిలక
తోకతో నీరు తాగే మొలక – దీపంవత్తి

కన్నుంది చూడలేదు కాలుంది నడవలేదు – నవారుమంచం

గుంటలో జన్మించి గుడిసెలో జీవించి
సంతలో నిలబడి పంక్తిలో వాలింది – చాప

నా తల్లేమో సంద్రం నా తండ్రేమో సూరీడు
నేనేమో అందరికీ కావాలి – ఉప్పు

కవిత్వానికి చమత్కారం జీవం. ఆ చమత్కారం పదగతంకావచ్చు. వాక్య గతంకావచ్చు. భావగతమయినదీ కావచ్చు. పొడుపుకథల్లోను చమత్కారం ఎన్నో రూపాలలో సాక్షాత్కరిస్తుంది. ఉదాహరణకు కొన్ని.

డాక్టరొచ్చారు సూది వేశారు
కాసు లిసేను పారిపోయారు – దోమ

అమ్మా యొకతె వచ్చింది
అమృతం నిండా పోసింది
కులుకుతు కులుకుతు నడిచింది
కౌగిలిలో అట్టే ఒదిగింది – నీళ్ళబిందె

రాజు రాణి వున్నారు - దేశం కాదు
ఆకు లెన్నో వున్నాయి - మొక్క కాదు
అక్షరాలెన్నో వున్నాయి - పుస్తకం కాదు
సొమ్ము లెన్నో వున్నాయి - అంగడి కాదు - చీకట్లపే

మట్టి కింద వెండి ముద్ద - ముల్లంగి
దారి పొడుగునా దాహం తీరుస్తుంది - వాన కాదు
కొండలో కోనలో తిరుగుతుంది - ఎలుగ్గొడ్డు కాదు
సముద్రంలో మునిగిపోతుంది - చేప కాదు - నది

మానవ దేహప్రకృతి ఆధారంగా అల్లబడిన పొడుపు కథలు పిల్లలకి బాగా నచ్చుతాయి. వీటిలో వివరణ ఎక్కువగా వుంటుంది. చిన్న పిల్లలకు చప్పున స్ఫురించడం కోసం వివరణ తప్పనిసరి.

అక్కాచెల్లెల అనుబంధం ఇరుగూ పొరుగూ సంబంధం
దగ్గర దగ్గరవున్నారు దరికి చేరలేకున్నారు
చిన్న చిన్న తలుపులు చిటారి తలుపులు

అనడంలో 'కళ్ళు' గుర్తుకు వస్తాయి.

పగలాడి రాణికి వాకిట్లో కాపలా - నాలుక

రైతు చల్లని విత్తనం మేస్త్రీకట్టని కట్టడం
వాకి వుతకని గుడ్డలు ఉలితో చెక్కని రాళ్ళు - పళ్ళు

ఐదుగురిలో చిన్నోడు - పెళ్ళికి మాత్రం పెద్దోడు. - చిటికెన వ్రేలు.

పొడుపు కథలలో మరికొన్ని వున్నాయి. వీటికి జవాబు చెప్పడానికి పెద్దగా ఆలోచించవలసిన అవసరం లేదు. స్పష్టతకు దగ్గరగా వుండడమే దీనికి కారణం

వస్తా నీతో ఎప్పుడు - పరుగులు వారేటప్పుడు - నీడ
ఎందరెక్కితేనేం పూరుకునే గుర్రం - అరుగు
తాగడానికేమో నీరుంది తానమాడడానికి
తగినంత నీరు లేదు - టెంకాయనీరు
నన్ను చూస్తే నిన్ను పట్టిస్తా - అద్దం
ఆకాశం కేసి ఎదిగింది చెట్టు కాదు
ఆకులున్నాయి కొమ్మల్లేవు - కొబ్బరి కాయ
మధ్య మధ్య గణుపులున్నాయి వెదురు కాదు
తింటే చాలు ఎంతో మేలు - చెరకు

జానపద విజ్ఞాన అధ్యయనంవల్ల లాభా లెన్నో. విశ్వవిద్యాలయాలలో పొడుపు కథలకు సంబంధించిన పరిశోధన జరుగుతుండడం అభినందించదగ్గ అంశమే.

ఆంధ్ర ప్రభ (దినపత్రిక)
2-4-'78

# భారతిదాసన్ - త్రిపురనేని - శ్రీ శ్రీ

సాహిత్య పరిశోధనలో నేడు తులనాత్మక అధ్యయన పద్ధతికి ఎంతో గౌరవం, ఆదరణ, ప్రయోజనం, అగ్రతాంబూలం అన్నీ కనిపిస్తున్నాయి. ఈ దృష్టితో తమిళ మహాకవి భారతిదాసన్ శతజయంతి ఉత్సవ సందర్భంలో ఆ మహాకవిని తెలుగు కవులతో సరిపోల్చి చూస్తున్నాం. ప్రసిద్ధ విద్వాంసులు భారతిదాసన్ కవిని గరిమెళ్ళ సత్యనారాయణతోను, గురజాడతోను కొందరు పోల్చారు. కాని నా దృష్టిలో శ్రీ శ్రీకి సమానుడయిన తమిళకవి లేనట్లే భారతిదాసన్‌కు సరితూగగల తెలుగుకవి లేనే లేడు. ఈ నిష్కర్షకు 'సవాలక్ష కారణాలున్నాయి.

భారతిదాసన్ చాలకాలం బతికిన వ్యక్తి. 1891 నుండి 1964 దాకా భారతదేశమంతట, దక్షిణదేశమంతట జరిగిన అనేకానేక సంఘటనలను దర్శించి, స్పందించి కవితావ్యవసాయం సాగించినవాడు. ఈ దృష్టితో పరిశీలిస్తే తెలుగు కవులలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ శ్రీ మొదలయినవారు స్వాతంత్ర్యానంతరం కూడా జీవించినవారే. భావ కవిత్వానికి పరిమితమయినవారు రాయప్రోలు, సంప్రదాయవాదానికి భిన్నంగా ప్రవర్తించినవారు విశ్వనాథవారు, పాశ్చాత్యప్రభావంతో మార్క్సిజమ్ వైపు మొగ్గి అభ్యుదయ, విప్లవకవితలలో వీరవిహారం చేసినవారు శ్రీ శ్రీ. అందువల్ల వీరితో ఏకముఖంగా భారతిదాసన్‌ను పోల్చడం 'అతివ్యాప్తి' అవుతుంది.

ఉపాధ్యాయుడు, పత్రికాధిపతి, సంఘసంస్కర్త సాహిత్యకవి భారతిదాసన్ అని అంటే ఈ మహాకవిని కందుకూరి వీరేశలింగంతో పోల్చాలి. అయితే పంతులుగారు స్వాతంత్ర్య సంగ్రామంలో వహించిన పాత్ర చాల తక్కువ. మహిళాభ్యుదయానికి, అతిబాల్య అతివృద్ధ వివాహ సంస్కరణకు, విధవా వివాహాది సత్కార్యాలకు పరిమితమయిన సంస్కర్త. అంచేత కందుకూరి వారిని భారతిదాసన్‌తో పోల్చడం 'అవ్యాప్తి' అవుతుంది. కొంతవరకు భారతిదాసన్‌ను గురజాడ, గరిమెళ్ళ, రాయప్రోలు, త్రిపురనేని రామస్వామి

చాదరులతో పోల్చవచ్చు. ఈ నలుగురు కవులను మూసగాపోసి నగిషీలు దిద్దితే భారతిదాసన్ ప్రతిరూపమవుతుందనడం స్వభావోక్తి. 'భారతి దాసన్'ది చిత్రమయిన ప్రవృత్తి. ఆ కవిని గురించి ప్రసిద్ధ విమర్శకుల అభిప్రాయాలు గమనించదగ్గవి.

పుదుమై పిత్తన్: వివేకాలయం కట్టి అందులో మనల్ని సుఖంగా జీవించేటట్లు ఆశించిన జ్ఞాని.

రా. పి. సేతుపిళ్లై: భారతిదాసన్ కవితలో వేగం వుంది. స్వాతంత్ర్య దాహం వుంది. సంప్రదాయంవుంది. నిర్దిష్ట లక్ష్యముంది.

వ. రా: ఆవేశాన్ని, ఉద్వేగాన్ని ప్రవాహరూపంలో ఉప్పొంగించిన మహోన్నత కవి భారతిదాసన్.

కి. ఆ. పె. విశ్వనాథం: కవితకోసం ఒకసారి, వినూత్న భావాలకోసం మరోసారి, ఉద్విగ్నత కోసం ఇంకో తడవ, శ్రావ్యత కోసం మరోమారు భారతిదాసన్ కవితల్ని చదివాను.

భారతిదాసన్ ఒక సిద్ధాంతానికి తలతాకట్టు పెట్టుకున్న వ్యక్తికాదు. మారుతున్న సమాజానికనుగుణంగా ప్రజాశ్రేయస్సు పరమార్థంగా తన్ను మలచుకొన్న సమ్మిశ్రిత సైద్ధాంతిక ప్రవక్త. చాల సందర్భాలలో భారతిదాసన్ కవితలో వైరుధ్యాలు కనిపిస్తాయి. అయితే వాటిమధ్య క్రమం లేకపోలేదు. ఒక సరోవరంలో ఒకరాయి విసరినపుడు ఏర్పడే చిన్న పెద్ద తరంగాల వలయాలవంటివిగా వాటిని గుర్తించడం అవసరం. భారతిదాసన్ కవితలో భాషాభిమానం, అగ్రవర్గాల పట్ల ద్వేషం, మహిళాభ్యుదయం, హేతువాద ధోరణులు, అభ్యుదయ వాదాలు, భారతిదాసన్ ప్రత్యేకతలు మొదలైనవాటిని విహంగావలోకన దృష్టితో చూద్దాం.

**భాషాభిమానం :**

భారతదేశంలో తమకున్న భాషాభిమానాన్ని బాహ్యంగా చెప్పుకుంటూ ఒక ఉద్యమంగా నడుపుతూ జీవించినవారిలో నాడు బెంగాలీలు, నేడు హిందీ ప్రాంతీయులైతే, నాడూ-నేడూ తమిళులు కనిపిస్తారు. ఈ అభిమానం తమిళులలో

పిసరంత పెచ్చు అనడం అందరికి తెలిసిన విషయమే. ఈ భాషాభిమానం భారతియార్‌లో వున్నా పల్లవించి శాఖోపశాఖలై కొన్ని సందర్భాలలో 'వెర్రి తలలు' కూడా వేసింది భారతిదాసన్‌లోనే అని సత్యాన్వేషణ చేసే పరిశోధకు లంటారు.

"తమిళానికి అమృతమని పేరు. ఈ తమిళం ప్రాణానికి సమానం."

"ఓ శంఖమా ! మా జీవితం, మా జవం,
సర్వస్వం తమిళమవి మోగించు"
"తల్లిమీద ఆన తండ్రిమీద ఆన
తమిళ ప్రాంతంమీద ఆన
స్వచ్ఛమైన తమిళంమీద ఆన పెట్టి
సోదరులారా మీకు చెబుతున్నా"

సామాన్య ప్రజలలో కూడా తమిళాభిమానాన్ని రేకెత్తించిన ఉద్యమ కారుడు భారతిదాసన్. తెలుగులో ఆంధ్రరాష్ట్ర సాధనకోసం జరిగిన పోరాటాలలో మాత్రం ఈ అభిమానం కవుల రచనల్లో ఉరకలు వేసింది. తెలుగు భాష గొప్పతనం గురించి మహాకవుల అభిప్రాయాలు

మార్దవ మాంధ్రంబు మధుర మాంధ్రంబు
హార్దమై శ్రావ్యమై యాంధ్రంబు తనరు

ఏ. వి. నరసింహంపంతులు 'ఆంధ్ర భాషా ప్రశంస'

అలరు తేనెలకు సావలి గట్టిన
కండ చక్కెరకు గడవలు పట్టిన
అమృతపు సోనలలో తిరుగాడే
తెలుగు బాసనాది కమ్మని
తెలుగు పలుకు నాది

పినుమర్తి వెంకటరత్నం - రత్నాపఠం

భారతిదాసన్ - త్రిపురనేని - శ్రీశ్రీ

నాదు జాతి నాదేశము నాదు భాష
అను అహంకార దర్శనమందు మాంధ్ర
రాయప్రోలు సుబ్బారావు

తమిళులు సుబ్రహ్మణ్యస్వామిని 'తమిళ్ కడవుళ్' అని చెప్పి మురిసి పోయినట్లే త్రిపురనేని రామస్వామి చౌదరిగారు బ్రహ్మ భగవద్గీతలో విశ్వరూప సందర్శన భాగంలో బ్రహ్మనాయని నోట

'బాసలలో నెల్ల తెల్గు బాసను నేనే'

అని చెప్పించుకున్నారు. చాలక

తెలుగులలోనెల్ల మాల తెలుగును నేనే అని కూడా వివరించినారు. దేవునికి భాషకు ముడిపెట్టిన తమిళ కవులెందరో వున్నారు గాని తెలుగు కవులలో 'త్రిపురనేని' మాత్రం కనిపిస్తున్నారు.

భారతిదాసన్‌కు తమిళాభిమానంతోబాటు సంస్కృత ద్వేషంవుంది. హిందీ ఆధిక్యతపట్ల నిరసన కూడా వుంది. సంస్కృతం తమిళం హక్కును పరిహ రించినదని భారతిదాసన్ చాలచోట్ల వాచ్యం చేశారు.

మా హక్కును చంపేసిన పాము సంస్కృతం అన్నారు
- ఎళుచ్చి - ఉత్థానం

కాని తెలుగు కవులలో సంస్కృత ద్వేషమున్నవారు కనిపించరు. హిందీ ఆధిక్యత పట్ల నిరసన చూపినవారు కూడా అరుదు. కాని చౌదరిగారు ఈ విషయంలోను తమిళకవులతో సరిపోతారు. వెల్లువ వలె వచ్చి పడుతున్న హిందీ భాషా వ్యాపక మును ఆయన అనేక విధములుగ ప్రతిఘటించారు.

తమతమిళజాతి పౌరుషాన్ని, కళాసంస్కృతి ఔన్నత్యాన్ని, పురాప్రసక్తిని వర్ణించడంలో భారతిదాసన్ ఎలాంటి అనురక్తిని ప్రదర్శించాడో అలాగే త్రిపుర నేని రామస్వామి చౌదరి గూడ వర్ణించారు. ఆంధ్ర వాఙ్మయంలో విశ్వనాథ

సత్యనారాయణ, తుమ్మల సత్యనారాయణ చౌదరి, మల్లంపల్లి సోమశేఖర శర్మ ప్రభృతులు కూడా ఈలాగే కీర్తించిన వారిలో ప్రముఖులు.

ఆంధ్ర పౌరుషమన మాటలా

విశ్వనాథ, ఆంధ్ర పౌరుషము.

తెలుగు జోదుల తుటారి కటారి
చెలగి పగర చీల్చిన దినంబు

తుమ్మల సీతారామమూర్తి చౌదరి – రాష్ట్రగానం

తెలుగు జోదుల కత్తిమలసి నర్తించె
తెలుగు దొరల సేన దెన లాక్రమించె

మల్లంపల్లి సోమశేఖరశర్మ 'శారద'

తెలుగు బిడ్డ మరచి పోకుర
తెలుగు దేశము పురిటి గడ్డర
కొక్కొ–రొకో పాట పాడర

కవిరాజు 'శతకాలు – గీతాలు'

అంటూ తెలుగువారల వేడినెత్తురు, తెలుగు బావుటాలను పరిచయం చేసినారు.

తెలుగు నాడును గొల్వరా తమ్ముడా
తెలుగు గాలిని పీల్చరా

కర్లపాలెం కృష్ణారావు 'తెలుగునాడు'

తెలుగు వారిలో ఈ భాషాభిమానం మరో భాషపై దురభిమానం కలిగించ లేదు. కాని భారతిదాసన్ వంటి కవులలో కొన్నివేళల 'ద్వేషాన్నే' పెంచింది.

'ఎల్లాం తమిళర్ ఉడమైయే' (అంతా తమిళుల సొత్తు) అనే కవితలో కర్ణాటక సంగీతం తమిళ సంగీతమన్నాడు. ఈలాగే ప్రతి ఒక్కదానిని కళను,

వైద్యాన్ని తమిళంతో ముడిపెట్టి ఆర్యులు సంస్కృతీకరించి తమిళాన్ని మట్టు పెట్టారని ఆవేదన కక్కుకొన్నాడు.

ఈ సందర్భంలో డా॥ సి. నారాయణ రెడ్డిగారి మాటలు ప్రస్తావించడం తప్పుకాదు.

> "ఉద్యమం జడివాన వంటిది. ఆ సమయంలో వెలువడే కవిత్వం అంచులు దాటి ప్రవహిస్తుంది. ఈ విధమైన అభిమానము ఆ యుగ లక్షణము. ఇది పెద్ద దోషముకాదు నాటి కాల స్వభావమట్టిది. కవుల చిత్తవృత్తి అట్టిది. కవులు ప్రకటించిన అభిమానాతిరేకము అనాటి ప్రజలకానందమే కలిగించినది".

(ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు - ప్రయోగములు పుట-411)

అగ్రవర్గాలపట్ల ద్వేషం :

ఒకవర్గంమీద లేదా ఒక వర్ణంమీదా ద్వేషం పెరగటానికి ప్రధానంగా నాలుగు కారణాలు కనిపిస్తాయి. మొదటిది ఆ వర్గం లేదా ఆ వర్ణంవారివల్ల ఆత్మ గౌరవానికి హానికలగడం. రెండవది అభ్యుదయకాంక్ష. మూడవది తమ జీవన భృతికి ఆస్కారమయినదికూడా చేజారిపోతుందేమో అన్న ఆందోళన. నాల్గవది నీచ రాజకీయాలు.

భారతిదాసన్‌కు అగ్రవర్గాలపట్ల ద్వేషంకలగడానికి వైయక్తిక కారణాలు కనిపించవుకాని రామస్వామినాయకర్ ఆదర్శాల అనుకరణ కారణంకావచ్చు. లేదా నాటి సాంఘికవాతావరణం కావచ్చు. అయితే చౌదరిగారిలో అగ్రవర్ణులపై ద్వేషం కలగడానికి అనేక కారణాలున్నాయి. ఒక దీక్షితుడు కమ్మ కుమ్మర శబ్దాలకు సామ్యంచూపించి వీరందరు ఏకోదరులంటే కోపం తెచ్చుకోవడం, అలాగే తాను డబ్బుయిచ్చికొన్న మిఠాయిపొట్లాన్ని స్నేహితునికిస్తుంటే అతని తండ్రి వారించడం. 'అంత్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుకాదు'. అనే అప్పకవి వాక్యం, వివాహాదులలో శ్రోత్రియుల దోపిడీలు మొదలయినవి కారణాలుగా కనిపిస్తాయి.

సాహిత్యం సమాజానికి దర్పణం లాంటిది. సాంఘికాంశాలు సాహిత్యంలో ఏదో రూపంలో కనిపిస్తాయి. మేధావులు తమ కేపీ పట్టనట్లు పూరుకోవడం ఈ శతాబ్దంలో మరీ ఈ పదేళ్ళలో చూస్తున్నాం. భారతకాలంలో భీష్మ, ద్రోణ, కృపాచార్య మొదలయిన పెద్దలు దుర్యోధనుని చేతలు ధర్మవిరుద్ధమని తెలిసినా ఏమీ చేయలేకపోయారు. అందువల్లనే కృష్ణుడు

'సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచే
బారము పొందలేక చెడబారిన దైనయవస్థ దక్షు లై
వ్వారల ఉపేక్ష సేసి రది వారల చేటగు గాని'

గట్టిగా మందలించాడు.

ఎవరో ఒక వ్యక్తి అపకారం చేస్తే ఆ వ్యక్తి కులాన్ని, ఆవ్యక్తి అనుయాయి వర్గాన్ని పీడించడం మనం చూస్తున్నాం. పరీక్షిత్తు మరణానికి తక్షకుడు కారణం, ఆ కోపంతో జనమేజయుడు 'సర్పయాగం' చేయడానికి సిద్ధమయ్యాడు. అలాగే పరశురాముడు రాజకులాన్ని వెదకి వెదకి చంపాడు.

గృహదహనాలు, హత్యలు, లూఠీలు 20వ శతాబ్దంలో రోజూ వినే వార్తలు. భారతకాలంలోని 'లాక్షా గృహదహనం' ఈలాంటిదే. అమాయకులయిన వారు అడవిలో పయనం చేస్తుంటే దారి కాచి, పీడించినట్టు హిడింబాసురుడు అందరిని అడ్డుకున్నాడు. పనీ పాట లేక, దబాయింపులతో, ఇతరుల శ్రమల పై బ్రతికే రౌడీమూక దొరలున్నట్లే, బకాసురుడు గ్రామీణుల్ని అణచి హాయిగా కడుపారా తినేవాడని చెప్పవచ్చు. కనికరం లేక, నిద్ర పోతున్నారనే కాసంత ఇంగితం లేక, ఊచకోత కోసిన సన్నివేశంలాగే అశ్వత్థామ 'ఉప పాండవుల్ని' పరలోకం పంపించారు.

వెలది, జూదం, వేట, పానం మొదలయిన వాటిని సప్తవ్యసనా లనడం పరిపాటి. ఈ వ్యసనాల కారణంతో తమకున్న ఆస్తిని కర్పూరహారతి చేయడం, అనర్థాలు కోరి తెచ్చుకోవడం, అగడు పడడం, వీథుల్లో పడడం అందరికీ తెలిసిందే. పాండురాజు వేటవల్ల, శుక్రాచార్యులు పానంవల్ల, ధర్మరాజు జూదంవల్ల, కీచకుడు వనితామోహంవల్ల పడరాని పాట్లు పడ్డారు.

ద్వేషముండడం వేరు. ద్వేషాన్ని ప్రకటించడం వేరు. ఈ ద్వేషప్రకటనలో వాచ్యభావం, హద్దులుదాటిన దూషణ భారతదాసన్‌లో కనిపిస్తాయి. ఈ విషయంలో కవిరాజుగారెంతో నయమని నా అభిప్రాయం. కనుక కవిరాజును ఆనాటి సమకాలీనులు చెళ్ళపిళ్ళవారు, విశ్వనాథవారు, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు వారు, వేలూరి శివరామశాస్త్రిలు అభిమానించారు. గౌరవించారు. మహాకవి కవితను నోరారా మెచ్చుకొన్నారు. ఈ సందర్భంలో వేలూరి శివరామశాస్త్రిల అభిప్రాయాలు గమనింపదగ్గవి.

వ్యక్తిగతమైన భావాలను స్వతంత్రంగా వ్యక్తంచేయడం అందరికీ సాధ్యం కాదు. లోకానికి ఇష్టమయినా, కష్టమయినా లక్ష్యంచేయకుండా స్వభావసిద్ధంగా స్వధర్మాన్ని వ్యక్తంచేసినవారు కవిరాజు.

కవిరాజు సన్మాన సంచిక – 127

మహిళాభ్యుదయం :

మహిళాభ్యుదయంపట్ల భారతిదాసన్, చౌదరిగారు ఎంతో కృషిచేసినవారు. ప్రత్యేకించి 'స్త్రీవిద్య'పట్ల ఇద్దరూ సానుభూతి వున్నవారే.

భారతిదాసన్–

చదువులేని పడతులు
చదువుకున్న మహిళలు సంస్కరించిన సాగునేల
కళ్ళతో దారి చూడగలిగినట్లు
కాళ్ళతో నడయాడగలిగినట్లు
కాంతామణుల కారణాన పురోగమించవచ్చు
మంచి స్థితిలోన నిలువంగ
మరిమరి తోడ్పడు మగువల చదువు

పెణ్ కల్వి (స్త్రీవిద్య)

స్త్రీలు పురుషులకేమాత్రం తీసిపోయేవారుకారు. వారు సరిసమానులు.
వర్తకం చెయ్యవచ్చు విమానాలు నడపవచ్చు

ఆణ్ పెణ్ నిగర్ (స్త్రీపురుషులు సమానులు)

చౌదరిగారు కుప్పుస్వామి శతకంలో స్త్రీ విద్యగూర్చి ప్రస్తావించారు.

చదువులేని జాయ సల్లాపములకన్న
చదువుకొన్న జాయ చలము మేలు
భార్య చదువు పతికి బనికి వచ్చుచునుండు
కొడుకు చదువుకన్న కొంతవఱకు
చదువుకొన్న భార్య సంసారమును దిద్ది
కొనుచు బతికి గూర్చు గుప్పుస్వామి

వివాహ వ్యవస్థ :

వివాహ వ్యవస్థలో అగ్రవర్గస్థుల దోపిడిని, అధిపత్యాన్ని, అర్థరహితమైన విధానాలను భారతిదాసన్, చౌదరి ఇద్దరు దుయ్యబెట్టినవారే.

భారతిదాసన్ 1928 లోనే వివాహవ్యవస్థలో 'మంగళసూత్రధారణ' ను వదలిపెట్టే విధానాన్ని ప్రవేశపెట్టారు. పెరియార్ నాయకత్వంలో అగ్రవర్గస్థులను పిలువకుండా చేసే వివాహాలకు ఆదరణ చూపారు. అలాగే చౌదరిగారు 'వివాహ విధి' అనే చిన్న పుస్తకం వ్రాసి సంస్కృతమంత్రాలను తెలుగు మాటల్లోకి మార్చి వధూవరులు అచరించవలసిన విధులను సులభమైన తెనుగులో ప్రవచించారు. ఉపన్యాసాలతో ముఖ్యమయిన కొన్ని ఆచారాలను, సంప్రదాయాలను వదలిపెట్టకుండా నూతన వివాహ పద్ధతికి శ్రీకారం చుట్టారు. అదే సందర్భంలో సరస్వతీ బ్రహ్మేంద్రస్వాములవారి సహకారంతో రామస్వామి చౌదరిగారు స్వసంఘ పౌరోహిత్య కార్యక్రమాన్ని దిగ్విజయం చేశారు. వారే 'కమ్మబ్రాహ్మణులు'గా చెలామణి అయ్యారు. ఇలాగే చౌదరిగారు ముహూర్తములపట్ల విశ్వాసం సడలించ గలిగారు. తానే తన కుమారుడయిన వెంకటేశ్వరరావుగారికి ఆషాఢ మాసంలో రాహుకాలంలో వివాహం జరిపించారు.

వివాహవ్యవస్థలో భారతిదాసన్ మరికొన్ని ముందడుగులు వేశారని చెప్ప వచ్చు. పెద్దలు నిశ్చయించిన వివాహంకంటే ప్రేమవివాహాలు మంచివని ఆ ఆ మహాకవి అభిప్రాయం. అలాగే విధవా వివాహాలు తప్పుకావని అతని ప్రాయం.

సతి మరణించాక మరొక అనుకూలవతిని మగవాడు
వెతుక్కున్నట్టు మగువ కూడా పతి మరణించాక మరొక
అనుకూలుణ్ణి ఎన్నుకోవడం మంచిది.

—కైమ్మై పళి

ఇతర భాషాకవులు ఊహించని కాలంలో గురజాడ హరిజనులపట్ల సాను భూతి ప్రకటించినట్లే భారతిదాసన్ 1929 లోనే కుటుంబ నియంత్రణ అవసరమని వ్రాయడం వారి భవిష్యద్దర్శనాన్ని తెలియజేస్తుంది.

హేతువాదం :

జీవిత తత్త్వాన్ని, నీతి శాస్త్రాన్ని నిర్మించుకోవడానికి మార్గం చూపేది సత్యాసత్యాలను నిర్మించేది హేతువాదం. ఈ వాదాన్ని భౌతిక ప్రపంచానికి అన్వయిస్తే భౌతికవాదం. దేవునికి అన్వయిస్తే నాస్తికవాదం. మానవునికి అన్వయిస్తే మానవతావాదమవుతుంది. తమిళదేశంలో రామస్వామి నాయకర్ ఈ ఉద్యమ సంచాలకుడయితే ఆంధ్రదేశంలో రామస్వామి చౌదరి 'ఆదిపురుషుడు'. ఈ హేతువాద చ్ఛాయలలో కొన్నిటిని చూద్దాం.

దైవ మీమాంస :

రామస్వామి నాయకర్ ప్రభావంలో పడ్డాక భారతిదాసన్ రచనల్లో హేతువాద ధోరణులెన్నో కనిపిస్తాయి. ప్రత్యేకించి కడవుళై నంబినోర్ కైవిడప్పట్టార్' (దేవుణ్ణి నమ్మినవారు విముక్తులయ్యారు) కవితలో దేవుణ్ణి నమ్మితే దిగులులేదని కొందరు గుడి కడతారు. కలవారికి అన్నీ సమకూరుతాయి. నమ్మిన వారికీ అన్నపానీయాలు కరవని అంగలారుస్తారు. ఒకరోజు ఒక లారీ గుడిని ఢీ కొడుతుంది. విగ్రహం ముక్కలయింది. బండిలోని పది మందికి ఒళ్ళంతా గాయమట అపుడు కవి అన్నాడు.

తన్ను కాపాడుకోలేని దేవుడు
తన్ను నమ్మిన వారిని కాపాడగలడా అని

(దేవుడ స్తమించాడు)

అలాగే 'కడవుళ్ మఱైన్దార్' లో కవి చింతనాలోకంలో వుంటే దేవుడు వచ్చి పలకరించాడు. గోడవుందంటే గోడకట్టినవాడున్నాడు కదా అని తన్ను గుర్తించమన్నాడట. అపుడు కవి నిన్ను చెక్కినశిల్పి ఎవడని అడిగితే దేవుడు అంతర్ధానమయ్యాడట - అంటే దేవుడు లేడు. మానవుడు చేసిన మూర్తి అని అభిప్రాయం. అలాగే ఒకచోట దేవుడు అనేమాట లేనిరోజుల్లో యావత్ప్రపంచం అందరిదిగా ఉండేదని భారతిదాసన్ అన్నాడు.

ఈలాంటి భావాలు తెలుగులో గురజాడలో కూడా కనిపిస్తాయి.

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్క
మనుషులంటే రాయి రప్పకన్న కనిష్ఠం

'మీ పేరేమిటి' కథానికలో

"దేవుడు చేసిన మనుషుల్లారా
మనుషులు చేసిన దేవుళ్ళారా" అని ప్రశ్నించారు.

త్రిపురనేనివారు 'భారతిదాసన్'లాగే 'దేవమానవ సంవాదం' భూమికగా ధూర్తమానవ శతకం వ్రాశారు. సర్వసాధారణంగా అన్ని శతకాలలోను మానవులకు జరుగుతున్న అన్యాయాలనూ, అధర్మాలను తమ ఇష్టదైవానికి నివేదించుకోవడం వస్తువయితే మానవుడే మకుటధారియైన ప్రపంచంలో భగవంతుడే కవిరాజుగారికి కలలో కనిపించి తనపేరిట భూసురవర్గం సమాజంలోని ఇతర వర్గాలకు చేస్తున్న అన్యాయాలను విన్నవించుకుంటాడు. చివరకు ఇప్పటివరకూ చేసినవేవో చేశావు. వాటిని క్షమిస్తున్నాను. ఇకముందు ఇలాంటితప్పులు చేయకుండా లోగడచేసిన తప్పులను సరిదిద్దుకోవడానికి గట్టిగా ప్రయత్నించమని మందలించాడు.

భారతిదాసన్ బాల్యంలో కొన్ని భక్తి దైవసంబంధి గేయాలు వ్రాసినా లో మదరాసులో జరిగిన నాస్తికులసభలో 'తాను శాశ్వతమైన నాస్తికుణ్ణి' వ్రాసి చేవ్రాలుకూడా చేశాడు.

కవిరాజుగారు సూతపురాణం కాలంనాటికి ఏకేశ్వరోపాసకులు. భగవద్గీత నాటికి నాస్తికులని కొందరి అభిప్రాయం.

పౌరాణిక కథలు :

భారతిదాసన్, కవిరాజు ఇద్దరుకూడా పరంపరగావస్తున్న పౌరాణిక కథాంశాలను వినూత్నపంథాలో పరిశీలించారు. భారత భాగవత రామాయణాలలోని కథాంశాలను ఆర్యద్రావిడ సంగ్రామంగా భావించారు. భారతిదాసన్ సంజీవి పర్వతత్తిన్ సారత్తిల్‌లో క్రొత్తసిద్ధాంతం ప్రకటించారు.

ఈలాగే త్రిపురనేనివారు కురుక్షేత్రసంగ్రామం, శంబూకవధ, ఖూనీ, సూతపురాణం, భగవద్గీత మొదలయినవి వ్రాశారు.

కౌరవులకన్నా పాండవులు నీతివంతులని, పాండవులకు రాజ్యాధికారం లేదనిచెప్పడం కురుక్షేత్రసంగ్రామ నాటక కథాంశం. శ్రీరాముడు ఆర్యుడని, శంబూకుడు అనార్యుడని ఆకారణంగా ఆర్యుడయిన రాముడు అనార్యుడయిన శంబూకుని వధించాననడం శంబూక కథాంశం. వేనుడు నాస్తికుడయినా మానవత్వానికి ప్రతీకగా నిలిచినాడని, ఋషులు వర్ణాశ్రమధర్మాల్ని పరిరక్షించమంటే సర్వప్రాణులు సమానమనడంతో ఆర్యఋషుల కుట్రలవల్ల వేనుడు బలికావడం 'ఖూనీ'లోని కథాంశం. అష్టాదశపురాణాలు వ్రాసిన సూతుడు రామస్వామి కలలో కనబడి పురాణాలన్నిటిని తనకు అంటగట్టారని, అవన్నీ బూతుల బుంగలంటూ, సత్యాన్ని వెలికిదీసి సూతపురాణం వ్రాయమని ఆదేశిస్తే ఈ గ్రంథం వ్రాశారు. పెరియార్ పెంచి పోషించిన "ద్రావిడ వాదం" చౌదరిగారిలో కనిపించడం విశేషం.

అభ్యుదయ వాదాలు :

1935 నాటికి భారతదేశంలోని మేధావులు, రచయితలు మార్క్సిస్టు దృక్పథాలవైపు ఆకర్షితులయ్యారు. అయినా అప్పట్లో స్వాతంత్ర్య సంపాదన ప్రధానంకావడంతో రచయిత లెక్కువమంది కర్షక కార్మిక శ్రామికవర్గ అభ్యున్నతి వైపు కేంద్రీకరించలేకపోయారు. అయితే ఆ తరువాతనే వృత్తులపట్ల, కర్షక కార్మిక శ్రామికుల ఔన్నత్యంపట్ల సానుభూతి ప్రకటించిన రచనలు ఎక్కువగా

వచ్చాయి. భారతిదాసన్ 1964 దాకా జీవించినవాడు కావడంవల్ల కవిరాజు 16-1-1943లో పరమపదించడం కారణంవల్ల ఆ కవిని శ్రీశ్రీతో పోల్చడం సబబు.

భారతిదాసన్ ఊసరక్షేత్రాన్ని సస్యశ్యామలంచేసి గాదెల నింపేవారి కండ బలిమిని, రాళ్ళనుకొట్టి కొండలనుచీల్చి ఎన్నో ఆయుధాలను తయారుచేసేవారి హస్తనైపుణ్యాన్ని, నిశ్వాసం బంధించి సముద్రంలో మునిగి ముత్యాలుతెచ్చేవారి ఉచ్ఛ్వాసాన్ని ఘనంగా కీర్తించాడు. అలాగే అనేక వృత్తులవారిని అవులు మేపే వారిని, మగ్గం నేసేవారిని, గొడ్డలిపట్టినవారిని, చివరకు బుట్టలల్లేవారిని, సున్నం పూసేవారినికూడా వర్ణించాడు. అయితే అతని రచనల్లో వస్తుచిత్రణకంటే కూడా వారి మనోభావాల చిత్రణ ఎక్కువగా కనిపిస్తుంది. ఉదాహరణకు

ఓ ఫ్యాక్టరీ సైరనా
ఇంకా ఎందుకు ఊరకున్నావు
ఐదు గంటలు కావచ్చింది

— ఆలైత్తొళిళాళి (కర్మాగారం కార్మికుడు)

ఎండను కాస్త
నెమ్మదిగా రమ్మనండి

—కోడాలిక్కారన్ (గొడ్డలివాడు)

అయితే శ్రీ శ్రీ 'కవిత'కు ప్రాధాన్యం ఇవ్వలేదు. కవితాత్మ మంచిదిగాని సమస్యను పక్కదారికి పట్టిస్తుంది. అంచేత

కమ్మరి కొలిమి కుమ్మరి చక్రం
జాలరి పగ్గం సాలెల మగ్గం
శరీర కష్టం స్ఫురింపచేసే
గొడ్డలి రంపం కొడవలి నాగలి
సహస్ర వృత్తులు అన్నాడు

శ్రీ శ్రీకి రష్యాపై రష్యాప్రజల అభ్యున్నతిపై ఎంతో ఆదరణ వున్నట్లే భారతిదాసన్‌కు రష్యా జీవితంపై అవగాహన వుంది. "ఉరుసియావిలుం ఇందియా విలుం" (రష్యాలోనూ ఇందియాలోను) అనే కవితలో

కంతులు కోయను కొడవలియంట రష్యాలో
మెడలు త్రుంచను కొడవలియంట హిందూదేశంలో

పాలనచేసే కార్మికుని సుత్తి
అక్కడ ఇనుపముద్దను చిదుముతుంది
ఇక్కడేమో పొద్దుగాటి సుత్తి
ఇనుపపెట్టెను పగలగొడుతుంది
అక్కడేమో అంతా అందరిది
ఇక్కడేమో పేదకార్మికునికి
సగం సగం

భారతదాసన్‌కు 'రాజకీయ పరిభాష'ల గురించి 1947 నాటికే తగినంత పరిజ్ఞానంవుంది. 'అరసియల్ వగై యిన్ అయల్మొళి పెయర్గళ్' (రాజకీయాలలో ఇతర భాషాపదజాలం) అనే కవితలో సోషలిసం, కాపిటలిసం, కమ్యూనిజం, ఫాసిజం, నాసిజం, న్యూటిలిసం అనేవాటిని చాల సులభంగా రమ్యంగా చెప్పాడు.

పాడి పశువులు రెండుంటే
పక్కింటివారి కొక్కటివ్వడం సోషలిజం

పాడి పశువులు రెంటిలో
ఒకదాన్ని అమ్మి
గూళి ఎద్దును కొనడం కాపిటలిసం

ఆ రెంటిని ప్రభుత్వాధికారులకిచ్చి
అవసరానికిమాత్రం 'పాలు' పుచ్చుకోవడం కమ్యూనిజం

పెట్టుబడిదారీవిధానం ప్రపంచాన్ని ఏలా పీడిస్తుందో బాధితులు ఆలోచించ వలసిన విధానమెట్టిదో రమ్యంగా చెప్పాడు భారతిదాసన్.

ఊరిలోగాని దేశంలోగాని ప్రపంచంలోగాని
లెక్కపెడితే శ్రామికులు సముద్రమంత
పెట్టుబడిదారులు నీటిమీద తెప్పలాంటివారు
—తళై ఆరు

పెట్టుబడిదారీవిధానం నశించాలని సోషలిజం ఆచరణకురావాలనే ఉద్దేశ్యంతో భారతిదాసన్ 'పుదియ ఉలగు సెయ్యోమ్' (కొత్తప్రపంచం సృష్టిద్దాం) అనే కవిత వ్రాశారు. అది యించుమించు శ్రీశ్రీ మరోప్రపంచంలాంటిదే.

సరికొత్తలోకం సృష్టిద్దాం
హీనలోకాన్ని వేళ్ళతో పెకలిద్దాం
ఎవరెన్ని చెప్పినా సోషలిజాన్ని
ఎనిమిది దిక్కుల చాటిచెబుదాం

ఘర్మజలానికి ధర్మజలానికి
ఖరీదు కట్టే షరాబు లేడోయ్ అని అంటే

భారతిదాసన్ : వియర్వై కడలిన్‌కాట్చి (చెమట కడలిదృశ్యం)
శరీరాన్ని పిండి స్రవింపజేసిన
ప్రతి చెమట బిందువులోను
ఈ ప్రపంచమంతా వారిదేనని గ్రహించాను

దోపిడీకి గురిఅయిన సమాజం తిరగబడవలసిన అవసరంగురించి శ్రీశ్రీ 'పదండి ముందుకు పదండి త్రోసుకు' అనే గేయంలో హెచ్చరించినట్లే భారతిదాసన్

పరుగెత్తి పారిపోయే పేదలు
హఠాత్తుగా
తన్నేవారయితే
పరుగెత్తేవారు
పైనుండి కర్రపెత్తనం చేసేవారు
సమానులయి పోతారు

అలాగే సాయన్‌ద తరాను (వ్రాలిన త్రాసు) కవితలో

కొందరుమాత్రం బతుకుతుంటే
అనేకులు శ్రమించే తీరాలంటే
అలాంటి లోకం నశించిపోయినా బాగు

శ్రీశ్రీ చెప్పనిది భారతదాసన్ వ్యక్తంచేసిన భావం గమనించతగ్గది. ఇందు లోనే మరోచిత్రం—

దొరతనంకూడా దొడ్డవారికి సాయంచేస్తుంది
శ్రామికులపై కత్తులు నూరుతుంది.

ఇంతేకాకుండా శ్రామికజనం పెట్టుబడిదారులను గద్దించి అతగడంకూడా భారతిదాసన్‌లో కనిపిస్తుంది. తొళిలాలర్ విన్నప్పం (కార్మికుల విన్నపం)లో

మా శరీరంలో రక్తం ఉడుకెత్తకమునుపే సామాజిక
దృష్టితో మీ ఆస్తిపాస్తుల్ని మాపరం చేయండి

శ్రామికులు, మేస్త్రీలు, రాళ్ళుకొట్టేవారు, ఓడపనివారు, కమ్మరులు, కుమ్మరులు, గొడుగులు తయారుచేయువారు, అశుద్ధాన్ని మోసేవారు, కవితలో విన్నపం చేయడం విశేషం.

ఏమయినా శ్రీ శ్రీ కవిత్వంలోని వేగం, 'పాట్టి' అనుబంధం, రచనలోని శబ్దశక్తి భారతిదాసన్‌లో కనిపించవు.

భారతిదాసన్ ప్రత్యేకతలు :

భారతిదాసన్ ఒక ప్రచారకవి. పైగా పత్రికలు నడిపినవాడు. సినీ రంగంతో పరిచయమున్నవాడు. రాజకీయ నాయకులతో అనుబంధమున్నవాడు. అతని కవితలలో ప్రకృతి, తమిళస్తుతి, ప్రేమ, దేశభక్తి, పిల్లల పాటలు కనిపిస్తాయి. వీటిలో ప్రకృతి, ప్రేమ పాటలలో సుందరమయిన భావసంపద మనల్ని ఆకర్షిస్తుంది.

"పూర్ణచంద్రుడు సుందరుడయిన చంద్రుడు
ఆకాశంలో పైపైకి ఎగబాకుతున్నాడు.
బొదిగిన పాతదనంలో కొత్త ఆలోచన పొడమినట్లు"

అంచుమించు గురజాడ "పాత కొత్తల మేలు కలయికను" స్పష్టం చేస్తుంది.

"అస్తమానం చీకటిచేత శుష్కించిన లోకం చూశాను
అదే మోస్తరు ఆకాశం చూశాను దిక్కుల్ని చూశాను
ఆ వెనుక నల్ల చీకటి నవ్విందేమో
పగలబడి నవ్విన కాంతిముత్యమా వెన్నెలా
జారకుండ కారకుండ సౌందర్యమంతా చేర్చి
చల్లచేసి కాంతినిచ్చి ప్రకృతికాంత గగనంలో
చిత్రించిన చిత్రవర్ణమా"

అని వెన్నెలను చంద్రుని వర్ణించడం.

భారతిదాసన్‌లో పరస్పర విరుద్ధ భావాలున్నప్పటికిని ఆ కవి 'విశ్వైక్య భావం' నుండి దారి తప్పలేదు. ఉలగమున్నేట్రం (విశ్వోన్నతి) కవితలో

విశ్వమా సర్వోన్నతిని పొందు
ఉన్నవాళ్ళకంతా నీవే తల్లివి
కయ్యాలెందుకు కొట్లాటలెందుకు
వైమనస్యాలెందుకు' అని ప్రశ్నించాడు.

ఈలాగే మరికొన్ని భావాలు:

"తనకొడుకు తన ఇల్లాలు తన ఇల్లు
తన సంపాదన సర్వస్వం తనకంటూ ప్రలాపించేవాడు
చిన్నదయిన 'ఆవగింజ' లాంటివాడు"
"నిర్మల హృదయం, ప్రేమ హృదయం, విశాల హృదయం
ప్రపంచ వాసులంతా ఒక్కరే అనే భావనలోనే ఆనందం"

"సజ్జనులున్న దేశాన్ని బలవంతులు హీనంగా చూసే మాలిన్యభావం భూలోకంపై పడే ఉరుములాంటిది" పేరిగై (భేరి)

'సుతవ్యామోహమ్మది నైజమేరికిని' అన్నాడొక మహాకవి కన్న మమకారం ఏ పనికయినా సిద్ధపడుతుంది. రాముని మీది మమకారం దశరథుణ్ణి, దుర్యోధనుని మీది మమకారం ధృతరాష్ట్రుణ్ణి ముప్పుతిప్పలు పెట్టింది. చివరకు విధ్యుక్తధర్మంలో అడుగడుగునా అడ్డు వచ్చి అధర్మానికి 'సై' అంది.

తల్లిదండ్రులు లేకపోతే పిల్లలు పడే కష్టం మనకందరికి తెలిసిందే. పాండురాజు మరణించాడు. పాండవుల్ని పట్టించుకున్న వారు లేరు. చివరకు ఋషులు వారిని కౌరవసభకు చేర్చారు. తల్లీ తండ్రీ తెలియని కర్ణుడు పడ్డ ఇబ్బందులెన్నో.

'వెట్టి చాకిరి' ఈనాడు సర్వత్రా గ్రహిస్తున్న అంశం. ఆలనాడు వినత, గరుత్మంతుడు కద్రువకు వారి సంతానానికి 'వెట్టిచాకిరి' చేసినవారే. గరుత్మంతుడు బలవంతుడయినా బలహీనులు, అసమర్థులయిన నాగులకు 'ఊడిగం' చేయవలసి వచ్చింది. చివరకు అమృతభాండం తెచ్చియిచ్చినట్టు నటించి ఋణవిముక్తుడయ్యాడు.

ఇంక విద్య, వైద్యం గురించి కొన్ని సామ్యాలు చూద్దాం. ఒక 'కుండలో' గర్భాన్ని వుంచి కాపాడడం, పిల్లలు పుట్టడం భారతంలో కనిపించే అంశం. ఇది యించుమించు 'టెస్ట్ ట్యూబ్ బేబీ'లను తలపించే అంశం. విపరీతమయిన లైంగిక సంపర్కంవల్ల ఆరోగ్యం దిగజారుతుందని, ఎయిడ్స్ లాంటి వ్యాధులు వస్తాయని నేటి నిర్ధారణ. విచిత్ర వీర్యుడు అల్పాయుష్కుడు కావడం, పాండురాజు పాండురోగ పీడితుడు కావడం, అతిరిక్త శృంగార కార్యకలాపాల వల్లనే అనడం తప్పుకాదు.

ఒక ప్రభుత్వ ఉద్యోగి ఆ ప్రభుత్వానికి విధేయుడుగా వుండడం విధ్యుక్త ధర్మం. అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే 'కాండక్ట్ కోడ్' ప్రకారం శిక్షార్హుడు. కురుపాండవ కుమారులకు విద్యాబోధన చేయడాని కోసం 'ద్రోణుడు' నియుక్తుడయ్యాను. కులద్వేషంతో కాకుండా 'ఏకలవ్యుని' విధ్యుక్త ధర్మం కారణంగా శిష్యునిగా అంగీకరించలేదు. అర్జునునికి అన్ని రహస్యాలు చెప్పాడు. తన

ఏది ఏమయినప్పటికిని 'భారతిదాసన్' ఒక మహాకవి. ఒక భాషాభిమాని. హేతువాది. ఈ శతాబ్దంలో మరచిపోలేని మహావ్యక్తి. కనుకనే తమిళనాడు అతనిపేర విశ్వవిద్యాలయమే నెలకొల్పింది. ఈ సందర్భంలో త్రిపురనేని సుబ్బారావుగారి మాటలు అవశ్యం స్మరింపతగ్గవి.

"ప్రతి తరమూ తనకు కావలసిన నాయకుణ్ణి తనే సృష్టించుకుంటుంది. సమకాలీన సామాజిక వాతావరణంతో రాజీపడలేని ఏ విప్లవ హృదయమో విజృంభించి, తిరగబడి, సంఘంలో పరిమాణాలు తెచ్చి కొత్తమార్గాలు చూపు తుంది. తనలోని కుళ్ళును తనే భరించలేని సమాజం - తనలోనుండి ఒక నాయ నాయకుణ్ణి ఎన్నిక చేసుకుని అతనిచేత క్షాళితం చేయబడుతూ ఉంటుంది. అలాంటి మహాపురుషుడే భారతిదాసన్."

## ఉపకరించిన రచనలు

తెలుగు :

1. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు - ప్రయోగములు - —డా॥ సి. నారాయణరెడ్డి
2. కవిరాజు జీవితం - సాహిత్య —త్రిపురనేని సుబ్బారావు
3. త్రిపురనేని రామస్వామి చౌదరి నూతన పురాణము - ఒక పరిశీలన - —మొవ్వ లలితకుమారి
4. తెలుగులో జాతీయోద్యమ కవిత్వము —డా॥ మద్దూరి సుబ్బారెడ్డి

తమిళం :

1. తమిళ్ ఇలక్కియ వరలారు —డా॥ సి. బాలసుబ్రమణియన్
2. నాళ్ మలర్గళ్
3. భారతిదాసన్ ఇశైయముదు
4. ముల్లైక్కాడు

(భారతిదాసన్ శత జయంతి ఉత్సవాలలో తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో జరిగిన కార్యక్రమంలో చదివిన వ్యాసం).

# తాళ్ళపాక అన్నమయ్య - ఇతర వాగ్గేయకారులు

సాధారణంగా భాషలలోని సాహిత్యం రెండు రకాలు. మొదటిది శిష్ట సాహిత్యం. రెండవది జానపద సాహిత్యం. ఈ రెంటికి వారధి లాంటిది పద కవిత. జానపద సాహిత్యం పదకవితకు పుట్టిల్లు. శిష్ట సాహిత్యం మెట్టిల్లు. ఆంధ్ర వాఙ్మయంలో విస్తారమయిన పదకవిత వుంది. అయితే సేకరించినవి తక్కువ. ముద్రణాభాగ్యమందున్నవి మరీ తక్కువ. ఇప్పటికి బిచ్చగాళ్ళనోట కొంత కొనవూపిరి పోసుకుంటూ వుంది.

తాళ్ళపాక అన్నమయ్య పదకవితా పితామహుడు. అన్నమయ్య సంకీర్తనలు చాలవరకు రాగిరేకుల్లో దాగివుండటం, త్యాగరాజస్వామి శిష్యపరంపరలాగా అన్నమయ్యకు లేకపోవడం, ఇతర వాగ్గేయకారుల రచనలకున్నంత ప్రచారం లేకపోవడంవల్ల అన్నమయ్య సంకీర్తనలకు వ్యాప్తి లేకపోయింది. సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, వేటూరి ప్రభాకర శాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మల అవిరామ కృషితో, సంగీతజ్ఞులనేకుల దృష్టి పడటంతో అన్నమయ్య కీర్తనలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ కారణంవల్ల అన్నమయ్య ఎంతటి విశిష్టుడో, ఇతర వాగ్గేయకారులకు ఏ మాత్రం తీసిపోడో సాహిత్య సంగీత మర్మజ్ఞులకు తెలియ డానికి వీలయింది. ఈ ప్రయత్నంలో ఒక భాగమే అన్నమయ్యను తమిళ కన్నడ ఆంధ్ర వాగ్గేయకారులతో సరిపోల్చడం - ఇదే నా ప్రసంగ ధ్యేయం.

**అన్నమయ్య - సంస్కృత వాగ్గేయకారులు :**

సంస్కృత వాగ్గేయకారులకు తలమానికం లాంటివాడు జయదేవుడు, అతని కృతి గీతగోవిందం, రాధాగోవిందుల ప్రణయ, విరహ, విశ్లేష, కలహ, ఖండన, సానునయ, సంవిధానాల ద్వారా జీవబ్రహ్మైక్య సంధాన వేదాంతం వ్యంజితమవుతుందని పెద్దలంటారు. భారతదేశమంతట వ్యాపించిన ఈ భక్తి వాహినికి గంగోత్రి లాంటిది గీత గోవిందం.

అన్నమయ్య సంకీర్తనల్లో రాధామాధవ కీర్తనలెన్నో వున్నాయి.

'అతి శోభితేయం రాధా
సతత విలాసవశా రాధా' 4-48

రాధా మాధవ రచన సకలజన
సాధు వేదమే జగమున కలిగె 11-2-70

రాధా మాధవ రతి చకితమితి
బోధావహం శ్రుతి భూషణం 3.664

గీత గోవిందంలో వున్నట్టే విరహ, విశ్లేష, కలహాలు అన్నమయ్య సంస్కృత సంకీర్తనల్లో కనిపిస్తాయి.

జానామ్యహం తే సరస లీలాం
నానావిధ కపట నాటక సఖత్వం
ప్రలపన వచనైః ఫలమిహ కిం
చలచల కుడ్య క్షాళనయా కిం.

జయదేవుని తరువాత చెప్పుకోదగినవాడు లీలాశుకుడు. ప్రణయ శృంగారంలో అవస్థా భేదాలను ప్రదర్శించి జయదేవుడు మానవ మనస్తత్వానుగుణమైన రూపక నిర్మాణం చేస్తే లీలాశుకుడు రాధాకృష్ణుల ప్రణయానికే గాక సామాన్య జీవుల ఆరాటాన్ని జతచేసి వ్రాశాడు. వాగ్గేయకార ప్రపంచంలో శ్రీరామ, బాలకృష్ణ సంకీర్తనలు విస్తరించడానికి లీలాశుకుడు మార్గదర్శి. బిల్వమంగళుని

"యంశైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌద్ధాబుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైన శాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయం నో విదధాతు వాంఛితఫలం శ్రీదేవకీనందనః"

శ్లోకం అనుసరించి అన్నమయ్య

"ఎంతమాత్రమున నెవ్వరుదలచిన అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచిచూడ పిండంతె నిప్పటి యన్నట్లు
కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మమనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవుడనుచు
సరి నెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
శ్రీ వేంకటపతి నీవైతే చేకొనిఉన్న దైవమని
ఈవలనే నీ శరణనియెద" అని కల్పించాడు.

సంస్కృతంలో సంకీర్తనలు వ్రాసినవారిలో శివనారాయణతీర్థులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఉపనిషత్ బ్రహ్మయోగి, శ్యామాశాస్త్రి, ముత్తుస్వామిదీక్షితర్ మొదలయినవారు ప్రముఖులు. దీక్షితర్ ప్రతి కృతిని 'మంత్రంగా' భావించడం ఆస్తికుల విశ్వాసం. అన్నమయ్య సంకీర్తనలుకూడా అలాంటివే. అంచేతనే మనుమడు.

"నందవర కులాగ్రణి యైన వైష్ణవోత్తముడు
సవరించు మురవైరి సంకీర్తనములు
కువలయంబున పేరుకొన్నమాత్రమున
తలచిన భూత బేతాళ పిశాచ
ములు పారిపోవ నిమ్మల శుభంబెసగ
విని కనియును లోన వెరగందికొనుచు

అని తన ప్రత్యక్ష అనుభవాలను జతచేశాడు.

అన్నమయ్య సంస్కృత సంకీర్తనలుకూడా వ్రాయడంతో తరువాతి వాగ్గేయ కారులందరు తెలుగు సంకీర్తనములతోబాటు సంస్కృత కీర్తనలుకూడా వ్రాశారు,

వాటిలో నారాయణతీర్థుల తరంగాలు, గోపన్న కలయే గోపాలం, దీనదయాళ్ కీర్తనలు, సుబ్రహ్మణ్యకవి భజేహం భవాని, నమశ్శివాయ తే నమో భవాయ, ఉపనిషత్ బ్రహ్మయోగి రామతరంగం, త్యాగరాజస్వామి సామజవరగమన, మానససంచరరే, శ్యామశాస్త్రి పాహి శ్రీ గిరిజాసుతే, శంకరీశంకురు మొదలయినవి లెక్కకులేనన్నివి వ్రాశారు.

ఒక మహానదిలో అనేక ఉపనదులు కలిసినట్టుగా ఎందరో వాగ్గేయకారుల ధర్మాలు అన్నమయ్యలో కనిపిస్తాయి. వైరుధ్యాలున్నా సమానత్వం నిలుపుకున్న వాడు. ప్రౌఢంగాను సరళంగాను చెప్పగలిగిన వాగ్గేయకారుడు అన్నమయ్య. వాగ్గేయకారులలో ఉత్తమ కవితాంశకలవాడు అన్నమయ్య. అతని భావుకత అనంతం.

తాళ్ళపాక అన్నమయ్య - ఆళ్వారులు :

తాళ్ళపాక అన్నమయ్య నందవరీకుడు. స్మార్తుడు. ఘనవిష్ణువు పంచ సంస్కారాలు చేయడంతో తిరుమలలో వైష్ణవుడయ్యాడు. ఆపై అహోబిలంలో ఆదివన్ శఠగోపయతీంద్రుల దగ్గర ఉభయవేదాంతం నేర్చుకున్నాడు. అన్నమయ్యకు విశిష్టాద్వైత మతప్రవక్తలయిన రామానుజులన్నా, ఆళ్వారులన్నా చాలా గౌరవం. అన్నమయ్య తిరుమలకు వెళ్ళే మార్గంలోని త్రోవ భాష్యకారులను

ఈతని కరుణనేకా యిల వైష్ణవుల మైతి
మీతని వల్లనే కంటి మీ తిరుమణి
యీతడే కా వుపదేశ మిచ్చె నష్టాక్షర మంత్ర
మీతడే రామానుజులు యిహపర దైవము

అన్నమాచార్య చరిత్ర పీఠిక. పుట-17

అని కీర్తించారు. అలాగే

కారి మార సుతుని చక్కని మాటలకు జొక్కి
చూరగా వేదాల గుట్టు చూచినవాడు
తీరని వేడుకతో తిరుమంగయాళువారి

అరడి ముచ్చిమి గూటి కానపడ్డ వాడు
పెరియాళువారి బిడ్డ పిసికి పై వేసిన
విరుల దండల మెడ వేసినవాడు 11-2-55

అని తిరుమంగైయాళ్వారును, పెరియాళ్వారును ఘనంగా కీర్తించాడు.

వైష్ణవభక్తి సాహిత్యమునకు విశిష్ట ప్రచారం చేసినవారు ఆళ్వారులు. వారు పన్నిద్దరు. వారందరు శ్రీమన్నారాయణుని దివ్యాంశాలతో జన్మించినవారే. అన్నమయ్య స్వామి నందకాంశంతో జన్మించాడని విశ్వాసం. పేయాళ్వార్ కూడా అలాంటి అంశతో జన్మించినవాడు తిరుమళిశై ఆళ్వార్ రాజాజ్ఞను ధిక్కరించినట్లే అన్నమయ్య సాళువ నరసింహరాయల ఆజ్ఞను తూలనాడాడు. తిరుప్పులియూర్‌లో తిరుమళిశై ఆళ్వార్ మహిమలను ప్రదర్శించినట్లే అన్నమయ్య కూడా కొన్ని మహిమలు చూపాడు. తొండరడిప్పొడియాళ్వార్ 'తిరుప్పళ్ళి ఎళుచ్చి' పాడినట్లే అన్నమయ్య వేంకటేశ్వరునికి మేలుకొలుపులు పాడాడు. కులశేఖరాళ్వార్ రాముని అభిమానించినట్లే అన్నమయ్య శ్రీరామనామ సంకీర్తనలెన్నో వ్రాశాడు. తిరుమంగైయాళ్వార్ అనేక క్షేత్రాలను దర్శించినట్లే అన్నమయ్య కర్ణాటాంధ్ర ప్రాంతాలలోని దేవాలయాలను దర్శించి దివ్యదేశాల సంఖ్యను పెంచాడు. తిరుప్పాణాళ్వార్ వీణ మీటుతూ భగవద్గుణగానం చేసినట్టే అన్నమయ్య దండె మీటుతూ భక్తిని ప్రదర్శించాడు. ఆళ్వారులలో అన్నమయ్యకు చాల సన్నిహితంగా కనిపించేవారు పెరియాళ్వార్ నమ్మాళ్వార్లు కులశేఖరాళ్వారులు.

నమ్మాళ్వారు వైశాఖ మాసంలో విశాఖ నక్షత్రంలో జన్మించాడు. అన్నమయ్య కూడా అంతే. ఇద్దరికి 16వ ఏట విష్ణు సాక్షాత్కారం కలిగింది. ఆళ్వారులలో అత్యధిక సంఖ్యలో పాశురాలు పాడిన ఘనత నమ్మాళ్వారుకున్నట్టే ఆంధ్ర వాగ్గేయకారులలో అన్నమయ్య అత్యధిక సంకీర్తనలు పాడినవారిలో మొదటివాడు. అన్నమయ్య వేంకటేశ్వర సాక్షాత్కారానంతరం సంకీర్తన యజ్ఞం మొదలెట్టినట్లే నమ్మాళ్వారు పాశురాలు పాడడం ప్రారంభించాడు.

తులసీవనంలో జన్మించిన గోదాదేవిని శ్రీరంగనాథునికర్పించి పెరియాళ్వార్ మామగారయినట్లే పద్మసరోవరంలో పొడమిన అలమేలు మంగాంబికను వేంకటేశ్వర స్వామికిచ్చి పెండ్లిచేసి మాయమయ్యాడు.

మధురకవి ఆళ్వార్ తన గురువైన నమ్మాళ్వారును 'కణ్ణినుమ్ సిరుత్తాంబు' అని కీర్తించినట్లే అన్నమయ్య 'చూడు డిందరికి సులభుడు' (2-117) అని తన గురుభక్తిని ప్రకటించుకున్నాడు.

ఆళ్వారులందరు ఒక కాలానికి సంబంధించినవారు కారు. ఒకే మనస్తత్వం కలవారు కారు. ఒక్కొక్క విషయాన్ని భిన్నరీతులలో భావించినవారు. అన్నమయ్య వారిని అనుకరించినపుడు గాని అనుసరించినపుడు గాని ఒకరినే ధ్యేయంగా, మాతృకగా భావించలేదు. అందరిని అనుకరిస్తూ తన ప్రత్యేకతను నిలబెట్టుకున్న వాడు. వాటిలో కొన్నిటిని పరిశీలిద్దాం.

**తిరుమల ప్రశంస :**

వైష్ణవులకు ఆరాధ్యమయిన క్షేత్రం తిరుపతి. తొండరడిప్పొడియాళ్వార్, మధురకవి ఆళ్వార్ తప్ప ఇతరులందరు తిరుమలేశుని, తిరుమలను పొగడినవారే. వారి పాశురాలలోని ఈ భావాలకన్నిటికి తలమానికంగా అన్నమయ్య,

> కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
> తెట్టలాయ మహిమలే తిరుమల కొండ
> వేదములె శిలలై వెలసినది కొండ
> యేదెస పుణ్యరాసులే యేరులైనది కొండ 9-182

అని వర్ణించాడు.

**అన్యస్తుతి విముఖత :**

పూదత్తాళ్వార్, పేయాళ్వార్, మధురకవి ఆళ్వార్ మినహా ఇతరులందరు అన్యస్తుతిపట్ల వైముఖ్యం ప్రదర్శించినవారే. పొయ్గై ఆళ్వార్ 'వాయవనై యల్లదు' అనే పాశురంలో నా నోరు వెన్నునితప్ప అన్యులను కీర్తించదు. వసుధ కొలిచినవానికితప్ప ఇతరులకు వందనం చేయవు అని వర్ణించాడు. తిరుమళిశై ఆళ్వార్ 'నాక్కొండు మానిడం పాడేన్' - ఈ నాలుకతో మానవులను పాడను అని నిష్కర్షగా చెప్పాడు. తొండరడిప్పొడి ఆళ్వార్ 'సేవియేన్ ఉన్నై యల్లాల్' అనే వాక్యంతో నిన్నుతప్ప ససేమిరా ఇతరుల్ని సేవించను అన్నాడు. కులశేఖ

రాళ్వార్ 'హే గోపాలక హే కృపాజలనిధే' శ్లోకంలో 'హే గోపీజననాథ పాలయ పరం జానామి నత్వాం వినా' అని చెప్పాడు. తిరుమంగై ఆళ్వార్ 'వేంకటమామలై మేయ అయనడి యల్లదు మత్రరియేన్' వేంకటాద్రిలో వాసంచేసే యాదవుని పాదములుతప్ప వేరేమీ ఎరగను అన్నాడు. ఇక నమ్మాళ్వార్ తిరువాయ్మొళిలో వాయ్కొండు కీర్తనలో స్వామిని కొనియాడిన నోటితో ఇతరుల్ని పాడనని చెప్పాడు. అన్నమయ్యలో నరస్తుతి పై ముఖ్యానికి సంబంధించిన వాక్యాలెన్నో కనిపిస్తాయి.

నరహరి కీర్తన నానిన జిహ్వ
పరుల నుతింపగ నోపదు జిహ్వ —అన్నమాచార్య చరిత్ర

పసురమై వెతలేని పాటుపడవచ్చుగాక
కపివో నొరుల పొగడగా వచ్చునా 5-223

తలరాయిగాగ నెందరికి మొక్కెడిని
తెలివిమాలిన యట్టిదేహి 1-201

వాత్సల్యభక్తి :

దేవకీ కౌసల్యలు పరమాత్మ స్వరూపులయిన తమ బిడ్డలపై చూపిన అనురాగవిశేషమే వాత్సల్యాసక్తి. పెరియాళ్వార్ సంకీర్తనలలో ఈలాంటివి ఎక్కువ. శిశుచేతలకు మురిసిపోతూ, ఆటలకు తబ్బిబ్బు అవుతూ, మారాములకు విసిగిపోతూ వ్రాసిన పాశురాలెన్నో. అన్నమయ్య వాత్సల్య సంకీర్తనల్లో కొన్నిట అన్నమయ్య యశోదగా కనిపిస్తాడు. కొన్నిట పెరియాళ్వార్గా కనిపిస్తాడు.

సారెకు నంటకురే జడనందురు
ధీరుడాత డున్నతపు దేహియట
బాయట పెట్టకురే పశులుపారెడి పొద్దు
ఓయమ్మ బాలులకు వొప్పదందురు

ఆకసము చందురునిద్దె వెన్న ముద్దయుంట
ఆకడ చెయిసాచి యందంగరాక
శ్రీకాంతతోడం గూడి శ్రీ వేంకటాద్రి ఎక్కి
పైకొని పెచ్చుపెరిగి ప్రౌఢయె కృష్ణుడు
నీలపుం గంటసరులు నేరేడు పండ్లంటా
గోలయై నమలభోయి కొరుకరాక
ఖొలనవి మెత్తగాను ఖొలచియిమ్మని తల్లి
చేలకొంగు పట్టుతీసి చెప్పరాని కృష్ణుడు
నీరాటలోనం దన నీడచూచి బాలుండట
రారమ్మని పిలిచి రాకుండంగా
కారించి కడవనీరు కలంచి వెదకీ
పూరక కానకే పొంచివున్నాడు కృష్ణుడు 3-530

దాస్య భక్తి:

అనన్యమనస్కులై భగవంతునికి దాస్యం చేయడమే దాస్యభక్తి. ప్రహ్లాదుడు భాగవతంలో 'చక్రిదాస్య'మని చెప్పాడు. ఆళ్వారులలో పొయ్‌గై ఆళ్వార్, మధురకవి ఆళ్వార్ మినహా ఇతరులందరు దాస్యభక్తిని ఘనంగా కీర్తించారు. ఏళ్ పిరప్పుం ఆళాగి అంజాపెరుక్కు అరుళ్ (ఏడేడు జన్మలలోను దాసుడనై నీ పాదాలను సేవించేభాగ్యం ప్రసాదించు) అని పేయాళ్వార్ ప్రార్థిస్తే, ఎన్నరంగ నక్కడియార్గళాయ్ (నా రంగనికి దాసులై) అని కులశేఖరాళ్వార్ అంటే గర్భవాసకాలం నుండి నేను నీ దాసుడనని పెరియాళ్వారు సవినయంగా చెప్పాడు. కులశేఖరాళ్వారు 'త్వద్భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతిమాం స్మర లోకనాథ' అని ముకుందమాలలో చెప్పిన వైనాన్ని అన్నమయ్య

కందువ శ్రీ వేంకటేశ కడు నీ బంటు బంటుకు
సందడి బంట నవుటే చాలదా నాకు (8-23)

అని స్పష్టం చేశాడు.

కైవల్యమున కంటె కైంకర్యమెక్కుడు (7-249)

శ్రీ వేంకటేశు చూచినవారి శ్రీపాద
సేవకుండై వుండ చేరినం జాలు (2-352)

మధురభక్తి :

వేదాలలో యోషాజారా భావరూపంలోను, బృహదారణ్యకోపనిషత్తులో సతీపతి భావరూపంలోను మధురభక్తి చోటుచేసుకున్నట్టు పండితులు భావిస్తారు. జీవులంతా నాయికలు. దేవుడొక్కడే నాయకుడు. నాయిక నాయకుని పొందుకోసం పరితపించినట్టు జీవుడు పరమాత్ముని సాన్నిధ్యంకోసం పరితపిస్తాడు. ఈ తపనల్లో శృంగారం ప్రధానాంశం. శైవులు సంయోగశృంగారానికి వైష్ణవులు విప్రలంభ శృంగారానికి ప్రాధాన్యమిచ్చినట్లు పండితుల నిష్కర్ష. ఆళ్వారులలో కులశేఖ రాళ్వార్, తిరుమంగై ఆళ్వార్, పెరియాళ్వార్, నమ్మాళ్వార్, అండాళ్ రచనల్లో మాత్రమే మధురభక్తికి సంబంధించిన అంశాలు కనిపిస్తాయి. వీటిలో మోహం, విరహం, మన్మథపూజ, దౌత్యం, ప్రణయకోపంలాంటివి ప్రధాన అంశాలు.

కులశేఖరాళ్వార్ 'వాసుదేవా వున్ వరవు పార్తే' అనే పాశురంలో తన కోసం నాయకుడువస్తాడని ఎదురుచూస్తున్న నాయికను వర్ణించాడు. ఆ నాయికకు తెలుసు నాయకునికి తనపై మనసులేదని. నమ్మాళ్వార్ తన నాయకుని రప్పించు కోవడంకోసం చెలికత్తెను పురమాయించినట్లు 'అమరర్ పెరుమానై క్కండు' అనే పాశురంలో చెప్పాడు. ఇక అండాళ్ అయితే తన తాపాన్ని, మోహాన్ని మేఘాలతో చెప్పుకుంటుంది 'మేగంగాళ్! వేంగడత్తు తన్నాగ తిరుమంగై తంగియ సీర్ మార్వర్క్కు' అనే పాదాలలో. తాళ్ళపాక అన్నమయ్య తానే అలమేలుమంగగా, కొన్నిచోట్ల తానే సఖిగా భావించుకుని కీర్తనలెన్నో వ్రాశాడు.

ముదము చొలకెడి యట్టి మంచి వయసున మనకు
తుదలేని వేడుకలు దొరకుచున్నదురా 12-54

కడు మోహమున సిగ్గు గదియు చున్నదు లేక
యెడలేని కూటము[illegible] యెచ్చరికె లేక
విడువ కీటువలెనె తిరువేం[illegible]టేశుడు నీ[illegible]
వడి దలచి నా కడకు [illegible]చు చెన్[illegible] 1[illegible]-93

కుమారుడయిన అశ్వత్థామను కూడా పక్కకు నెట్టి పార్థునికి పరమార్థం ఉపదేశించాడు.

ఈ రోజుల్లో 'నకిలీ సర్టిఫికేట్ల' భాగవతం తరచూ వింటున్నాం. ఆదాయం విషయంలో, కులంవిషయంలో ఈ దాగుడు మూతలు కనిపిస్తాయి. ఈలాంటివారు పట్టుబడితే నిరుత్తరులవుతారు. పరశురాముడు ఒక కులం వారికి తప్ప మరొకరికి విద్యనేర్పనని చెప్పాడు. ఒకసంస్థ వ్యక్తిగతమయినప్పుడు అతణ్ణి శాసించే హక్కు లేదు. కర్ణుడు తప్పుడుకులం పేరు చెప్పి శిష్యునిగా చేరాడు. చివరకు పట్టుబడ్డాడు. అందరికీ అన్ని అవకాశాలుంటే కర్ణుని ఈలాగా చేయనవసరం లేదు.

ఈ రోజుల్లో తెలివి తేటలున్నవాడు పేదవాడుగా, అసమర్థుడుగా చెలామణి అవుతాడు. పైగా దారిద్ర్య బాధతో క్రుంగిపోతుంటాడు. మేధావుల ఆర్థిక దారిద్ర్యానికి ద్రోణుడు ప్రతీక. కన్నకొడుకు అశ్వత్థామ ఆకలిని తీర్చలేని దుర్భర జీవితం గడిపాడు. చివరకు ఆశ్రయమిచ్చిన వారికి అమ్ముడయిపోయాడు. బలహీనుల్ని ఉద్ధరించడం తప్పుకాదు కాని ఆ పేరుతో మేధాసంపత్తి వున్నవారిని అణచివేయాలనుకోవడం సామాజిక శ్రేయోమార్గం కాదు.

ఇక రాజకీయ సంబంధాలు, అసెంబ్లీలలో పార్లమెంటులలో ప్రతిపక్షాలు 'వాక్ అవుట్' చేయడం దినపత్రికల్లోచూస్తున్న విషయం. తనకు నచ్చని విషయం తీర్మానం చేసినప్పుడు, తన వాదనకు తగినంత సంఖ్యాబలం లేనప్పుడు ఆవేశంతో వూగిపోతూ నిరసన తెలియజేస్తూ బయటికి నడవడం వింటూ వుటాం. శ్రీకృష్ణునికి ఆతిథ్యం ఇవ్వడానికి ధర్మరాజు సిద్ధమయినపుడు భీష్మాదులు ధర్మరాజును ప్రోత్సహించినపుడు శిశుపాలుడు తన మందీమార్బలంతో నిష్క్రమించాడు.

రాజకీయాలలో నిరంతర శత్రువులు, నిరంతర మిత్రులు లేరు. కృష్ణుని నిందించాలనుకున్న దుర్యోధనుడు యుద్ధం తప్పదని తెలుసుకున్నాక కృష్ణుని సాహాయ్యం కోరాడు. ఎన్నికల్లాంటివి వచ్చినపుడు గ్రామం, నగరం రెండూ సమర క్షేత్రాలయినట్టు, తమ కనుకూలమయిన సర్దుబాట్లు చేసుకున్నట్లు ఆనాటి రాజులు కొందరు కౌరవపక్షం చేరారు. మరికొందరు పాండవపక్షం శ్రేయస్కరమని అనుకున్నారు.

నాయికా నాయకులు అనురాగవతులయినపుడు 'దౌత్యం' సాన్నిహిత్యాన్ని పెంచుతుంది. ఈ దౌత్యాన్ని వ్యక్తులు నడపవచ్చు లేదా అచేతన వస్తువయినా కావచ్చు. ఆళ్వారుల పాశురాలతో తిరుమంగైయాళ్వార్, నమ్మాళ్వార్ భ్రమర దౌత్యాన్ని, మనోదౌత్యాన్ని, శుకదౌత్యాన్ని చెప్పారు. అలాగే నమ్మాళ్వార్, ఆండాళ్ మేఘదౌత్యాన్ని చెప్పారు. నమ్మాళ్వార్ 'హంస దౌత్యాన్ని' కూడా చెప్పాడు. అన్నమయ్యలో చాలచోట్ల సఖీదౌత్యమే కనిపిస్తుంది. నాయిక పడుతున్న అవస్థలను వివరించి నాయకునికి ఆశపుట్టించి అతనిని రప్పించే ప్రయత్నం ఇందులోని భాగం.

నీచ్చేయవయ్యా వేగుదాకా జాగులేల
కొచ్చి చెలులము నేము కొండేలు చెప్పేమా 19-220

ఎదురుగా హంస నంపి ఇంటిలోన నున్నదిదే
కదిసి మన్నించరాదా ఘనత మీర 17-180

ఇవేగాక ఆళ్వారుల రచనలలో మిన్నగా భావింపబడే పల్లాండు, తిరుప్పళ్ళి ఎళుచ్చి మొదలయినవి అన్నమయ్యలో కూడా కనిపిస్తాయి.

పల్లాండు అనే మాటకు తమిళంలో బహు సంవత్సరాలని అభిప్రాయం. పెరియాళ్వార్ తనకు సాక్షాత్కరించిన శ్రీమన్నారాయణమూర్తిని దర్శించి ఆనంద పారవశ్యంతో అతని పాదాలకు, అవినాభూతులయిన భక్తులకు హృద్ స్థానంలోని శ్రీదేవికి చేతుల్లోని శంఖచక్రాలకు శాశ్వతరక్ష కోరడం పల్లాండు. రక్షను 'తిరుక్కాప్పు' అనడం వైష్ణవ సంప్రదాయం. శ్రీ వైష్ణవుల భగవదారాధనలో పల్లాండు కడపటి ప్రార్థనాగీతం. దీనిని 'మంగళంగా' చెప్పడం అలవాటు.

గుట్టున కోరిక లెల్ల కొల్లవట్టె నీ
పట్టపు దేవికి పల్లాండు పల్లాండె

అలరు మేడలోన అలమేలు మంగ నిదె
అలయికదీర ప్రేమ నలర జేసి
కలసి వేంకటేశ కౌగలించుకొనే విదె
పలుమారు మీకు మీకు పల్లాండు పల్లాండె 3-256

ఆళ్వార్లు నృసింహ రామకృష్ణాది మూర్తులను భక్తి ప్రపత్తులతో కీర్తించినట్లే అన్నమయ్య కీర్తించాడు. అహోబిలవాసంతో నారసింహభక్తి, మధురభక్తి కారణంగా కృష్ణభక్తి, ఆదర్శజీవితం కారణంగా శ్రీరామచంద్రుని మీద భక్తి అలవడింది. ఆళ్వారులందరి సమ్యగ్ రూపమే తాళ్ళపాక అన్నమయ్య.

**అన్నమయ్య - కన్నడ 'హరిదాస' వాగ్గేయకారులు :**

కన్నడానికి తెలుగుకూ వున్న అనుబంధం ప్రాచీనమయింది. భౌగోళికంగా రెండూ ఒకదాని కొకటి పక్కన పక్కనేవున్న భూభాగాలు. చారిత్రకంగా రెండు ప్రాంతాల్ని ఒకే రాజకుటుంబం చాలకాలం పరిపాలించింది. లిపి సామ్యం రెంటిలోనూ వుంది. అంచేతనే శ్రీనిడుదవోలు వారు ఈ భాషల్ని కవలపిల్లలుగా ఒక రెమ్మలో పూచిన రెండు పూవులుగా భావించారు. ఈ అవినాభావ సంబంధం సంకీర్తన సాహిత్యంలోనూ కనిపిస్తుంది.

కన్నడంలో విశిష్టమయిన వీరశైవయుగంలో శివశరణులు ఎన్నో గేయాత్మక రచనలు చేశారు. వాటిని వీరశైవ విద్వాంసులు 'శాస్త్ర' మని వ్యవహరించారు. ఇవి చాల వరకు వచన సంకీర్తనాలు. ఈ వచన సంకీర్తనల స్ఫూర్తితో కన్నడంలో అచలానందులు, ఆద్యులు, నరహరితీర్థులు, శ్రీపాదరాయలు సంకీర్తనలు వ్రాశారని పండితులు భావిస్తున్నారు. వీరిలో శ్రీపాదరాయలు అన్నమయ్య కంటే కొంచెము పెద్దవారు. వీరిద్దరికి సాళువ నరసింహరాయల పరిచయం వుంది. సాళువ నరసింహరాయల అభ్యున్నతికి ఇద్దరూ తోడ్పడినవారే. అన్నమయ్య ఆశీస్సులతో దండనాథుడయిన సాళువ నరసింహరాయలు చక్రవర్తి కాగలిగాడు. అలాగే శ్రీపాదరాయల ఆశీస్సులతో నరసింహరాయలు బ్రహ్మహత్యాదోషమును పోగొట్టుకొనగలిగాడు. శ్రీపాదరాయలు కోలారుజిల్లాలోని 'ముళబాగిలు' మఠాధిపతి. అన్నమయ్య శ్రీపాదరాయలిద్దరు పరస్పరం కలుసుకొన్నారో లేదో తెలియదు గాని వీరిద్దరి రచనల్లో ఎన్నో సామ్యాలు కనిపిస్తాయి.

శ్రీపాదరాయలు అన్నమయ్యలు సంకీర్తనలు వ్రాయడానికి 'నాలాయిర దివ్యప్రబంధ' పఠనం స్ఫూర్తి కలిగించి వుండవచ్చు. తమిళ పాశురాలను పాడే వారిని 'అరైయార్' అనడం అలవాటు. వారు కులోత్తుంగుని కాలం నుండి కనిపిస్తారు. దేవుని శేషవస్త్రాన్ని 'రుమాలుగా' చుట్టుకొని చేతిలో తంబూర

పట్టుకుని, కాలిలో గజ్జెలు కట్టుకుని, చిరుతలు వాడుతూ పాడడం అనాటి వైష్ణవ భక్తుల వేషం. ఈ వేషం అన్నమయ్యకు నచ్చివుండవచ్చు. దేవాలయాలలో దివ్య ప్రబంధం పారాయణం చేసేలాగున పూజావిధానాలలో కన్నడ సంకీర్తనలకు ప్రాధాన్యం కల్పించడం శ్రీపాదరాయల ఆశయం కావచ్చు.

శ్రీపాదరాయలు ద్వైతమత ప్రచారకులయితే అన్నమయ్య విశిష్టాద్వైత మత ప్రచారకుడు. మతవిషయంలో రెంటికి పెద్ద తేడాలేదు. ద్వైతులు విఠలునికి ప్రథమ నమస్కారం అర్పిస్తే విశిష్టాద్వైతులు శ్రీరంగ, కంచి, తిరుపతి దేవుళ్ళను తమఇలవేల్పుగా భావిస్తారు. అయితే హరిదాసులందరు విఠలునితోబాటు తిరుమలేశుని సేవించినవారే. అందువల్లనే కన్నడంలో దేవరందరె తిమ్మప్ప గురువందరె మంచాలెయ రాఘప్ప - దేవుడంటే శ్రీనివాసుడొకడే. గురువంటే మంత్రాలయం లోని రాఘవేంద్రుడే అని చెప్పుకుంటారు. శ్రీపాదరాయలు భూషణకె భూషణం, స్మరిసిదవరను కాయ్వ, 'హరే వేంకటశైల వల్లభ' అనే సంకీర్తనలలో వేంక టేశ్వరుని కీర్తించినట్లే అన్నమయ్య విఠలుణ్ణి కీర్తించాడు. పైగా విఠలుణ్ణి వేంకటేశ్వర అభేదంగా గుర్తించాడు. ఈ ప్రయత్నంతో విశిష్టాద్వైతం, ద్వైతం కన్నడాంధ్ర ప్రాంతాలు సన్నిహితమైనాయి. ఇదొక ప్రశాంత విప్లవంలాంటిది.

అన్న : ఎలమి శ్రీ వేంకటేశుడితడే పదారువేల
చెలులతో కూడినాడు శ్రీవిట్టలేశుడు
బల్లిదపు శ్రీ వేంకటపతివై పాండురంగాన
చల్లగా నెలకొంటివి జయవిఠ్ఠలేశ్వర 10-171

ఈ మూరితా పాండురంగ మిరవై వుండినవాడు
కామించీ మూరితి శ్రీ వేంకటగిరి నున్నవాడు 11-1-203
"పండరి నామము పరమ పావము"

పల్లవి, అనుపల్లవి, చరణం అనే సంకీర్తన పద్ధతి శ్రీపాదరాయలవారిలో స్పష్టంగా కనిపిస్తుంది. చరణాంతంలో కొన్ని పదాల ఆవృత్తి నియమం కూడా కన్నడ సంకీర్తనల్లో కనిపించే సమానాంశం. అన్నమయ్య సంకీర్తనలు రాగి రేకులలో భద్రపరచబడినట్లు శ్రీపాదరాయల సంకీర్తనలు భద్రపరచలేదు. పైగా

వారు మఠాధిపతులు కావడంవల్ల ప్రజలతో సన్నిహిత సంబంధం చాల తక్కువ. అంతేకాక తరువాతివారయిన వ్యాసరాయ, పురందరదాసాదులు గురువును మించిన శిష్యులయ్యారు.

కన్నడ హరిదాసులలో 'పురందరదాసుల' వారిది పేచీలేని పెద్ద పీటలాంటిది. వ్యాసరాయలంతటివారు 'దాసరందరె పురందరదాసరయ్యా' దాసులంటే పురందర దాసులవారే అని మనసా చెప్పినవారు. అన్నమయ్య వృద్ధాప్యసమయంలో పురందరదాసు కలుసుకొన్నాడని ఐతిహ్యం. పరస్పరం సంభావించుకున్నారని అన్నమయ్య మనుమడు అన్నమాచార్య జీవితచరిత్రలో స్పష్టం చేశాడు.

అన్నమయ్య సంకీర్తనలకు పురందరదాసు సంకీర్తనలకు చాల పోలికలు కనిపిస్తాయి. అన్నమయ్య తాను దర్శించిన ప్రతి దేవతామూర్తిలో శ్రీనివాసుని చూచినట్లే పురందరదాసు ప్రతి రూపంలోనూ విఠలుణ్ణి దర్శించగలిగాడు.

కంఢె నా నిన్న వెంకట నెంబ విఠలన

వేంకటేశ్వరుడనే విఠలుణ్ణి నేను దర్శించాను. ఈతడే 'కూసుకండెనమ్మ' అనే కీర్తనలో మహావిష్ణువు వడ్డికాసులవాడై శేషగిరిమీద నిలిచాడని, బలిని వంచించి కంచిలో నిలబడ్డాడని, గోవుల్ని కాచి జగన్నాథంలో వున్నాడని, పాలు పెరుగు కడవల్ని పగులగొట్టి ఉడిపిలో వున్నాడని వర్ణించాడు. వేంకటేశ్వరుడు కాంచన బ్రహ్మ, ఉడిపి శ్రీకృష్ణుడు అన్న బ్రహ్మ, పురందర విఠలుడు నాదబ్రహ్మ.

భగవంతుని దొంగగా, దివ్యఫలంగా ఇద్దరూ భావించారు. నామసంకీర్తనను ఔషధోపమానంతో చమత్కరించారు. వాత్సల్య సంకీర్తనలలో జానపదుల కథల్ని ఇద్దరూ పొందుపరచారు.

చందమామ పాడి తల్లి నరి పొత్తుకు రమ్మంటే
చందురు చూచి కృష్ణుడు సన్నచేసెను
ముందర చంద్రుడు వచ్చి మొక్కితే యశోద చూచి
ముందెలా యంటినో యని మరచి వెరగందెను 10-285

తల్లి ముత్యాలహారం కూరుస్తూ వుంది. కృష్ణుడు తచ్చాడుతున్నాడు. తల్లి తదేకధ్యానంలో తన్ను పట్టించుకోలేదని రెండు ముత్యాలను పట్టుకెళ్ళాడు. తల్లి గమనించలేదు. ముత్యాలు కూరుస్తుంటే తక్కువ వచ్చాయి. పనివాళ్ళని అడిగింది. చివరకు కృష్ణుని అడిగింది. కృష్ణుడు తల్లి చేయిపట్టుకుని పెరటికేసి నడిచాడు. అక్కడ ఒక చెట్టు మొలిచివుంది. చెట్టంతా ముత్యాలట. ఈ భావంగల

'ఏను హేళలె నాను కృష్ణనమహిమెు' కీర్తన కన్నడదేశంలో చాలా ప్రసిద్ధ మయిన కీర్తన. మరికొన్ని సామ్యాలు

| | | |
|---|---|---|
| అన్న : | ఊరక దొరకునా వున్నతోన్నత సుఖము | 6-104 |
| పురం : | సుమ్మనే బరువుదే ముక్తి | కీ. 79 |
| అన్న : | నూతులు త్రవ్వగ భేతాళములు పుట్టె | 6-8 |
| పురం : | తోడలు బావి భేతాళ హొరటితు | కీ. 191 |

సంకీర్తనల్లో సంస్కృతవాక్యాలను పొందుపరచే పద్ధతి అన్నమయ్యదే

| | | |
|---|---|---|
| అన్న : | దండన బుద్ధులు 'ద్వాసుపర్ణ' వున్నదిగాన | 6-121 |
| | పైకొని తద్విష్ణోఃపరమై యుండగను | 2-232 |
| పురం : | మిథిలేశ 'మమ కించి న్నదహ్యతే' ఎంబంతె ఇరబేకు | (కీ. 404) |

ఈలాగే పాదాంతపదాలయిన చింత-ఫల-సాక్షి-మనసా-లాలి వంటివి పురందర దాసులోకూడా లెక్కలేనన్ని కనిపిస్తాయి.

**అన్నమయ్య - కనకదాసు :**

హరిదాసులలో 'కనకదాసు'కు ప్రత్యేకస్థానంవుంది. వ్యాసరాయలు మెచ్చు కున్న హరిదాసు అతడు. కురబకులానికి చెందినవాడయినా దాసకూటంలో ఒకడుగా వెలామణి అయిన వ్యక్తి. పురందరదాసాదులకు పూజనీయుడయిన భక్తాగ్రేసరుడు.

అన్నమయ్యకు కనకదాసుకు కొన్ని పోలికలు కనిపిస్తాయి. ఇద్దరూ గ్రామీణజీవితంపై ఆసక్తివున్నవారు. ఇద్దరూ శిష్ట, పామరజన ప్రీతికరమయిన

రచనలు చేసినవారు. కనక దాసు నలచరిత్ర, నవధాన్యచరితె వ్రాయడం గుర్తించ దగ్గవి. కనకదాసు ఆరాధ్యదైవం కాగినెలిలోని ఆదికేశవుడయినా తిరుమలేశుని మనసారా కొల్చిన హరిదాసు. అన్నమయ్య సంకీర్తనల్లో కల్యాణకీర్తనలెన్నో కనిపిస్తాయి. అయితే స్వామి తన కల్యాణం దర్శించమని కనకదాసును కోరినట్లు, ఆమేరకు కనకదాసు తిరుమల చేరుకున్నట్లు, ఆనాటి ఆలయాధిపతులు కనకదాసును గుర్తించలేనట్లు, అప్పై కనకదాసు కోపపడగా స్వామి తనంతతాను ప్రసాదాలు తెచ్చియిచ్చినట్లు, ప్రసాదం గిన్నె కనబడకపోగా ఆలయాధికారులు పట్టుకున్నట్లు ఐతిహ్యం. అన్నమయ్య దశావతార కీర్తనలలో "ఉక్తివైచిత్రి" ముఖ్యమయింది. హరిదాసులలో పురందరదాసు, కనకదాసులు ఈ ఉక్తివైచిత్రికి ముగ్ధులై ఎన్నో పదాలు వ్రాశారు.

అన్నమయ్య: ఏమిసేయవచ్చు కర్మమిచ్చినంతే కాని లేదు
తాము సేసినంతవట్టు తమకు పోరాదు
ఇట్టునట్టు మిట్టిపడ్డా యించుకంతా లేదు వీపు

బట్ట గట్ట మోపు మోచి పాటువడ్డాలేదు
తట్టువడ లోకమెల్లా తవ్వుకొనినా లేదు
తెట్ట తెరువున నోరు తెరచినా లేదు 1-55

అని సామాన్యమానవుడు పడే అగచాట్లను స్వామికి జతచేసి చెప్పాడు. పై కీర్తన లోని 'నోరు తెరచినా లేదు' అనడం నరసింహస్వామిని తెలియజేస్తుంది. ఈ అంశాన్ని ఎన్నుకొని లేదా భావించుకుని కనకదాసు అత్యద్భుతమయిన కీర్తన వ్రాశాడు.

'ఏను కారణ బాయ తెరది పేళలో
దాన వాంతక అహోబల నారసింహనె'

"వేదాలు దొంగలించినవానిని ఏలాగయినా మట్టుపరచాలని నోరు తెరిచావా? మంథర పర్వతం మోస్తు బరువు మోయలేక నోరు పెగల్చావా? భూమిని చాపచుట్టగా పట్టుకెళ్ళినవాణ్ణి చంపి పగదీర్చు కొన్నానని నోరు తెరిచావా. బలిచక్రవర్తి దగ్గిరికి దానంకోసం వెళ్ళి నోరు తెరిచావా, పట్టుదలతో క్షత్రియుల్ని పీచమణచ

డానికి నోరు తెరిచావా. కట్టుకున్న ఇల్లాలు కనబడకపోతే ఏం చేదామా అని నోరు తెరిచావా. అందమయిన అమ్మాయిల్ని చూస్తూ నోరు తెరిచావా, గుర్ర మెక్కి దట్టిస్తూ నోరు తెరిచావా" అని చమత్కార గర్భితంగా దశావతారాలను వర్ణించాడు

అన్నమయ్య 'అంత హితులా అన్నలును తమ్ములును' అని ఇహలోక బాంధవ్యాలను నిరసిస్తే కనకదాసు పౌరాణిక సాక్ష్యాధారాలతో ఎవరికీ ఎవరూ హితులు కారు. కాబట్టి ఆదికేశవుడొకడే హితుడని 'ఆరు హితవరు ఎందు నంబబేడ' కీర్తనలో, వాళ్ళను [illegible] హితులందామా? ప్రహ్లాదునికి ఎలాంటి తండ్రి! [illegible] హితాన్ని [illegible] అని అందామా? కుంతి కర్ణునికి ఏం ఒరగబెట్టింది. కొడుకు హితాన్ని కోరేవాడా? కంసుడు కన్నతండ్రిని చెర పట్టాడు కదా, సహోదరుడు హితం కోరేవాడా? సుగ్రీవుడేం చేశాడు? వాలి ఏం చేశాడు. అంచేత రక్తసంబంధీకు లయిన బంధువుల్ని నిజంగా నమ్మవద్దు. ఆదికేశవుని నమ్మినవారికే సుఖం. అతడే అందరికి హితుడు.

కులంగురించిన 'ఎత్తిపొడుపులు' విమర్శలు అన్నమయ్య కనకదాసులలో చాలా కనిపిస్తాయి.

కందువగు హీనాధికము లిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ

కులమెంత కలిగినా కూడించు గర్వంబు 9-83
జాతి యిందేది అంత్య జాతి యిందేది
జాతులన్నిట ఆత్మ సర్వేశుడు
తెలివి గలదాకా తెగని మరుగులివి

తెలిసి నంతట మీద తీరు సంశయము 2-136

వట్టి నట రాజసాలు వర్ణాశ్రమములును 10-235

కనకదాసు: కులకుల వెన్నుతిహరు
కులవ్యావుడు నత్యసుఖ పుళ్ళ జనరిగె" కీర్తనలో

తామర బురదలో పుట్టడం లేదా? పద్మనాభునికి అర్పిస్తున్నాం కదా? పశుమాంసం నుండి పాలుపుట్టడం లేదా. బ్రాహ్మణులు స్వీకరిస్తున్నారు కదా? మృగాల దేహాల నుండి కస్తూరి పుట్టడం లేదా. బ్రాహ్మణులు పూసుకుంటారు కదా. ఆత్మ ఏ కులం? జీవుడు ఏ కులానికి చెందినవాడు? తత్త్వేంద్రియాల కులా లేవి?"

అన్నమయ్యను హరిదాసులను సామూహికంగా పరిశీలిస్తే మనకెన్నో సామ్యాలు కనిపిస్తాయి. విఠలునిలో వేంకటేశ్వరుని దర్శించడం అన్నమయ్య దృష్టి. శ్రీపాదరాయలు, వ్యాసరాయలు మఠాధిపతులయితే పురందరదాసాదులు గృహస్థులు. కనుకనే వారి రచనల్లో సాంసారిక జీవనప్రాముఖ్యం కనిపిస్తుంది. అన్నమయ్యలాగే పురందరదాస, కనకదాసాదులు విస్తృత దేశసంచారం చేసిన వారు. ప్రజల్లో భక్తిభావం ప్రబలడానికోసం జానపదగేయ వరుసలను వాడుకుని వైష్ణవ తత్త్వాన్ని విశదీకరించారు. కన్నడ హరిదాసులందరు అన్నమయ్యలాగే సంస్కృత సంకీర్తనలు వ్రాసినవారే. అంకిత పద్ధతి, విభిన్న రాగాల ప్రయోగం, సంగీతంలో వివిధాంశాలు మొదలయినవి ఏకకాలంలో అన్నమయ్యలోను, హరిదాసులలోను పరిణతి చెందింది. భాషావిషయంలో వీరు గ్రాంథికగిసుకుని కీర్తనలు వ్రాయలేదు. మతప్రచారంలోనూ అంతే. అందువల్లనే కన్నడరాష్ట్రంలో మారు మూలల్లో కూడా హరిదాసుల 'దేవరనామగళు' వినిపిస్తాయి.

**అన్నమయ్య – ఆంధ్ర వాగ్గేయకారులు :**

ఆంధ్రదేశంలో వచనరచనకు, భజన సంకీర్తన పద్ధతులకు పరమాచార్యుడు, ప్రపితామహుడని కొనియాడబడిన తొలి వాగ్గేయకారుడు కృష్ణమాచార్యులు. అన్నమయ్యకు కృష్ణమాచార్యులు ఎన్నో విధాల మార్గదర్శి. శిఖాయజ్ఞోపీతం, కటిసూత్రం, కాషాయ వస్త్రం. లలాటంలో తిరుమణి, తిరుచూర్ణం, దండె మీటుతూ కనబడడం లాంటివి అన్నమయ్యలో కనిపిస్తాయి. సింహాచలంలో వుంటూ చాతుర్లక్ష సంకీర్తనలను కృష్ణమాచార్యులు రచించగా అన్నమయ్య తిరుమల తిరుపతి కేంద్రంగా చేసుకుని ముప్పది రెండువేల కీర్తనలను వ్రాశాడు. కృష్ణమాచార్యుని రచనలలో కొన్ని పదుల కీర్తనలు మాత్రం దక్కితే అన్నమయ్యవి సుమారు పన్నెండువేల దాకా కనబడుతున్నాయి. కృష్ణమాచార్యులు ఆంధ్రదేశంలో వైష్ణవ పుణ్యక్షేత్రాలన్నిటిని దర్శించినట్టు అన్నమయ్య కూడా

దర్శించాడు. కృష్ణమాచార్యులు తన సంకీర్తనంలో వర్ణించినట్లు అన్నమయ్య కురువరతినంబి, అనంతాళ్వారు మొదలయినవారిని ప్రత్యేకించి కీర్తించినాడు. కృష్ణమాచార్యులకు పదారపయేట స్వామి సాక్షాత్కారమయినది. ఇవేగాక ఇరువురి రచనల్లోను కొన్ని సామ్యాలు కనిపిస్తాయి. మచ్చుకు—

హరిభక్తిలేని విద్వాంసుని కంటెను హరికీర్తనము సేయునతడె కులజుండు శ్వపచుండైన నేమి? ఏ వర్ణంబైన నేమి?

అన్న : వేదములు చదివియును విముఖుడై హరికథలు
నాదరించని సోమయాజి కంటె
ఏదియును లేని కులహీనుడైనను విష్ణు
పాదసేవకుడు వో బ్రాహ్మణోత్తముడు
పరమమగు వేదాంతపఠన దొరికియు సదా
హరి దలచని సన్యాసి కంటె
మరగి పసురము దినెడి మాలయైనను వాడె
పరమాత్ము కొలిచినను బ్రాహ్మణోత్తముడు 11_3_117

కృ : దేవా! గీత ప్రబంధములచేత మిమ్ము మెప్పించెదనంటినా
కిన్నర కింపురుష గరుడ గంధర్వ సనక సనందన సనత్కుమార
పరమ భాగవతులు, నారదాదులు మీ సన్నిధినే యున్నారే.
విందులు పెట్టి మిమ్ము మెప్పించెద నంటినా విదుర భరద్వాజులు
శబరి మొదలయినవారు మీ సన్నిధినే యున్నారే

వారిధి దాటి మెప్పించ వాయుజాడ నేగాను
సారె చవుల మెప్పించ శబరిగాను....
ఘనముగ మోచి మెప్పించ గరుడుండ నేగాను
నవ్వుచు పాడి మెప్పించ నారదుడ నేగాను

రాగ తాళాదులతో కృష్ణమాచార్యులు రామనామాలు, నృసింహనామాలు వ్రాసినట్లే అన్నమయ్య అనేక సంకీర్తనలను వ్రాశాడు. కృష్ణచార్యులు తన సంకీర్తనల్లో తళియ, అడియేన్, తిరువడిగళ్ మొదలయిన వైష్ణవ పరిభాషలను వాడినట్లే అన్నమయ్య కూడా విరివిగా వాడాడు.

అన్నమయ్య - త్యాగయ్య :

కొండలమధ్య పుట్టి కోనల్లో పెరిగి కొండలరాయనిపై నిండయినభక్తి నిలుపుకున్నవాడు అన్నమయ్య అయితే నదీతీరంలోపుట్టి నాదోపాసనచేసి తరించిన వాడు త్యాగయ్య. ఇద్దరిది పండితవంశం. ఇద్దరికి భార్యలిద్దరు. ఇద్దరు బాల్యదశలో ఇబ్బందులుపడినవారే. పూజావిగ్రహాలుపోగా ఇద్దరు భగవంతునికి విన్నపాలు చేసికున్నవారే. రోజుకొక్క కీర్తనవంతున వ్రాయడం అన్నమయ్య వ్రతమయితే వాల్మీకి రామాయణ శ్లోకాలను దీటుగా 24 వేల కృతుల్ని త్యాగయ్య వ్రాశాడని ప్రతీతి. అన్నమయ్య సంగీతసాహిత్యాలకు సమానస్థానం కల్పిస్తే త్యాగయ్య సంగీతానికి, ప్రత్యేకించి 'ధాతుకల్పన'కు అవకాశమెక్కువ ఇచ్చాడు. అన్నమయ్య సంకీర్తనల ఛాయలు త్యాగయ్యలో విరివిగా కనిపిస్తాయి.

| | | |
|---|---|---|
| అన్న : | పెద్ద తెరవుండగాను పెడగంతలుదీసుక<br>పొద్దువోక యడవులఁ బుంగుడయ్యేరు | 9-94 |
| త్యాగ : | చక్కని రాజమార్గముండ<br>సందుల దూరనేల ఓ మనసా | 1-396 |
| అన్న : | ఎంత సోదించిచూచినా ఎన్నెన్ని చదివినా | 8-28 |
| త్యాగ : | ఎంత నేర్చిన ఎంత చూచినా<br>ఎంతవారలయిన కాంతదాసులే | 1-292 |
| అన్న : | సంసారమే మేలు సకల జనులకును<br>కంసాంతకుని భక్తికలిగితే చాలు | 9-159 |
| త్యాగ : | సంసారులైతే నేమయ్యా శిఖి పింఛావ<br>తంసు డెదుటనుండగ | 2-206 |

రాయబారాలు ఈనాటివి కావు. అనాదిగా వుండేవి. భారతంలోని ద్రుపద పురోహితుని రాయబారం, సంజయుని రాయబారం, శ్రీకృష్ణుని రాయబారం లాంటివి. ఆయా దేశాలమధ్య విద్వేషం రగిలేవేళ చేసుకునే ప్రయత్నాల వంటివే.

తమకు భద్రతలేనివేళ, అజ్ఞాతంలోకి వెళ్ళిపోవడం రాజకీయ నాయకులకు అలవాటయిన విషయం. పాండవుల అజ్ఞాతవాసంకూడా ఈలాంటిదే. కాకపోతే జూదంలోని షరత్తుకూడా. అలాగే దుర్యోధనుడు మడుగులోకి దూకడం, భద్రత చేసుకోవడం. రాజులసమర్థులయినవేళ అతణ్ణి ఆశ్రయించినవారు అకృత్యాలకు ఎగబడుతుంటారనడానికి 'కీచకుని' వృత్తాంతం సాక్ష్యం.

ఇంక యుద్ధాలజోలికివస్తే కొన్ని సామ్యాలను గుర్తించవచ్చు. వారుణాస్త్రం ప్రయోగిస్తే వర్షాలుకురవడం. ఆగ్నేయాస్త్రం ప్రయోగిస్తే నిప్పులుకురవడం భారతంలో కనిపించే అంశాలు. సుదూరంలోవున్న ఒక లక్ష్యాన్ని ఛేదించడం 'మిసల్స్' ప్రయోగంలాంటిదే. అర్జునుడు సైంధవుణ్ణికొట్టి ఆ తల అతని తండ్రి చేతిలోపడేటట్లు చేశాడట. ఆలాగే అశ్వత్థామ 'బ్రహ్మశిరోనామక' అస్త్రాన్ని ప్రయోగించి 'ఉత్తరగర్భాన్ని' నిష్ప్రయోజనం చేశాడట. పొగవాయువు వదిలితే (బాష్పవాయువు) ఊపిరాడక చతికిలబడడం పేపర్లలో వింటున్నాం. ఉత్తర గోగ్రహణసందర్భంలో సమ్మోహనాస్త్రం ప్రయోగిస్తే ఒకరిద్దరుతప్ప తక్కిన వాళ్ళంతా వివశులుకావడం ఈలాంటిదే.

ఈనాడు ఆటల పోటీలు జరుగుతున్నా, వినోదకార్యక్రమాలు జరుగుతున్నా ప్రత్యక్షవ్యాఖ్యానం చేసేవిధంగా సంజయుడు ధృతరాష్ట్రునికి సమరవిశేషాలను 'రన్నింగ్ కామెంటరీ'లాగా వినిపించాడు. ఇంధన వనరులు తగ్గిపోయిన ఈ రోజుల్లో 'సోలార్ ఎనర్జీ' గురించి విస్తృతంగా ప్రచారం చేస్తున్నాం. ఇది సహజసిద్ధమయింది. ద్రౌపది అరణ్యవాసంలోవుండగా సూర్యుని అనుగ్రహంతో లభించిన అక్షయపాత్ర యించుమించు ఈలాంటిదే.

ఇక మానసికసంబంధాలను పరిశీలిస్తే అనాటి వ్యక్తులస్వభావాలు ఈనాటి వ్యక్తులలోకూడా కనిపిస్తాయి. అన్నీ వున్నవారు కాలవైపరీత్యంవల్ల పోగొట్టుకుని నిస్సహాయస్థితిలోవుంటే వారిని హేళనచేసేవిధంగా దాయాదులు వారిముందు డాబు

| | | |
|---|---|---|
| అన్న : | దొరకునా యితనికృప తుదిపదంబు | 1-353 |
| త్యాగ : | దొరకునా యిటువంటి సేవ | 1-440 |
| అన్న : | ఊరకే కల్గునా ఉన్నతోన్నతసుఖము | 6-104 |
| త్యాగ : | ఊరకే కల్గునా రామభక్తి | 1-190 |
| అన్న : | కనుగొను నీ విగ్రహమే గ్రహబలమిది నాకు | 6-109 |
| త్యాగ : | గ్రహబలమేమి శ్రీరామానుగ్రహబలమే బలము<br>గ్రహబలమేమి తేజోమయ వి<br>గ్రహమును ధ్యానించేవారికి నవ | 1-395 |
| అన్న : | తనువే గుడియట తలయే శిఖరమట<br>పెనుహృదయమే హరి పీఠమట | 6-62 |
| త్యాగ : | తనువే నీకనువైన సదనమురా రఘునాథ<br>స్థిరచిత్తము వరచామీకరపీఠము రఘునాథ | 1-127 |
| అన్న : | నీవంటి దైవాలు లేరీ నిఖిలలోకములందు | 10-240 |
| త్యాగ : | నీవంటి దైవమును షడానన నే నెందుగానరా | 2-11 |

'పాడేమునేము పరమాత్మ నిన్నును
వేడుక ముప్పదిరెండువేళల రాగాలను'

అని అన్నమయ్య సామవేదనాదవినోదుని కీర్తించినట్టే త్యాగయ్య 'శోభిల్లు సప్త స్వర సుందరుల భజింపవే మనసా !' అని హెచ్చరిక చేసుకున్నాడు. 'అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన రచనాంశము త్యాగయ్య'.

**అన్నమయ్య - క్షేత్రయ్య :**

అన్నమాచార్యుని తరువాత అంతటి వాగ్గేయకారుడు క్షేత్రయ్య. సంగీత సాహిత్యాలతో పదాభినయానికి ప్రాధాన్యంతెచ్చిన వాగ్గేయకారుడు క్షేత్రయ్య. అన్నమయ్య వేంకటేశ్వరుణ్ణి భజిస్తే వరదయ్య మువ్వగోపాలుని నమ్మకున్నాడు. అన్నమయ్య కర్ణాటాంధ్ర తమిళప్రాంతాలలోని వైష్ణవాలయాలు సేవిస్తే వరదయ్య

ప్రధానంగా తమిళప్రాంతంలోని క్షేత్రాలను దర్శించినట్లు తెలుస్తుంది. అన్నమయ్య సంకీర్తనలు 22 వేలయినా 12 వేలు దక్కినట్లు క్షేత్రయ్య పదాలు 4000 అయినా సుమారు 400 మాత్రం దక్కాయి. అన్నమయ్య సంకీర్తనల్లో ఆనాటి రాజుల పేర్లు కనిపించవుగాని క్షేత్రయ్యపదాలలో మధుర, తంజావూరు, గోలకొండ పాదుషాలపేర్లు కనిపిస్తాయి. త్యాగయ్య ఆధ్యాత్మికభక్తికి అగ్రతాంబూలమిస్తే క్షేత్రయ్య 'మధురభక్తి'ని అభిమానించాడు. అయితే తెలుగు నుడికారంతో, భావ వ్యక్తీకరణలో సంఘటనను ఏరుకోవడంలో అన్నమయ్యమార్గంలో క్షేత్రయ్య నడిచాడని చెప్పడం సబబు.

అన్న : నాకుంజెప్పరె వలపు నలుపో తెలుపో

క్షేత్ర : వలపనే దెటువంటివస్తువో తెలియదే

అన్న : కొండలో కోవిలకుయ్య గుండెపగిలే

క్షేత్ర : కోడికూసె నయ్యయ్యో నా గుండె ఝల్లుఝల్లుమనెనే

అన్న : ఆపాటి చుట్టరికమదె చాలును
బాగుగ తా నేడనైన బతికితే చాలుగాక

క్షేత్ర : అక్కరో నను బాసినందు కాడితి నింతే
చక్కని మా మువ్వగోపాలు డెక్కడ నుండితేనేమి

అన్న : ఆడదాని బతుకింత అరడికద్దా

క్షేత్ర : ఆడపుట్టువు పుట్టు నన్నలయాంతుర

అన్న : చిత్తరువు వ్రాయబోతె చెలియకు నంతలోనె
హత్తి నీ రూపుతోచె

క్షేత్ర : ఊరకుండలేక గోర నే వ్రాసిన నీ రూపుగాతోచురా

తాళ్ళపాక అన్నమయ్య 'వేంకటేశ్వరుని కలిసిన అలమేలుమంగమ్మను

"పలుకుతేనెల తల్లి పవళించెను
కలికితనముల విభుని కలసినదిగాన" అని వర్ణిస్తే

క్షేత్ర : "కంచివరదుని కలసిన 'అమ్మవారి'ని

మగువ తన కేళికామందిరము వెడలన్

వగకాద మా కంచివరద తెల్లవారె ననుచు"

అనుచు పడకిల్లువదలి పరవశంలోవచ్చిన వైనాన్ని వర్ణించాడు.

అన్నమయ్య సుమారు వందకుపైగావున్న రాగాలలో సంకీర్తనలు వ్రాస్తే క్షేత్రయ్య వాడిన రాగాలు 39 మాత్రమే ముఖారి, ఆహిరి, కాంభోజి రాగాలకు ఇద్దరూ ప్రాముఖ్యమిచ్చారు. అన్నమయ్యలాగే క్షేత్రయ్య శృంగార సంకీర్తన ములలో ఆహిరి, కాంభోజి రాగాలను విరివిగా వాడారు. అన్నమయ్య శృంగార సంకీర్తన రచనాంశం క్షేత్రయ్య అనడం సబబు.

అన్నమయ్య – శాహజీ :

తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజైన 'ఏకోజీ' కుమారుడు శాహజీ. ఇతడు పూర్తిగా స్థానికులతో కలసిపోయి ద్రావిడభాషా కవిపండిత పోషకుడయ్యాడు. ఇతని రచనలు దాదాపు 20 దాకా వున్నాయి. ఇతని విష్ణుపల్లకి సేవాప్రబంధం, శంకరపల్లకి సేవాప్రబంధంలోని కొన్ని పదాలు అన్నమయ్య పదాల్ని తలపిస్తాయి. తాళ్ళపాక అన్నమయ్య అమ్మవారి పల్లకీ సేవను

"కులుకక నడవరో కొమ్మలాల

జలజల రాలీని జాజులు మాయమ్మకు

ఒయ్యన మేను గదలీ నొప్పుగా నడవరో

గయ్యాళి. శ్రీపాదతాకు కాంతలారా"

అని వర్ణిస్తే శాహజీ ఉమామహేశ్వరులు నాయికా నాయకులయిన శంకరపల్లకి సేవా ప్రబంధంలో

"కదలింపకు రోయి పల్లకి

కదలనీక రోయీ చాల

మృదువైన జంగమయ్య మేను నొచ్చీని

హరువున మెల మెల్లన అడుగు లిడరోయి
పురవైరికి బడలిక పుట్టపోయీని

అని స్వామి బడలికను వర్ణించాడు. అలాగే విష్ణు పల్లకి సేవాప్రబంధంలో

సొగసు పల్లకి చూడవే కలికి
తెగువను బోయలు దెచ్చిరి హరికి"

అని స్వామివారికి సన్నద్ధం చేసే పల్యంకోత్సవాన్ని వర్ణించాడు.

అన్నమయ్య - యాగంటి కవులు :

యాగంటి పదాలలో ఎక్కువ భాగం వ్రాసినవారు గార్లపాటి లక్ష్మయ్య. ఇతడు అన్నమయ్యకు పూర్వుడని, సమకాలీనుడని, తరువాతివాడని భిన్నాభిప్రాయాలున్నాయి. అయితే యాగంటి కవి ఒకడు కాడని మరికొందరున్నారని అందువలననే యాగంటి కవులనే వ్యవహారం. అయితే ఇద్దరూ రాయలసీమవాసులనడంలో సందేహం లేదు.

భగవంతుని యథార్థ స్వరూపం తెలుసుకోలేక ఇంతకాలం మోసపోయామని ఆవేదన చెందడం ఇద్దరిలోనూ సమానం. అలాగే 'సంసార నిరసన' కు సంబంధించిన వివరణ

యాగంటి : ఎందరో తల్లిదండ్రులు బిడ్డలెందరో మున్నెందరో సతులు
ఎందరో తోడ బుట్టువులు తనకెందరో

అన్న : అన్నలంటా తమ్ములంటా ఆండ్లంటా బిడ్డలంటా
వన్నెల అప్పుగొన్న వారులో వీరు

తగ బంధులా తనకు తల్లులను తండ్రులను
వగల బెట్టుచు తిరుగువారే గాక

యాగంటి పదాల 'ఏల'లను దృష్టిలో పెట్టుకుని అన్నమయ్య 'ఏలలు' వ్రాసినట్లు పలువురు పరిశోధకులు భావిస్తున్నారు.

యాగంటి : కానరాని అడవిలోన
వాన లేని మడుగు నిండె
వాన లేని మడుగు మీద - యాగంటి లింగ
మానరాని అగ్ని పొడమెరా

అన్న : మేడలెక్కి - విన్ను చూచి
ఖాదేననే యాసతోడ
పాడుదేరి పుస్సురందురా - వేంకటేశా
యాడనుంటి విందాకనుధా

ఈ ఏలల్ని అనుసరించి కందుకూరి రుద్రకవి, దళవాయి తిమ్మభూపాలుడు మొదలయినవారు ఏలలు రచించివుండవచ్చు.

ఆంధ్ర వాగ్గేయకారులలో అందరికంటె ఎక్కువగా కీర్తనలు వ్రాసిన ఘనత అన్నమయ్యదే. అలాగే లభ్యమయిన సంకీర్తనల నిష్పత్తిచూసినా అన్నమయ్య రచనలే ఎక్కువ మిలిచాయని చెప్పవచ్చు. అన్నమయ్యలాగా విస్తృతంగా తిరిగిన వాగ్గేయకారుడు ఆంధ్ర వాగ్గేయకారులలో కనిపించరు. ఆధ్యాత్మిక, శృంగార సంకీర్తలనే విభాగంలో అన్నమయ్య వ్రాస్తే తరువాతివారు ఒక్క విభాగానికే పరిమితమయ్యారు. జానపదగేయ ఫణితులయిన లాలి, తుమ్మెద, సువ్వి, అల్లో నేరేళ్లు, గొబ్బి, జాజర, సోది, తందాన, ఏల, కోలాట, చందమామ, శోభన, హారతి, ఉయ్యాల, జోల, మంగళగీతాలను సంకీర్తనలలో పొందుపరచడం అన్నమయ్య ప్రత్యేకత. ఆలాగే భాషావిషయంలోనూ స్వాతంత్ర్యం వహించిన వాడు అన్నమయ్య. తాను వైష్ణవుడయినా ఆనాడు ప్రచారంలోవున్న ఇతర వైష్ణవ శాఖలను ఆదరించి సమన్వయించి విస్తృతవైష్ణవం నిలిపిన వాగ్గేయకారుడు అన్నమయ్య

అపురూప మైనట్టి ఆధ్యాత్మ కీర్తన
లృక్తితో నెవ్వడు పాడినాడు
చిత్తంబు గరగించు శృంగార పదముల
అనురక్తియై యెవ్వ డల్లినాడు

తనకు దీటగునట్టి తనయులు కలుగంగ
ధన్యుడై యెవ్వాడు తనరినాడు
సాహిత్య సంగీత సమ్మాన్య మూర్తియై
జగతిలో నెవ్వాడు సాగినాడు

దివ్య దేశాల నెవ్వాడు తిరిగినాడు
వైష్ణవంబును నెవ్వాడు వలచినాడు
శ్రీనివాసుని భక్తుడై చెలగె నెవడు
అట్టి యన్నమాచార్యుని కంజలిడుదు

# 'సుబ్రహ్మణ్య భారతి'

రష్యన్ రచయిత పుష్కిన్‌లాగా కేవలం నలభై సంవత్సరాలు మాత్రం జీవించినవాడు, అమెరికన్ రచయిత వాల్ట్‌విట్‌మన్ లాగా ఆడవారి కోసం అసంఖ్యాక రచనలు చేసినవాడు, బంకించంద్ లాగా దేశభక్తిని పెంచినవాడు. ఇక్బాల్ లాగా భారతీయతను అభిమానించినవాడు, గురజాడ అప్పారావుగారి లాగా పాత కొత్తల మేలు కలయికను మనస్ఫూర్తిగా కోరినవాడు తమిళ కవి సుబ్రహ్మణ్య భారతియార్.

సుబ్రహ్మణ్య కవి తమిళనాడు రాష్ట్రంలో తిరునెల్వేలి జిల్లా ఎట్టయాపురంలో 1882వ సంవత్సరం డిసెంబర్ 11వ తేదీన సామాన్య కుటుంబంలో జన్మించాడు. పసితనంలోనే తల్లిని కోల్పోయాడు. తండ్రి చిన్నస్వామి అయ్యర్ భారతియార్‌ను గారాబంగా పెంచాడు. 15వ ఏట చెల్లమ్మాళ్‌ను సహధర్మచారిణిగా ఎన్నుకున్నాడు. 1921వ సంవత్సరం సెప్టెంబరు 12వ తేదీన ఏనుగుచాతబడి అకాలమరణం పాలయి అమరజీవి అయ్యాడు.

సుబ్రహ్మణ్య కవి బహుముఖ ప్రజ్ఞావంతుడు. బాల్యంలో ఎట్టయాపురం సంస్థానంలో అతడొక చిన్న ఉద్యోగి. కొంతకాలం మధురైలో తమిళపండితుడు. మరికొంతకాలం మదరాసులో పాత్రికేయుడు. ఇంకా కొంతకాలం భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో భాగం పంచుకున్న వీరుడు. అయినా ఇతని కీర్తి కవితల్లో నేటికి గుబాళిస్తూనే వుంది.

ప్రాచీన కవి లక్షణాలలో 'వైదుష్యం' ఒకటి. పాండిత్యం లేని కవిని ఆదరించడమో గౌరవించడమో కలలో కూడా కాని పని. ఆంగ్లాది భాషలతో పరిచయం, తర్క సంగీతాది శాస్త్రాలతో పరిచయం, తమిళంలో తరగని పాండిత్యం వల్లనే సుబ్రహ్మణ్య కవి పదకొండవయేటనే ఎట్టయాపురం సంస్థానంలో ప్రతిష్ఠాత్మకమయిన భారతి బిరుదాన్ని దక్కించుకున్నాడు. సమకాలీనులల్లో అసమానుడని నిరూపించుకున్నాడు.

'ప్రకృతికిన్ భాష్య ప్రణేతల్ కవుల్' అనడం మన సంప్రదాయం. వేదకాలం నాటి మహర్షులు, ప్రాచీన కవులు ప్రకృతిని చూచి పరవశించిన వారే. ప్రకృతిని ఉపాసించిన వారే. ప్రకృతి రామణీయకతను పద్యాలలో వివరించిన వారే. సుబ్రహ్మణ్య కవి ప్రకృతి ప్రియుడు. అతని దృష్టిలో ప్రకృతి చైతన్యపు ముద్ద.

ప్రపంచంలో జడ పదార్థమన్నది లేదు
మట్టీ రాయి జడములు కానే కావు
పాడు పల్లె దైవం ఎడారి కడలి దైవం
ఏడు లోకాలూ దైవం, ప్రతిదీ దైవం.

భారతి దృష్టిలో అసౌందర్యమన్నది అసలు లేదు. కనుకనే కాకి నలుపురంగులో కూడా కన్నయ్యను చూడగలిగాడు. సూర్యుని చుట్టూవున్న మేఘాలను బంగారు పడవలుగా, మండుతున్న బంగారు దీవులుగా దర్శించగలిగాడు. ప్రకృతి వర్ణనలలో వ్యంగ్యాన్ని సునిశితంగా చెప్పిన కవి భారతియార్. గాలికి సంబంధించిన కవితలో

"కొండ గాలి మంచిది
కడలి గాలి మందు
ఆకాశల నుండి వచ్చే గాలి మంచిది
ఊరి మీద వచ్చే గాలి విరోధి"

అనడంలో కలుషితమయిన మానవ మనస్తత్వం తెలుస్తుంది.

భక్తికి కవిత్వానికి దగ్గరి చుట్టరికం. ప్రాచీన కవులందరూ భక్తులే. అయితే భారతియార్ భక్తి కవిత్వం పలాయన మంత్రంతో ముడివడిన్ది కాదు. నిరాశా జనకమయిన వాతావరణంలో పెట్టిన కేకలు కావు. తన్మయత్వంతో తన్ను తాను మరచిపోయేటట్టు చేసినవి కావు. అతడు ఇతర దేవతలను కొలిచినా ప్రధానంగా కాళికామాత ఉపాసకుడు. ఆ ఉపాసనలో సంప్రదాయ ధోరణులున్నాయి. సమాజాన్ని చైతన్యవంతం చేసే అభ్యుదయ భావాలు కూడా వున్నాయి. కనుకనే ఒక సారి భారతియార్

'సర్వమూ నీవయై కాళి సర్వత్ర నిండి వున్నావు
మంచి చెడ్డలు కాళి దైవలీలలు కావా'

అంటూనే

"పామును చంపే బలం శక్తి
దేశాన్ని కాపాడే జ్ఞానం శక్తి
నైచ్య నివారణోపాయం శక్తి
పతనాన్ని నిరోధించే పౌరుషం శక్తి'

అని ప్రబోధించాడు.

'కవనార్థ మ్ముదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి' అని చెళ్ళపిళ్ళ వారంటే 'మా వృత్తి కవన మల్లడం మాత్రం కాదు దేశానికి సేవ చేయడం' అని సాంఘిక బాధ్యతను ఇతరులకు గుర్తుచేసిన మహాకవి భారతియార్. ఈ దృష్టి కలవాడు కావడం వల్లనే ఎట్టయాపురం సంస్థానంలోని చిన్న ఉద్యోగాన్ని తనంత తాను వదులుకున్నాడు. జమీందారులకు ప్రబంధాలను వినిపించే బంధాన్ని తెంచు కున్నాడు. దారిద్ర్యం కారణంగా ఇతరుల దగ్గర ఊడిగం చేయడంవల్ల కవితకు తాను చాలా దూరమయినట్టు చాల పాటల్లో వాపోయాడు. కవితను ప్రేయసిగా భావించడం భారతియార్ ప్రత్యేకత.

కవితలో కాల్పనిక ప్రపంచం అనివార్యం. కాని అదే గమ్యం కాదు. వాస్తవిక జగత్తును మరచిపోవడం నేల విడిచిన సాము. భారతియార్ కుయిల్ పాట్టు (చిలుక పాట) లాంటివి వ్రాసినా, పాంచాలీ శపథం లాంటి ప్రాచీన ఇతివృత్తాల కవితలు వ్రాసినా నూతన సందేశం వినిపిస్తాడు. భారతదేశ దాస్యం పాంచాలి వ్యథలో ఉరకలు వేస్తుంది. పరులకు రాజ్యమప్పగించడం తగదనడంలో ధర్మరాజుపై దాడి కనిపిస్తుంది.

ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం విడిగా వున్నరోజుల్లో అఖండ భారతీయతను గుర్తించినవాడు భారతియార్.

సింగళ దీవికి సేతువు కట్టేము సేతువునేమో వీథిగ తీర్చేము
వంగదేశపు మిగులు నీటితో మధ్యదేశంలో పైరు చేసేము
సింధు నదిని పండు వెన్నెలలో చేరదేశపు వయసు కన్నెలతో
తేట తెలుగున పాట పాడుతూ పడవ నడిపి తిరిగి వచ్చేము

అనడం ఆ రోజుల్లో కవుల ఊహలకు కూడా రాని అపురూపమయిన భావన. అంతే కాదు. స్వాతంత్ర్యం వస్తుందా, అంతా వ్యర్థప్రయత్నమేనా అని గాంధి లాంటివారు కూడా సందేహిస్తున్న కాలంలో

"ఆడుదాం పాడుదాం
ఆనందప్రదమయిన స్వాతంత్ర్యం వచ్చేసిందని"

పాట వ్రాయడం దీర్ఘదర్శకత్వానికి నిదర్శనం. ప్రజాస్వామ్యం తప్పక వస్తుందని అతని భావన. అంచేతనే

'అందరూ సమానులు, సమధర్ములు
అందరూ ఈ దేశపు రాజులు
మనమందరం ఈ దేశపు రాజులం'

అన్నాడు. తమిళంలో దేశభక్తి గేయాలను భారతియార్ లాగా విరివిగా వ్రాసిన వారు లేరు. తెలుగులో గరిమెళ్ళ సత్యనారాయణ భారతియార్ లాంటివాడే.

కదిలేది, కదలించేది కవిత్వమవుతుంది. సాటిమానవుల అభ్యున్నతికి బాట వేసేదే ఉత్తమ కవిత్వం. ఆ అభ్యున్నతికి అడ్డగోడలైన జాతి మమకారం, దారిద్ర్యం, మూఢ విశ్వాసాలమీద భారతియార్ విరుచుకుపడిన పాటలెన్నో. సామాన్య వ్యక్తికి తినడానికి తిండి లేకపోతే ప్రపంచాన్ని కాల్చివేద్దాం అనడంలో విప్లవవాదం వినిపిస్తుంది. వేదాలను ఎంతగా అభిమానించినా సామాజిక దృష్టితో 'వేదం పుదుమై సెయ్' వేదం కొత్తది కల్పించాలని ఆదేశించాడు.

భారతియార్ తమిళుడే. తమిళాన్ని అభిమానించినవాడే. అయితే భారతీయతలో తమిళాభిమానం అంతర్వలయం. ఆతనికున్న అంతర్జాతీయ అవగాహన ఆనాటి కవులలో ఎవరికీ లేదు. రష్యాలో జార్ చక్రవర్తుల పతనానికి స్పందించి

దర్పం ప్రదర్శిస్తుంటారు. పాండవులు అరణ్యవాసం చేసేవేళ దుర్యోధనుడు మందీమార్బలంతో పాండవులున్నచోటికివెళ్ళి ప్రవర్తించినతీరు ఈలాంటిది. ఈలాగే అనుకూల్యశత్రుత్వం. స్నేహితునిలాచేరి వుబ్బించి వ్యూహంలోపడవేసి ఆపై తప్పించుకుని నమ్మినవారిని నట్టేటముంచడం ఎన్నికలలో, వ్యాపారాల లావా దేవీలలో చూస్తున్న విషయం. ఆలాగే శల్యుడు కర్ణుని సారథ్యానికి ఒప్పుకుని రథాన్ని నడిపిస్తూ పగవారిని పొగడుతూ కర్ణుని నిర్వీర్యుణ్ణిచేస్తూ అతని ఉత్సా హాన్ని దెబ్బతీశాడు.

లోకంలోని వ్యక్తులు రెండురకాలవారు. ఆదర్శం 'ఒంటబట్టించుకుని' చివరిదాకా బతికేవారు కొందరు. వాస్తవాన్ని గుర్తించి సర్దుకుపోయేవారు కొందరు, భీష్ముడు మొదటిరకంవాడు. అతడొక కర్మవీరుడు. గాంధీ, జయప్రకాశ్‌నారాయణ్, కామరాజ్‌లాంటి ఆదర్శజీవి.

ఉమ్మడికుటుంబ వ్యవస్థలో పెద్దవానికి పెద్దపీట. ఈ వ్యవస్థ కనుమరుగై పోతున్న వ్యవహారం. పొరపొచ్చాలున్నా సర్దుకుపోవడం ఈ వ్యవస్థలోని సజీవ గుణం. ఈ వ్యవస్థకు బద్ధులయినవారు పాండవులు. అందువల్ల తప్పంతా 'ధర్మరాజుదే' అయినా భీమాదులు ఉమ్మడిబాధ్యత వహించారు. అష్టకష్టాలుపడ్డారు.

సృష్టిలో స్త్రీ అబలకాదు. అవసరమయితే సబల. పామయినా పగ మరచి పోతుంది కాని భామిని పగ మరచిపోదు. పురుషులకంటె దృఢంగా రాజకీయాలు నడపడం ఆడవారికి చేతయినవిషయం. స్వర్గీయప్రధాని ఇందిరాగాంధీ ఇందుకు సాక్ష్యం. భారతంలో ద్రౌపదికున్న కార్యనిష్ఠ అలాంటిది.

భారతం పుక్కిటిపురాణంకాదు. సాగుతున్న మానవజాతి చరిత్ర. పెల్లుబికే ఆవేశాలకు అద్దంపట్టిన చరిత్ర. వారసత్వాన్ని అడుగడుగునా గుర్తింపచేసే సాంఘికచరిత్ర. సంగ్రహంగా చెప్పాలంటే భారతం ఒక విజ్ఞానకోశం.

ఆల్ ఇండియా రేడియో,

తిరుపతి.

14-12-81

'మహాకాళి పరాశక్తి కడగంట చూసింది రష్యాని
ఆవిర్భవించిం దొక విప్లవం'

అని జేజేలు పలికాడు. ఆలాగే బెల్జియం స్వతంత్రదేశమయినప్పుడు సంతోషించి 'బెల్జియం వర్ధిల్లాలి' అంటూ కవిత వ్రాశాడు.

భారతియార్ కవితకు సారళ్యం జీవం. జానపదగేయ వరుసలు ప్రాణం. అంతే కాదు భారతియార్ ఒక వర్గానికే కాకుండా అందరికి హితబోధ చేశాడు. చిన్నపిల్లలకు పాటలు. కోణంగి పాట, బండివాని పాట, బుడ బుక్కలవాని పాటలు ఉదాహరణలు. స్త్రీల అభ్యున్నతికోసం పెణ్ విడుదలై (స్త్రీ విముక్తి) పుదుమైప్పెణ్ (క్రొత్తరకం మగువ) లాంటివి వ్రాశాడు.

"లోకానికి మంచే చెబుతాను - నాకు
తెలిసిన సత్యాన్ని తప్పక చెబుతాను"

అని జీవితాంతం చెప్పిన కవి భారతియార్. సాహిత్యాన్ని శక్తివంతమయిన ఆయుధంగా మలచుకున్న తమిళ కవులలో భారతియార్ అద్వితీయుడు. అతని పంథాలో నడచిన వారెందరో. తమ పేర్లను గూడా మార్చుకున్న కవులు- ఉదాహరణకు భారతిదాసన్ లాంటివారు - తమిళనాడులో కనిపిస్తారు. తిరుపతి వేంకటకవుల శిష్యులనడం ఎంత గౌరవమో భారతియార్ పంథాలో నడవడం అంత గౌరవప్రదం.

ఒక్క మాటలో చెప్పాలంటే భారతియార్ భావ కవి, గేయ కవి, జాతీయ కవి, అన్నిటికి మించి మానవతా వాది. అభ్యుదయ కవి.

(ఆల్ ఇండియా రేడియో, కడప.)

11-4-81

# తెలుగు సాహిత్యం - ఆళ్వారుల ప్రసక్తి

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో వీరశైవ సాహిత్యాన్ని ప్రత్యేక విభాగంగా గుర్తించి పరిశోధన చేసినవారున్నారు. పఠన పాఠనాదులలో ఆ సాహిత్యం ప్రత్యేకతలను నిరూపించినవారున్నారు. కాని వైష్ణవ సాహిత్యాన్ని అందులోను ఆళ్వారుల వాఙ్మయాన్ని విస్తృతంగా సాధికారికంగా పరిశోధన చేసినవారు చాల తక్కువ. పఠనపాఠనాదులలో ఆ వాఙ్మయం ప్రత్యేకతలను స్పష్టంగా నిరూపించినవారు లేరని చెప్పవచ్చు. ఆళ్వారుల వాఙ్మయం చాలవరకు తమిళంలో వుండడం, తెలుగు కవులలో చాలమందికి తమిళంతో పరిచయం నామమాత్రం కావడం కారణాలు కావచ్చు. ప్రాచీనాంధ్రయుగంలో శైవ ప్రాబల్యం ఎక్కువ కావడం కూడ కారణం కావచ్చు. కాని విజయనగర రాజుల కాలంనుండి ప్రత్యేకించి రాయలయుగంనుండి వైష్ణవం ఆంధ్రదేశంలో వ్యాప్తి కావడంతో వైష్ణవ సాహిత్యం వెలుగులోకి వచ్చింది.

## 1. ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో ఆళ్వారుల ప్రసక్తి :

ఆంధ్ర వాఙ్మయంలో మొట్టమొదట ఆళ్వారుల ప్రసక్తి కృష్ణమాచార్యుల (13 వ శతాబ్ది) సింహగిరి వచనాలలో కనిపిస్తుంది "దేవా! శ్రీ రామానుజుల సిద్ధాంతమునుబోలు మఱి సిద్ధాంతము లేదు. పరమాచార్యులంబోలు మఱి యాచార్యులు లేరు. పరమ భాగవతులంబోలు మఱి సమ్మోదపరులు లేరు. వారి కైంకర్య పరులంబోలు మఱి కైంకర్యపరులు లేరు. 'అస్మద్గురుభ్యో నమః' అను మంత్రంబునకు సరి మంత్రంబు లేదు. పరమ రహస్యంబునుంబోలు మఱి రహస్యంబు లేదు. స్వామీ సింహగిరి నరహరి నమోనమో దయానిధీ"! (సింహగిరి వచనములు - 17 వ వచనము).

ఆపై పదకవితా పితామహుడు 32 వేల సంకీర్తనలు వ్రాసినవాడు శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తుడయిన తాళ్ళపాక అన్నమాచార్యుల (15 వ) సంకీర్తన వాఙ్మయంలో ఆళ్వారుల ప్రసక్తిని గుర్తించవచ్చు.

"కారి మార సుతుని చక్కని మాటలకు పొక్కి
చూరగా వేదాల గుట్టు చూచినవాడు
తీరని వేడుకతో తిరుమంగయాళవారి
ఆరడి ముచ్చిమి గూడి కానపడ్డవాడు
పెరియాళవారి బిడ్డ పిసికి పై వేసిన
విరుల దండల మెడ వేసినవాడు"

అని అన్నమయ్య నమ్మాళ్వారును, తిరుమంగై ఆళ్వారును, పెరియాళ్వారును, గోదాదేవిని ప్రస్తావించాడు. అహోబలంలో ఆదివన్ శఠగోపయతుల దగ్గర శిష్యరికం, తిరుమలవాసం, నాలాయిర దివ్యప్రబంధ శ్రవణం, వైష్ణవమతాను రక్తి వీటికి కారణాలు కావచ్చు.

2. ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో పన్నిద్దరాళ్వారుల కావ్యాలు :

ఆళ్వారులు పన్నిద్దరు. వీరిని గురించి ఒకచోట ప్రస్తావించి వారి చరిత్రలను విపులంగా వర్ణించిన ప్రసిద్ధ ప్రాచీన కవులు తాళ్ళపాక చిన్నన్న, సిద్ధిరాజు తిమ్మరాజు, నంబూరి కేశవాచార్యులు. ఈ ముగ్గురు కవులు విష్ణు భక్తులయిన పన్నిద్దరాళ్వారుల చరిత్రలనేగాకుండా వైష్ణవమతవ్యాప్తి గావించిన యామునాచార్య, రామానుజాచార్యుల చరిత్రలను గూడా తమ గ్రంథాలలో విపులంగా వర్ణించారు. వీరిలో మొదటివాడయిన తాళ్ళపాక చిన్నన్న క్రీ. శ. 1498 – 1561 నాటివాడు. పెద తిరుమలయ్య నాలుగవ కుమారుడు. అన్నమాచార్య చరిత్రం, పరమయోగివిలాసం, అష్టమహిషీ కల్యాణం, ఉషాపరిణయం గ్రంథాలను వ్రాసినవాడు. ద్విపద కవిత్వానికి గౌరవాదరాలు పెంచిన కవి. అందువల్లనే 'చిన్నన్న ద్విపదకెరగు' అని ప్రసిద్ధి ఏర్పడింది. ఇతనికి చిన్న తిరు వేంగళనాథయ్య, చిన తిరువెంగళయ్య, తిరువెంగళనాథయ్య, తిరువెంగళ నాథయ్యంగార్, వెంగళార్య, తిరు వేంకటనాథయ్య, తిరువేణాధర్, తిరు వేణాధయ్యర్ అనేవి నామాంతరాలు.

'పరమయోగి విలాసం'లో ఎనిమిది ఆశ్వాసాలున్నాయి. 6377 ద్విపద లున్నాయి. అలమేలుమంగ వేంకటేశ్వరులకు ఈ గ్రంథం అంకితం. వేంకటేశ్వరుడు వైష్ణవాకారం దాల్చి ప్రసాదం అనుగ్రహించి

" పనుపడ ద్రవిడ ప్రబంధంబు చూచి
తెలుగున రచియింపు ద్విపద రూపమున "

అని ఆదేశించగా పరమయోగి విలాసం వ్రాశాడు. ఈ గ్రంథం వ్రాసేవేళ చిన్నన్న కొంత తటపటాయించినట్లు కనిపిస్తుంది.

" వేదంబులెల్ల ద్రావిడముగా చేసి
వేదాంతవిదులు కోవిదులు నైనట్టి
గురుతరులగు పరాంకుశ ముఖ్యయోగి
వరుల వైభవము కావ్యము సేసినట్టి
అలఘు పూర్వాచార్యులగు వారి యెదుట
నిల నితరుడు కావ్యమెట్లు సెప్పెడిని
గావున తత్పాదకమల సేవకుడ
కావున వారి మార్గముననే యేను
జలజాతవాసిని చనుబాల ముట్టి
పలికెద నానేర్పు పరిపాటి నిప్పుడు "

అనడం దీనికి సాక్ష్యం. 'ద్రావిడాగమ సార్వభౌములైన మావారల ఆళవారు లను' అనడంలో ఆత్మీయత సువ్యక్తం.

చిన్నన్న పరమయోగి విలాసానికి సంస్కృతంలోని గరుడవాహన పండితుని దివ్యసూరి చరితమ్, అనంతాచార్యుని ప్రపన్నామృతమ్, తమిళం లోని పిన్‌బళగియ పెరుమాళ్ జ్యీయర్ (ఆరాయిరప్పడి) (14 వ) గురుపరంపరా ప్రభావం, మణవాళమహాముని (14 వ శ.) ఉపదేశరత్నమాలలు ఆధారం కావచ్చు. అయితే చిన్నన్న వీటిలో కొన్ని మార్పులు చేశాడు.

మూలంలో భక్తిసారయోగి కథలో దృఢవ్రతుడు నాలుగవజాతికి చెందిన వాడు. భక్తిసారుడు మొదట శైవుడు. పాణాళ్ పంచముడు. నిజమయిన వైష్ణ

వుడు కులాలకు అతీతుడని భావించడంవల్ల చిన్నన్న ఈ 'కులాల రొంపి'లోకి దిగలేదు.

అలాగే కథాంశాలలో కూడా చిన్నన్న కొన్ని మార్పులు చేశాడు. భక్తిసారుడనే ఆళ్వారు చరిత్రలో పల్లవరాయడు తనకు పున్యయౌవనం కలిగేటట్లు స్వామినుద్దేశించి గానం చేయవలసిందిగా కణికృష్ణణ్ణి కోరాడని ఆధారగ్రంథాలు వర్ణిస్తే తనకు మరే కోరికలేనట్టు, కృష్ణుని కవితకు మెచ్చినట్లు, తనమీద పాట వినాలనే తలంపుమాత్రం వున్నట్టు చిన్నన్న మార్పుచేశాడు. బహుశః తన తాత 'అన్నమయ్య చరిత్ర' కారణం కావచ్చు.

కులశేఖరాళ్వార్ చరిత్రలో కులశేఖరుడు సైన్యాన్ని సమాయత్తపరచి తానే సమరానికి సిద్ధమయ్యాడు. మంత్రులు శ్రీ భట్టరుగారితో శ్రీరాముడు శత్రు సంహారంచేసిన ఘట్టాన్ని చదువవలసిందిగా కోరారు. కులశేఖరుడు సంతోషించి సేనలను ఉపసంహరించినట్టు ఆధారగ్రంథాలలో వున్నది. రామాయణపారాయణం జరుగుతుండగా సీతాపహరణం విని కులశేఖరుడు రావణునిమీద దండెత్తడానికి సైన్యం సమాయత్తపరచాడట. తాను గుర్రమెక్కి లంకవైపు కదిలాడు. అపుడు గోవిందుడు విమానంలో తనతో తీసుకునివెళ్ళాడని చిన్నన్న మార్చాడు.

తిరుప్పాణార్ చరిత్రలోకూడా పాణార్ వరివెన్నులో శ్రీవత్స అంశంలో జన్మించాడని, మాతదాసుడనే పంచముడు పెంచుకున్నాడని ఆధారగ్రంథాలలో వివరణవుంది. లోకసారంగుడు రాళ్ళతో కొట్టినట్లు, రంగనాథుని నుదుటిపై రక్తం స్రవించినట్టు ఆధారగ్రంథాలలో వుండగా కులప్రసక్తిగాని, అఘాయిత్యంగాని చిన్నన్న వర్ణించలేదు.

ఆళ్వారుల చరిత్రలను సమగ్రంగా వణంచే మరొక కావ్యం పిడ్డిరాజు తిమ్మరాజు 'పరమయోగి విలాసం'. ఇతడు కొండవీటిని పరిపాలించిన అళియ రామరాయని మేనల్లుడు. క్రీ. శ. 1564 నాటివాడు. తిమ్మరాజు తన పరమయోగి విలాసాన్ని మంగళగిరి నరసింహస్వామికి అంకితం చేశాడు. ఇదియొక చంపూ ప్రబంధం. ఐదు ఆశ్వాసాలగ్రంథం. ఇందులోని గద్యపద్యాల సంఖ్య 1381. తిమ్మభూపతి చిన్నన్న పరమయోగి విలాసం ఆధారంగా ఈ గ్రంథం వ్రాసినట్లు

కన్పిస్తుంది. ద్విపదరూపంలో ఉన్న గ్రంథానికి ఇది పద్యరూప పరివర్తనమని చెప్పవచ్చు. ఉదాహరణకు :

"ఘనతరంబైన చక్రము కేల బూని
చెనటి రక్కసుల ద్రుంచిన బడలికయొ
జలరాశి జొచ్చి రాక్షసుల గీటణచి
చెలగి వేదములు దెచ్చిన బడలికయొ
క్షీరసింధువు మథించియు గ్రుంగకుండ
జేరి మందరము మోచిన బడలికయొ
ఘుఖదంత కోరకమున జగత్త్రయము
నిఖిల భారంబు నానిన బడలికయొ
పైకొన్న యుక్కు కంబము గొనగోళ్ళ
జేకొని ప్రక్కలించిన బడలికయొ
జగము లీరేడును చక్కని యడుగు
చిగురుటాకున గొలిచిన బడలికయొ
గండగొడ్డట రాజ కంఠనాళములు
చెండి చెండాడి వైచిన బడలికయొ
దండకావనమున దనుజ వర్గంబు
జెండి వైచుచు జరిపించిన బడలికయొ
కౌరవాధిపునితోఁ గనలి తత్పురము
సీరాగ్రమున బెకల్చిన బడలికయొ
యలవి మీఱంగ గోపాంగనామణుల
చెలువంపురతులఁ దేల్చిన బడలికయొ
మేలిమి తురగంబు మీదట నెక్కి
లీల వయ్యాళిదోలిన బడలికయొ
నాయెడ నాతోడ నింతయు తెలియ
మాయన్న యెఱిగింపుమా"

సీ॥ "నిగమ చోరకుని ఖండించిన యలతయో
యబ్ధిలో గిరిమోచినట్టి యలతో
తెగి హిరణ్యాక్షు మర్దించిన యలతయో
యతని సోదరు జంపినట్టి యలతో
గుజ్జు రూపునకు మేన్గాలిపిన యలతయో
యడవి రాజుల జెండినట్టి యలతో
తొడరి రావణు తలత్రుంచిన యలతయో
యమున నాగట గ్రుచ్చినట్టి యలతో

గోపకాంతుల రతి పెనంకువల యలతో
యలఖలధ్వంసచింత బాటిలిన యలతో
యలఘు కృపతో నిమిత్తంబు దెలుపుమయ్య
నీవు పవళించుటకును నోదేవ దేవ!"

ఇలాగే చిన్నన్న 200 ద్విపదలతో 108 దివ్య తిరుపతుల్ని వర్ణించగా తిమ్మరాజు ద్విరదగతి రగడలలో వర్ణించాడు.

ఇక మూడవది ఆచార్య సూక్తి ముక్తావళి. ఈ గ్రంథకర్త నంబూరి కేశవాచార్య. ఈ గ్రంథం రామానుజాచార్యుల వారికి అంకితం. రచయిత తండ్రి వెంకటకృష్ణాచార్యులు. తల్లి అలమేల్మంగమ్మ. ఇతడు ప్రతివాది భయంకరా చార్యుల శిష్యుడు, మంగళగిరితో చేరిన 'నంబూరు' ఇతని నివాస స్థలము.

ఆచార్య సూక్తి ముక్తావళిలో పూర్వ భాగం, మధ్య భాగం, ఉత్తర భాగం అనే మూడు భాగాలున్నాయి. మొదటి దానిలో 6, రెండవ దానిలో 12, మూడవ దానిలో 6 ఉల్లాసాలున్నాయి. పూర్వ భాగం 19 ఉల్లాసాలలో ఆళ్వారుల చరిత్ర. ఆ పై రామానుజాదుల చరిత్ర, ఆచార్య పురుషుల చరిత్రములున్నాయి. ఇందులో ఆళ్వారుల కథలే గాక విశిష్టాద్వైత రహస్యాలు నిండివున్నాయి కవి గురు పరంపరా ప్రభావము, దివ్యసూరి చరిత్రము, ప్రపన్నామృతము, యతీంద్రప్రవణ ప్రభావం ఆధారంగా ఈ గ్రంథాలు వ్రాశాడు.

"ఈ పిన్న పాపచే యిల భట్టనాథుండు తులసీవనము ద్రవ్వ వెలసియుండె
నీ ముద్దు గుమ్మచే యిట సూరివరులకు బిమగారికిని పుద్దుపట్టియయ్యె
నీ మందయానచే తానుందుగా దాల్చి విరులవందలు హరికొలి కొసంగె
నీ ముద్దురాలచే యిచ్చువేదాగొల్లి వదతియై కృష్ణానుభావమొందె
దగుచు శ్రీరంగభర్త యీ తరుణి కతని కేలుభాంగియు దగనని యింతులనగ
భావమున రంగ నిలిచె"

(ఆచార్య సూక్తి ముక్తావళి)

తెలుగు కవులలో పన్నిద్దరాళ్వారులను కావ్యాదిలో స్తుతించిన కవి కృష్ణదేవరాయలు.

"అల పన్నిద్దరు సూరులందును సముద్యల్లీల గావున్న వె
గ్గలపుం దాపము బాప నా నిజ మస్క కంజాత సంజాతపు
ష్కలమాధ్వీక ఝురి న్మురారి నొగియంగా జొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దరు సూరులం దలతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్"

ఆముక్తమాల్యద (1-10)

3. తెలుగు కవులకు నచ్చిన ఆళ్వారుల చరిత్రలు :

ఆళ్వారులు పన్నిద్దరైనప్పటికి తెలుగు కవులకు విప్రనారాయణుడు, ఆండాళ్ మాత్రమే నచ్చినట్టున్నారు. దీనికి రెండు కారణాలు. మొదటిది ఇతర ఆళ్వారులలో కంటె విప్రనారాయణుని కథలో శృంగార స్పర్శ ఎక్కువ కన్పించడం. భావుకతకు, కల్పనలకు, చిత్రణకు అవకాశం ఎక్కువ కావడం. పైగా రాజులు శృంగారప్రియులు కావడంవల్ల మెచ్చుకోవడానికి అవకాశం కలిగడం. సమకాలీన రాజకీయ పరిస్థితులు కూడా అలాగే ఉండడం.

రెండవది ఆళ్వారులలో గోదాదేవి ఒక్కతె మాత్రం స్త్రీ. శైవంలో 'కారైక్కాల్ అమ్మయార్' అలాంటిది. గోదాదేవి భక్తితో రంగనాథుణ్ణి స్మరించి వరించడం సామాన్య స్త్రీలను కూడా ఆకర్షించే అంశం.

ఈ కారణాల వల్లనే తెలుగులో విప్రనారాయణునికి సంబంధించిన మూడు ప్రబంధాలు, మూడు యక్షగానాలు కన్పిస్తాయి. అయితే గోదాదేవికి సంబంధించిన ప్రాచీన వాఙ్మయం చాల తక్కువ.

### 3.1.1 ప్రబంధాలలో విప్రనారాయణ చరిత్ర :

ఆంధ్రులభిమానించిన ప్రక్రియ ప్రబంధ ప్రక్రియ. తెలుగులో విప్ర నారాయణ కథను ఆధారంగా చేసికొని ముగ్గురు కవులు ప్రబంధాలుగా తీర్చారు.

#### మొదటిది చదలువాడ మల్లన 'విప్రనారాయణ' చరిత్ర :

మల్లన ఎఱ్ఱన వంశంలోనివాడు. ఎఱ్ఱన చిన్నిమనుమడు. ఇతడు శైవాచార సంపన్నుడయినా విప్రనారాయణ కథను అభిమానించాడు. సాళువ మూకరాజు కుమారుడయిన తిరుమలరాజుకు అంకితమిచ్చాడు. కనుక ఇతడు 1580 నాటివాడు. చిన్నన్న 'పరమయోగి విలాసం' ఆధారంగా ఈ గ్రంథం వ్రాయబడింది.

#### రెండవది సారంగు తమ్మయ్య 'వైజయంతీ విలాసం' :

తమ్మయ్య వైష్ణవుడు. గోలకొండను పరిపాలించిన మహమ్మదు శాహి కాలంలో కరణంగా వుండేవాడు. ఇతడు భరద్వాజ గోత్రుడు. నృసింహమంత్రి కుమారుడు. తమ్మయ్య తన గ్రంథాన్ని శ్రీరామునికి అంకితం చేశాడు. ఇతని కాలం క్రీ. శ. 1600.

#### మూడవది పిడుగు వేంకటకవి 'విప్రనాయణ చరిత్ర' :

పిడుగు వేంకటకవి 'మల్లన' పుత్రుడు. అతులిత రస కవితాధార ఆదినారాయణ సోదరుడు. విబుధ జన విధేయుడు. ఇతని కృతి విప్రనారాయణ చరిత్ర. ఇందులో 3 ఆశ్వాసాలే వున్నాయి. అసమగ్రం కూడా. లభ్య భాగం బట్టి తమ్మయ్య వైజయంతీ విలాసం ఆధారంగా వేంకటకవి ఈ గ్రంథం వ్రాసి నట్లు తెలుస్తుంది.

"శ్రీరంగంబున శేషశాయి యగుచున్ శ్రీరంగ నాచ్చారుతో
కారుణ్యాకర మూర్తియై వెలగి లోకంబెల్ల రక్షింప కా
వేరీ మధ్య నివాసుడై బరగు నా విశ్వేశు రంగేశ్వరున్
సారస్ఫూర్తిదలంతు నన్ను కృపచే చాలన్ విలోకింపగన్"

అనే ప్రార్థనవల్ల శ్రీరంగేశునికి అంకితమనవచ్చు.

3.1.2 యక్షగానాలలో 'విప్రనారాయణ చరిత్ర' :

తెలుగు సాహిత్యంలో ప్రబంధాలు, శతకాల తర్వాత కవులభిమానించిన ప్రక్రియ 'యక్షగానాలు' మార్గ దేశి ప్రక్రియలకు కూడలి. ప్రదర్శన యోగ్య మయింది. పండిత పామర రంజకమయింది. తెలుగులో విప్రనారాయణ కథా పరములయిన యక్షగానాలు నాలుగు.

మొదటిది చక్రపురి రాఘవాచార్యుని 'విప్రనారాయణ చరిత్ర' :

ఇతడు క్రీ. శ. 1545 ప్రాంతపు వాడని పలువురి భావము. ఇతడు కందుకూరి రుద్రకవికి సమకాలికుడుగాని లేదా కొంచెము ముందువాడుగాని కావచ్చును. ఇతని కథకు మూలం చిన్నన్న పరమయోగి విలాసం కావచ్చు. శ్రీ రంగేశుడు చోళరాజు సభలో సాక్షాత్కరించినపుడు అప్సరస స్త్రీలు ఏలలు పాడినట్టు కవి వర్ణించాడు.

రెండవది విజయరాఘవ నాయకుని 'విప్రనారాయణ చరిత్ర'

ఇతడు రఘునాథరాయల కుమారుడు. 1633-1673 నడుమ తంజావూరు పాలించిన రాజు. ఇతడు తన యక్షగానాన్ని 'విచిత్ర నాటకం' అని పేర్కొన్నాడు. గేయ ధర్మాన్ని తగ్గించి రూపక కళను ఈ నాటకంలో సంతరించినవాడు విజయరాఘవ నాయకుడు. కవి పరంపరగా వస్తున్న విప్రనారాయణుని కథలో కొన్ని మార్పులు చేయడం గుర్తించదగ్గది.

విప్రనారాయణుని ఆరాధ్యదైవం శ్రీరంగనాథుడు. కాగా విజయరాఘవ నాయకుడు మన్నారుగుడి రాజగోపాలుడని మార్చాడు. విప్రనారాయణుని సమకాలీన వ్యక్తిగా చిత్రీకరించడం మరొక మార్పు. శ్రీరంగం పాండవుల

వశంలో వుండడం, వారు తమకు శత్రువులు కావడం కారణం కావచ్చు
విప్రనారాయణుడు బ్రహ్మచారిగా విఖ్యాతుడయితే విజయ రాఘవనాయకుడు
ఏకపత్నీవ్రతునిగా చిత్రీకరించాడు.

మూడవది ఉత్తర రంగకవి 'భక్తాంఘ్రిరేణు చరిత్ర':

ఈ రచయిత యక్షగానం వ్రాసినా నాటకంగానే భావించాడు. కవిని
గురించిన ఇతర వివరములు తెలియవు. పశ్చిమ రంగమున వెలసిన రంగనాథ
స్వామికి అంకితంగా ఈ యక్షగానం వ్రాయబడింది. [illegible]
ప్రతిబట్టి 1772 పూర్వంనాటిదని చెప్పవచ్చు. 'పరమయోగి విలాసాన్ని
అనుసరించిన నాటకమయినా ఇందులో విటకంటికి వికటదాసరి సంవాదాలు
రమ్యంగా వున్నాయి.

నాల్గవది గడ్డం రామదాసు 'విప్రనారాయణ చరిత్ర':

ఈ యక్షగానం కృతిభర్త మిట్టదొడ్డశౌరి. కవి 1873-1930 నాటివాడు.
ఆశుకవి రత్న బిరుదాంకితుడు. కథలో మార్పులు కనిపించవు. ఈ గ్రంథాన్ని
1850 లో మద్రాసు వెస్టువార్డువారు ప్రకటించారు.

**3.1.3** విప్రనారాయణ కథలోని మార్పులు - చేర్పులు :

తాళ్ళపాక చిన్నన్న, తిమ్మభూపతి, మల్లన వీరి విప్రనారాయణ కథలు
చాలవరకు ఒకే రకంగా కనిపిస్తాయి. కాని సారంగు తమ్మయ్య వైజయంతీ
విలాసంలో చాల మార్పులు చేశాడు. వాటిలో పేర్ల మార్పులు, కథాంశంలోని
మార్పులు గమనించదగ్గవి.

ఆధార గ్రంథాలలో దేవదేవి అక్క 'అలివేణి' కాని చిన్నన్న,
తిమ్మభూపతి, మల్లనలు దేవదేవి అక్క అని చెప్పారుగాని పేరు చెప్పలేదు.
సారంగు తమ్మయ్య మధురకళా ప్రియ అయిన దేవదేవి అక్కకు "మధురవాణి"
అని నామకరణం చేశాడు. ఆధార గ్రంథాలలో విప్రనారాయణునికి సేన
మొదలియారు పంచ సంస్కారాలు చేసినట్లుండగా చిన్నన్న గురువుపేరు చెప్ప

లేదు. ఆధార గ్రంథాలలో విప్రనారాయణుని శిష్యునిపేరు రంగదాసుడని వుండగా చిన్నన్న 'కాంతోపయంతుడు' అని చెప్పాడు. తమ్మయ్య శిష్యుని పేరును 'రంగ'నిగా పరిచయం చేశాడు.

ఇక కథాంశాలలోని ప్రధానములయిన కొన్ని మార్పులు. శ్రీహరి వనమాలికాంశంతో ఒక వైష్ణవ గృహస్థునికి విప్రనారాయణుడు జన్మించాడని ఐతిహ్యముండగా సారంగు తమ్మయ్య లక్ష్మీనారాయణ దంపతులకు సంతానం లేదని, సంతానం లేని కారణంవల్ల ఒక వైష్ణవ యతీంద్రుడు భిక్షకు రావడానికి తిరస్కరించాడని, దంపతులు బాధపడ్డారని, కలలో లక్ష్మికే విష్ణువు కనబడి నలుపు తెలుపు రంగుల పూలదండను ప్రసాదించాడని, అదే వైజయంతి అని మార్పు చేశాడు.

దేవదేవి గయ్యాళి తల్లిపోరు పడలేక వేశ్యావృత్తి మాని విరక్తురాలయ్యేనని చిన్నన్న ప్రాయంగా 'పింగళోపాఖ్యానం' విని విరక్తురాలయినట్లు సారంగు తమ్మయ్య వర్ణించాడు. అలాగే రంగడిచ్చిన గిన్నెను వేశ్యామాత పరీక్షించాలని అనుకొన్నదట. శంఖచక్రాలబట్టి ఆ గిన్నె గుడిలోనిదని గ్రహించి తలవరులకు తెలిపిందని తమ్మయ్య మార్పు చేశాడు. రాజు దేశబహిష్కరణ శిక్ష విధిస్తే విప్రనారాయణుడు దేహ త్యాగానికి సిద్ధమయినట్లు తమ్మయ్య మార్పు చేశాడు.

వైష్ణవాచార విధేయత చిన్నన్నలో, భక్తిరస ప్రాధాన్యం తిమ్మరాజు, మల్లనలలో, శృంగార ప్రాధాన్యం తమ్మయ్యలో చోటుచేసుకుంది.

### 3.2 ప్రాచీన ఆంధ్ర వాఙ్మయంలో 'గోదాదేవి':

వైష్ణవాంధ్ర సాహిత్యంలో ఆముక్తమాల్యదకు విశిష్ట స్థానముంది. ఈ గ్రంథానికి విష్ణుచిత్తీయమని కూడా పేరు. రచయిత వైష్ణవుడు. కృతిభర్త శ్రీనివాసుడు. కృతి కూడా వైష్ణవ సంబంధి. ఆంధ్ర ప్రబంధములలో ప్రౌఢము. ఇందులో అనేక కథలున్నా గోదాదేవి కథకే ప్రాధాన్యం. రాయలు తన కాలంనాటి వైష్ణవ గురుపరంపరా ప్రభావాన్ని తెలిపే కథల్ని పరిశీలించి కొన్ని మార్పులుచేసి ప్రబంధ రచన చేశాడు.

మొదటిది పేర్లకు సంబంధించినది. [ఆధార గ్రంథాలలో పాండ్యరాజుపేరు వల్లభదేవుడని వుండగా రాయలు మత్స్యధ్వజుడని చెప్పాడు. మూలంలో 'అనుగ్రహ' గోదాదేవి చెలికత్తెకాగా రాయలు మరాళి, హారిణి, స్రగ్విణి చెలికత్తెలను జోడించాడు. గోదాదేవికి 'సూడికొడుత్త నాచ్చియార్' అనే పేరు ప్రసిద్ధికాగా దానికి తగినట్టు 'ఆముక్తమాల్యద' అని పేరుపెట్టాడు.

రెండవది కథాంశాలకు సంబంధించినది. మూలంలో తులసీవనంలో 'బాలకన్య' విష్ణుచిత్తునికి దొరికిందని వుండగా నెలదమ్మి బావికి దగ్గర తులసీవనసీమలో తిన్నెపై 'గోద' నిసుగుగా దొరికిందని రాయలు మార్చాడు. గోదాదేవి భూదేవి అవతారంగా చెప్పినా దానికి తోడు సత్యాదేవి అవతారమని కూడా రాయలు స్పష్టం చేశాడు. మూలంలో కుమార్తె దుఃఖాన్ని తండ్రి గుచ్చిగుచ్చి అడగడం, తాను రంగనాథుని వలచినానని చెప్పడం, ఆపై విష్ణుచిత్తుడు శ్రీరంగం వెళ్ళడం వంటివి ఆముక్తమాల్యదలో లేవు. గోదాదేవి విరహాన్ని గుర్తించిన చెలికత్తెలు ఉపచారాలు చేయడం, వ్రతదీక్షకు ప్రోత్సహించడం, కుమార్తె కృశిస్తుండగా విష్ణుచిత్తుడు మన్నారుస్వామిని ప్రార్థించడం రాయలు చేసిన మార్పులు. గోదాదేవి తాను పూలు ముడిచి విడిచిపెట్టడం తండ్రికి తెలియడం, తండ్రి నొచ్చుకోవడం, స్వామి తనకా పూలు సమ్మతమనడం మూలంలోని అంశాలు. కాని గోదాదేవి పూలు ముడిచి విడిచి వేయడం తండ్రికి కూడా తెలియదని రాయలు వర్ణించారు. మూలంలో శ్రీరంగనాథస్వామి గోదాదేవిని వరించి అంతర్ధానం చేశాడనివుండగా రాయలు మధ్య కొంత కథ నడిపినాడు. రంగనాథుడు గోదాదేవిని చూచి తమకంతో ఒక మాయా వధూటిని కల్పించాడు. పల్లకి ఎక్కినది తన బిడ్డ అనియే విష్ణుచిత్తుడు భావించాడు. కాని విడిదికి వెళ్ళి చూడగా అక్కడెవ్వరు కనబడలేదు. రంగనాథుడే మాయం చేశాడని తండ్రి తల్లడిల్లినాడు. స్వామి భయపడి ఆమెను యథావిధిగా విడిదిలో ఉంచాడు. మూలంలోలాగే పరిణయంతో కథను రాయలు ముగించాడు.

తాళ్ళపాక చిన్నన్న పరమయోగివిలాసంలో 'గోదాదేవి కథ'ను చాల మూలవిధేయంగాను కొంతవరకు ఆముక్తమాల్యద ఆధారంగాను వ్రాశాడు. కొన్ని అంశాలలో పాత్రక్రొత్తల మేలుకలయిక కనిపిస్తుంది. ఉదాహరణకు ఆముక్త

మాల్యద ఆధారంగాను వ్రాశాడు. కొన్ని అంశాలలో పాతకొత్తల మేలుకలయిక కనిపిస్తుంది. ఉదాహరణకు ఆముక్తమాల్యద వృత్తాంతం ఆధార గ్రంథాలలో విష్ణుచిత్తుని స్వామి సందర్శించాడు. రాయల గ్రంథంలో గోదాదేవి స్వామికై సిద్ధంగా వుంచిన పూలు ముడిచినట్టు పెరియాళ్వారుకు తెలియదు. కాని తలవని తలంపుగా విష్ణుచిత్తుడు తన కుమార్తె పూలు ముడుచుకోవడాన్ని చూసినట్టు చిన్నన్న వర్ణించాడు.

"జనకుండు వటపత్ర శాయికై యిడిన
ననగూడ లోని క్రొన్నన దండలెత్తి
యొనగూడు కొప్పున నొప్పుగా చుట్టి
నినుపారుబావిలో నీడ చూడంగ
నేమరిపాటుగా నేతెంచి తండ్రి
కోమలి దిక్కు కన్గొని తల్లి ! యిట్లు
హరి సమర్పణమున కమరించు పుష్ప
సరములు నీకు శేషము చేయ తగునే."

అని అప్పుడే పువ్వులు కోసి స్వామి కర్పించి స్వామివల్ల సర్వస్వం తెలుసుకున్నట్టు చిన్నన్న వ్రాశాడు.

యక్షగాన వాఙ్మయంలో విప్రనారాయణ చరిత్ర వున్నట్టే ఆండాళ్ చరిత్ర కూడా వుంది. ఈ చరిత్రను కొత్తూరు రంగనాయకమ్మ రచించింది. ఈమె గురువు, ఈచంబాడి శ్రీనివాసాచార్యులు. ఈ రచయిత్రి శ్రీ రంగనాథ పంగుణి ఉత్తర ఉత్సవ యక్షగానం కూడా రచించిందని పండితులు భావిస్తున్నారు. ఈ గ్రంథాన్ని రంగనాయకమ్మ మదరాసు శ్రీ రామానుజ విలాస ముద్రాలయంలో 1937 ముద్రించారు.

ఈ యక్షగానంలో ఆండాళ్ చరిత్ర ప్రధానమయినప్పటికీ ఆళ్వారుల చరిత్రలుకూడ కనిపిస్తాయి. ఆండాళ్ పెండ్లి వేడుకల పాటలు ఈ యక్షగానంలోని ప్రత్యేకత.

వధూవరులను సఖులు ఉయ్యాల లూచేవేళ 'ఊంజల్ పాట్టు పాడడం' తమిళదేశంలో వైష్ణవుల్లో ఇప్పటికీ కనిపించే ఆచారం.

"శ్రీ విల్లిపుత్తూరు పూంజల్ తొట్టి
చతుర్వేదంగళుం శంగల్ పూట్టి
ఆరుశాస్త్రంగళుం తూణ్గల్ నాట్టి
ఆండాళ మన్నారు ఆడినారూంజల్"

అనడంలో తమిళ వాతావరణం గమనించవచ్చు.

తెలుగులో ప్రత్యేకించి తిరుమంగ ఆళ్వారు చరిత్ర కావ్యాలు లేవు. కాని రెండు యక్షగానాలు మాత్రం కనిపిస్తున్నాయి. మొదటిది కోవెల తిరువేంగడ దాసుది. ఇతడు శ్రీరంగ తిరుమల శ్రీభట్టరార్యుని శిష్యుడు. నరసింహాచార్యుని కుమారుడితడు. వెంకటాచార్యుని మనుమడు. కవి మంగళగిరి నరసింహస్వామికి ఈ యక్షగానాన్ని అంకితం చేశాడు. ఇతని కాలం 1800-1850 కావచ్చని ఆచార్య యస్వీ జోగారావుగారి అభిప్రాయం.

రెండవది పరాశరం శేషాచార్యుల వారిది. ఇతడు వైఖానసుడు. పున్నమాంబా జోగయాచార్యుల పుత్రుడు. నివాసము తెనాలి తాలూకా పేరుకలపూడి. కృతిభర్త తమ్మపూడి నివాసి సూర్యదేవరజోగయ్య, ప్రచురణ టి. చెంగల్వారాయ నాయుని మురహరి ప్రెస్, మదరాసులో 1907 జరిగింది. కనుక కవి 1907 నాటి వాడని చెప్పవచ్చు.

4. జానపద వాఙ్మయంలో ఆళ్వారుల సాహిత్యం :

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు తన "తెలుగు జానపదగేయ సాహిత్య" మను సిద్ధాంత గ్రంథంలో "వైష్ణవమత సంబంధములు"ను శీర్షికలో 'శ్రీ ఆండాళ్ చరిత్రము'ను ఉదాహరించారు. జానపద సాహిత్యంలో ఇతర ఆళ్వారుల ప్రసక్తి కనిపించదు.

శ్రీ ఆండాళ్ చరిత్రం తోహరా రూపకంలో 600 పంక్తులున్న గ్రంథం. ఈ గ్రంథాన్ని వంగిపురం వెం. రంగాచార్యులు రచించారని శ్రీ రామరాజుగారు తెలియజేశారు. ఈ గ్రంథంలో భూదేవి ఆండాళ్‌గా, గరుడాళ్వారు పెరియాళ్వారుగా అవతరించడం, 108 దివ్య తిరుపతుల నామముల శ్రీరంగమాహాత్మ్యం, ఆండాళ్

తిరుమొళి సారాంశము శ్రీరంగనాయకుల కల్యాణవిభవం మొదలైనవి వున్నాయి. తెలుగులో ప్రసిద్ధమయిన రాయల ఆముక్తమాల్యదను శ్రీ రంగాచార్యులు పాట రూపంలో మలిచారు.

ఆండాళ్ యుక్తవయస్కురాలయినప్పుడు విష్ణుచిత్తుడు వరాన్వేషణమునకు సిద్ధమయ్యాడు. కాని ఆ కూతురు హరితో వివాహం చేయించమని ప్రార్థించినదట.

"ఏయే దేశములందు ముకుందుండేయే పేరులతోడన్
ఏయే రూపుల దాల్చియుండెన్ యెరుగ పల్కుమని వేడెన్"

అపుడు పెరియాళ్వారు దివ్య తిరుపతులను వర్ణించాడు. శ్రీ రంగేశు చరిత్రాన్ని విపులంగా వర్ణించమని గోద కోరింది. పెరియాళ్వార్ శ్రీరంగమాహాత్మ్యం చెప్పగానే 'శ్రీరంగేశుని దక్క నన్యునిన్ స్వీకరింప పతిగాన్' అని శపథం చేసింది. మరి హరిపొందుకు ఉపాయం కోరింది. తండ్రి మార్గశిర వ్రతం చెప్పాడు. ఆమె

"తిరుగ ముప్పది పాశురయుతమగు తిరుప్పావు పాడి
వారిజనేత్రుడు రంగేశుండే వరుడగుటకు వేడి"

వ్రతం పూర్తి చేసిందట. శ్రీరంగడు స్వప్నంలో సాక్షాత్కరించి

"ప్రసన్నుడై యా రాత్రి యంతయును పతితోడ భోగించెన్"

ఆరోజే మనకు 'భోగి' అయినదని రంగాచార్యుల వివరణ గమనించదగ్గది. ఆండాళ్ సఖులతో తన అనుభూతిని చెప్పుకొన్నది. విష్ణుచిత్తుడు చింతాక్రాంతుడయ్యాడు. స్వామి స్వప్నంలో సాక్షాత్కరించాడు. శ్రీరంగానికి రావలసిందిగా పురమాయించాడు. ఆకాశవాణి ఆండాళ్ 'భూసతి' అని స్పష్టం చేసింది. శ్రీరంగేశుడు అర్చకులద్వారా విల్లిపుత్తూరుకు వెళ్ళి గోదాదేవిని తోడ్కొనిరమ్మని ఆదేశించాడు. పాండ్యరాజు వారి వివాహానికి సన్నాహాలు చేశాడు. మాధవుడు మానవాకృతితో వివాహమాడాడు. పెండ్లి ఐదురోజులు జరిగాయి. మరునటి రోజు చూడగా

"మరునాడుదయము వటకుటీరమును మగువయు మాధవుడున్
వరవిగ్రహరూపంబుల వెలసిరి నరులెల్లను గొలువన్"

పెరియాళ్వార్ పరితపించాడు. శిలారూపంలోనే శౌరి

"చెట్టబట్టి నీ తనయను నాయెద చేర్చితి మామయ్యా
గోదా కొరకై యిటు విలపించి కుందతగునె మదిలోనన్
ఛేదింపుము మమకార బంధమును చిత్తము జొరనీకన్
ఎపుడు నీ సుతను జూడ దలచెదవొ అపుడు నన్నుమదిలోన్
జపమును చేయుము మామా కోర్కిక సఫలంబగు నటులన్
తరుణి తోడనే దర్శన మొసగెద దయయుంచుము నమ్ము"

అని చెప్పాడు. విష్ణుచిత్తుడు అలాగే హరిని అరాధించి వైకుంఠం చేరాడు.

ఆళవందారు 'ఉయ్యాల పాట'లో వేదాంతం ముఖ్యమయినా ఆళ్వారుల ప్రసక్తి లేకపోలేదు.

"శ్రీమన్నారాయణుని ఉయ్యాలో చిత్తమందున నిలిపి ఉయ్యాలో
సౌఖ్యంబు గనవలె ఉయ్యాలో చక్కగా మనసులో ఉయ్యాలో
మూలాధారమందు ఉయ్యాలో మరి విష్వక్సేనుండు ఉయ్యాలో
భవిష్యదాచార్యులు ఉయ్యాలో భాష్యకార్లధిపతి ఉయ్యాలో
ద్వయమంత్రరత్నము ఉయ్యాలో దర్శనంబాయెను ఉయ్యాలో

విశిష్టాద్వైతంబు ఉయ్యాలో విశదంబుగాజేసె ఉయ్యాలో
భక్తియోగముకన్న ఉయ్యాలో బలమే ప్రపత్తియు ఉయ్యాలో
రామానుజాచార్యులె ఉయ్యాలో రక్షించువారలు ఉయ్యాలో
పన్నిద్దరాళ్వార్లు ఉయ్యాలో పట్టిచూపిన నిష్ఠ ఉయ్యాలో"

ఏది ఏమయినా జానపదవాఙ్మయంలో వైష్ణవసంబంధ గేయాలు తెలంగాణం లోనే ఎక్కువ కనిపిస్తాయి. మహబూబ్‌నగరం, ఆదిలాబాదు, ఓరుగల్లుమండలాలు చెప్పుకోదగ్గవి. గ్రామాధికారులయిన రెడ్లు, వెలమలు, గోలుకొండ వ్యాపారులు అధికంగా వైష్ణవులుకావడమే దీనికి కారణం.

5. తిరునామములలో 'అళ్వారు' ప్రసక్తి :

శ్రీ వైష్ణవ సంప్రదాయానికి పరమప్రమాణాలు రెండు. మొదటిది పరాశర, పారాశర్యాది మునులు ప్రచురించిన సంస్కృత వేదాంతభాగం. రెండవది శఠకోపయతీంద్రులు గుర్తించిన ద్రావిడ వేదాంతభాగం. ఈ రెండవదాని అనుకరణ 'తిరునామములు'.

'తిరునామం' అనే పదం ప్రాచీనమయింది. శఠకోపుల తిరువిరుత్తంలో 'తిరునామచ్చొల్' ఉంది. తిరునామములు సంకీర్తనలయినా వాటిలో విశిష్టాద్వైత రహస్యాలుండడం ప్రత్యేకత. ఆంధ్రప్రాంతాలలోకంటె తెలంగాణప్రాంతంలో 'తిరునామాలకు' వ్యాప్తి ఎక్కువ.

"ఎంచ వశమౌనా ఆళ్వారుల గాంచ వశమౌనా
అంచితముగ శ్రీపతియు పుట్టించు జీవులుచేయు దుస్తర
సంచితార్థములెల్ల తామెడలించి మము రక్షించి రహహ"

అనడంలో ఆళ్వారుల సామూహిక స్తుతి కనిపిస్తుంది.

తిరునామములలో నమ్మాళ్వారును 'తెన్నరంగం పొన్నడి' అని వ్యవహరించారు. రంగనాథస్వామికి పాదుకాస్థానీయులని అర్థం. విష్ణ్వాలయాలలో భగవత్పాదుకలను 'శఠకోప' మంటారు. అందువల్ల భగవత్ పాదుకాస్థానీయులు శఠకోపులు. అంచేత ఇతర ఆళ్వార్లు అవయవస్థానీయులు.

"కారిమార కుమారా ! మీకంటె ఘనులెవరయ్యా మమ్మాటికి
ఘనులిక నెవ్వరయ్యా
శ్రీ రమాపతిశేషి యతనికి తిరుగల విగ్రహము మీరట
తెన్నరంగం పొన్నడనదగు
చెన్ను మీరు ముదలాళ్వారులట శిరము నెమ్మోము సర్వాంగము
సన్నుతిగాంచిన భక్తిసారులే స్తనయుగంబు మీకు
ఎన్నిచూడ భట్టనాథవర్యు లురము ఎంతో వైభరిని విఖ్యాతి
గన్న శ్రీ యోగివాహనులె కంఠదేశమయ్యా కులశేఖరు

లన్న మికరములు వరకా సుదిరమిట భక్తిం గ్రహిరెయి
రెన్నగా సూరుపులట వన్నెగా ధుర కాలు
వన్నెగల పాదపద్మములు వరయుడగు శ్రీరామానుజులు”

(తిరునామములు పుట–52)

తిరునామములలో గోదాదేవి, నమ్మాళ్వారుల స్తుతి ఎక్కువగా వైవిధ్య పూరితంగా కనిపిస్తుంది. ఈ ఆళ్వారుల చరిత్ర కథనంతోపాటు ఆళ్వారులపట్ల తిరునామ రచయితలకున్న భక్తిభావం దాస్య, మధురభక్తిరూపాలలో కనిపిస్తాయి.

చరిత్ర కథనం :

“మంచి తులసి వనమందంచితముగ నుద
యించి శ్రీ విష్ణుచిత్తులగాంచి ప్రేమ మీరగ
పెంచి దానరుచిని మించి యింపు బోణాలతో
పంచబాణు గురినెంచి యాడి మది నెంచిన కొమ్మా
కట్టె పువుల దండలు పెట్టె మంగ కొప్పున
జుటి విభుని కొరకు పెట్టి పంపిన బలుమేటి
శ్రీ విష్ణుచిత్తునిపట్టి
వట్టిమాటలిక కట్టిపెట్టి దయపట్టి
ఏలువారి హరి పట్టపు రాణి

(తిరునామములు పుట–28)

అలాగే నమ్మాళ్వారు చరిత్ర ‘వన్నెమీర శఠగోపుల వైభవము వర్ణింపతరమా’ అనే తిరునామములో వర్ణితం. తిరునామాలలో విప్రనారాయణ, తిరుమంగై ఆళ్వార్ల నుతులు కూడా వున్నాయి.

“చాలా ధన్యులమైతి మమ్మా
భాగవత పాదధూళి మనకు లభించెనమ్మా
దీని ప్రభావము తెలిసి భక్తపద
రేణుముని తదభిధానము గనెనట”

(తిరునామములు పుట–288)

"హరికీర్తన వీనులే పండువుచు
నిరంతరము పరకాలముని పూజన మిడుచు
పరిణయాప్త శ్రీ హరుం దోచి భా
స్వర భాగవతార్చనలు చేసిరట"

(తిరునామములు పుట 238)

భాగవతారాధనలో ఆళ్వారులలో తిరుమంగై ఆళ్వారులది భాగవ తార్చన కోసం ఈ ఆళ్వారు తన ఆస్తిని వెచ్చించాడు. ప్రజాధనాన్ని విచ్చల విడిగా వాడారు. దొంగతనం చేశారు. దోపిడీలు చేశారు. ఆదిదంపతులయిన శ్రీ మహావిష్ణువులు సామాన్యులుగా రాగా వారిని కూడా దోచడానికి సిద్ధమయ్యారు.

## 6 నాలాయిరం ఛాయలు :

వైష్ణవానికి నాలాయిరం నాలుగు స్తంభాలవంటివి. నాలాయిరం పాశురాలు సంగీత ప్రధానమయినవి. వీటిని మొదట సంకలనం చేసినవారు శ్రీనాథమునులు. అంతేకాదు దేవాలయాలలో, పర్వదినాలలో నాలాయిర పఠనానికి ఒక వ్యవస్థ ఏర్పరచినవారు కూడా వారే. వారు నియమించిన గాయకులే "అరయరులు". క్రమంగా ఈ ప్రబంధ పారాయణం వైష్ణవుల నిత్యజీవనంలోను భాగమయింది. వివాహ సందర్భంలో సీర్‌పాడల్, ధనుర్మాసవేళ 'నోము' ప్రాణోత్క్రమణ సమయంలో తిరువాయ్‌మొళిలోని ఒక నిర్దిష్టభాగ పఠనంలాంటిది వ్యాప్తిలోకి వచ్చింది. అందువల్ల వైష్ణవం వ్యాపించిన చోటల్లా నాలాయిరం నిలదొక్కుకొన గలిగింది.

## 6.1 అన్నమయ్య సంకీర్తనలలో నాలాయిరం ఛాయలు :

పాశురాలకున్న గానయోగ్యతను గుర్తించిన అన్నమయ్య ప్రబంధాముల జోలికి పోకుండ సంకీర్తన యాగం మొదలు పెట్టాడు. ఆళ్వారులలాగా దివ్యదేశ సంచారం చేశాడు. నాలాయిరానికి నిత్యపూజాదుల్లోవున్న ప్రాధాన్యం గుర్తించి ఆలాగే పాటలు వ్రాశాడు. వాటిలో కొన్నిటిని చూద్దాం.

మేలుకొలుపు :

తొండరప్పొడియాళ్వార్ 'తిరుప్పళ్ళి ఎళుచ్చి' లో శ్రీరంగనాథుణ్ణి, పెరియాళ్వార్ 'ఆండాళ్' కృష్ణుణ్ణి మేలుకొలిపినట్టే అన్నమయ్య వేంకటేశ్వరునికి మేలుకొలుపులు గానం చేశాడు. వాటిలో 'హరికృష్ణ మేలుకొను (9-254) భోగి శయనమును బుసకొట్టెడిని (1-139) వారిధి శయన వటపత్ర పరియంక (11-170) మొదలయినవి చెప్పుకోదగ్గవి.

మంగళాశాసనం :

కులశేఖరాళ్వార్ ముకుందమాలలో 'జయతు జయతు దేవో దేవకీ నందనోయం' శ్లోకంలో, తిరుమంగై యాళ్వార్ కోషియుం కూడలుం కోయిల్ కొండ కోవలర్ (ఉరైయూర్ దక్షిణ మధురలను ఆలయంగా చేసికున్న గోపాలునిలాగా వున్నవానికి మంగళం)లో, పెరియాళ్వార్ పల్లాండులో, ఆండాళ్ తిరల్ పోట్రి, కషల్ పోట్రి, గుణం పోట్రీ (సామర్థ్యానికి మంగళం, పాదాలకు మంగళం, గుణాలకు మంగళం) అని కీర్తించినట్టుగా అన్నమయ్య మరలి మరలి జయమంగళం సొరిది నిచ్చలును శుభమంగళము (1-448) చేశాడు.

అలమేలుమంగ :

పెరియాళ్వార్ 'వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాళ్గిన్ద మంగయుం పల్లాండు' (నీ వక్షస్థలంలో కుడిభాగంలో మూర్తిమంతురాలై వసించు మంగమ్మకు ఎన్నో వత్సరాలు) అని ఆండాళ్ వేంగడత్తు తన్నాగ తిరుమంగై తంగియనేర్ మార్వర్కు (వేంకటగిరి శ్రీనివాస వక్షస్సునికి) అని కీర్తిస్తే అన్నమయ్య చాల చోట్ల అలమేల్మంగ నురమున నించుకొని (2-231) అని స్పష్టంగా చెప్పాడు.

వేంకటేశ్వర ప్రశంస :

ఆళ్వారుల ప్రబంధాలలో 108 దివ్య తిరుపతుల వర్ణనలున్నాయి. వీటిలో 'తిరువేంగడమ్' ఒకటి. తిరుమళిశై ఆళ్వార్ వెర్పెన్ట్రు వేంగడం పాడినేన్ వీడాక్కి నిర్కిన్డేన్ (కొండ అంటూ వేంకటాద్రిని కొనియాడాను. అంతేకాదు మోక్షం సిద్ధమవి నిలిచాను) అని కీర్తించాడు. పొయ్‌గైయాళ్వార్ వెళ్ళత్తి

నుళ్ళానుం వేంగడత్తు మేయానుం ఉళ్ళత్తినుళ్ళానెన్ట్రోర్ (పాలకడలిలో వున్న వాడు, వేంకటాచలంలో నిలిచినవాడు అయిన విష్ణువు నా మనసులోనున్నాడు) అని కీర్తించాడు. ఆళ్వారులలో పదిమంది స్వామిని సేవించడం గమనించదగ్గ అంశం. ఇక అన్నమయ్య శ్రీనివాస ప్రశంస చెప్పడం సూర్యుణ్ణి దీపంతో చూపడం లాంటిదే.

అణకువ ప్రదర్శన :

తిరుమళిశై తన్నునాయిగా, తొండిరడిప్పొడి పాపిగా, కులశేఖరాళ్వార్ క్రూరకర్మునిగా చెప్పుకున్నారు. తిరుమళిశై ఆళ్వార్ "కళలు నేర్చుకోలేదు, పంచేంద్రియాల ఇష్టం ప్రకారం నడిచాను. అవివేకిని" అని చెప్పుకొంటే, నమ్మాళ్వార్ 'యాచకులకు బిచ్చం పెట్టి ఎరగను. దప్పిగొన్నవారి దాహం తీర్చలేదు. పంచేంద్రియాలు ఎటుపోతే అలాపోయాను. పుష్పార్చన చేయలేదు. మూర్ఖుణ్ణి, కఠినుణ్ణి అని చెప్పినట్టుగా, ఆండాళ్ 'పాపిని క్షుద్రమనుజులమయిన మనం' అని చెప్పుకుంది. అలాగే అన్నమయ్య పసరమువంటి వాడను, శిశువు వంటి వాడను, వసుధలో రాయివంటి వాడను (10-23) అని చెప్పుకున్నాడు.

అన్యస్తుతి వైముఖ్యం :

పొయ్గై ఆళ్వార్ 'వాయవనై యల్లదు వాళ్తాదు' (నా నోరు వెన్నుని తప్ప అన్యుల్ని కీర్తించదు) తిరుమళిశై ఆళ్వార్ నాక్కొండు మానిడం పాడేన్ (ఈ నాలుకతో మనుష్యుల్ని పాడను) కులశేఖరాళ్వార్ 'జానామి నత్వాం మీ' అని కీర్తించినట్లే అన్నమయ్య

> "హరి పుట్టించిన దేహి హరినే కొలువక
> నరుల కొలుచుట అన్యాయమయ్య"

> "నరహరి కీర్తన నానిన జిహ్వా
> పరుల నుతింపగ నోపదు జిహ్వా" అన్నాడు.

మధురభక్తి:

కులశేఖరాళ్వార్ వాసుదేవాప్తున్ వరవు పార్త్రే (వాసుదేవా! నీ రాక కోసం చూసి) అంటే నమ్మాళ్వార్ 'అమకర్ పెరుమనైక్కాండు' లో చెంకత్తైను పురమాయించడం, ఆండాళ్ మేఘాలతో సందేశమంపడం లాంటివి కనిపిస్తే అన్నమయ్యలో హంస సంగతం, సఖీదౌత్యం కనిపిస్తుంది.

ఆండాళ్‌లో మన్మథ పూజా విధానం 'తాయుమై నెల్లోయు' లో కనిపిస్తే అన్నమయ్యలో వలతులై పొంతుల వనవిహారము పొంచి కొప్పులు మించ పువ్వులుగోసి అనే వర్ణనలో స్పష్టమవుతుంది.

అన్నిటికి మించి అన్నమయ్యలో నమ్మాళ్వార్ పాశురాల ఛాయలు, అనువాదాలు, అనుసరణలు ఎక్కువ కనిపిస్తాయి. మచ్చుకు నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళిలో తిరుమలను "ఒళివిల్ కాలమెల్లామ్" అనే పాశురంలో కీర్తించినట్లే అన్నమయ్య

"కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
తెట్టలాయ మహిమలే తిరుమల కొండ"

అని కీర్తించాడు.

(9-182)

తిరువాయ్‌మొళిలోని 'వాయ్‌కొండు' అనే పాశురంలో పతివ్రతాభక్తిని చెప్పినట్లే అన్నమయ్య

"నరహరి కీర్తన నానిన జిహ్వా
బరుల నుతింపగ నోపదు జిహ్వా''

అని కీర్తించాడు.

తిరువాయ్‌మొళిలో 'కులంతాంగు' అనే పాశురంలో హరిభక్తుడన్న చండాలుడైనా పూజనీయుడని చెప్పినట్లే

"పసురము తినెడి మాలయైనను వాడె
పరమాత్మ గొలిచినను బ్రాహ్మణోత్తముడు"

(11-3-117)

అని కీర్తించాడు.

తిరువాయ్ మొళిలో 'అడియార్ స్తుతిలో దాస్యభక్తిని చెప్పినట్లు అన్నమయ్య

"కందువ శ్రీ వేంకటేశ నడుమ నీ బంటు బంటుకు
సందడి బంటు నవ్వచే చాలదా నాకు"

(8-23)

లో కీర్తించాడు.

తిరువాయ్‌మొళిలో భగవత్‌భావనకు సంబంధించి 'అవరవర్' అనే పాశురంలో కీర్తించినట్లే అన్నమయ్య

"ఎంతమాత్రమున నెవ్వరు తలచిన"

(7-159)

అనే పాశురంలో ప్రస్తుతించాడు.

తిరువాయ్‌మొళిలోని 'మణివణ్ణా' 'యెన్మాణిక్యచ్చోదియై' 'కరుమాణిక్యమె' అనడానికి అనువాదప్రాయంగా 'మాణిక్యదీపమనై' 'మాణిక్యపు మన్మథ మన్మథుండితడే' 'పనివడి గొప్ప విడుపాటి నేరెడుబండు, కనుపట్టు పురుషాకారమైనట్టుండె' అని వర్ణించారు.

ఇవేకాకుండా ప్రాబోధిక స్తవం, మనసా, చిలుకా, సంబోధనాత్మకములు ఆళ్వారులలో కనిపించినట్టే అన్నమయ్యలోనూ, తాళ్లపాక కవులలోను కనిపిస్తాయి.

**6.2.** తాళ్లపాక చిన్నన్న రచనల్లో 'నాలాయిర దివ్యప్రబంధ' ఛాయలు :

పరమయోగి విలాసము కేవలం ఆళ్వారుల చరిత్రలుమాత్రం కావు. కనుకనే చిన్నన్న ఆళ్వారుల రచనలనుకూడా అక్కడక్కడ అనువదిస్తూ వైష్ణవ

విజ్ఞానసర్వస్వంగా వైష్ణవ ప్రచారకగ్రంథంగా తీర్చాడు. తలమానికములాంటి పాశురాలను తెలుగులో అనువదించాడు.

మచ్చుకు.

1. పేయాళ్వారు వామనక్షేత్రస్వామి సందర్శనానంతరం భక్తిపార వశ్యంతో చెప్పిన పాశురాలను అనువాదప్రాయంగా

"సిరిగంటి చెన్నుమించిన మేనుగంటి గరమొప్పు వదనవికాసంబుగంటి
సల్లలితావనీ స్తనకుంభ శుంభ పల్లవంబులబోలు పాదముల్గంటి
సరసిజహల శంఖచక్రాంకుశాంక చరణముల్ జగదేక శరణముల్గంటి
దరణిబింబము చాయదరళంబు కనక సురుచి రాంశుకము నంశుకముగన్గొంటి

.... .... .... .... ....

శాతాంశు మండల శతకోటికోటి రీతి జూపట్టు కిరీటంబుగంటి
మలగులై తెల్లదామరల దామరల గలహించు నిడు వాలుగన్నులగంటి
మకరకుండల బాలమార్తాండ రుచుల వికసియు వదనారవిందంబుగంటి"

(పరమ. పుట-99)

2. తొండరడిప్పొడి యాళ్వారు తిరుప్పళ్ళియెళుచ్చిలో రంగనాథునికి మేల్కొలుపులు పాడినట్లే ఆ పాశురాలకు అచ్చమైన తెనిగింపుగా చిన్నన్న

"అరుణ బింబం బుదయాద్రిపై నిలిచె బలపలవేగి వీడ్వడ మబ్బులడగె
నలరుచు భూ దేవియల సొనగురిసె జాలించి కరుణచొప్పడ యోగనిద్ర
చాలించి శ్రీరంగశాయి మేల్కనవే.....................
నిధులు నంబుధులును నిర్జర కపిల-బుధులు నచ్చరలు దుంబురు నారదులును
మునులు నీ ముందర మొనసియున్నారు వనజాప్త కాంతితీవలు వాతె దెసల
జాలించి కరుణ చొప్పడ యోగనిద్ర - జాలించి శ్రీరంగసాయి మేల్కనవె-
తమ్ములు వికసించె దరణియుం బొడమె - గొమ్మలు పసపాడి కోరిరావీడి
కట్టిరి పుట్టముల్ కావేరి నడుమ బుట్టక పుట్టిన పూసెజ్జనున్న
నీల నీరద వర్ణ! నీ యోగనిద్ర జాలించి శ్రీరంగ శాయి! మేల్కనవె!"

(పరమ. పుట - 363-66)

3. పెరియాళ్వారు తిరుప్పల్లాండు (మంగళా శాసనానికి) లక్ష అనువాద సారంగా తాళ్ళపాక చిన్నన్న వ్రాసిన ద్విపదపంక్తులు

"శ్రీ మాల్యకారునిచే దివ్యపుష్ప - దామముల్ తాల్చి యుద్ధ తరంగసీమ
జాణూరమల్లుని శమయించి మిగుల రాణించు శౌరి దోర్దండంబులకును
వలపల రవికోటి వడకించుకాంతి దలుకొత్తుచుండు సుదర్శనంబునకు
నల చెంతనని దైత్యులగలు నాదములు సలుపుచుండెడు పాంచ జన్యంబునకును

కెందామరల పస గిలుబాడు పసలయందంబు గలుగు నీ యడుగు దమ్ములకు
బూధికతోడ నెప్పుడు బంటనైన - యేనును నీవును నెరవింతలేక
యొనుగూడి యుండెడి యునికి కెంతయును నెనపి యుండంగ బె
క్కేండ్లు మంగళము............................"

(పరమ. పుట -

4. తిరుప్పాణ్ ఆళ్వార్ రంగనాథుని దర్శించి పాదాది కేశపర్యంతము వర్ణించి పాడిన 'అమలనాది పిరాన్' అనే పది పాశురాల ప్రబంధాలకు చిన్నన్న చేసిన అనువాదం

"రమణుడౌ వేంకటగ్రావేశుపాద - కమలముల్ నాకన్ను గవ నెలకొనియె
నలఘుప్రసన్నుడై యఖిల లోకములు - గొలిచి దైత్యుల గాథ కులముల నఱకి
కౌతుకంబున నొప్పు కాకుత్స్థతిలకు - బీతాంబరమునం బైరసెనా తలపు
చక్కని వేంకటేశ్వరు బ్రహ్మగన్న - పొక్కిలియరసంజ పొలుపులల్లార్చి
సిరిమించు లొయ్యారి చెంగావి వలువ బరికింప నా ప్రాణప్రదమైతనర్చె

.... .... .... .... ....

ఎట్టి చిత్రమొకాని యిట్టె నా తలంపు గట్టిగా దనసొమ్ముగా జేసికొనియె
నవనీత చోరుండు నా మనోహరుడు - నవిరళ శుభమూర్తి యగు రంగశాయి
గనుగొన్న యీతన గనుదోయి యెండు - గనుపుండుగాక ...."

(పరమ. పుట - 213-15)

5. మధురకవి ఆళ్వార్ 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను పాశురాలకు అనువాదసారంగా చిన్నన్న వ్రాసిన ద్విపద పంక్తులు

"తామసాంభోరాశి తరియింపజేసి - శ్రీమించనను గటాక్షించినయట్టి
కరుకాధిపతియైన గురుపదాబ్జముల - నిరతంబు వసియించి నెలచెనా తలపు
వేతెరంగులనైన వేరొండెఱుంగ - వేదమంతయును ద్రావిడముగా జేయు
పరమ గురుండు నాపాలి దైవంబు.

(పరమ. పుట - 147)

6. తిరుమంగై యాళ్వార్ పెరియ తిరుమొళిలోని 1084 విశిష్టమయిన పాశురాలకి చిన్నన్న తెనిగింపు

"ఘనవిష జ్వాలలు గ్రక్కు-సర్పంబు - నొనగూడి
యొకయింట నుండు చందంబు
గడలి నెన్నడును భగ్నంబైన యోడి - వడకుచుండెడి యెడవాని చందమున
వడిగోసిపాఱు ప్రవాహంబు చెంత బుడమినుండెడి మహాభూజంబు కరణి
నిడియంగ దుదమొదలేర్చు కాష్ఠంబు - నడుమ జీమలపంక్తి నడికుండు సరణి
నెడపకపాఱు నట్టేటిలో జిక్కి- కడు భీతినొందు సృగాలంబు భాతి
తాపత్రయోర్మి సంతతుల నేపారు నాపూర్ణ సంసారమును పయోరాశి
లోలత మునిగి తేలుచున్న నన్ను బాలించి దరిచేర్చు పరమేశ"

(పరమ. పుట - 422)

7. తిరుమంగై ఆళ్వార్ సాష్టభుజకర నరసింహస్వామిని కీర్తించి గానం చేసిన పాశురాలకు తెనిగింపుగా చిన్నన్న వ్రాసిన ద్విపదలు

"కరుణ నాదైన యాకలి చూడలేక యరుదెంచి నా కమృతాన్నంబు పెట్టి
దన నామ మడిగిన దయతోడ నవ్వి పునుగ కెప్పుడు సాష్టభుజకరుడైన
హత హేమ కశిపుండననియె నేవేలు నతడె పంచేషు పంచాయుధాబ్జములు
ధరియించి యసుర డెందము విదారించి శిరము చేరిన నరసింహ విగ్రహుండు
నతడె శ్రీ వామనుడతడె విష్ణుండు నతడె నాకులదైవ మన్నియు నతడె"

(పరమ. పుట - 429)

మధ్యయుగ కాలం నాటి కాంట్రపేట రామానుజాచార్యులు నమ్మాళ్వారు తిరువాయ్‌మొళిని ద్విపద కావ్యంగా వ్రాసినారు. చాలావరకతడు చిన్నన్న పరమయోగివిలాసాన్ని అనుసరించినట్లు స్పష్టమౌతున్నది. మచ్చుకు

తిరువాయ్‌మొళిలోని 'ఎంబిరానై' పాశురభావం

"తల్లియు దండ్రియు దానయై మనకు నెల్ల దాస్య సుఖంబులిచ్చిన ఘనుడు అవతార ముఖమున నతులితంబగుచు నవనీల మేఘంబు నగు మేనివాడు మన మిందఱమును సమ్మతి నాశ్రయింప ననఘుండు మననొప్పులన్నియు మాన్చు."
ఇదేగాక శ్రీ భండారు సుదర్శనార్యారయ్య 'తిరుప్పళ్ళాండు' అనే గ్రంథం కూడా వ్రాసినట్టు తెలుస్తుంది.

### 6.3 తిరునామములలో దివ్య ప్రబంధ ఛ్ఛాయలు :

ఆళ్వారుల దివ్య ప్రబంధాలను ద్రావిడ వేదాలుగ చెప్పడం పరిపాటి. వేదాలు పరబ్రహ్మ ప్రతిపాదకమయినట్లే ద్రావిడ వేదాలు కూడా పరబ్రహ్మ సంధానానికి పరబ్రహ్మప్రాప్తికి అనువయినవి. తిరునామములలో 'ద్రావిడవేద' ప్రసక్తి ఎక్కువ.

"అన్ని వేదముల వంటిది గాదమ్మా
ద్రావిడ వేదము
ఎన్ని వేదములనైన తానెదిరించి నిగ్రహించు
శేన యాగాది విధివాక్య సంతతి నిహ
భోగానుసరణ బోధమాని
పూని శాశ్వత సదానుభవంబిది
తా నాత్మేశుని దాస్యరూపమనె"

(తిరునామములు – 32)

తాను పరమాత్ముడు దాసుడు. అస్వతంత్రుడు. అతనికి దాస్యం చేస్తూ శాశ్వత సుఖానుభూతి మార్గం చూపే మతం శ్రీ వైష్ణవం. తిరునామములలో నాలాయిర దివ్య ప్రబంధ ఛ్ఛాయలెన్నో కనిపిస్తాయి. మచ్చుకు

పల్లాండు తిరునామం :

దండామని చెప్పరే నా స్వామిని దయవుంచమని యడుగరే
దండామని తమ దాసహృత్కమల మందుండి రక్షించు బ్రహ్మాండ నాయకునకు
ఇద్దరు భార్యలకు పెద్దైన మా యిందిర యనుబాలకు
ముద్దుమొగంబున ముదమొప్పగాను దిద్దిన కస్తూరి తిరుమణిరేఖకు
ఉరగ తల్పంబునకు అతడెక్కేటి గరుడ వాహనమునకు
అరుదుగ పన్నిద్దరాళ్వారులకెల్ల శరణని చాలగ సిరులవ్వమని దూరె
చారు భుజంబులకు మెప్పైన శ్రీ శంఖ చక్రంబులకు
హారకుండల మణిహార శృంగార శరీర సద్భక్త మందార భుజంబునకు

'రక్షక' అనడానికి బదులు 'దండము' అనేమాట ఇక్కడ వాడబడింది. ఇవేగాక నమ్మాళ్వార్ పాశురాలలోని స్త్రీత్వారోపణ. నారాయణ పరత్వం, భాగవత ప్రశస్తి, ఆచార్యప్రాధాన్యం, క్షేత్రప్రశస్తి, నవవిధ భక్తి భేదాలు, కుల నిరస నాదులు తిరునామములలో విరివిగాకనిపిస్తాయి. మచ్చుకు కొన్ని

స్త్రీత్వారోపణ :

"తాళగలనా నిముషము బాయగలనా
తాళగలనా లలన మా నమ్మాళ్వారుల దేవగానము"

క్షేత్ర ప్రశస్తి :

నమ్మాళ్వారు తిరువాయ్ మొళియందు 35 దివ్య దేశాలను కీర్తించారు. వాటిలో ప్రసిద్ధములు శ్రీరంగం, తిరుపతి మొదలగునవి. తిరునామములలో శ్రీరంగం, తిరుపతి, విల్లిపుత్తూరు క్షేత్ర ప్రసక్తి విరివిగా కనిపిస్తుంది.

కుల నిరసనాదులు :

"కులము కారణమేమి గుణమే ప్రధానము
కులములో నేమున్నది
పలుక నేటికి విష్ణుభక్తులై యుండేటి
పావనమగు చున్నది"

అనే తిరునామంలో వ్యాస, పరాశర, నారద, జటాయువు, విదురులను ప్రస్తా వించారు.

> ''కుల గోత్రములను గోతులలోబడి కూలలేవే
> కులము కారణమని నిక్కేకు
>
> చదువులు చదువగనేమి విప్రజాతిని పుట్టగనేమి
> మద మత్సరములన్ని వదలి దాసుల దాసిగా వలెను''

మొదలైనవి.

జానపద గేయ రీతులు నాలాయిరంలో కనిపించినట్టే తిరునామములలో కూడా మనసా, చిలుకా, హంసా, చందమామ పదాలున్నాయి. అలాగే మతం వ్యాప్తి కావడానికి వీలుగా వివిధ వృత్తుల సంకేతాలు కూడా తిరునామాలతో చోటు చేసుకున్నాయి. మచ్చుకు

పెరుగు పాట :

> ''పెరుగోయమ్మ పెరుగు
> పెరిగిన దుర్గుణ మరుగు
> అతి మధురంబిది పెరుగూ
> దోషాదుల బిల్లలు కరుగూ
> అతులితమ్ముగ ద్రావిడ వేదార్థము
> యతిపతి దాసుల కతిమోదంబిడి

(తిరునామములు - 57)

చింత చిగురు పాట :

> ''చింత చిగురు గొనగదరె ఆళ్వారు
> చింత చిగురు గొనగదరె''

(తిరునామములు - 40)

మనసా :

ఊరకే చదువుచు సీతల
యూచనేటికే యో మూఢ చిత్తమా''

(తిరునామములు - 37)

''వద్దు మనసా భాగవత దూషణ వలదు మనసా''

(తిరునామములు - 377)

ఒక్క వాక్యంలో చెప్పాలంటే తిరునామములలో దివ్య ప్రబంధాల అనుకరణ మాత్రం గాకుండా ముముక్షుప్పడి, వార్తామాల, ఆచార్య హృదయం, శ్రీవచనభూషణం, రామానుజ రచనల ప్రభావం అతివేలంగా వుందని చెప్పవచ్చు.

7. ఆధునిక యుగంలో ఆళ్వారుల వాఙ్మయం :

ఇరవయ్యవ శతాబ్దంలో వెలువడిన ఆళ్వారుల వాఙ్మయాన్ని ఐదు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది పద్యగద్య గేయ నాటకాలు మరి అనువాదాలు.

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు 'గోదా వైభవం' పద్య కావ్యంగా సంతరించినవారు. 13-11-71 లో మొదలుపెట్టి 29-12-71 లో ముగించారు. 30 దినాల అనుభూతిని 30 ఖండాలలో సువ్యక్తం చేశారు. భాగవత దశమ స్కంధ పారాయణంతో ముగ్ధులై ఈ కావ్యం వ్రాసినట్లు పీఠికలో తెలియచేశారు. శ్రీ ఆచార్యులవారు పరంపరగా వినబడే గోదాదేవి కథలో కొన్ని మార్పులు చేశారు.

విల్లిపుత్తూరు స్వామి వటపత్రశాయి కాదు. అతడు వేణుగోపాలుడు. గోదాదేవి స్నానం చేసి వస్తుండగా కృష్ణుడు స్పృశించినట్లు అనిపిస్తుంది. జడలో ముద్దబంతి పూవు మాయమవుతుంది. స్వామి వేణువుపై ఆ ముద్దబంతి పూవు కనబడుతుంది. స్వామి గోద కోసం ఆరాటపడడం దీనిలోని ప్రత్యేకత. గోద మేనమామ పెళ్ళి కోసం రాగా గోదాదేవి వేణుగోపాలుణ్ణి ప్రార్థిస్తుంది. వివాహం విల్లిపుత్తూరులోనే జరుగుతుంది.

గోదా కల్యాణం వ్రాసిన వారిలో మరొకరు శ్రీ పీసపాటి రంగాచార్యుల వారు. వీరు గోదా కల్యాణంతో బాటు తిరుప్పావైను అనువదించారు కూడా. ప్రథమాశ్వాసంలో 92, ద్వితీయాశ్వాసంలో 49, తృతీయాశ్వాసంలో 61 పద్యాలున్నాయి.

"పన్నిద్దరాళువారుల
సన్నిధుల న్మనమునందు సాష్టాంగముగా
పెన్నిధులని సేవింతును
పన్నగ శయనుని పవిత్ర పదముల గొల్తున్"

అని ఆళ్వారుల పట్ల తనకున్న భక్తి ప్రపత్తులను ప్రకటించుకున్నారు. తిరుప్పావైను 30 సీస పద్యాలలో తెనిగించారు. చివరగా

"కృతి కర్త రంగ దాసుడు
కృతిపతి రంగేశు డాత్మకృతి నీ గోదా
సతి చరితమ్ము నొసంగెను
కృత కృత్యుడగుచు పూర్వకృత సుకృతమునన్"

అని ముగించారు.

గోదాదేవి కథను గేయ కావ్యంగా తీర్చినవారు శ్రీ దివి రంగాచార్యులవారు. శ్రీ వల్లభరాయ గ్రంథమాల, చీరాలవారు 1981 లో ఈ గ్రంథాన్ని ముద్రించారు.

ఈ గ్రంథం మంజరీ ద్విపదలో రచితం. విష్ణుచిత్తుడు గోదాదేవి బాల్యం అర్చన పోలిక, వ్రతం, ఐక్యం, పెరియాళ్వారు అనే భాగాలు ఇందులో కనిపిస్తాయి. రచయిత చాల మార్పులు చేశారు. ఈ కథలో వివాహ ప్రసక్తులు లేవు. గర్భాలయంలో ప్రవేశించి 'గోద' అంతర్ధానమవుతుంది. ముగ్ధభక్తికి విష్ణుచిత్తుడు, మధురభక్తికి గోదాదేవి ప్రతీకలు. గోదాదేవి పొందినది మధురాద్వైత అర్థసిద్ధి. ఈ కథలో 'గోద' భూదేవి అంశ కాదు. శ్రీదేవి అంశ. గోదలో జీవాత్మ సందేశం కూడా కనిపిస్తుంది. గుణ, రూప, పూజ, స్మరణ, ఆత్మ నివేదన, విరహాదులున్నాయి.

"రాధికా లోలుండు రాదేల నేడు
రాధ నేనే కాదె రసకేళి తేల"

అనడం గోదాదేవి వంతు అయితే

"తన్ను యశోదగా తలపోయు నతడు
భక్తి యుక్తుండౌను సహజ సత్యమున"

అనడం విష్ణుచిత్తుని వంతు. ఈ కావ్యంలో విష్ణుచిత్తునిది వైరాగ్యంతో కూడిన జ్ఞానభక్తి.

తెలుగులో తిరువాయిమొళికి ఆంధ్ర పద్యానువాదం చేసిన అర్వాచీన కవి బ్రహ్మశ్రీ చెన్నపురాజు కొండనామాత్య దేశపాండ్యగారు. నమ్మాళ్వారు తిరునక్షత్ర సమయంలో కవికి ఆళ్వారు సాక్షాత్కరించి రచనకు ప్రేరేపించారు.

"ద్రావిడ వాణ్మిబాడితిని రాజిల వేద చతుష్టయంబులన్
కోవిదులుల్లసిల్ల మనుగూర్చు తెనుంగున నీ ముఖంబునన్
భావుక మంద జెప్పెద ప్రబంధము నాంధ్రవచోనుభావనం
భావన లెస్సయని పల్కెడె కన్నడ రాయదర్శిలిన్"

అనే పద్యం దీనికి సాక్ష్యం. ఈ పుస్తకానికి నిడుదవోలు వేంకటరావుగారు విపులమైన పీఠిక వ్రాశారు. ఇందులోని ఒక అనువాద పాశురము.

"మా పూర్వులకును పూర్వుడు
రూపింపగరాని సుగుణ రుచిరాంగుడు ని
త్యాపాదిత పూజార్హుడు
డాపుగ శ్రీ వేంకటాద్రి ధవుని దలంతున్"

ఇక రెండవది తెలుగు లిపిలో సంస్కృత ద్రావిడ భాషలలోని ఆళ్వారుల చరిత్రలకు సంబంధించిన గ్రంథాలను ముద్రించడం. ఈ మహోపకారాన్ని చేసిన వారు ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య స్వాములవారు. వారు అ. ము. శ్రీనివాసాచార్యులతో కలిపి గరుడవాహన పండితుడు రచించిన శ్రీ దివ్యసూరి చరిత్రాన్ని ముద్రించారు. అలాగే మణవాళప్పెరుమాళ్ నాయనార్ రచియించిన

ఆచార్య హృదయాన్ని 1972 లో ప్రకటించారు. భాష తమిళమయినా తెలుగు లిపిలో ముద్రించడం ఈ గ్రంథం ప్రత్యేకత.

ఇక మూడవది నాలాయిర దివ్య ప్రబంధాలకు టీకా తాత్పర్య భావ వివరణలు సమకూర్చడం. ఈ ప్రయత్నం చేసిన పెద్ద సంస్థలలో తిరుమల తిరుపతి దేవస్థానం. శ్రీ రామానుజ కీర్తి కౌముది గ్రంథమాల (గుంటూరు) శ్రీ గోదా గ్రంథమాల (ముసునూరు) ప్రసిద్ధాలు. ఇక వ్యక్తుల దృష్ట్యా చూసి నపుడు ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య స్వాములవారు, మాడభూషి రామానుజాచార్యులవారు ఇంకా ఎందరో పెద్దలు ఈ భారాన్ని సమర్థవంతంగా మోసినవారే. కె. టి. యల్. యన్. ఆచార్య తిరుప్పల్లాండు, కె. టి. యల్. నరసింహాచార్య తిరువాశిరియం, నాచ్చియార్ తిరుమొడి మొదలైనవి ఆళ్వారు వాఙ్మయ ప్రచారంలో మైలు రాళ్ళు. అయితే వీటిలో తి. తి. దేవస్థానం 'తిరువాయ్ మొళి' ప్రామాణికమయిన గ్రంథమనడంలో సందేహంలేదు. దివ్య ప్రబంధాలలో 'తిరుప్పావై'కు వచ్చిన వ్యాఖ్యాన గ్రంథాలు మరే దానికి రాలేదనవచ్చు. వీటిలో తి. తి. దేవస్థానం వారు శ్రీ సుదర్శనాచార్యుల వారి 'తిరుప్పావై' వివరం సమగ్రమని చెప్పవచ్చు.

ఇక నాల్గవది తెలుగులో ఆళ్వారుల వాఙ్మయ వైశిష్ట్యం గురించి నిరూపించే పరిచయ విమర్శ గ్రంథాలు. ఈ రంగంలో సాటిలేని కృషి చేసినవారు ఇద్దరు. టి. లక్ష్మణాచార్యులు, శ్రీ ధనుర్ధరం వరదాచార్యులవారు. వరదాచార్యులవారి 'ఆళ్వారులు - దివ్య ప్రబంధములు'. ఆళ్వారుల వాఙ్మయం చదివేవారికి 'కరదీపిక' లాంటిది. వీరేగాక శ్రీ రామానుజదాసులు విరచించిన దివ్యసూరి కథాసారం, మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ రచించిన దివ్యసూరి హృదయం, ఆచార్య పురుషుల చరిత్ర లాంటివి బాగా ప్రచారంలోని పుస్తకాలే. తిరుమల తిరుపతి దేవస్థానం వారు కూడా ఆళ్వారుల దివ్య వైభవము అనే పుస్తకాన్ని ప్రచురించారు. శ్రీ తిరువాయిపాటి రాఘవయ్య ఈ గ్రంథ రచయిత. శ్రీ రామానుజ కీర్తి కౌముది గ్రంథమాలలో పన్నిద్దరాళ్వారుల చరిత్రలు లఘుకావ్యాలుగా కూడా ముద్రితం.

ఇక ఐదవది శ్రీ వేంకటేశ్వర స్వామిపై ఆళ్వారులు పాడిన పాశురాల ప్రచురణ. తి. తి. దే. వారు 1947 లో తిరువేఙ్కడముడైయాన్ విషయముగ

ఆళ్వారుల మంగళాశాసనములు ఎ. జయరాం నాయుడు, బి. ఎ., వారిచే ప్రచురింపబడినది. అలాగే దేవస్థానం వారే చెలికాని అన్నారావుగారి ప్రోత్సాహంతో శ్రీ దివ్యసూరులు అనతిచ్చిన మంగళాశాసన పాశురములను 1957 లో ముద్రించారు. శ్రీ సుదర్శనాచార్య స్వామిగారు తెలుగులో టీకా తాత్పర్యాలతో ఈ పాశురాలకు చక్కని వ్యాఖ్యానం చేశారు. ఇవేగాక ఆళ్వారులకు సంబంధించి తెలుగులో సిద్ధాంత గ్రంథాలు పత్రికా వ్యాసాలు చాలా ఉన్నాయి. వీటిలో ప్రత్యేకించి ఆచార్య వేటూరి ఆనందమూర్తి వైష్ణవ వాఙ్మయం, డా॥ జె. మునిరత్నం అన్నమయ్య ఆళ్వారులు - తులనాత్మక పరిశీలన, డా॥ కిడాంబి నరసింహాచార్య తిరునామములు మొదలయినవి చెప్పుకోదగ్గవి.

శైవ సాహిత్యంలాగే ఆళ్వార్ వాఙ్మయం విశిష్టమయింది. మత ప్రాంత భాషా భేదాలను విస్మరించి ఈ సాహిత్యాన్ని సమగ్రంగా అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా వుంది. సంస్కృత ద్రావిడ భాషలలోని ఆళ్వార్ వాఙ్మయాన్ని తెలుగులో అనువదించి ఆ సాహిత్య మాధుర్యాన్ని అందించవలసిన బాధ్యత తిరుమల తిరుపతి దేవస్థానం వంటి వారికి తప్పక వుంది.

## ఉపకరించిన రచనలు


1. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర — డా॥ యస్వీ జోగారావు
2. ఆచార్య సూక్తి ముక్తావళి — నంబూరి కేశవాచార్యులు
3. ఆముక్తమాల్యదా సౌందర్యము — డా॥ టి. కోటేశ్వరరావు
4. ఆళ్వారుల దివ్య ప్రబంధం — ధనకుధరం వరదాచార్యులు
5. ఆళ్వారుల మంగళాశాసన పాశురములు — టీక కె. వి. సుదర్శనాచార్య
6. కృష్ణమాచార్యుని కృతులు పరిశీలన — సి. హెచ్. వెంకటేశ్వరరావు
7. తాళ్ళపాక కవుల కృతులు వివిధ సాహితీ — ప్రక్రియలు — డా॥ వేటూరి ప్రభాకర శాస్త్రి
8. తిరునామములు - సమగ్ర పరిశీలనము — డా॥ కిడాంబి నరసింహాచార్య
9. తెలుగు జానపద గేయ సాహిత్యము — డా॥ బి. రామరాజు

10. ద్వాదశ సూరి చరిత్రము —కె. టి. ఎల్. నరసింహాచార్యులు

11. ద్విపద వాఙ్మయము — డా॥ నాగయ్య

12. పరమయోగి విలాసము — తాళ్ళపాక చిన్నన్న

13. విష్ణుభక్తి తత్పరుడు - విప్రనారాయణుడు — డా॥ ఎడ్ల బాలకృష్ణారెడ్డి

14. వైష్ణవాంధ్ర వాఙ్మయము — డా॥ వేటూరి ఆనందమూర్తి

15. Golden Jubilee Celebration Souvenir T. T. D.
Collected Papers —Prof. N. Subbu Reddiar

[తిరుమల తిరుపతి దేవస్థానం దివ్య ప్రబంధ ప్రాజెక్ట్ ఏప్రిల్ 1991 లో నిర్వహించిన సెమినారులో చదివిన వ్యాసం]

# శ్రీనాథుని చాటువులలో సాంఘిక జీవన చిత్రణ

ప్రాచీనాంధ్ర కవులలో శ్రీనాథుని కొక ప్రత్యేక స్థానం ఉంది. ఆ మహా కవికి గీర్వాణమంటే ఎంత గౌరవమో తెలుగంటే అంత ప్రాణం. ఆ కవికి ప్రౌఢ ప్రబంధాలను వ్రాసి పండితుల్ని మెప్పించే సామర్థ్యం ఉన్నట్లే సామాన్యుల్ని మరపించే మురిపించే రచనలు చేసే నైపుణ్యం వుంది. అతడెంత రసికుడో అంతకు మించి భక్తుడు కూడా. ఎన్నో పదవుల రుచులు చూసినవాడైనా పామరులతో సమానంగా కష్టసుఖాలు పంచుకున్నవాడు శ్రీనాథుడు. అందువల్లనే ఇతరుల చాటువులలో కనిపించనంత సాంఘిక చిత్రణ శ్రీనాథుని పద్యాలలో కనిపిస్తుంది.

సాంఘిక చరిత్ర అంటే ప్రధానంగా ప్రజల చరిత్ర. అది సామాన్యుల సొంత కథ. సాంఘిక చరిత్రలో ప్రధానంగా నాలుగు అంశాలుంటాయి. మొదటిది అందరికి అవసరమయిన నీరు-కూడు-గుడ్డ-నివాసాలకు సంబంధించిన ప్రయాస. రెండవది ప్రజాజీవనం సాఫీగా సాగడానికి ఏర్పరుచుకున్న వర్ణవ్యవస్థ-కులవృత్తి వ్యవస్థ. ఇంక మూడవది సంఘములోని కొందరి వ్యక్తుల ప్రవృత్తులు. నాల్గవది రాచరికానికి సంబంధించిన విశేషాలు.

మనిషి మనుగడకు 'నీరు' చాల అవసరం. 'నీరే ప్రాణాధారము. నోరే రసభరితములగు నుడులకు నెల్లన్' అన్నాడొక కవి. నీటి పద్ధతి ఈనాడు ఎలా వుందో శ్రీనాథుని కాలంలోను అక్కడక్కడ వుండేవి. దేవునిమీద భారం వేసి, బావులు త్రవ్వుతూ, అందులో నీరు పడకపోగా, ఇంకాస్త తవ్వితే 'గంగ' పడుతుందేమోనని, ఈనాడు ప్రయత్నించినట్లే ఆనాటి పలనాటి వాస్తవ్యులు ప్రయాస పడేవారేమో. వారి ఆవేదనను అర్థం చేసుకున్న శ్రీనాథుడు,

> ''సిరిగల వానికి చెల్లును
> తరుణులు పదియారు వేల్వురదగఁ బెండ్లాడన్
> దిరుపమున కిద్దరాండ్రా
> పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్'' అన్నాడు.

ఇది వెటకారము కాదు. అమాయకుల 'ఆస్తిక్యాన్ని' కాలరాచడం తప్పని కాలకంఠునికి హెచ్చరిక కూడా. 'అంగడి యూరలేదు' అనే చాటువులోకూడ 'నీటికై భంగపడంగ బ్రాల్పడు కృపాపరు లెవ్వరు లేరు' అని వర్ణించాడు.

నీరు తర్వాత మనిషికి అవసరమయింది 'ఆహారం.' ఈ ఆహారం ప్రాంతం బట్టి, ఆర్థికస్తోమత బట్టి, వ్యక్తి అభిరుచుల బట్టి మారుతూ వుంటుంది. రాకపోకల సాధనాలు అంతంత మాత్రంగా వున్నరోజుల్లో దొరికే వస్తువులతోనే అన్నీ సర్దుకోవడం అలవాటు. పలనాటి సీమలో జొన్న ముఖ్యమైన పంట. అక్కడివారికి "జొన్న కలి జొన్నయంబలి జొన్నన్నం జొన్న పిసురు" రోజూ వుండేదే. చింతచిగురు బచ్చలికూర కలిపిన కూడు వారికి విందు భోజనం లాంటిది. ఉన్నవారు లేనివారు జొన్నకూడుతో తృప్తి పడడం చూసి శ్రీనాథుడు 'కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్' అని విసురు విసిరాడు.

పలనాటి 'ఫలహారం' ఈలా అయితే అరవల వంటా వార్పు ఆంధ్రుల్ని అదరగొడుతుంది. తెలుగువారి వంటకంలో 'పప్పు' ప్రధానమయితే తమిళుల భోజనంలో 'చారు' ముఖ్యం. ఈ వంట వార్పుకు జడిసిపోయి

> "తొలుతనే వడ్డింత్రు దొడ్డమిర్యపుఁ జారు
> చెవులలోఁ బొగవెళ్ళ చిమ్మరేఁగ
> పలు దెఱంగుల తోడఁ బచ్చళ్ళు చవిగొన్న
> బ్రహ్మరంధ్రము దాకఁ బారు నావ
> వేపాకు నెండించి వేసిన పొళ్ళను
> గంధాన గాంచినఁ గ్రక్కువచ్చు"

అని నమస్కారం పెట్టడం ఒక సన్నివేశం. ఇక 'కర్ణాటకప్రాంతంలో అయితే వెల్లుల్లి, తిలపిష్టం, చల్లా అంబలి' మొదలయినవి సామాన్య ఆహార నియమాలు.

ఇంక ఆర్థికస్తోమత బట్టి పరిశీలిస్తే శ్రీనాథుని చాటువులలో 'పేదవారి భోజనం'కూడ లేకపోలేదు.

"మూతిని ముట్టగా వెఱతు ముద్దకు ముద్దకు గూటి లోపలన్
బూతికపాలు సైకతం పచ్చడి కొంచెము ఘ్యాది నుండియు
చూతమటన్న లేదు." కాని కలవారి ఇండ్లలో పప్పన్నం,

పరమాన్నం, నేయి, పచ్చళ్ళు, పానకాలు, బొబ్బట్లు, ఊరగాయలు వగైరాలున్నట్లు 'అపూపసూప వప్తాంగ భంజనులార' పద్యం సాక్ష్యం పలుకుతుంది.

తిండితర్వాత మనిషికి అవసరమయింది మానసంరక్షణకోసం వస్త్రం, ఈ వస్త్రధారణకూడ ప్రాంతంబట్టి, ఆర్థికస్తోమతబట్టి, అభిరుచులబట్టి మారుతుం టుంది. గొంగలికప్పు, మేలుపచ్చడాలు, వంకరపాగాలు, మైలకోకలు, నడుము వంగిన కత్తులు, మైసూరివారి వేషాలు, కుళ్ళాపెట్టుకోవడం, కోకచుట్టడం, మహా కూర్పాసం తొడగడం వారి గాంభీర్యానికి వన్నె చేకూర్చే అంశాలు.

శ్రీనాథుడు పురుషులవేషంకన్నా స్త్రీలవేషాన్ని విరివిగా చాటువులలో వర్ణించాడు. ఆనాటి స్త్రీలు మల్లియచీర, చెంగావిచీర, పాలవెల్లువవంటి చీర, కుసుమంబద్దిన చీర, సన్నపుచీర, మడిచీరలు కట్టేవారు. ఇక ఆనాటి రవికలలో ఎఱరైక, యమునారైక, కావిరైక, కుట్టినీ రవిక, చందురు కావిరైకలుండేవి. చీర రైకలే కాకుండా ఆనాటి స్త్రీలు 'వన్నెల గాగరలు' అంటే రకరకాల రంగుల పావడాలుకూడ అందంగా ధరించేవారు. పైటల్లోకూడ నాచుపైట, దిగజారినపైట, బిరుసు పయ్యెదచెంగు, ఓరపయ్యెదకొంగు, మైజాఱు కోయలున్నట్లే కుచ్చెళ్ళలో కూడ పటువారు సందెడు కుచ్చెళ్ళు, జిగిమీఱు కుచ్చెళ్ళు, మోగాళ్ళ జీరాడు చీర, చుంగులుజారెడు కుచ్చెళ్ళు ఆనాటి అతివలు మెచ్చుకొనే అలంకరణలు. బొట్టులలో కూడ అగిసాకు బొట్టు, కుంకుమ చుక్కబొట్టు, విభూదిబొట్టు, సింధూరపు బొట్టు, కస్తూరిసోగ బొట్టు, భూతిరేఖలు, తిరుచూర్ణం ఉన్నాయి. ఆభరణాలలో గెలుకు మట్టెలు, మంజీరాలు, కనకపుటందియలు, మొలనూలు, పచ్చపూసలు, హారాలు, కమ్మలు, ముక్కుచెన్నత్తు, అరవీసపు మంగళసూత్రమువంటివి కూడ కనిపిస్తాయి.

కూడుగుడ్డల తర్వాత మనిషికి 'నీడ' అవసరం. శ్రీనాథుని చాటువులలో 'ఆకాశ హర్మ్యాల' వర్ణనలు లేవు. పడమటిప్రాంతంలో సుద్దపైనపోసి కట్టిన వాటిని 'మిద్దె'లనడం పరిపాటి, ఇతరత్రా 'మిద్దె'లంటే 'భవంతు'లని ప్రసిద్ధి ఈ సౌధాల్ని చూసి శ్రీనాథుడు,

"మిద్దెలు మిద్దెలన్నా మన మేడలకంటెను సొంపునించి బల్
విద్దపు సౌధజాలముల లీల వెలుంగునటంచు నెంచి నే నద్దిర మోసపోతి,"

అన్నాడు.

ప్రజాజీవనం సాఫీగా సాగడానికి ఏర్పరచిన కులవ్యవస్థ వర్ణవ్యవస్థ చాటువులలో ఎలావుందో చూద్దాం. శ్రీనాథుని చాటువులలో రాచకన్యలు బ్రాహ్మణులలో నియోగి భామలు, వైశ్యులు, తదితరుల వర్ణనలున్నాయి. ఆయా కులాలకంటె వృత్తులకు ప్రాధాన్యమిస్తూ కాలం గడుపుతున్న కాంతామణులే శ్రీనాథుని చాటువులలో ఎక్కువ. అంగడివీధిలో రసికుల్ని పూరించేవిధంగా పండ్లమ్మే జంగంవారి పిన్నది, ఆవందగ్గర కూర్చున్న "అందాల కుమ్మరిబాలిక, తమలపాకులమ్మే తరుణి, నూలు వడికే 'నూతన యౌవన' సాలె భామ. ఏకులు వడికే రంభలాంటి రామ, మొలలోతు తటాకంలో నిలబడి బట్టలుతికే చాకలి 'పిన్నది' వృత్తివ్యవస్థను నిలుపుకున్నవారే. ఈ వృత్తులేకాకుండా శ్రీనాథుని చాటువులలో చాలచోట్ల 'వేశ్యా జీవనం' కనిపిస్తుంది. వారి సుఖజీవనాన్ని చూసి శ్రీనాథుడంతటివాడుకూడా,

"కవితల్ చెప్పినఁబాడ నేర్చిన వృథాకష్టంబె యీ భోగపుం
జవరాండ్రేకద భాగ్యశాలినులు" అన్నాడు.

ఇంక శ్రీనాథుని చాటువులలోని వైయక్తిక అభిరుచులు. ఈ అభిరుచుల విషయంలో పెద్దాచిన్నా అనే అంతరువు కలవారు లేనివారు అనే గిరలుండవు. వేశ్యాప్రియత్వమన్నది ఆనాటి వ్యవస్థలో గౌరవానికి చిహ్నం. రసికత్వానికి పరాకాష్ఠ. 'చేతులో' చెయ్యేసి సంకేతస్థలం 'మరిమరి' గుర్తుచేసి అమవాస్య రాత్రివేళల్లో మాట నిలుపుకోలేని మగువను శ్రీనాథుడు మనసా

"హా సురత తంత్ర కళానిధీ! యెందువోయితే
రాజమహేంద్రవీధిఁ గవిరాజు ననున్ గికురించి"

అని తిట్టుకున్నాడు. అంతేకాదు అవసరానికి దగ్గరచేరిన వేశ్యల్ని గుర్తుంచుకోవడం, కుశలప్రశ్నలడగడం, ఔపచారికం కూడా. ఈ విషయాన్నే

"గుడి మీది క్రోతితోడను
గుడి లోపల నంబివారి కోడలి తోడన్
నడి వీధి లంజ తోడన్
నడిగొప్పుల హోరుగాలి నడిగితి నమమీ'' స్పష్టంచేస్తుంది.

వారకాంతల వ్యవహారంమాత్రం కాదు. వారివల్ల వ్యవహరించే వ్యాధుల వైద్యాల వర్ణనకూడ చాటువులలో కనిపిస్తాయి.

'నగము బోలెడు మేను సగము చేసెనుగదా' అనే పద్యపాదం. ఉలివిరి చెక్కతో ఔషధం, పత్తెంగా రొట్టె, గాలి ఆడని ప్రదేశంలో మంచంమీద పడుకోవడంవంటివి సుఖరోగాదుల వైద్యంకూడా.

కలవారి ఇళ్ళల్లోను, హోదాతో కాలంగడిపేవారి ఇళ్ళల్లో గుట్టుచప్పుడుగా సాగే వ్యవహారంకూడా శ్రీనాథుని చాటువుల్లో చోటుచేసుకుంది. (అగ్గికోసం) వచ్చి అడియేన్ దాసోహమ్మంటు నమస్కరించిన పడతిపై ఒక జియ్యరుస్వామి చేసిన అత్యాచారం 'ఇంగల మంచువచ్చి' అనే చాటువులో కనిపిస్తుంది.

శ్రీనాథునికి నచ్చిన ప్రదేశం 'కుందుగడ్డ'
మందరాద్రి సములు మానవులందరు
చందమామ కూన అందుముకులు
కందులేని మౌక్తికంబులు జొన్నలు
కుందనపు చెడ్డ 'కుందుగడ్డ'
ఇక ఆడపిల్లల తీరుతెన్నులు.

మేత గరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతు తనంబునన్ బందిపిల్ల
ఎల్లపనులను జరుపంగ బల్లిపిల్ల
అందమున కోతిపిల్ల యా యరవపిల్ల.

బహుశః శ్రీనాథుడు తాను చూసిన 'కొందరి అరవల స్వభావాలను' సార్వత్రికము చేసి వుండవచ్చు. అంతేకాని అరవలందరు అలా ఉంటారని కాదు.

ఇక రాజరికానికి సంబంధించిన విశేషాలు శ్రీనాథుని చాటువులలో సామాన్య ప్రజానీకానికి రాజులకు సంబంధించిన ప్రత్యేక వృత్తాంతాలేవీ కనిపించవు. కాని రాజులు పండిత ప్రియులు. కవిశేఖర మిత్రులు. భేషజాలకు పోకుండా కవి పండితులతో కలిపి తిరగడం, తినడం, విహరించడం వారికి అలవాటు. ఈ విషయాన్నే శ్రీనాథుడు

'కాశికా విశ్వేశు గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయడిచ్చు
రంభ గూడె తెనుంగు రాయ రాహుత్తుండు
కస్తూరి కే రాజు ప్రస్తుతింతు,
స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తి గలదు
కైలాసగిరి బండె మైలారు విభుఁడేగి
దినవెచ్చ మేరాజు తీర్చఁగలఁడు"

అని స్పష్టం చేశాడు. శ్రీనాథుడు జీవించిన కాలంలో రెడ్డిరాజులు పోయి ఒడ్డెరాజులు వచ్చారు. రాసిక్యం తెనియనివారు, కవి పండితులంటే ఆదరణ లేనివారు కావడంవల్ల పన్ను చెల్లించలేదని శ్రీనాథునికే శిక్ష వేశారు. చేతికి వెదురు గొడియ తగిలించడం, నగరి వాకిటనుండే నల్లగుండును భుజాలకెక్కించడం, పాదాలకు సంకెళ్ళు బిగించడం, ఎదురెండలో పొగడదండ వేయించడం ఆనాటి శిక్షా విధానం.

ఇక పరిశిష్టం-మత విషయం ఆలోచిస్తే శ్రీనాథుని చాటువులలో వైష్ణవులు, శైవులు స్మార్తులు కనిపిస్తారు. 'ఇంగలమంచు' అనేపద్యంలో శఠగోపజియ్యరు దాయాదాల్పలె పద్యంలో విశ్వేశ్వరార్చనా వేళలో గిరిగిండ్లు వాయించే 'జంగ మాంగన' 'మీగాళ్ళ జీరాడు' పద్యంలో మడిచీరతో తిరుచూర్ణం ధరించిన సాతాని కనిపిస్తారు.

శ్రీనాథుని చాటువులలో పలనాటి సీమలు - పలివెల, గురజాల, కడిదిపురం, రాచవీడులు, రాజమహేంద్రవరం, విద్యానగరం, సింహాద్రి, కడప మండలం

'కుందుగడ్డ'లు ప్రస్తావన ఉంది. అలాగే 'కాసలనాటి' వారు, వేపారివారు, వెల్గోటి వారు కనిపిస్తారు.

శ్రీనాథుని చాటువులలో మోతాదు మించిన శృంగారం మాత్రం కాదు. మురిపించే కుటుంబ చిత్రణంకూడ కనిపిస్తుంది. పలనాటి సీమలోని ఒక ఇల్లాలి ఇంటి వైనం—

"పువ్వులు కొప్పునం దుఱిమి ముందుగఁ గొనసి యాడుచుండగా
జెవ్వనఁ జంగ సాఁచి యొకచేతను రోఁకలిపూని యొయ్యనన్
నవ్వు ముఖంబు తోడఁ దను నందనుఁ బాడుచు నాథుఁ జూచుచున్
సువ్వియ సువ్వియంచు నొక సుందరి బియ్యము దంచె ముంగిటన్"

పంట పండితే ఢోకా లేదుగాని ఆ ఏడు కరువుకాటకాలు. తిండిలేక కటకటలాడే రోజులు. ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. మగవారికి వ్యవసాయం పనుల్లేవు. మగడు ఊరుచుట్టి వచ్చాడు. ఉస్సురుమని గోడకాని కూర్చున్నాడు. ముత్తైదువు కదా అంటూ పువ్వులిచ్చింది. ఇక ధాన్యం దంచాలి. అంచేత పని తొందరగా తెమలడంకోసం చంటిపిల్లవాణ్ణి నేల పడుకోపెట్టింది. నవ్వుమొగంతో భర్తని, పాట పాడుతూ పిల్లవాణ్ణి, అలసట తీరేలా 'సువ్వి సువ్వి' అంటూ ధాన్యం దంచిందట. భార్య వయ్యారానికి భర్త, పాటకు పిల్లవాడు మురిసిపోయారు. ఎవరికీ ఇబ్బందిలేక ధాన్యం దంచడం పూర్తి అయింది. ఆ తరువాత 'వంట' చేసి బిడ్డను, భర్తను ఆ ఇల్లాలు మురిపించి వుంటుంది.

ఏమయినా తెలుగు కవులలో శ్రీనాథునికి సాటి రాదగినవారు లేరు. తన సుఖ దుఃఖాల్ని, లాభ నష్టాల్ని, మానావమానాల్ని తనకు తారసపడిన వారిని, తాను చూపిన దృశ్యాల్ని యథాతథంగా వర్ణించడం అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు.

ఆల్ ఇండియా రేడియో,
కడప, 1987.

## అప్పకవి చమత్కార పద్యాలు

తెలుగు వాఙ్మయంలో ఛందోగ్రంథాలకు కొదవలేదు. అయితే వాటిలో 'అప్పకవీయా'నికి ఉన్న ప్రచారం మరేదానికి లేదనడం అతిశయోక్తి కాదు. అప్పకవి బహుగ్రంథకర్త.

"జగతి నాపస్తంబ శాఖోక్తి షట్కర్మ
　　పద్ధతి ఖండ నిబంధనంబు
కాలభాలార్ణవాఖ్య జ్యోతిష గ్రంథ
　　సంహితా సుశ్లోక సంగ్రహంబు
శ్రీమదనంత ప్రసిద్ధ మహావ్రత
　　కల్పకథాంధ్రోక్తి కావ్యరచన
శ్రీనగాధీశ సుశ్లేష నిందాస్తుతి
　　భావగర్భిత సీస పద్యశతము
లలిత కవికల్పకాఖ్యాన లక్షణంబు
మహిత సాధ్వీజనౌఘ ధర్మద్విపదము
నంబికావాద నామక యక్షగాన
కృతియుఁజేసితి కాకనూరికులయప్ప"

పీఠిక-౭౮

అనే పీఠికాపద్యంబట్టి అప్పకవి ఎన్నో గ్రంథాలను వ్రాసినట్లు స్పష్టమవుతుంది. అయితే ఈ గ్రంథాలేవి నేడు దొరకడంలేదు. ఒక్క అప్పకవీయమనే లక్షణ గ్రంథం తప్ప. ఇదియొక లక్షణగ్రంథం. ఇందులో ప్రసిద్ధ గ్రంథాలనుండి అప్పకవి ఎన్నో ఉదాహరణాలిచ్చాడు. అయితే అక్కడక్కడ చమత్కారంకోసం అప్పకవి సొంత పద్యాలుకూడా చేర్చాడు. వాటిలో కొన్ని నీతిని, మరికొన్ని రసికతను, కొన్ని స్వానుభవాన్ని, ఇంకా కొన్ని పౌరాణికాంశాలను స్పష్టం చేస్తాయి. వాటిలో కొన్నిటిని చవిచూద్దాం.

అప్పకవి 'ఇష్టదేవతాస్తుతి' భాగంలో వినాయకుణ్ణి

"తనుఁగని యొక్క యెత్తునసె
దక్షజయు న్నిటలాక్షుఁడు న్ముదం
బున నిరు చెక్కులం గదిసి
ముద్దుకొనంగ నొకింత నెమ్మొగం
బనువుగ వెన్కకుం దిగిచి
యత్నవిహీన పరాస్పరాస్య చుం
బనములు తల్లిదండ్రులకుఁ
బన్నుగఁ గూర్చు గజాస్య నెన్నెదన్"

అని ప్రార్థించాడు.

సాధారణంగా తల్లిదండ్రులకు 'తొలిచూలు'పై ఆప్యాయత ఎక్కువే వుంటుంది. వినాయకుడు దక్షజామాహేశ్వరుల తొలిచూలు. బిడ్డ ఎంతో ముద్దులు కురిపిస్తుంటే తల్లితండ్రులకు వల్లమాలిన వాత్సల్యం పెల్లుబుకుతుంది. తల్లిదండ్రుల మధ్య కుమారుడు తచ్చాడుతున్నాడు. ఒక చెక్కిలిపై పరమశివుడు మరోవైపు దక్షజ ముద్దెట్టుకున్నారు. అల్లరివాడయిన ఆ గజాననుడు మెల్లగా తల తిప్పు కున్నాడు. ఇది తల్లిదండ్రులు వూహించని పరిణామం. చివరకు బిడ్డను ముద్దెట్టు కొనపోయిన సతీపరమేశ్వరులు పరస్పరం చుంబించుకున్నారట.

సిద్ధఖండ బిందువు, సిద్ధపూర్ణ బిందువుల్ని వివరిస్తూ అప్పకవి కొన్ని ఉదాహరణలిచ్చాడు.

వెలఁది చెలఁగి నిన్నుదలఁచిన నన సిద్ధ
ఖండ బిందువయ్యెఁ గమలనాభ
పొంకమైన యింతి పొందు సొంపఁగు నన
సిద్ధ పూర్ణబిందు విద్ధచరిత 2_23

ఉదాహరణాల్ని ఉదాహరణాలుగా కాకుండా ఒక స్వరూపం కళ్ళకు అనేలా పదాలను జోడించడం ఇందులోని ప్రత్యేకత.

"కమలనాభ! ఒక తరుణి మనసారా నిన్ను వలచింది. ఆ అమ్మాయి అందగత్తె కూడా. ఆవిడను ఏలుకోవడం న్యాయం" అని పై పద్యం స్థూలార్థం.

వెల్ఁది, చెల్ఁగి, తల్ఁచి మొదలయిన పదాలలో అరసున్నలున్నాయి. ఈ అర సున్నలు కోరికల అపూర్ణస్థితిని స్పష్టంచేస్తున్నాయి. వనిత వలచినంత లాభం లేదు. వనితామానస సూనసూయకుడు ఏలుకోవాలి. భగవంతునిపై భక్తి నిలపడం ముక్తికి సగందూరంలో వుండడంతో సమానం. ఆ తరుణి కోరిక సిద్ధించినట్టే. ఇంక 'పొంకమైన యింతిపొందు సొంపు' అనడం సాముద్రికశాస్త్రానికీ, వాత్స్యాయన కామసూత్రాలకు సంబంధించిన అంశాలు. పొంకము, ఇంతిపొందు, సొంపు అనే మాటలు నిండుసున్నలున్న పదాలు. ఆ పదాలున్నట్లే నెలతకూడా నిండుగా వుందని భావం. గలగలపారే ప్రవాహంలో తానమాడడం, గరగరలాడే గారెల రుచి చూడడంలాగే పొంకమయిన అవయవాలున్న అంగనాసాంగత్యం విందని అప్పకవి తన రసికతను పరోక్షంగా వ్యక్తంచేశాడు.

వనితయుఁ గవితయుఁ దానై
చనుదెంచుట కలుగునేని సరసంబగు 1-56

అని అప్పకవి నిర్వచనం. 'సరస' శబ్దం సార్థకం. రసమంటే రసరాజమయిన శృంగారం. 'శృంగార ఏవ మధురః పరప్రహ్లాదన్ రసః' అని ఆలంకారికుల అభిప్రాయం. బలిమిని చెరపట్టిన స్త్రీల పొందు సరసం కాదు. తనంతతాను వలచి వచ్చిన వనిత సాంగత్యం సరసం. తనలో శృంగారభావం కలిగిస్తూ, ప్రియుని అలరించే వనితాసాంగత్యం సరసమని అప్పకవి స్పష్టంచేశాడు.

అప్పకవికి 'వెల్లుల్లి' అంటే పడదు కాబోలు. వైద్యగ్రంథాలలో 'వెల్లుల్లి' మాహాత్మ్యం కొండంతగా వుంది. అయినా అప్పకవి తన అయిష్టతను

చందనోదకములను నిచ్చలును బెంపఁ
బడియు వెల్లుల్లి తన కంపుఁ బాయనిగతి
శుభగణము గూడియును నిజశూన్యఫలము
తగణము త్యజింపదనియె 4-129

అనే పద్యాలలో చెప్పాడు.

మానవప్రవృత్తి చాల చిత్రమయింది. కొందరు తమ సుఖదుఃఖాల్ని బాహ్యం చేయరు. మనసులోనే దాచుకుంటారు. కొందరు 'బాహాటం' చేసుకుంటారు.

ప్రత్యేకించి కోపం వచ్చేవేళ ఆంగికచలనాన్ని అదుపు చేయడం మరీకష్టం. ఉదాహరణకు తల్లి పిల్లల్ని కసరుకోవడం అందరికి తెలిసిందే. యశోద కన్నయ్యను కసరుతుంది.

చలము మాని కుడువు చట్ట కేశవ ప్రొద్దు
చాలనయ్యెఁ బసి వ్రజంబు వెడలె
జతలు గూడి వచ్చి సఖులు చీరెదరేల
జాగనంగ దంత జంబులయ్యె 2_119

చలము, చట్ట, చాల, జత, జాను మొదలయినవానిని దంతజమని చెప్పడం లాక్షణికుని అభిప్రాయం. ఈ ఘట్టం కోప ప్రకటనకు సంబంధించినది. కోపం వచ్చేవేళ పండ్లు కొరకడం సహజాంగికం. సన్నివేశానికి, ఉదాహృత పదాలకు చక్కటి సమన్వయం కుదరడం ఇక్కడ విశేషం.

భక్తి విభేదాలలో 'వాత్సల్య భక్తి' ఒకటి. తమిళంలో పెరియాళ్వార్, హిందీలో సూరదాస్, కన్నడంలో పురందరదాసు ఈ వాత్సల్య భక్తిని అభిమానించి వర్ణించినవారిలో ప్రముఖులు. అప్పకవి ఏకతరయతి, సంయుతాసంయుతప్రాసలకు ఇచ్చిన ఉదాహరణలలో ఈ భక్తిభావం సుస్పష్టం.

రార బాలకృష్ణ రచ్చల గుమ్మిఁగూడి
బాగ యనుచు నిన్ను అవ్వఁబెట్టు
వాండ్ర యిండ్ల కేగి వాదేలఁ దెచ్చెద
వనిన నేకతరములై పొసంగు 3_86

పోఁడి ద్రచ్చగ నిమ్ము నా తండ్రి కృష్ణ
వేకు కొనియెద నందాకఁ బండ్లు దినుము
దుండగపు చేష్టలను నోటి గాంద్రతనము
మెండుఁగాఁ జొచ్చె నీకు నైదేండ్ల కనఁగ 3_316

తన్ను యశోదగా భావించడం ఈ పద్యాలలోని భావవిశేషం.

అప్పకవి 'ఆటవెలది' కి లక్షణం చెబుతూ రమణీయమయిన దృశ్యాన్ని పాఠకుల ముందుంచాడు.

'మేలు మేలటంచు మిత్రులు ముగ్గురు
వింత యనుచు విబుధు లిద్ద
అహహ యనుచు సూరులయిదుగురును మెచ్చ
నాట వెలఁది మూట నలరు నగము 4_35

ఈ పద్యంలో ఒక 'నాట్యప్రదర్శన' సన్నివేశముంది. ఆ ప్రదర్శన చూడడానికి ధనవంతులు, సామాన్యులు, పండితులు, పామరులు వచ్చారు. నాట్యం జనరంజకంగా వుంది. రసికులు ఊగిపోయారు. 'మేలు మేలు' అని ప్రశంసించారు. 'వింత వింత' అంటూ విబుధులు పొగడినారు. కొందరు ఆనందపారవశ్యం అణచుకోలేక 'అహహ, అహహ' అంటూ ఆనందించడం తెలిపిందే.

అప్పకవి కాలంలో కూడా తెలుగన్నా, తెలుగు కవిత అన్నా ఒక చిన్న చూపు ఉందేదేమో. మాటవరుసకు తెలుగును మెచ్చుకొనేవారిని అప్పకవి మంద లించాడు కూడా.

ఇంటిలోన హేమమెంతఁ గల్గిననేమి
తొడవు సేయకున్నఁ దొడుగరాదు
తెలుఁగు బాస యెంత తెలిసియుండిన
చదువకున్న కవిత చక్కఁగాదు.

అప్పకవి 'అనంతవ్రత కథను' విరచించినట్లు పీఠికా భాగములోని పద్యము (ప 85) స్పష్టం చేస్తున్నది. కాని ఈ గ్రంథం అలభ్యం. అప్పకవికి ఈ కథపట్ల ఆదరం ఎక్కువ అనడానికి 'పంచపద'కు ఉదాహరణగా అనంతుని కథను ఇవ్వడం గమనించదగ్గది.

ధన్య సుశీల యనన్వీత
తత్పరతన్నది యొద్దునందు స
త్కన్యలు సేయు సువ్రతము
తానును వేడుక నాచరించి స
న్మాన్యత గట్టినట్టి నవ
మండిత తోర మనూయఁజేసి పె
న్దైన్యము నొంది కానల వి
ధాతృకృతంబయిన సంచరించు కౌం
డిన్య మహామునీశ్వరుఁ గ
డింధిగఁ బ్రోచిన రుక్మిణీశ్వరా" 4–280

అప్పకవీయం లక్షణ గ్రంథమయినా అందులో చమత్కారవంతమయిన పద్యాలున్నాయనడంలో సందేహం లేదు

—స్రవంతి, నవంబరు 74

# గురజాడ కన్యక పూర్ణమ్మ కథలు - తులనాత్మక పరిశీలన

రమణీయార్థక ప్రతిపాదకమయిన శబ్దం కావ్యమని ఒక అలంకారికుడంటే కాదు రసాత్మకమయిన వాక్యమే కావ్యమన్నాడు మరొక అలంకారికుడు. అనంతమయిన ఆవేశాన్ని అద్దంలో చూపించేటట్టు మహాకవి గురజాడ 'దేశభక్తి' గేయంలో కవిత్వతత్వాన్ని విశదీకరించారు.

ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలుకవలె నోయి
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలె నోయి

అన్నదే గురజాడ నిర్వచనం. సర్వాలంకారికుల సారాంశం రంగరించి చెప్పిన మాటలివి. కవిత్వం వాచ్యం కారాదు. పూర్తిగా దురవగాహమూ కారాదు. కోయిల కుహూకుహూ రావం ఏలా ఆసక్తి జనకంగా, వీనులకు విందుగా వుంటుందో ఆలాగే కవిత్వం కూడా పండితులకు, పామరులకు ఆనందదాయకంగా వుండాలని కవి ఆశయం. ఆ కవిత్వం కూడా అభిమానాలను పెంచాలి. అభిమానాలను పెంచని కవిత్వం వ్యర్థం. ఈ అభిమానం ఏదయినా కావచ్చు. దేశాభిమానం, భాషాభిమానం, సమస్యాభిమానం వగైరాలు ఈ దృష్టితో గురజాడ రచనలలో కన్యక పూర్ణమ్మ కథలను పరిశీలిద్దాం.

స్థూలంగా కన్యక కథ. అందాలబొమ్మ అయిన ఒక సెట్టి కుమార్తె చెలికత్తెలతో నగర రాచవీథులలో వెళుతూ వుంటుంది. ఆ కన్నె సొగసుకు ఆ రాచవీథిలో విహారం చేసే మహారాజు కన్ను చెదరింది. ఏలాగయినా ఆమెను తనదానిగా చేసుకోవాలని అనుకున్నాడు. దుష్టమంత్రుల ప్రోత్సాహంతో నట్టనడి వీధిలో కన్యను చుట్టుముట్టారు. అప్పటికి చేయగలిగిందేమీ లేక దేవకార్యం తీర్చి వస్తానని, అందాక ఆగమని కన్యక ప్రార్థిస్తుంది. ఆలోగా కన్యక తండ్రీ రాజుతో

అగ్నిసాక్షిగా స్వీకరించమని, రాజు కోరడం కన్న మించిన భాగ్యం లేదని
చెప్పాడు. కాని రాజు అహంకారి కావడంవల్ల పట్టమేలే రాచబిడ్డకు సెట్టి ధర్మ
మార్గం చెప్పడమా. రాజు తలచింది ధర్మం. చెప్పింది శాస్త్రం. గడువు పెట్టక
వెంటనే కన్యకను అర్పించవలసిందిగా దబాయించాడు. ఇక గత్యంతరం లేక
దేవకార్యం తీర్చి రాచకార్యం తీరుస్తానని వినయంగా ప్రార్థించాడు. రాజు
ఏలాగయితేనేం సరేనన్నాడు. కన్యకదుర్గను సేవించి, నగలను అమ్మవారికి
అర్పించి, కులం పెద్దలకు రోషం వచ్చేలా మాట్లాడి, 'పట్టమేలే' రాజయితే
పట్టవలసిందేగా అని అగ్నిగుండంలో పడి ఆత్మాహుతి చేసుకుంటుంది.

ఇక పూర్ణమ్మ కథ - పూజారింట పుట్టిన చిన్నది పూర్ణమ్మ. అందానికి
అసలు నిర్వచనం పూర్ణమ్మ రూపం. పూర్ణమ్మకు దుర్గమ్మపై వుండే భక్తి
మాటల్లో చెప్పలేం. పూర్ణమ్మ యుక్తవయస్కురాలయింది. తల్లిదండ్రులు డబ్బు
ఆశతోనో లేక మరే కారణం వల్లనో ముసలిమొగుడుకు ముడివేశారు. ఆ పై
వసంతకాలం వచ్చింది. వనంలో వసంత విజృంభణం చూసి పూర్ణమ్మ నిట్టూ
ర్చింది. పూర్ణమ్మ జీవితంలో 'వసంతం' రాలేదు. ఈలోగా భార్యను తీసుక
పోవడానికి భర్త నగలతో చీరలతో వచ్చారు. వదినెలు సింగారించారు. పూర్ణమ్మ
పెద్దలకు నమస్కారం చేసింది. తల్లిదండ్రుల్ని జాగ్రత్తగా కాపాడవలసిందని
ఇతరులకు చెప్పింది. దుర్గాదేవిని భక్తితో సేవించమని హితోక్తులు పలికింది.
సాయంత్రం దుర్గను సేవించడానికి ఒంటరిగా వెళ్ళింది. ఆవులు, పెయ్యలు
మందల చేరాయి. కాని దుర్గను సేవించడానికి వెళ్ళిన పూర్ణమ్మ రాలేదు.

ఈ రెండు కథలకు ఎన్నో సామ్యాలున్నాయి. ప్రధానంగా రెండు కథలు
స్త్రీలకు సంబంధించినవి. స్త్రీలంటే గురజాడవారికి అమితమయిన గౌరవం. స్త్రీల
సమస్యలంటే మహాకవికి వల్లమాలిన సానుభూతి. ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం
కన్యాశుల్కం నాటకరచన. ఇంక ముత్యాలసరాల సంకలనంలోని కన్యక పూర్ణమ్మ
కథలు, సుభద్ర సత్యవతి మొదలయినవి. ఈ రెండుకథలు విషాదాంతాలు. కన్యక
పూర్ణమ్మలిద్దరూ ఆత్మాహుతి చేసుకున్నవారే. పూర్ణమ్మ దేవాలయ ప్రాంగణంలో,
కన్య అగ్నిగుండంలో. ఇద్దరు దుర్గమ్మ భక్తులుకావడం ఒక విశేషం. కాని
కన్యక భక్తికన్నా పూర్ణమ్మ భక్తి ఒకవాసి ఎక్కువంటే తప్పులేదు. పూజారింట
పూర్ణమ్మ పుట్టడంవల్ల సహజంగా ఆ వాతావరణంలో తిరగడంవల్ల పూర్ణమ్మకున్న

'భక్తి' కన్యక భక్తికంటే భిన్నం. నిరంతరసేవనంవల్ల మొగ్గలు తొడిగింది. పార్వతి తపస్సుకాలాన్ని అధిగమించిందని చెప్పడానికి నన్నిచోడుడు వరుసగా ఆరు ఋతువులను వర్ణించినట్లే పూర్ణమ్మ భక్తి కాలాతీతమని చెప్పడానికి

"ఏయే ఋతువుల పండే పళ్ళను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితో కొలిచెను"

అని అన్నాడా మహాకవి. ఆవిడ భక్తిలో ఏమాత్రం ఏమరుపాటులేదని నిరూపించడానికి

''ఏయే వేళల పూసే పువ్వుల
ఆయా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితో కొలిచెను''

అని తెలిపాడు. తీరా పుట్టిల్లు వదలివెళ్ళే సమయంలోకూడా 'బంగారు దుర్గను భక్తితో కొలవండి, ఆయావేళల పూసే పువ్వుల ఆయా ఋతువుల పళ్ళన్నీ, భక్తినిగోసి శక్తికి ఇవ్వండి' అంటూ ప్రార్థించింది. ఇలాంటి భక్తి వాతావరణం కన్యక కథలో లేదు. బ్రాహ్మణవర్గానికి పూర్ణమ్మ, వైశ్యజాతికి కన్యకలు మాతృకలనడం సమంజసం. లేదా కలవారి కన్య లేనివారి లేమలుపడే ఇబ్బందులకు ప్రతీకలనడంకూడా సరిపోతుంది.

ఇంక రెండవ అంశం కన్యక పూర్ణమ్మల అందచందాలు. ఔచిత్యంతో కూడిన శృంగారవర్ణన ఈ రెండు కథల్లోను కనిపిస్తుంది. గొప్ప చిత్రకారుడు అటూఇటూ గీసిన రేఖలలో ఒక రూపం మనకు గోచరించినట్టు మహాకవి సౌందర్యవర్ణన నడిచింది. కన్యక సౌందర్యాన్ని కవి కథాగేయం ప్రారంభంలోనే వర్ణించాడు. కాని పూర్ణమ్మ సౌందర్యాన్ని

కాసుకు లోనై అల్లుని తలచుచు
ఆనందించెను అమ్మొకతె

అని అనడంలో తండ్రి పిల్ల గొంతుకోశాడని వ్యక్తమవుతుంది. అధికారానికి బలి అయిన అబల కన్యక అయితే, డబ్బుకు బలి అయిన తరుణి పూర్ణమ్మ. రాజ భయంతో సెట్టి కన్యకను రక్షించలేకపోయాడు. ధనాశతో పూజారి పూర్ణమ్మ జీవితానికి మంగళంపాడాడు. ఇదీ తేడా. ధర్మపద్ధతి వదలి, పదవులకై ఆశపడి, కాసు పీసం కలిగివుంటే చాలనుకునేవారికి కన్యక కథ మొట్టికాయలాంటిది. అతి వృద్ధవివాహంవల్ల కలిగే అనర్థాలేవో పూర్ణమ్మ కథ చెబుతుంది. రెండూ కరుణ రసపూరిత గేయాలుకావడం విశేషం.

కన్యక కథ పట్టణపరిసరాలలో పూర్ణమ్మ కథ గ్రామీణసీమలో సాగడం మరీ విశేషం. ఇంతేకాక వీరిద్దరిలోనూ తేడావుంది. కన్యక సహజధీర. రాజవీధిలో రాజు సమీపించగానే ఏమాత్రం అదరక బెదరక

ముట్టబోకుడు దేవకార్యం
తీర్చివచ్చెద నీవు పట్నం
ఏలు రాజవు

అని గదమాయించింది కూడా. చివర పౌరకుల మనోనేత్రంపై వుంచాడు. అలా వర్ణించడంలో ఎంతో ఔచిత్యంవుంది. మహారాజు కన్యక సౌందర్యానికి ముగ్ధుడు కావడం ప్రధానం. అంచేత కన్యక వర్ణన అనివార్యం.

తగటు బంగరు చీరకట్టి
కురుల పువ్వుల పథులుచుట్టి
నుదుట కుంకుమ బొట్టుపెట్టి

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ

అనడంలో బాహ్యసౌందర్యం వ్యక్తం. చెలికత్తెలు చుట్టూవుండడంవల్ల రాజుకు ఆ కన్యక చుక్కలనడుమ చందురునట్లు కనిపించింది. కాని పూర్ణమ్మకు ఈ నగలు లేవు. పేదవారి బిడ్డ, సహజమయిన అందం ఆమెకు భగవంతుడిచ్చిన వరం.

అంచేతనే మాటిమాటికి గురజాడ 'పుత్తడిబొమ్మా పూర్ణమ్మా' అన్నాడు. కలువ కంటి, లావణ్యవతి, హంసగమన అని వాచ్యంచేయక చివరకు

కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి చేరెను మేని పసల్
హంసల చేరెను నడకల బెడగుల్

అన్నాడు,

సంఘానికి అనర్థదాయకమయిన ఏవీగాని గురజాడ సహించలేదు. ఆయన కోరిందల్లా పూర్తి కొత్తదనమూ కాదు. బూజుపట్టిన పాతపద్ధతులూ కావు. కొత్త పాతల మేలుకలయిక కొమ్మెరుంగులు చిమ్మగా అనే మాట సాహిత్యంలోమాత్రం కాకుండా సమాజగతిలోను అన్వయించుకోవాలి. ఈ రెండు కథల్లోను కవి ఆశించింది ఇదే. కన్యక బతుకు బుగ్గిపాలుకావడానికి, పూర్ణమ్మ బతుకు గంగపాలు కావడానికి వారి తండ్రులు కారణం. అంచేత అగ్గిలో దూకడానికి ముందు కన్యకచేత

"అన్నలారా తండ్రులారా
ఆలకించం డొక్క విన్నప
మాలు బిడ్డల కాచుకొనుటకు
ఆశ లేదొక్కొ కులములోపల"

అని పలకరించాడు. ఆలాగే పూర్ణమ్మ కథలో 'కాసుకులోనై తల్లీతండ్రి నెనరూ న్యాయం విడనాడి, ముదుసలిమొగుడుకు ముడివేసిరీ' అని ప్రారంభంలో తల్లీ దండ్రులిద్దరూ కారణమని వ్రాసినా చివర

వగచిరి వదినెలు వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిపెట్టెన్

దుర్గ దేవాలయంలో 'పట్నమేలే రాజువైతే పట్టు నన్నిపుడని' మంటల్లో దూకింది. ఇలాంటి ధైర్యం పూర్ణమ్మకు లేదు. తల్లితండ్రులచాటున పెరిగిన బిడ్డ పూర్ణమ్మ.

అన్నల తమ్ముల కనుగ్గై అల్లారుముద్దుగా పెరిగిన బాల. అన్నిటికంటే మిన్నగా 'మొగుడు తాత' అని చెలికత్తెలు పరిహాసంచేస్తుంటే చివుక్కుమన్నా నోరు మెదపని అమ్మాయి. తల్లిదండ్రులు దీవిస్తే ఫక్కున నవ్వి 'అమ్మను అయ్యను కావండి' అని ఏడవలేక నవ్వింది.

పూర్ణమ్మ పేరుకుతగ్గట్టు నిండుకుండ. చిన్నతనంలో దుర్గమ్మను పూర్ణమ్మ ఏఏ కోరికలు కోరిందో పేరుకుతగ్గట్టు జీవించి చివరకు పూర్ణత్వంలో సంలీన మయింది. సాత్వికానికి పూర్ణమ్మ, రాజసానికి కన్యక ప్రతీకలనడం సమంజసం.

సందేశాన్ని ప్రసాదించడం కవిత్వలక్షణాలలో ఒకటి. ఈ రెండుకథల ద్వారా సమాజంలో చైతన్యంకలిగించిన గురజాడ నిజంగా మహాకవి.

ఆంధ్రజ్యోతి, 14-1-75.

# వేదం వారి 'ఎల్లి'

గురజాడ 'కన్యాశుల్కం' లాగే ఆంధ్రదేశంలో బాగా ప్రచారమందుకున్న నాటకం ప్రతాపరుద్రీయ నాటకం. నండూరి 'ఎంకి' లాగా వేదం వారి 'ఎల్లి' చాల ప్రసిద్ధి పొందిన పాత్ర.

ప్రతాపరుద్రీయ నాటకంలో ముఖ్యంగా మూడు స్త్రీ పాత్రలున్నాయి. ప్రతాపరుద్ర మహారాజు ధర్మపత్ని శర్వాణి. తల్లి ముమ్మడమ్మ. పేరయ్య పెండ్లాము 'ఎల్లి'.

కొన్ని పాత్రలపైన కొన్ని సమయాల్లో మాత్రం సానుభూతి కలుగుతుంది. ఉదాహరణకు రామాయణం తీసుకుందాం. సీతమ్మను పరిత్యజించడానికి రాముడు చాలా మథనపడ్డాడు. తన్ను శ్రీరామచంద్రుడు పరిత్యాగం చేశాడని తెలియక రథంలో కూర్చుని సీతమ్మ వెళుతున్నప్పుడు ఆ పాత్రపై సహజంగా సానుభూతి కలిగింది. ఆలా కాకుండా కొన్ని పాత్రలపైన కవి మొదటినుండి సానుభూతి పరంపరలు కుప్పిస్తాడు. అటువంటి పాత్రల్లో 'ఎల్లి' ఒకతె. ప్రతాపరుద్రీయ నాటకంలో వేదం వారు 'ఎల్లి'ని మహారాణి శర్వాణితో సమంగా చిత్రీకరించారు. ఇక కథకు వద్దాం.

ప్రతాపరుద్ర మహారాజు గోదావరి తీరంలో వేటాడుతూ అలసి సొలసి మర్రిచెట్టు నీడలో ఆదమరచి నిదరపోయాడు. సరిగ్గా ఆ సమయంలోనే వలీఖాన్ సైనికులు ఆ మహారాజును బంధించి ఢిల్లీకి తరలిస్తారు. ఈ విషయం తెలిస్తే పట్టణంలో కల్లోలం చెలరేగుతుందని జనార్దనమంత్రి ఒక ఉపాయం పన్నాడు. రాజు పోలికలున్న చాకలిపేరయ్యను ప్రచ్ఛన్నంగా అంతఃపురంలో బంధించాడు. తురకలు చాకలిపేరయ్యను తమ వెంట తీసుకుని వెళ్ళారని, మహారాజు క్షేమంగా వున్నారని వదంతి వ్యాపింపజేస్తారు. మహారాజుగారు వేటలో గాయపడ్డట్టు, అంతః పురంలో విశ్రాంతి తీసుకుంటున్నట్టు 'పుకారు' పుట్టిస్తారు. ఇదీ కథ.

తన ప్రాణేశ్వరులు గాయపడ్డారని తెలియగానే మహారాణి శర్వాణి దిగులు పడ్డది. రాజుగారిని చూడడానికి తహతహలాడింది. విద్యానాథుడు జగన్నాథాదులు

'అమ్మా! కబళికా మంత్రము, మృతసంజీవనీ మంత్రప్రయోగము చేసితిమి. రెండిటికిని మూడు దినములు. స్త్రీల కంటను బాలుర కంటను పడ గూడదని నియమము' అని నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. కాని శర్వాణి నమ్మలేదు. అప్పుడావిడ 'మహిషాసుర మర్దని'లా కనిపించిందట.

'ఈ దేశ క్షోభంలో యుద్ధ సంరంభంలో మా ప్రాణేశ్వరులను మేము కనుటకు వీరి ఆటంకమా' అని రాణి తన జబర్దస్తీని స్పష్టంగా ప్రదర్శించింది. ఈలాగే తన మామను తురకలు బంధించినారని తెలియగానే ఎల్లి 'ఎకాయెకి' యుగంధర మహారాజు కడకుపోయి

'మహాప్రభో! మీరే తల్లి, మీరే తండ్రి అన్ని మీరే సామి మీరే నారాయణమూర్తి అని మీ పాదాలు కొలుచుకుంటూవున్నందుకు నా మొగుణ్ణి తురకలకు తమరు పట్టిచ్చినారంట సామీ! ఇక నాను బతకలేను మారాజా' అని వాపోయింది. మాటలు వేరుకావచ్చుగాని మనసులోని అభిప్రాయం ఇద్దరిదీ ఒకటే. కాకపోతే మహారాణి భాషలో హుందాతనం, ఎల్లి మాటల్లో సహజత్వం.

మరో సన్నివేశం. తన ప్రాణనాథులవారు క్షేమంగా ఓరుగల్లు చేరుకోవాలని, తన పసుపుకుంకుమలు పదికాలాలపాటు పదిలంగావుండాలని తాను మహారాణి కనుక 'గౌరీపూజ'ను శర్వాణి ఆడంబరంగా మొదలెట్టింది. మహారాణిచేసే పూజ కనుక పదిబళ్ళ పువ్వులు, నూటుబిందెల పన్నీరు, నూరుగిండ్ల అత్తరు, మోయడానికి వీలులేనంత వరహాలు అవసరమయ్యాయి. కాకతీయ సామ్రాజ్యానికి మహారాణి కనుక ఒక బ్రాహ్మణుడు 'రాణమ్మ మధుర మీనాక్షిలావుం'దని తెగ పొగిడాడు, దానంపుచ్చుకున్న మరొక బ్రాహ్మణుడు 'శర్వాణి' అనసూయా అరుంధతుల్ని మించిందని ఆకాశానికెత్తాడు. వేరొకడు సాక్షాత్ 'ఆ కాశీ విశాలాక్షి' అని నమస్కారం పెట్టాడు.

ఇంతే కాదు. 'ఏలినవారు గడికోటకు వచ్చారని' ముందు తెలియజేసిన పరిచారికకు శర్వాణి మెడలోని హారం బహుమానంగా ఇచ్చింది. కలవారి ఇంట్లో ఏది జరిగినా సంబరంగా వుంటుంది మరి. కాని వేదం వారు 'ఎల్లికి' ఇటువంటి ఆర్భాటాలేవీ పెట్టలేదు. తన కష్టం చెప్పుతున్న ఎల్లితో యుగంధరుడు 'ఈ ధనం తీసుకో, ఈ నగలు తీసుకో' అన్నాడు. ఎల్లి మాత్రం 'నా కెందుకు రాజా!

యయ్యి ముండమోపికి' అని దిగాలుపడి నిట్టూరుస్తూ జవాబిచ్చింది. అంచేత యుగంధరుడు

"తప్పు మాట అనుకొనకు. చిరకాలము ముత్తయిదువుగానుండువు పో" అని బలవంతంగా ఆభరణాలిచ్చాడు. కాని ఎల్లి వాటిని తీసుకోలేదు. "నేను తమ లోగిట్లోనే గంజి తాగుతా నా కిష్టమైన పని పాట చేసుకొంటా పడుంటాను" అని మంత్రిని ప్రాధేయపడింది. ఇలా ప్రార్థించడంలో అంతర్యం వుంది. మంత్రిగారి ముందు తచ్చాడుతుంటే పేరయ్య విమోచనం గురించి పదేపదే గుర్తుకు తీసుకు రావచ్చు. కులం వారితో కలిసివుంటే సాటివాళ్ళ ఎత్తిపొడుపులనుండి దూరంగాను ఉండవచ్చు. ఈ ఘట్టంలో కూడా ఎల్లి రాణితో సమానంగా నిలబడ్డది. అంచేతనే యుగంధరుడు.

'ఎల్లి కష్టమే ఇట్లున్నదే! అంతఃపురంలో ఏమి అడావిడిగా వుందో!' అని తర్కించుకున్నాడు.

మరో సన్నివేశం చూద్దాం. మహారాజు వస్తున్నారని తెలియగానే రాణి ఏకవేణీధరయై కిటికీ వెనుక దాగి చూడ్డం మొదలెట్టింది. కాని పాపం ఎల్లికి మేడ లేదే? అంచేత నిచ్చెన వేసుకుని గోడమీద నిక్కి ఎదురుచూడ సాగింది. మహారాజు ఆగమనం తెలియగానే రాణెమ్మ నగరంలోని సువాసినుల కందరికి పూలు పన్నీరు సరఫరా చేసిందట. అయితే ఎల్లి అదేవేళ తన కులం వాళ్ళకు విందు చేసింది. మహారాజు అంతఃపురం చేరుకోగానే

'ఆహా! ఎంత కాలమునకు ఆర్యపుత్రులు ఈ కన్నులకగపడుచున్నారు'

అని మనసులో అనుకుందట. కాని మనసొకటి మాటొకటి తెలియని ఎల్లి పేరయ్య కనబడగానే

'బతికున్నావా మావా!' అని గుండె బరువంతా ఒకసారి దిగదీసుకుంది.

అన్నీ సమానమే గాని - మహారాజు అంతఃపురం చేరుకోగానే శర్వాణి దుఃఖం పటాపంచలయింది. తన పూజ ఫలించిందని రాణి తెగ సంబరపడింది. కాని ఎల్లి కోరిక మాత్రం తీరలేదు. రాచనగరులో మర్యాదలు, హంగామాలు చూసిన పేరయ్య

"మురికి గుడ్డ బుదికే కంపెల్లివి. ఇంక నాకు నువ్వు
పనికిరావు. నా నెల్లిపోతా! పెత్తాతదురద మగా
రాజు కేంటి కంపెల్లి పెళ్ళామేంటి"

అని పుల్ల విరుపుగా అంటే పాపం ఆ స్త్రీ హృదయం ఎంతగా గాయ పడిందో మరి! అయినా ఎల్లి మనసులో విశ్వాసం అడుగంటలేదు.

"గవురమ్మ తల్లీ! నాను నోముకొంటే నా మామను తెచ్చియిచ్చినావు గదా! య్రెరి కుదిరిస్తివా నాకు పెద్ద మంతిరిగార్చిన నగలన్నీ నీకు నిలువు దోపిస్తాను అమ్మ తల్లీ" అంటూ ప్రార్థించింది.

ఆలాగే ఎల్లి పేరయ్యమీద ఫిర్యాదు చేసింది. రాజాస్థానంలో విచారణ మొదలయింది. ఉన్నట్టుండి విచారణ హద్దు మీరుతుందేమోనన్న భయం పట్టు కుంది ఎల్లికి.

'నా పిరాదు యిని అయన్నేమైనా శిచ్చ శేస్తారేమో మా రాజా!

ఫిరాదు చేసుకోను సామీ!' అని వాగ్దానం తీసుకుని ఎల్లి పేరిగాని నేరాలు ఏకరువు పెట్టింది.

"య్రెరోడో ఒల్లడో తెలదు మా రాజా! కూడు తినక యింటికి రాక ఒగ్గేశి ఎల్లిపోయినాడు" అని కంట తడిపెట్టింది. పేరయ్య మారాలని వుంది గాని పేరయ్యకు శిక్ష పడడం సుతరామూ ఇష్టం లేదు.

"వీడు చదువుకొన్నందున చాకళ్ళలో చెడిపోయాడు. కావున వీడే ఎల్లికి పనికి రాడు" అని విశ్వాసరావు మాట కోసం చెబితే

'నారాయణమూర్తీ! పనికొస్తాడు సామి! అని తనవాడెక్కడ దక్క కుండా పోతాడేమో అని ఆరాటపడింది.

ప్రతాపరుద్రమహారాజు ఎల్లి పేరయ్యల వ్యవహారం గుర్తించి సంబర పడ్డాడు. చివరకు నౌఖర్లతో

"వీరిం గొనిపోయి దీని నచ్చరవలె, వీనిని అమరేశ్వరునివలె కట్టించి తొడిగించి తెండి" అని ఆజ్ఞాపించాడు. తనకు నమస్కరించిన చాకలి దంపతుల్ని చూచి మహారాజు

"మంచి అనుకూల నాయకుడవు నీవు. స్వాధీన పతిక అది" అని ప్రశంసించాడు.

చెకుముకి శాస్త్రి, జనార్దనుడు, పెద్దసెట్టి ప్రభృతులు కూడా

"నీ వంటి వెర్రి కులస్త్రీల కందరికీ వుంటే తరించిపోతాం" అని మనసారా మెచ్చుకున్నారు.

పేరయ్య మాటవరుసకు ఎల్లిని కాస్త వుడికించాలని 'కంపెల్లి' అన్నాడను కోండి. ఎల్లి అంటే అతనికి ఆరవప్రాణం. చతుర్థాంకంలో విద్యానాథునితో పేరయ్య

'ఒకపాలి కలచినా ఒకపాలి మంచి మాటాడుద్దండి' అని ఎల్లితో తనకున్న అనుబంధాన్ని చెప్పుకున్నాడు. ఈ అంకం చివర

'ఎల్లి నాతో గద్దె యెక్కుంటదీ — జాజి
మల్లి నాతో గద్దిమా నుంటదీ
పేరయ్య రాజంట — పేరెల్లి రాణంట
తనకు మావా వాళ్ళు దండమెడతారంట'

అని కలలు కన్నాడు. రాజుగారు 'చాకళ్ళకు నీకు కులముపెద్ద, చాకలి దొర' అని చెప్పగానే ఎగిరి గంతేసినాడు.

గురజాడ వారన్నట్టు
'సతుల సౌరను కమలవనముకు
పతుల ప్రేమయె వేవెలుగు'
అన్న వాక్యం ఎల్లికి సరిగ్గా సరిపోయింది.

ఆంధ్రప్రభ (దినపత్రిక)
14-7-72.

# సి. పి. బ్రౌను సాహిత్యసేవ

అఖండ భారతదేశం ఔన్నత్యాన్ని అన్నివిధాల ఆంగ్లేయులు పాడుచేశారనే అభియోగం మనం తరచు వింటూవుంటాం. అయితే భాషాసాహిత్యవిషయంలోమాత్రం ఈ అభియోగం నిరాధారం. తమదికాని దేశంలో, తమదికాని భాషను నేర్చుకొని, పరిశ్రమించి, ఆ భాషామతల్లికి అపురూప నీరాజనం సమర్పించిన విదేశీయులెందరో వున్నారు. వారిలో సి. పి. బ్రౌన్ చిరస్మరణీయుడు.

ఆచార్య జి. యస్. రెడ్డిగారిమాటల్లో చెప్పాలంటే సి. పి. బ్రౌన్.

"బహుభాషా దక్షిణ నాయకుడైనా, తెలుగుభాషను పట్టమహిషిగా వరించిన ధీరోదాత్తుడు; జీవితాంతం తెలుగుభాషాసాహిత్యాలు, తన వూపిరిగా జీవించిన యోగమూర్తి; ఆర్జించిన ప్రతిపైసాను తెలుగు సాహిత్యోద్ధరణకు, పండిత పోషణకు, గ్రంథప్రచురణకు వినియోగించిన త్యాగధనుడు. తెలుగు సాహిత్య పునరుజ్జీవనానికి, వికాసానికి బ్రౌన్ చేసిన సేవ అపూర్వం, అనితరం, బహుముఖం.

ఇంతగా ప్రసిద్ధిపొందిన సి. పి. బ్రౌన్ భారతదేశం కలకత్తాలో కౌలే, రెవరెండ్ డేవిడ్ బ్రౌను దంపతులకు 1798 వ సం॥ నవంబరు 10 వ తేది జన్మించాడు. తండ్రి ప్రోత్సాహంతో, భాషానురక్తితో బ్రౌన్ చిన్ననాటనే హీబ్రూ, సిరియన్, అరబ్బీ, పార్శీ, గ్రీక్, లాటిన్, హిందుస్తానీ భాషలతో పరిచయం పెంచుకొన్నాడు. 1814 లో ఇంగ్లాండులోని 'హెయిల్‌బరి' కళాశాలలో రెండేళ్లు చదువుకొన్నాడు. 1816లో Writers Rank అనే పట్టా పుచ్చుకొన్నాడు. 1817–20 ప్రాంతంలో మదరాసు కాలేజి విద్యార్థిగా తెలుగుపరిచయం పెంచుకొన్నాడు.

ఇక వుద్యోగజీవితం పరిశీలిస్తే బ్రౌన్ జీవితం చాల చిత్రమయింది. ఏ విదేశీయుడూ చేపట్టని రకరకాల వుద్యోగబాధ్యతల్ని బ్రౌన్ నిర్వహించాడు. 1829 నుండి 1869 దాక న్యాయాధిపతి, జిల్లా అధికారి, తంతి తపాలా అధికారి,

లాటరీ నిర్వహణాధికారి, లెక్కల తనిఖీదారు, విద్యాసంస్థల కార్యదర్శి, పత్రికా సంపాదకుడు, పరీక్షాధికారి, విశ్వవిద్యాలయ ఆచార్యుడు, ఐ.సి.ఎస్. పరీక్షాధికారిగా రాణించిన విచిత్రవ్యక్తి సి. పి. బ్రౌన్.

బ్రౌన్ సాహిత్యజీవితం సుసంపన్నమయింది. వీటిలో స్వీయరచనలు ప్రధానమయినవి. బ్రౌన్ ప్రధానంగా సంస్కృతం, ఆంధ్రం, ఆంగ్లభాషలలో రచనలు చేశాడని చెప్పవచ్చు, వీటిలో 2 తెలుగుభాషకు సంబంధించినవి. ఆంధ్ర గీర్వాణచ్ఛందము, వాక్యావళి, Dialogues in Telugu, తెలుగు వాచకము, ఇంగ్లీషు క్రియలు, (రేఫఱకార వచ్ఛబ్ద జ్ఞాపక లోకోపకారకము), ఇంగ్లీషు తెలుగు నిఘంటువు, మిశ్రభాషా నిఘంటువు, జిల్లా నిఘంటువు, పదనిధి, హైదరు చరిత్ర, మిరాసీవాదము, అనంతపురరాజుల చరిత్ర, తాతాచారి కథలు, లూకాచే వ్రాయబడిన శుభవర్తమానము, విస్తర రత్నాకరము, కీర్తనలు, వేమనపద్యముల ఆంగ్లానువాదము, సుమతిశతక ఆంగ్లానువాదములు చెప్పుకోదగ్గవి.

బ్రౌన్ సాహితీసేవలో మరో మైలురాయి గ్రంథసంపాదకత్వం సమీక్షణ. ముద్రణాదిసౌకర్యాలులేక, కొందరికిమాత్రమే పరిమితమైపోయి అటకలమీద మగ్గిపోతున్న వేలాది తాళపత్ర గ్రంథాలను బ్రౌన్ సేకరించాడు. బ్రౌన్ వాటిని సేకరించకుండావుంటే ఎన్నో తెలుగు కావ్యాలు పేరుకుమాత్రం స్మరించుకోవలసి వచ్చేది. తన కాలంనాటికే బాగా శిథిలమైపోయిన తాళపత్రాలకు కాగితపు ప్రతులు వ్రాయించాడు. సొంత ఖర్చుతో పండితులకు జీతమిచ్చి పరిష్కరించి ప్రామాణిక ప్రతుల్ని సిద్ధపరిచాడు. అసలువిషయం చెప్పాలంటే గ్రంథపరిష్కరణ విద్యాభిక్ష పెట్టిన తొలి సాహిత్యవేత్త బ్రౌన్.

పద్యాలను పాదాలకనుగుణంగా విభజించడం, యతిస్థానం గుర్తించడం, పద్యాలకు వచనాలకు సంఖ్యలను నిర్దేశించడం, ద్విపద పాదాలను ఒకదానికింద మరొకటి వ్రాయడం, టీకలు వివరణలు సమకూర్చడం, పాఠాంతరాల ప్రదర్శించడం, పదసూచికల సంతరించడం మొదలయినవి బ్రౌన్ ప్రవేశపెట్టిన నూతన సంస్కరణలే. బ్రౌన్ గ్రంథసంపాదన – సమీక్షణలో మొట్టమొదటి రంగం పురాణేతిహాసాల పునరుద్ధరణ ప్రధానమయింది. రచనలో సారళ్యం, ప్రజాభిమానం దృష్టిలో పెట్టుకొని బ్రౌన్ పురాణాలను అభిమానించాడు. వాటిలో విష్ణుపురాణం,

భాగవతం, పద్మపురాణం, ఆంధ్ర మహాభారతం, శ్రీ కాళహస్తి మాహాత్మ్యం, ఉత్తర రామాయణం, హరివంశం, భాస్కర రామాయణం, కాశీఖండం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం చెప్పుకోదగ్గవి. వీటిలో భాగవతం, భారతం, భాస్కర రామాయణం, ఉత్తర రామాయణాలను మొట్టమొదట ముద్రించిన ఘనత బ్రౌన్ దొరదే.

బ్రౌన్ సాహితీ సేవలో రెండవ మైలురాయి శృంగార ప్రబంధాల సముద్ధరణ. 24 ప్రబంధాలను పరిష్కరించి, శుద్ధప్రతుల్ని వ్రాయించి కొన్నింటి వ్యాఖ్యలను కూర్చిన నేర్పు బ్రౌన్ దొరగారిదే. వీటిలో కుచేలోపాఖ్యానం, వైజయంతీ విలాసం, మనుచరిత్ర, వసుచరిత్రలను తానే ముద్రించాడు. పద్మ పురాణంలో అహల్యా వృత్తాంతాన్ని, విష్ణు పురాణంలో పెక్కు పదాల్ని, శశాంక విజయం పూర్తిగా ఆంగ్లంలో అనువదించడంలో అతని భాషానురక్తిని విశదం చేస్తుంది.

బ్రౌన్ సాహితీ సేవలో మూడవ మైలురాయి కథాకావ్యాల పరిష్కరణ. తెలుగు కథాకావ్యాలలో పంచతంత్రం, శుకసప్తతి, సింహాసన ద్వాత్రింశిక, హంసవింశతి గ్రంథాలను పరిష్కరించి కాగితపు ప్రతుల్ని తయారు చేయించాడు. ఇవేగాక భోజరాజీయం, విక్రమార్క చరిత్ర, సకల కథాసార సంగ్రహం, సకల నీతి కథావిధానమనే గ్రంథాలను సంపాదించి కాగితాల కెక్కించాడు. వ్యావహారిక పదజాలం కథాకావ్యాలలో కనిపించడంవల్ల బ్రౌన్ ఈ కావ్యసముద్ధరణకు పూనుకొన్నాడు.

బ్రౌన్ సాహితీ సేవలో నాల్గవ మైలురాయి ద్విపద కావ్య పరిశీలన. సుదీర్ఘ సమాసాలు లేకపోవడం, రచనలో సారళ్యం కనిపించడం. పాడుకోవడానికి వీలుకావడంవల్ల 'బ్రౌన్' ద్విపదల్ని అభిమానించాడు. ఇతడు 41 ద్విపద కావ్యాలను సముద్ధరించాడు. వీటిలో పదమూడింటిని పరిష్కరించాడు. సారంగధర చరిత్ర, బసవ పురాణము, రంగనాథ రామాయణం మొ॥ చెప్పుకోదగ్గవి. ద్విపద కావ్యాలు అమూల్య రత్నాలని, తెలుగుభాష నుడికారం ద్విపదకావ్యాల్లో సజీవంగా వుందని, భాష నేర్చుకొనేవారు ద్విపద కావ్యాలను తప్పనిసరిగా చదవాలని,

ఆచారవ్యవహారాలు ద్విపద కావ్యాలలో బాగా కనిపిస్తాయని గుర్తించినవాడు బ్రౌన్ మహాశయుడే.

బ్రౌన్ సాహితీ సేవలో ఐదవ మైలురాయి శతకాల సంస్కరణ. బ్రౌన్ 84 శతకాలను సేకరించాడు. సుమతి, భాస్కర శతకాలకు పద సూచికల్ని, వేమన, కవిచౌడప్ప శతకాలకు టీకల్ని సమకూర్చాడు. తెలుగు కవితా మాధుర్యాన్ని, తెలుగుభాష తియ్యదనాన్ని, ఆంగ్లభాష తెలిసిన వారందరికి పంచిపెట్టడానికోసం బ్రౌన్ వేమన, సుమతి శతకాలను ఆంగ్లంలో అనువదించాడు. తెలుగు కావ్యాలలో అనువదింపబడిన గ్రంథాలు 'శతకాలు' కావడం గుర్తించదగ్గ విషయం.

శిథిలావస్థలోని తెలుగు కావ్యాలను సముద్ధరించిన మాత్రాన కర్తవ్య నిర్వహణము పూర్తియైనట్లు బ్రౌన్ భావించలేదు. ప్రౌఢ ప్రబంధాలకు, పురాణేతిహాసాలకు, శతకాలకు, ద్విపదలకు వ్యాఖ్యానాలు అవసరమని గుర్తించి 25 కావ్యాలకు వ్యాఖ్యలు వ్యావహారిక భాషలో సమకూర్చాడు. ఇంతే కాకుండా తెలుగువారికి తెలియని 'పదసూచికా నిర్మాణం' తెలియజేసిన ఘనుడు బ్రౌను. అన్నిటికన్నా సాహిత్యచరిత్రకు ఎంతో వుపకరించే సమకాలీన లేఖల సంపుటాల సమకూర్చినాడు.

బ్రౌన్ వ్యక్తిత్వం చాల చిత్రమయింది. అవివాహితుడై, అహోరాత్రాలు తెలుగుభాష సముద్ధరణకు పాటుపడుతున్న బ్రౌన్‌ను, సమకాలీనులు పరిహసించినా పట్టుదల వదలిపెట్టక పరిశ్రమించినవాడు. ఎందరో నిరుద్యోగులకు పని కల్పించడం, పేదసాదలకు సహాయం చేయడం, కడప, మచిలీపట్టణం, మదరాసులలో పాఠశాలలు స్థాపించడం లాంటివి చెప్పుకోదగ్గ అంసాలు. ఇంతే గాకుండా హైందవమత సమాజ సంప్రదాయంలో ఏ మాత్రం జోక్యం కల్పించుకోకుండా, ఆంధ్ర ప్రజల మతాచారాలను మన్నించడం బ్రౌన్ ప్రత్యేకతగా గుర్తించవచ్చు. తన పరిచితుల్ని, సహాయపడినవారిని గురించి నిజాయితీతో వారిపేర్లను గ్రంథస్థం చేయడం బ్రౌన్ మంచి గుణానికి కీర్తిపతాక. జూలూరి అప్పయ్యశాస్త్రిని గురించి His patience, his humility and his good sense always commanded great respect' అన్నాడు. అలాగే అద్వైత బ్రహ్మశాస్త్రి గురించి 'my very learned friend Brahmayya' అని ఆత్మీయతతో చెప్పుకున్నాడు. రావిపాటి గురుమూర్తి శాస్త్రి గురించి 'I mention his name because his talents, learning and good sense always entitled his judgement to respect' అన్నాడు. అలాగే కడప బంగళాలోని

గ్రంథాలయాన్ని పరిరక్షిస్తూ, కావ్యపరిష్కరణ కార్యాన్ని శ్రద్ధగా జరిపిస్తున్న కృష్ణారెడ్డిని 'a most noble and excellent assistant' అని ప్రశంసించాడు. ఇంతేకాదు. 24 ఏళ్ళుగా తనకు సేవజేసిన సేవకురాలు సారానాట్‌కు 250 పౌన్లు, ఎమ్మా అగర్‌కు ఇంటిసామాన్లతో 25 పౌన్లు, యాన్ హెన్రిటా షెర్మన్‌ను 200 పౌన్లు చెందాలని వీలునామా వ్రాశాడు. తన తరువాత తన పుస్తకాలన్నీ ఇండియా ఆఫీస్ లైబ్రరికి చెందాలని, తను లైబ్రరికి తరలించుకొనిపోవడానికి ఖర్చులక్రింద 10 పౌన్లుకూడా వ్రాయడం అతని చిత్తశుద్ధికి నిదర్శనం.

బ్రౌన్ సాహిత్యసంపద అంతా లండన్ ఇండియా ఆఫీస్ లైబ్రరీలలో ముద్రితాలు, అముద్రితాలు అన్నీ చేరి 52 సంపుటాలు అసూర్యంపశ్యలుగా వున్నాయి. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభండాగారంలో వేలకువేల 'బ్రౌన్ సాహిత్యం' భద్రంగావుంది. తెలుగుదేశంలో వివిధప్రాంతాల పండితులతో, విద్వాంసులతో తాను సాగించిన ఉత్తరప్రత్యుత్తరాల్ని ఇంకా ఇతర రకాల జాబుల్ని 20 సంపుటాలలో ఒక్కొక్క సంపుటంలో సుమారు 400 పుటలున్న వాటిని బ్రౌన్ భద్రపరచిపోయాడు. బ్రౌన్ కృషిని కొంతవరకు వెలుగులోనికి తెచ్చిన ఘనుడు బంగోరె, ఆచార్య జి. యన్. రెడ్డిగారు. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో 1975 సెప్టంబరులో ఒక పరిశోధనవిభాగాన్ని రూపొందించి ఐదు పుస్తకాలను వెలువరించిన శ్రమ వీరిదే.

నిజానికి బ్రౌన్ ఒక వ్యక్తికాదు, ఒక సంస్థ. తన ఇల్లే ఒక సారస్వత సత్రంగాతీర్చిన మహనీయుడు. విశ్వవిద్యాలయాలలో చరిత్ర, సాంఘిక, రాజకీయాది విభాగాలు, భాషా సాహిత్య విభాగాలు వీటిమధ్య సమిష్టి అధ్యయనానికి బ్రౌన్ వాఙ్మయం ఒక సుక్షేత్రం. తన జీవితంలో ప్రతిక్షణాన్నీ, జీవితార్జనలో ప్రతిదమ్మిడీని తెలుగు భాషా సాహిత్యాలకు వినియోగించిన కర్మయోగి బ్రౌన్.

"నూరార్లు లెక్కసేయక,
పేర్లెక్కిన విబుధవరుల బిలిపించుచు, వే
మార్లర్థమిచ్చు, వితరిణి,
వార్లెను ఫీలిప్పు బ్రౌను సాహెబు కరుణన్"

అని సమకాలీన పండితులచే కీర్తింపబడిన ధన్యుడు సి. పి. బ్రౌన్.

ఆల్ ఇండియా రేడియో,
కడప, 10-11-88.

# తెనుగు లెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

తమ దేశం, భాష, చరిత్ర, ప్రజలు, సంస్కృతులను గురించి కొండంతగా చెప్పుకున్నవారిలో వంగీయులు, తమిళులు ముందు శ్రేణిలో కనిపిస్తారు. ఈ ఇరవైయవ శతాబ్దం తొలి మూడు దశాబ్దాల కాలంలో తెలుగుజాతి కీర్తిని, తెలుగువారి ప్రత్యేకతల్ని కావ్యస్థం చేసినవారు కొందరే. ఈ భావనల్ని మంత్ర పరంపరలుగా భావించి మననం చేసి జీవితాంతం ఉపాసన చేసిన వారిలో శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారొకరు. అవధానిగా, ఆశుకవిగా, సాంప్రదాయకములయిన రచనలు సాగించిన సమ్మాన్యమూర్తి చౌదరిగారు.

తెలుగు కవులలో గ్రామీణ వాతావరణం పట్టించుకున్నవారు కొందరే. దేశానికి వెన్నెముక అయిన రైతు జీవితాన్ని మనసారా అర్థం చేసుకున్న కవుల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. మండు ఎండల్లో మలమల మాడుతూ, వానల్లో వరదల్లో నానుతూ, పంటలు పండించేవారే సార్థక జీవితం గడిపేవారు. ఇతరులంతా అతణ్ణి అనుసరించినవారని తమిళ జాతీయకవి భారతియార్ అన్నట్టే రైతన్నలపట్ల సానుభూతి ప్రకటిస్తూ చౌదరిగారు

'నీ సొమ్ము తిన్నవారె చూచుచున్నారు నిను గడ్డిపోచవలె' అంటూ
ధరలు పడిపోయె సేద్యంబు తక్కువాయె
శిస్తు మెండాయె నింకేమి సేయుటోయి
నిర్గరారణ్యమే నీకు నెలవటోయి
కర్షకా యిది యేనాటి కర్మమోయి'

అని రైతన్న జీవితంపట్ల తనకున్న ఆర్తిని వ్యక్తం చేశారు. గ్రామీణవాతావరణాన్ని కనులకు కట్టే విధముగా పెద్ద కాపు, పతిగ పంట, పైర పంట, క్షేత్ర జీవి మొదలయిన ఖండకావ్యాల్ని వ్రాశారు. సంక్రాంతి పద్యాలలో తెలుగువారి విందు భోజనాల్ని, కోడిపందెముల రామణీయకాన్ని, రంగవల్లికల అందచందాల్ని అలవోకగా చిత్రీకరించారు.

శ్రీ చౌదరిగారు భాషాపరంగా ఎంత సంప్రదాయబద్ధులో భావనాపరంగా అంత అభ్యుదయవాది. అందరికీ ఆహారనివాసాలు అందుబాటులో వుండాలని, సామాన్య వ్యక్తికి తిండి దక్కకపోతే ప్రపంచాన్నే కాల్చివేద్దామని తమిళకవి భారతియార్ ఆక్రోశం ప్రకటించినట్టే చౌదరిగారు

'సంఘమున హెచ్చుతగ్గులు సమయుదనుక
నెల్లరకుఁ గూడుగుడ్డ సంధిల్లు దనుక'

నవసమాజ స్థాపన జరుగదని ఢంకా బజాయించి చెప్పారు. ప్రజాస్వామ్యంలో 'మనమందరం రాజులం' అని భారతియార్ సామాన్య ప్రజల బలాన్ని వ్యంగ్యంగా చెప్పినట్లే

'మనము పేదవాని మఱచుట చేతనే
పెక్కు సంకటములఁ జిక్కినార
మతఁడె నేడు నారాధ్య దైవత
మతని కొల్చుటే సుఖావహమ్ము'

అని ప్రజాస్వామ్యనేతలని చెప్పుకునేవారికి చురకలు వేశారు. యుగయుగాలనుండీ ధనవంతులు నీతి లేక పాపభీతి లేక పేదలరక్తం జుర్రడం న్యాయం కాదని హెచ్చరించారు. గ్రామ రాజ్యం రైతు రాజ్యం, రైతు రాజ్యమే రామరాజ్యమని చెప్పడాని కోసమే

'హాలికుల నొక్కి జీవచ్ఛవాలఁ జేసి
యేలు వారేమి సాధింప నెంచినారొ
కాపణంగిన నే మొనగాడు నిల్చి
రైతు మూల్గిన నేవృత్తి రాణకెక్కు' అని ప్రశ్నించారు.

చౌదరిగారికి రైతన్నలే కాదు శ్రామికులన్నా గౌరవమే. 'శ్రమపడితే జాతికి సిరి, శ్రమపడడమే రాజ్యానికి సంపద' అన్నదే వారి ధ్యేయం. అంచేతనే గోడలు కట్టేవారిని చూచి

'ఎవని యెముక లీ మేడల కిటుకలయ్యె
నెవని రక్తంబుచే గోడ లిట్లు బిగిసె' అని ప్రశ్నించారు.

చౌదరిగారు ఆంధ్రత్వాన్ని బాహాటంగా చెప్పుకుని ఆనందించిన వ్యక్తి. అయితే ఆంధ్రత్వంలో భారతీయతను మరచిపోని మహనీయుడు.

'ఆంధ్రుడవై జన్మించితి
వాంధ్రుడవై యనుభవించు మా యుర్వీభవం
బాంధ్రుఁడవై మరణింపుమి
యాంధ్రత్వము లేని బ్రతుకు నాశింపకుమీ'

అని చెబుతూ ఆంధ్రత్వాన్ని ప్రాణంగా, భారతీయ ధర్మాన్ని దేహంగా భావించ వలసిందని హెచ్చరిక చేశారు. ఆంధ్రత్వంతో భారతీయత కలసివుండాలని అలా వుంటే రాష్ట్రంలో రారాపులుండవని చెప్పడం ప్రాంతీయతను రెచ్చగొట్టే వారికి హెచ్చరిక గూడా.

తెలుగువారి పండుగల్ని ప్రత్యేకించి సంక్రాంతి పండుగల్ని విస్తరించి వ్రాసిన అధునిక కవులలో తుమ్మలవారు ప్రసిద్ధులు సంక్రాంతిలక్ష్మి మొఖానికి 'గుమ్మడి పూదుమారం' అద్దినదట. మిరియపుపండు బొట్టు పెట్టినదట. మంచుతెర చీరను సింగారించుకొందట. బంతి చేమంతుల్ని కొప్పులలో తురిమిందట. తెలి మబ్బు గొడుగునీడలలో 'భాగ్యాల కదలి'లాగా బయలుదేరిందట. సంక్రాంతిలక్ష్మి సౌందర్యాన్ని కళాదృష్టితో రమణీయంగా వ్రాసిన కవి తుమ్మలవారే. పండుగ లంటే పణ్యారముల ఆరగింపుమాత్రం కాదు. అంచేతనే తుమ్మలవారు

"మేడపక్క గుడిసె మేలిమి బంగారు
పట్టువలువ సరస బ్రాఁతగోఁచి
తనివి చెంత నింత తరగని కన్నీరు
లేని పండువిది ఫలింపవలయు" అన్నారు.

తుమ్మలవారు అభినవ తిక్కనగా ప్రసిద్ధులు. కానీ చౌదరిగారికి ఇతర కవులపై ద్వేషంలేదు. పైపెచ్చు దేశకవులంటే ప్రాణం.

"తెలుగుబాస పెంపుతెలుప తిక్కన చాలు
అన్నమయ్య చాలు హాసుతెలుప
తిన్నదనము తీరుతెలుప వేమన చాలు
కేలుమోడ్తు వీరి మేలుములకు" అనడం దీనికి సాక్ష్యం.

తుమ్మలవారు గాంధీయవాదులు. కవితలోమాత్రం కాదు ఆచరణలోనూ. నిరాడంబరత. సత్యాహింసల పాలన, ఖద్దరు ధారణ, సామాజిక శ్రేయస్సుకే ప్రాధాన్యమివ్వడం మొదలయినవాటిల్లో తుమ్మలకు సాటిరాదగిన గాంధీయకవులు లేరు. తన్ను గాంధికవిగా పరిచయం చేసుకున్న కవి. మహాత్మ కథను, అమర జ్యోతిని వ్రాసి భక్తిప్రపత్తులు ప్రకటించుకున్న నిజాయితీపరుడు. పోతన 'పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట' అని చెప్పినట్టుగానే

"పలికెడిది గాంధి కథయట
పలికించెడివారు తెలుగు ప్రజలట"

అని పరమ పూజ్యత్వాన్ని నిలిపారు. కనుకనే కట్టమంచి రామలింగారెడ్డిగారు

'తుమ్మల సీతారామమూర్తి మహాత్మునియొక్క ఆస్థానకవి. ఆ స్థానము శాశ్వతము' అని నీరాజనం సమర్పించారు.

శ్రీ చౌదరిగారు నాస్తికులు కారు. కాని మాధవసేవకన్నా మానవసేవకు ప్రాధాన్యమిచ్చే సువ్రతులు. సుకవి లక్షణాలు చెప్పినప్పుడు చౌదరిగారు

"దేశభక్తునందు దీనునియందును
చెమటనోడ్చి బ్రదుకు జీవియందు
కరుణ సూనృతమ్ము కలవానియందును
వాసుదేవు చూచువాడు సుకవి" అని చెప్పారు.

గ్రంథాలను ఈశ్వరాంకితం చేయడాన్నికూడా నిరసిస్తూ

"ఈశ్వరుని చాటుగా మర్త్యుడెవ్వడు వీని
కైత కర్తదుబ్బు ననుటయుకల్ల కాన
హేమగిరికి వరాటిక నిచ్చినట్లు
నరుడు తన వచనమ్ము నీశ్వరునకిడుట" అన్నారు.

రాళ్ళు రువ్వినవారిమీద పూలు చల్లడం, ముండ్లుగుచ్చిన చేతిలో పండ్లు పెట్టడం, పరమశత్రువులో ఇష్టసఖుణ్ణి దర్శించడం, క్రోధాన్ని దిగమింగడం సుకవి లక్షణాలుగా చెప్పుకున్న చౌదరి జీవితంలోనూ సుకవి.

ఉత్తమ కవులు విశ్వశ్రేయస్సునే కోరుకుంటారనడానికి చౌదరిగారు కూడ ఉదాహరణ ప్రాయులే

"హస్తిన కరాచి చుట్టములైనవేళ
నమెరికా రషియా స్పర్ధలణిగినపుడు
లోకమున శాంతియొదవు నస్తోకమగుచు"

అనడం దీనికి నిదర్శనం. పీడితజాతిలో విప్లవం రాకతప్పదని వూహించిన దీర్ఘదర్శి

"దరిద్రుల( ద్రోసిపుచ్చుకా
లము చనె విప్లవాగ్ని దెసలన్ గబళింపకముందె యందలా
లమరినవారు మేల్కొని యహంకృతి నుజ్జనసేత లగ్గగున్"

చౌదరిగారి గ్రంథరాశి అనంతం. వాటిలో ఆత్మార్పణం, రాష్ట్రగానం, అమరజ్యోతి, ఆత్మకథ, కదంబకైత, ఎక్కట్లు మొదలయినవి చాల ప్రసిద్ధాలు. 25-12-1901 లో పుట్టి రసవత్కావ్యాలు రచించి కనకాభిషేక గజారోహణ గండ పెండేరాది సన్మానాలంది అభినవ తిక్కనగా విఖ్యాతులై 21-3-1990 వ తేది అమరజీవి అయిన తుమ్మలవారు ఆంధ్రుల ఆత్మగౌరవానికి 'బావుటా'వంటి వారనడంలో సందేహంలేదు.

ఆల్ ఇండియా రేడియో
25-4-91.

# కన్నడ కావ్యాలలో 'కుకవి నింద'

ద్రావిడ భాషలలో తమిళం తర్వాత ప్రాచీన సాహిత్య సంపద కన్నడ భాషలోనే వుంది. కన్నడకవులు తమ కావ్యావతారికలలో సుకవిస్తుతితోపాటు 'కుకవి నింద' కూడా చేశారు. ఈ సంప్రదాయం సంస్కృత ప్రాకృత సాహిత్యంలో అక్కడక్కడ కనిపించినా కన్నడంలోనూ, తెలుగులోనూ ఈ 'కుకవి నింద' కావ్యావతారికలలో ఒక భాగమయిపోయింది. ఈ నియమం పాటించని కవులు చాలవరకు తక్కువే.

కన్నడ సాహిత్యంలో 'అకవుల్ని' నిందించిన మహాకవి పంపకవి (క్రీ శ. 941) అంధ్రుడని చెప్పవచ్చు. ఆది పురాణం, విక్రమార్జున విజయం పంపమహాకవి రచనలు. ఆదిపురాణం ధార్మిక కావ్యమయితే విక్రమార్జున విజయం లౌకిక కావ్యం. మతాన్ని సాహిత్యాన్ని జోడు చేసి వ్రాసిన రచన ఆదిపురాణం. ఆదిపురాణం మొదటిరచన కావడం వల్లనో, సమకాలీనుల ఈర్ష్యాద్వేషాలకు విసిగి వేసారిపోయి పంపకవి అకవుల్ని నిందించడానిపిస్తుంది.

కోగిలెయ సర అరణ్యదొళ్
ఎగ్దెయదో మూర్ఖ జడజనారణ్యదొళ్ ఇం
పొగడిసిద కవి శబ్దం అ
దే గ్దెయుదు అరణ్యరుదితం అదుబగె వాగళ్

—ఆది పురాణం 1-23

దట్టమయిన అడవిలో కోకిల కుహూకుహూరావం అరణ్యరోదనం ఏలా అవుతుందో, మూర్ఖులు, జడులువున్న జనారణ్యంలో సత్కవి కావ్యపఠనం సుతరామూ పనికి రాదని భావం. రసవత్కావ్య నిర్మాత అయిన పంపమహాకవి అంతటివాడు విసిగి వేసారి 'శుష్కవ్యాకర్తలు, శుష్క తార్కికులు, మూర్ఖులు మొదలయినవారికి కావ్యరసాస్వాదనం దక్కదని (1-24) చెప్పాడు.

కన్నడ కవిత్రయంలో రెండవవాడు పొన్నకవి (క్రీ. శ. 939-968) ఇతడు కూడా శాంతిపురాణం అనే ధార్మిక కావ్యాన్ని వ్రాశాడు. శాంతిపురాణంలో

'ఉడుగిదుదు ఈగళిన కబ్బదొళ్ బట్టజె ఈ
గడిన కవి వ్రజక్కె పదసంచయం అచిరమాదుదు'

అని కుకవులు వ్రాసిన కావ్యాలను నిందించాడు. 'ఈనాటి కావ్యాలలో సౌందర్యం ఆవంతయినా లేదు. ఈనాటి కవులకు ఏ మాత్రం పదసంపత్తి వున్నట్టు లేదు' అని ఈసడించాడు.

కన్నడ కవిత్రయంలో మూడవవాడు రన్నకవి. రన్న తాను రత్న పరీక్షకుడనని, కృతిరత్న పరీక్షకుడనని సగర్వంగా చెప్పుకున్నాడు. ఆదిశేషుని పడగలమీది రత్నాలతో తన కృతిరత్నం పోటీ పడుతుందని చెప్పుకున్నాడు. ఈతని రచనలు అజిత పురాణం, గదా యుద్ధం. అజిత పురాణం ధార్మికకావ్యం, ఈ గ్రంథంలో రన్నకవి కుకవుల్ని నిందించాడు. ఆ కుకవులు వాగ్దేవి గొంతుకల్ని నులిపేవారట. వాఙ్మాతకు ద్రోహం చేసినవారట. పూర్వకవులు మాత్రం ప్రతిభా సమన్వితులని ఈనాటి కవులు పనికిరానివారని భావించేవారు నా 'గదాయుద్ధం' చదివి పరీక్ష చేసుకోవచ్చు, అని ఆహ్వానించాడు కూడా.

నేమి చంద్రకవి క్రీ. శ. 1200 నాటివాడు. జైనుడు లీలావతి ప్రబంధ రచయిత. కవి రాజమల్ల, విద్యా వధూవల్లభ, శృంగార కారాగృహ, చతుర్భాషా చక్రవర్తి మొదలయిన బిరుదాలు కలవాడు.

'అనుం బుధ రొడనె నృపా
స్థాన దొళ్ ఇర్దప్పెన్ ఎందు కుకవి కదంబం
బానుద్ద అప్పుదేకె ! ఉ
ద్యానదొళ్ బడనె ఇరవె కాగెయుం కోగిలెయిం'

కుకవి సమూహం తాము విద్వాంసులతో రాజాస్థానాలలో వున్నామని విర్రవీగ వచ్చు. అయితే లాభం ఏమి ? ఉద్యానవనంలో కాకులు కోకిలలు కలిసివుండవా.

కన్నడ ప్రశస్తకావ్యాలలో 'జగన్నాథ విజయం' ఒకటి. రచయిత రుద్రభట్టు (క్రీ. శ. 1180) ఆరసికుల్ని మెప్పించడం చాల కష్టమని రుద్రభట్టు భావించినవాడు. వెన్నెలవల్ల చంద్రకాంతశిలలు కరుగుతాయి. గోరి రాళ్ళు కరుగు

తాయా ? వసంతంలో మామిడిచిగురు తొడుగుతుంది. కాని మోడుమాను చిగిరిస్తుందా అని ప్రశ్నించినవాడు రుద్రభట్టు.

జన్నకవి వ్రాసిన ధార్మికకావ్యం 'అనంతనాథ పురాణం' ఇతని కాలం క్రీ. శ. 1230. కుకవుల్ని కూపమండూకాలుగా భావించినవాడు. వారికి పదవివ్యానం తెలియదు. స్వారస్యం తెలియదు. ప్రతిభను గుర్తుపట్టలేరు. కేవలం 'దురుక్ దురుక్' అంటూ రొదచేయడమే వారి ప్రవృత్తి. శ్రీనాథుడుకూడా అచ్చం ఈలాగే.

> కూప మండూకములఁబోలెఁ గొంచెమెఱిఁగి
> పండితంమన్యులైన వైతండికులకు 1-13

అని భీమేశ్వరపురాణంలో చెప్పాడు.

కన్నడంలో బాగా ప్రచారంలోవున్న సంకలన గ్రంథం 'సూక్తిసుధార్ణవం'. సంకలనకర్త మల్లికార్జునుడు. తన కాలంనాటి పండితుల చిత్తవృత్తిని సొగసుగా వర్ణించిన కవి మల్లికార్జునుడు.

కొందరు కవినిచూచి శాస్త్రజ్ఞానంలేదే అని అంటారట. శాస్త్రపరిచయం వున్నవారిని కవికాదని నిర్ధారిస్తారట. ఇంక కవులలో మరో తెగవారున్నారట. ఈ పద్యం ఏ ఛందస్సులోది అంటే కసరుకుంటారట. పద్యంలోని ఒక పద బంధాన్ని ఉదాహరిస్తూ ఈ ప్రయోగం ఈలాగవుందేమిటీ అంటే తిడతారట. ఏదయినా ఒక విచిత్రపదాన్ని ఉదహరిస్తూ అర్థమేమిటీ అంటే దురుసుగా వ్యవహరిస్తారట.

తెలుగులో తిక్కన భారతానికి ఎంత ప్రచారంవుందో ఆలాగే కన్నడంలో కుమార వ్యాసభారతానికి ప్రచారంవుంది. ఇతని కాలం 1400-1430. గదగ్‌లోని వీరనారాయణస్వామి కవి అని, తాను కేవలం లిపికారుడనని చెప్పుకున్నవాడు కుమారవ్యాసుడు. తన కావ్యాన్ని ఇతరులు ఈసడించుకున్నా నష్టంలేదని సాలంకారి కంగా కవి చెప్పుకున్నాడు.

> చోర నిందిసి శశియ బైదడె
> క్షీరవను క్షయరోగి హళిదడె
> నారణాప్సియ ఘోళవ నిందిసి నక్కరే నహదు (1-22)

దొంగ చంద్రుణ్ణి, క్షయరోగి పాలును, కుంటివాడు కాళిని నిందించడంలో ఫలమేమి అని కుమారవ్యాసుని ప్రశ్న.

తెలుగులో పిల్లలమర్రి పినవీరన జైమినిభారతం వ్రాసినట్టే లక్ష్మీశ కవి (క్రీ. శ. 1550) కన్నడంలో జైమినిభారతం వ్రాశాడు. కావ్యం చదివేవారికి సహనమవసరం. సహనశీలికి కావ్యామృతపానసిద్ధి తథ్యం. కావ్యాలలో తప్పు లుండవచ్చు, కాని చివరిదాక చదివితే ఎన్నో అమూల్యాంశాలు స్పష్టమవుతాయి. అంచేత తప్పులనే లెక్కపెట్టరాదు. మీగడకట్టిన పాలను వదలిపెట్టడంలేదు. పాలను చిలికి వెన్నతీసి లాభపడతాం. ఆ పాలిలో చింతపులుసు పిండితే ప్రయోజనం ఏముంది ? అలాంటి పాలను పారవేయాల్సిందే. ఆ దోషం ఆవుకు అంటగట్టడంలో అర్థమేమిటి ?

కుకవులకు నమస్కారంచేసి తామే తప్పుకున్న కవులుకూడా లేకపోలేదు. వారిలో 'ధర్మామృతకర్త' ఒకడు. దుర్జనపర కవీశ్వరుల్ని వెదకివెదకి భక్తితో నమస్కరిస్తానన్నాడు 'ధర్మామృత' కావ్యకర్త. తెలుగు కవులలో రామరాజ భూషణుడు, కందుకూరి రుద్రకవి, పిండిప్రోలు లక్ష్మణకవి, కృష్ణకవి మొదలయినవారు కుకవులకు నమస్కారంచేసి తాము తప్పుకున్నారు.

ఒక కవి కవితాలక్షణం తెలుసుకోవడానికి 'కుకవి నింద'కూడా సహాయపడుతుంది. కుకవులే లేకపోతే సుకవులకు ప్రసిద్ధిలేదు. కురూపులు లేకపోతే సురూపుల్ని గుర్తించేవారు చాల తక్కువే వుంటారు.

కన్నడాంధ్ర కవుల 'కావ్యావతారికల్ని' తులనాత్మకంగా పరిశీలించడం అవసరం.

# తమిళంలో పొడుపు కథలు

జానపద వాఙ్మయం సువిస్తరమయింది. అందులో ఎన్నో శాఖ లున్నాయి. వాటిలో 'పొడుపు కథలు' అనే శాఖకు ప్రచారం మరీ ఎక్కువ. పొడుపు కథలనే ఆంగ్లంలో 'రిడిల్స్' అంటారు. సంస్కృతంలో ప్రశ్నోత్తరమని, కూటమని, సమస్య అని ఎన్నో పేర్లతో పొడుపు కథలను వ్యవహరించడం కనిపిస్తుంది. తమిళంలో పొడుపు కథల్ని పిశి, పుదిర్, విడుకతై అని పేర్కొన్నారు. కన్నడంతో 'ఒగటుగళు' అని వ్యవహారం. తెలుగులో విడి కత, పొడుపు కథలనే పేర్లకు వ్యాప్తి ఉంది. పొడుపుటలో విప్పుటలో ఆనందాన్ని కలిగించేవి పొడుపు కథలవుతాయి. వీటిలో వస్తువు గూఢంగా ఉండటమే గాక వినేవాళ్ళకు కుతూహలం కలుగుతుంది. పొడుపు కథలు చాల వరకు ఆలోచనాత్మకాలు. అందువల్ల గంభీరంగా కూడా ఉంటాయి. పొడుపు కథలు ఎన్నో రకాలు. ఇందులో రానివంటూ ఉండవు. సాహిత్యానికి సంబంధించినవి, వినోదాత్మకంగా వుండేవి ప్రతి భాషల్లోనూ వున్నాయి. వీటివల్ల ఆయా జాతుల ఔన్నత్యం కూడా తెలియడానికి వీలుంది. కల్పనాశక్తి, భావ ప్రకటనలో వారికున్న చాతుర్యం చూస్తుంటే చాల ఆశ్చర్యమేస్తుంది.

ప్రకృతికి సంబంధించిన పొడుపు కథలు ఇతర భాషలలో ఉన్నట్లే తమిళం లోనూ ఎక్కువగా కనిపిస్తాయి.

మా నాన్న డబ్బు లెక్కెట్టలేను
మా అమ్మ చీర మడతెట్ట లేను

డబ్బు అనడంలో అసంఖ్యాకములయిన నక్షత్రాలు, మడత పెట్టలేని చీర అనడంలో 'ఆకాశం' తెలుస్తూ వుంది. ఈలాంటిదే మరొకటి.

నల్లచీర చిన్నది నాజూకుగా వున్నది
ముగ్గు లెట్టుతున్నది ముద్దు లొలుకుతున్నది

అనడంలో రాత్రివేళ ఆకారం కనిపించే తీరు మనోహరంగా వర్ణితం.

అన్నను చూస్తే ఉక్రోషం
తమ్ముని చూస్తే సంతోషం

ఈ పొడుపు కథల్లో తీక్షణంగా మండే సూర్యుడు చూడగానే ముద్దొచ్చే చంద్రుడు స్ఫురిస్తారు.

ఏడు కొండల కావల
ఏను బోతు రంకె వేసింది

అనడంలో దూరంగా భయంకరంగా గర్జించే మేఘగర్జన జ్ఞప్తికి వస్తుంది.

దగ్గరికెడితే చాలు దాసిని నేనంటుంది
గుబులుతిరిగితే చాలు కౌగిలికి సై అంటుంది

ఈ పొడుపుకథకు 'అలిగిన అమ్మాయి' అనే అర్థంచెబితే విశేషాంశం ఏమీలేదు. కాని ఈ పొడుపుకథ అడిగిన వ్యక్తి ఆశించిన విషయం 'కదలి అల'. ప్రౌఢ కావ్యాలలోని సముద్రవర్ణనలకు ఇది ఏమాత్రం తీసిపోదు.

పొడుపుకథల్ని జీవనదితో పోల్చవచ్చు. కొత్తప్రవాహం వచ్చేసరికి సరికొత్తజీవితం మొదలవుతుంది. అలాగే సంఘం మారుతున్నకొద్దీ, విజ్ఞాన ప్రయోజనాలు విస్తరించేకొద్దీ కొత్తకొత్త పొడుపుకథల్ని మానవులు సృష్టించు కుంటారు. ఈలాంటివాటికి ఆలోచించకుండా సమాధానంచెబితే మనం తప్పటడుగు వేసినట్లే.

చిన్నచిన్న యింటిలో సిపాయి వీరులెందరో

ఈ పొడుపుకథకు తేనెటీగ సమాధానం కావచ్చుగాని ఆశించిన జవాబు అగ్గిపెట్టె.

అంగలార్చేవాడు
అందుకుంటే చాలు
అణగిపోయే వాడు

దీనికి 'ఏడుస్తున్న పిల్లవాడు' అనే జవాబుతోబాటు మోగుతున్న టెలిఫోను గుర్తుకువస్తుంది.

తాకితే అంటుకుంటుంది – కాని బంకకాదు
వదలిపెడితే పనిచేస్తుంది – కాని యంత్రంకాదు

ఈ కథకు గయ్యాళిభార్య సమాధానం కాదుగాని 'కరెంట్ షాక్' ఆశించిన సమాధానం.

మెడవుంది చేతుల్లేవు
నాలుకవుంది మాటల్లేవు
నోరువుంది కదల్లేదు
టోపీవుంది కుచ్చులేదు

దీనికి సమాధానం 'పెన్'.

ఊరిచివరి కెళ్ళాను
కొండచిలువ చూశాను
లాగి లాగి కొట్టాడు
వెర్రెత్తి కేకవేశాడు

ఈ కథలో వూరిచివరుండే రైల్వేస్టేషన్, చాలా బోగీలున్న రైలు, బయలుదేరేటప్పుడు రైలుకూత రమ్యంగా వర్ణితం.

నోరులేదు కాని అన్నీ చెబుతాను
ప్రాణంలేదు కాని వూర్లకు వెడతాను
కాలులేదు కాని ఇంటికి వస్తాను

అనడంలో పోస్ట్‌మేన్ అందించే ఉత్తరంముక్క స్పష్టమవుతుంది.

'రారండని పిలిచేది పోపొండని తరిమేది'

అనడంలో ఫ్యాక్టరీలోని సైరన్‌కూత సమాధానం.

తమిళంలో ఇంటికి, ఇంట్లోని వస్తువులకు సంబంధించిన పొడుపు కథలు చాల కనిపిస్తాయి. ఇవి చాలవరకు పిల్లలకు, స్త్రీలకు సంబంధించిన పొడుపుకథలు. వీటివల్ల పిల్లలకు ఇంట్లోనే ఆలోచించే శక్తికి తర్ఫీదు ఇవ్వడం జరుగుతుంది. వీటిలో కొన్నిటినిచూద్దాం.

అమ్మ పడుకుంది బిడ్డ పారాడుతుంది - మసాలరాయి

వింతయిన చెరువులో అందాల చిలక
తోకతో నీరు తాగే మొలక - దీపంవత్తి

కన్నుంది చూడలేదు కాలుంది నడవలేదు - నవారుమంచం

గుంటలో జన్మించి గుడిసెలో జీవించి
సంతలో నిలబడి పంక్తిలో వాలింది - చాప

నా తల్లేమో సంద్రం నా తండ్రేమో సూరీడు
నేనేమో అందరికీ కావాలి - ఉప్పు

కవిత్వానికి చమత్కారం జీవం. ఆ చమత్కారం పదగతంకావచ్చు. వాక్య గతంకావచ్చు. భావగతమయినదీ కావచ్చు. పొడుపుకథల్లోను చమత్కారం ఎన్నో రూపాలలో సాక్షాత్కరిస్తుంది. ఉదాహరణకు కొన్ని.

డాక్టరొచ్చారు సూది వేశారు
కాసు లిసేను పారిపోయారు - దోమ

అమ్మా యొకతె వచ్చింది
అమృతం నిండా పోసింది
కులుకుతు కులుకుతు నడిచింది
కౌగిలిలో అట్టే ఒదిగింది - నీళ్ళబిందె

రాజు రాణి వున్నారు - దేశం కాదు
ఆకు లెన్నో వున్నాయి - మొక్క కాదు
అక్షరాలెన్నో వున్నాయి - పుస్తకం కాదు
సొమ్ము లెన్నో వున్నాయి - అంగడి కాదు - చీకట్లపే

మట్టి కింద వెండి ముద్ద - ముళ్ళంగి
దారి పొడుగునా దాహం తీరుస్తుంది - వాన కాదు
కొండలో కోనలో తిరుగుతుంది - ఎలుగ్గొడ్డు కాదు
సముద్రంలో మునిగిపోతుంది - చేప కాదు - నది

మానవ దేహప్రకృతి ఆధారంగా అల్లబడిన పొడుపు కథలు పిల్లలకి బాగా నచ్చుతాయి. వీటిలో వివరణ ఎక్కువగా వుంటుంది. చిన్న పిల్లలకు చప్పున స్ఫురించడం కోసం వివరణ తప్పనిసరి.

అక్కాచెల్లెల అనుబంధం ఇరుగూ పొరుగూ సంబంధం
దగ్గర దగ్గరవున్నారు దరికి చేరలేకున్నారు
చిన్న చిన్న తలుపులు చిటారి తలుపులు
అనడంలో 'కళ్ళు' గుర్తుకు వస్తాయి.

పగలాడి రాణికి వాకిట్లో కాపలా - నాలుక

రైతు చల్లని విత్తనం మేస్త్రీకట్టని కట్టడం
చాకి వుతకని గుడ్డలు ఉలితో చెక్కని రాళ్ళు - పళ్ళు

ఐదుగురిలో చిన్నోడు - పెళ్ళికి మాత్రం పెద్దోడు. - చిటికెన వ్రేలు.

పొడుపు కథలలో మరికొన్ని వున్నాయి. వీటికి జవాబు చెప్పడానికి పెద్దగా ఆలోచించవలసిన అవసరం లేదు. స్పష్టతకు దగ్గరగా వుండడమే దీనికి కారణం

వస్తా నీతో ఎప్పుడు – పరుగులు వారేటప్పుడు – నీడ
ఎందరెక్కితేనేం పూరుకునే గుఱ్ఱం – అరుగు
తాగడానికేమో నీరుంది తానమాడడానికి
తగినంత నీరు లేదు – టెంకాయనీరు
నన్ను చూస్తే నిన్ను పట్టిస్తా – అద్దం
ఆకాశం కేసి ఎదిగింది చెట్టు కాదు
ఆకులున్నాయి కొమ్మల్లేవు – కొబ్బరి కాయ
మధ్య మధ్య గణుపులున్నాయి వెదురు కాదు
తింటే చాలు ఎంతో మేలు – చెరకు

జానపద విజ్ఞాన అధ్యయనంవల్ల లాభా లెన్నో. విశ్వవిద్యాలయాలలో పొడుపు కథలకు సంబంధించిన పరిశోధన జరుగుతుండడం అభినందించదగ్గ అంశమే.

ఆంధ్ర ప్రభ (దినపత్రిక)
2–4–'78

# భారతిదాసన్ - త్రిపురనేని - శ్రీ శ్రీ

సాహిత్య పరిశోధనలో నేడు తులనాత్మక అధ్యయన పద్ధతికి ఎంతో గౌరవం, ఆదరణ, ప్రయోజనం, అగ్రతాంబూలం అన్నీ కనిపిస్తున్నాయి. ఈ దృష్టితో తమిళ మహాకవి భారతిదాసన్ శతజయంతి ఉత్సవ సందర్భంలో ఆ మహాకవిని తెలుగు కవులతో సరిపోల్చి చూస్తున్నాం. ప్రసిద్ధ విద్వాంసులు భారతిదాసన్ కవిని గరిమెళ్ళ సత్యనారాయణతోను, గురజాడతోను కొందరు పోల్చారు. కాని నా దృష్టిలో శ్రీ శ్రీకి సమానుడయిన తమిళకవి లేనట్లే భారతిదాసన్‌కు సరితూగగల తెలుగుకవి లేనే లేడు. ఈ నిష్కర్షకు 'సవాలక్ష కారణాలున్నాయి.

భారతిదాసన్ చాలకాలం బతికిన వ్యక్తి. 1891 నుండి 1964 దాకా భారతదేశమంతట, దక్షిణదేశమంతట జరిగిన అనేకానేక సంఘటనలను దర్శించి, స్పందించి కవితావ్యవసాయం సాగించినవాడు. ఈ దృష్టితో పరిశీలిస్తే తెలుగు కవులలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ శ్రీ మొదలయినవారు స్వాతంత్ర్యానంతరం కూడా జీవించినవారే. భావ కవిత్వానికి పరిమితమయినవారు రాయప్రోలు, సంప్రదాయవాదానికి భిన్నంగా ప్రవర్తించినవారు విశ్వనాథవారు, పాశ్చాత్యప్రభావంతో మార్క్సిసమ్ వైపు మొగ్గి అభ్యుదయ, విప్లవకవితలలో వీరవిహారం చేసినవారు శ్రీ శ్రీ. అందువల్ల వీరితో ఏకముఖంగా భారతిదాసన్‌ను పోల్చడం 'అతివ్యాప్తి' అవుతుంది.

ఉపాధ్యాయుడు, పత్రికాధిపతి, సంఘసంస్కర్త సాహిత్యకవి భారతిదాసన్ అని అంటే ఈ మహాకవిని కందుకూరి వీరేశలింగంతో పోల్చాలి. అయితే పంతులుగారు స్వాతంత్ర్య సంగ్రామంలో వహించిన పాత్ర చాల తక్కువ. మహిళాభ్యుదయానికి, అతిబాల్య అతివృద్ధ వివాహ సంస్కరణకు, విధవా వివాహాది సత్కార్యాలకు పరిమితమయిన సంస్కర్త. అంచేత కందుకూరి వారిని భారతిదాసన్‌తో పోల్చడం 'అవ్యాప్తి' అవుతుంది. కొంతవరకు భారతిదాసన్‌ను గురజాడ, గరిమెళ్ళ, రాయప్రోలు, త్రిపురనేని రామస్వామి

చౌదరులతో పోల్చవచ్చు. ఈ నలుగురు కవులను మూసగాపోసి నగిషీలు దిద్దితే భారతిదాసన్ ప్రతిరూపమవుతుందనడం స్వభావోక్తి. 'భారతి దాసన్' ది చిత్రమయిన ప్రవృత్తి. ఆ కవిని గురించి ప్రసిద్ధ విమర్శకుల అభిప్రాయాలు గమనించదగ్గవి.

పుదుమై పిత్తన్: వివేకాలయం కట్టి అందులో మనల్ని సుఖంగా జీవించేటట్లు ఆశించిన జ్ఞాని.

రా. పి. సేతుపిళ్లై: భారతిదాసన్ కవితలో వేగం వుంది. స్వాతంత్ర్య దాహం వుంది. సంప్రదాయంవుంది. నిర్దిష్ట లక్ష్యముంది.

వ. రా: ఆవేశాన్ని, ఉద్వేగాన్ని ప్రవాహరూపంలో ఉప్పొంగించిన మహోన్నత కవి భారతిదాసన్.

కి. ఆ. పె. విశ్వనాథం: కవితకోసం ఒకసారి, వినూత్న భావాలకోసం మరో సారి, ఉద్విగ్నత కోసం ఇంకో తడవ, శ్రావ్యత కోసం మరోమారు భారతిదాసన్ కవితల్ని చదివాను.

భారతిదాసన్ ఒక సిద్ధాంతానికి తలతాకట్టు పెట్టుకున్న వ్యక్తికాదు. మారుతున్న సమాజానికనుగుణంగా ప్రజాశ్రేయస్సు పరమార్థంగా తన్ను మలచుకొన్న సమ్మిశ్రిత సైద్ధాంతిక ప్రవక్త. చాల సందర్భాలలో భారతిదాసన్ కవితలో వైరుధ్యాలు కనిపిస్తాయి. అయితే వాటిమధ్య క్రమం లేకపోలేదు. ఒక సరోవరంలో ఒకరాయి విసరినపుడు ఏర్పడే చిన్న పెద్ద తరంగాల వలయాలవంటివిగా వాటిని గుర్తించడం అవసరం. భారతిదాసన్ కవితలో భాషాభిమానం, అగ్రవర్గాల పట్ల ద్వేషం, మహిళాభ్యుదయం, హేతువాద ధోరణులు, అభ్యుదయ వాదాలు, భారతిదాసన్ ప్రత్యేకతలు మొదలైనవాటిని విహంగావలోకన దృష్టితో చూద్దాం.

భాషాభిమానం:

భారతదేశంలో తమకున్న భాషాభిమానాన్ని బాహ్యంగా చెప్పుకుంటూ ఒక ఉద్యమంగా నడుపుతూ జీవించినవారిలో నాడు బెంగాలీలు, నేడు హిందీ ప్రాంతీయులైతే, నాడూ-నేడూ తమిళులు కనిపిస్తారు. ఈ అభిమానం తమిళులలో

పిసరంత పెచ్చు అనడం అందరికి తెలిసిన విషయమే. ఈ భాషాభిమానం భారతియార్‌లో వున్నా పల్లవించి శాఖోపశాఖలై కొన్ని సందర్భాలలో 'వెర్రి తలలు' కూడా వేసింది భారతిదాసన్‌లోనే అని సత్యాన్వేషణ చేసే పరిశోధకు లంటారు.

"తమిళానికి అమృతమని పేరు. ఈ తమిళం ప్రాణానికి సమానం."

"ఓ శంఖమా ! మా జీవితం, మా జవం,
సర్వస్వం తమిళమని మోగించు"
"తల్లిమీద ఆన తండ్రిమీద ఆన
తమిళ ప్రాంతంమీద ఆన
స్వచ్ఛమైన తమిళంమీద ఆన పెట్టి
సోదరులారా మీకు చెబుతున్నా"

సామాన్య ప్రజలలో కూడా తమిళాభిమానాన్ని రేకెత్తించిన ఉద్యమ కారుడు భారతిదాసన్. తెలుగులో ఆంధ్రరాష్ట్ర సాధనకోసం జరిగిన పోరాటాలలో మాత్రం ఈ అభిమానం కవుల రచనల్లో ఉరకలు వేసింది. తెలుగు భాష గొప్పతనం గురించి మహాకవుల అభిప్రాయాలు

మార్దవ మాంధ్రంబు మధుర మాంధ్రంబు
హార్దమై శ్రావ్యమై యాంధ్రంబు తనరు

ఏ. వి. నరసింహంపంతులు 'ఆంధ్ర భాషా ప్రశంస'

అలరు తేనెలకు సావలి గట్టిన
కండ చక్కెరకు గడవలు పట్టిన
అమృతపు సోనలలో తిరుగాడే
తెలుగు బాసనాది కమ్మని
తెలుగు పలుకు నాది

పెనుమర్తి వెంకటరత్నం - రత్నాపథం

భారతిదాసన్ - త్రిపురనేని - శ్రీ శ్రీ

నాదు జాతి నాదేశము నాదు భాష

అను అహంకార దర్శనమందు మాంధ్ర

రాయప్రోలు సుబ్బారావు

తమిళులు సుబ్రహ్మణ్యస్వామిని 'తమిళ్ కడవుళ్' అని చెప్పి మురిసి పోయినట్లే త్రిపురనేని రామస్వామి చౌదరిగారు బ్రహ్మ భగవద్గీతలో విశ్వరూప సందర్శన భాగంలో బ్రహ్మనాయని నోట

'బాసలలో నెల్ల తెల్గు బాసను నేనే'

అని చెప్పించుకున్నారు. చాలక

తెలుగులలోనెల్ల మాల తెలుగును నేనే అని కూడా వివరించినారు. దేవునికి భాషకు ముడిపెట్టిన తమిళ కవులెందరో వున్నారు గాని తెలుగు కవులలో 'త్రిపురనేని' మాత్రం కనిపిస్తున్నారు.

భారతిదాసన్‌కు తమిళాభిమానంతోబాటు సంస్కృత ద్వేషంవుంది. హిందీ ఆధిక్యతపట్ల నిరసన కూడా వుంది. సంస్కృతం తమిళం హక్కును పరిహరించినదని భారతిదాసన్ చాలచోట్ల వాచ్యం చేశారు.

మా హక్కును చంపేసిన పాము సంస్కృతం అన్నారు

- ఎళుచ్చి - ఉత్థానం

కాని తెలుగు కవులలో సంస్కృత ద్వేషమున్నవారు కనిపించరు. హిందీ ఆధిక్యత పట్ల నిరసన చూపినవారు కూడా అరుదు. కాని చౌదరిగారు ఈ విషయంలోను తమిళకవులతో సరిపోతారు. వెల్లువ వలె వచ్చి పడుతున్న హిందీ భాషా వ్యాపకమును ఆయన అనేక విధములుగ ప్రతిఘటించాడు.

తమతమిళజాతి పౌరుషాన్ని, కళాసంస్కృతి ఔన్నత్యాన్ని, పురాప్రసక్తిని వర్ణించడంలో భారతిదాసన్ ఎలాంటి అనురక్తిని ప్రదర్శించాడో అలాగే త్రిపురనేని రామస్వామి చౌదరి గూడ వర్ణించాడు. ఆంధ్ర వాఙ్మయంలో విశ్వనాథ

సత్యనారాయణ, తుమ్మల సత్యనారాయణ చౌదరి, మల్లంపల్లి సోమశేఖర శర్మ ప్రభృతులు కూడా ఈలాగే కీర్తించిన వారిలో ప్రముఖులు.

ఆంధ్ర పౌరుషమున మాటలా

విశ్వనాథ, ఆంధ్ర పౌరుషము.

తెలుగు జోదుల తుటారి కటారి
చెలగి పగర చీల్చిన దినంబు

తుమ్మల సీతారామమూర్తి చౌదరి - రాష్ట్రగానం

తెలుగు జోదుల కత్తిమలసి నర్తించె
తెలుగు దొరల సేన దెన లాక్రమించె

మల్లంపల్లి సోమశేఖరశర్మ 'శారద'

తెలుగు బిడ్డ మరచి పోకుర
తెలుగు దేశము పురిటి గడ్డర
కొక్కొరొకో పాట పాడర

కవిరాజు 'శతకాలు - గీతాలు'

అంటూ తెలుగువారల వేడినెత్తురు, తెలుగు బావుటాలను పరిచయం చేసినారు.

తెలుగు నాడును గొల్వరా తమ్ముడా
తెలుగు గాలిని పీల్చరా

కర్లపాలెం కృష్ణారావు 'తెలుగునాడు'

తెలుగు వారిలో ఈ భాషాభిమానం మరో భాషపై దురభిమానం కలిగించ లేదు. కాని భారతిదాసన్ వంటి కవులలో కొన్ని వేళల 'ద్వేషాన్నే' పెంచింది.

'ఎల్లాం తమిళర్ ఉడమైయే (అంతా తమిళుల సొత్తు) అనే కవితలో కర్ణాటక సంగీతం తమిళ సంగీతమన్నాడు. ఈలాగే ప్రతి ఒక్కదానిని కళను,

వైద్యాన్ని తమిళంతో ముడిపెట్టి ఆర్యులు సంస్కృతీకరించి తమిళాన్ని మట్టు పెట్టారని ఆవేదన కక్కుకొన్నాడు.

ఈ సందర్భంలో డా॥ సి. నారాయణ రెడ్డిగారి మాటలు ప్రస్తావించడం తప్పుకాదు.

> "ఉద్యమం జడివాన వంటిది. ఆ సమయంలో వెలువడే కవిత్వం అంచులు దాటి ప్రవహిస్తుంది. ఈ విధమైన అభిమానము ఆ యుగ లక్షణము. ఇది పెద్ద దోషముకాదు నాటి కాల స్వభావమట్టిది. కవుల చిత్తవృత్తి అట్టిది. కవులు ప్రకటించిన అభిమానాతిరేకము అనాటి ప్రజలకానందమే కలిగించినది".

(ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు - ప్రయోగములు పుట-411)

అగ్రవర్గాలపట్ల ద్వేషం :

ఒకవర్గంమీద లేదా ఒక వర్ణంమీదా ద్వేషం పెరగటానికి ప్రధానంగా నాలుగు కారణాలు కనిపిస్తాయి. మొదటిది ఆ వర్గం లేదా ఆ వర్ణంవారివల్ల ఆత్మ గౌరవానికి హానికలగడం. రెండవది అభ్యుదయకాంక్ష. మూడవది తమ జీవన భృతికి ఆస్కారమయినదికూడా చేజారిపోతుందేమో అన్న ఆందోళన. నాల్గవది నీచ రాజకీయాలు.

భారతిదాసన్‌కు అగ్రవర్గాలపట్ల ద్వేషంకలగడానికి వైయక్తిక కారణాలు కనిపించవుకాని రామస్వామినాయకర్ ఆదర్శాల అనుకరణ కారణంకావచ్చు. లేదా నాటి సాంఘికవాతావరణం కావచ్చు. అయితే చౌదరిగారిలో అగ్రవర్ణులపై ద్వేషం కలగడానికి అనేక కారణాలున్నాయి. ఒక దీక్షితుడు కమ్మ కుమ్మర శబ్దాలకు సామ్యంచూపించి వీరందరు ఏకోదరులంటే కోపం తెచ్చుకోవడం, అలాగే తాను డబ్బుయిచ్చికొన్న మిఠాయిపొట్లాన్ని స్నేహితునికిస్తుంటే అతని తండ్రి వారించడం. 'అంత్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుకాదు', అనే అప్పకవి వాక్యం, వివాహాదులలో శ్రోత్రియుల దోపిడీలు మొదలయినవి కారణాలుగా కనిపిస్తాయి.

ద్వేషముండడం వేరు. ద్వేషాన్ని ప్రకటించడం వేరు. ఈ ద్వేషప్రకటనలో వాచ్యభావం, హద్దులుదాటిన దూషణ భారతదాసన్‌లో కనిపిస్తాయి. ఈ విషయంలో కవిరాజుగారెంతో నయమని నా అభిప్రాయం. కనుక కవిరాజును ఆనాటి సమకాలీనులు చెల్లపిళ్ళవారు, విశ్వనాథవారు, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు వారు, వేలూరి శివరామశాస్త్రులు అభిమానించారు. గౌరవించారు. మహాకవి కవితను నోరారా మెచ్చుకొన్నారు. ఈ సందర్భంలో వేలూరి శివరామశాస్త్రుల అభిప్రాయాలు గమనించదగ్గవి.

వ్యక్తిగతమైన భావాలను స్వతంత్రంగా వ్యక్తంచేయటం అందరికీ సాధ్యం కాదు. లోకానికి ఇష్టమయినా, కష్టమయినా లక్ష్యంచేయకుండా స్వభావసిద్ధంగా స్వధర్మాన్ని వ్యక్తంచేసినవారు కవిరాజు.

కవిరాజు సన్మాన సంచిక – 127

మహిళాభ్యుదయం :

మహిళాభ్యుదయంపట్ల భారతిదాసన్, చౌదరిగారు ఎంతో కృషిచేసినవారు. ప్రత్యేకించి 'స్త్రీవిద్య'పట్ల ఇద్దరూ సానుభూతి వున్నవారే.

భారతిదాసన్–

చదువులేని పడతులు
చదువుకున్న మహిళలు సంస్కరించిన సాగునేల
కళ్ళతో దారి చూడగలిగినట్లు
కాళ్ళతో నడయాడగలిగినట్లు
కాంతామణుల కారణాన పురోగమించవచ్చు
మంచి స్థితిలోన నిలువంగ
మరిమరి తోడ్పడు మగువల చదువు

పెణ్ కల్వి (స్త్రీవిద్య)

స్త్రీలు పురుషులకేమాత్రం తీసిపోయేవారుకారు. వారు సరిసమానులు.
వర్తకం చెయ్యవచ్చు విమానాలు నడపవచ్చు

ఆణ్ పెణ్ నిగర్ (స్త్రీపురుషులు సమానులు)

చౌదరిగారు కుప్పుస్వామి శతకంలో స్త్రీ విద్యగూర్చి ప్రస్తావించారు.

చదువులేని జాయ సల్లాపములకన్న
చదువుకొన్న జాయ చలము మేలు
భార్య చదువు పతికి బనికి వచ్చుచునుండు
కొడుకు చదువుకన్న కొంతవఱకు
చదువుకొన్న భార్య సంసారమును దిద్ది
కొనుచు బతికి గూర్చు గుప్పుస్వామి

వివాహ వ్యవస్థ :

వివాహ వ్యవస్థలో అగ్రవర్గస్థుల దోపిడీని, ఆధిపత్యాన్ని, అర్థరహితమైన విధానాలను భారతిదాసన్, చౌదరి ఇద్దరు దుయ్యబెట్టినవారే.

భారతిదాసన్ 1928 లోనే వివాహవ్యవస్థలో 'మంగళసూత్రధారణ' ను వదలిపెట్టే విధానాన్ని ప్రవేశపెట్టారు. పెరియార్ నాయకత్వంలో అగ్రవర్గస్థులను పిలువకుండా చేసే వివాహాలకు ఆదరణ చూపారు. అలాగే చౌదరిగారు 'వివాహ విధి' అనే చిన్న పుస్తకం వ్రాసి సంస్కృతమంత్రాలను తెలుగు మాటల్లోకి మార్చి వధూవరులు ఆచరించవలసిన విధులను సులభమైన తెనుగులో ప్రవచించారు. ఉపన్యాసాలతో ముఖ్యమయిన కొన్ని ఆచారాలను, సంప్రదాయాలను వదలిపెట్టకుండా నూతన వివాహ పద్ధతికి శ్రీకారం చుట్టారు. అదే సందర్భంలో సరస్వతీ బ్రహ్మేంద్రస్వాములవారి సహకారంతో రామస్వామి చౌదరిగారు స్వసంఘ పౌరోహిత్య కార్యక్రమాన్ని దిగ్విజయం చేశారు. వారే 'కమ్మబ్రాహ్మణులు'గా చెలామణి అయ్యారు. ఇలాగే చౌదరిగారు ముహూర్తములపట్ల విశ్వాసం సడలించ గలిగారు. తానే తన కుమారుడయిన వెంకటేశ్వరరావుగారికి ఆషాఢ మాసంలో రాహుకాలంలో వివాహం జరిపించారు.

వివాహవ్యవస్థలో భారతిదాసన్ మరికొన్ని ముందడుగులు వేశారని చెప్ప వచ్చు. పెద్దలు నిశ్చయించిన వివాహంకంటే ప్రేమవివాహాలు మంచివని ఆ ఆ మహాకవి అభిప్రాయం. అలాగే విధవా వివాహాలు తప్పుకావని అతని ప్రాయం.

సతి మరణించాక మరొక అనుకూలవతిని మగవాడు

వెతుక్కున్నట్టు మగువ కూడా పతి మరణించాక మరొక

అనుకూలుణ్ణి ఎన్నుకోవడం మంచిది.

—కైమ్మై పళి

ఇతర భాషాకవులు ఊహించని కాలంలో గురజాడ హరిజనులపట్ల సాను భూతి ప్రకటించినట్లే భారతిదాసన్ 1929 లోనే కుటుంబ నియంత్రణ అవసరమని వ్రాయడం వారి భవిష్యద్దర్శనాన్ని తెలియజేస్తుంది,

హేతువాదం :

జీవిత తత్త్వాన్ని, నీతి శాస్త్రాన్ని నిర్మించుకోవడానికి మార్గం చూపేది సత్యాసత్యాలను నిర్మించేది హేతువాదం. ఈ వాదాన్ని భౌతిక ప్రపంచానికి అన్వయిస్తే భౌతికవాదం. దేవునికి అన్వయిస్తే నాస్తికవాదం. మానవునికి అన్వయిస్తే మానవతావాదమవుతుంది. తమిళదేశంలో రామస్వామి నాయకర్ ఈ ఉద్యమ సంచాలకుడయితే ఆంధ్రదేశంలో రామస్వామి చౌదరి 'ఆదిపురుషుడు'. ఈ హేతువాద చ్ఛాయలలో కొన్నిటిని చూద్దాం.

దైవ మీమాంస :

రామస్వామి నాయకర్ ప్రభావంలో పడ్డాక భారతిదాసన్ రచనల్లో హేతువాద ధోరణులెన్నో కనిపిస్తాయి. ప్రత్యేకించి కడవుళై నంబినోర్ కై విడ ప్పట్టార్' (దేవుణ్ణి నమ్మినవారు విముక్తులయ్యారు) కవితలో దేవుణ్ణి నమ్మితే దిగులులేదని కొందరు గుడి కడతారు. కలవారికి అన్నీ సమకూరుతాయి. నమ్మిన వారికీ అన్నపానీయాలు కరవని అంగలారుస్తారు. ఒకరోజు ఒక లారీ గుడిని ఢీ కొడుతుంది. విగ్రహం ముక్కలయింది. బండిలోని పది మందికి ఒళ్ళంతా గాయమట అపుడు కవి అన్నాడు.

తన్ను కాపాడుకోలేని దేవుడు

తన్ను నమ్మిన వారిని కాపాడగలడా అని

(దేవుడ స్తమించాడు)

అలాగే 'కడవుళ్ మర్రైనార్' లో కవి చింతనాలోకంలో వుంటే దేవుడు వచ్చి పలకరించాడు. గోడవుందంటే గోడకట్టినవాడున్నాడు కదా అని తన్ను గుర్తించమన్నాడట. అపుడు కవి నిన్ను చెక్కినశిల్పి ఎవడని అడిగితే దేవుడు అంతర్ధానమయ్యాడట - అంటే దేవుడు లేడు. మానవుడు చేసిన మూర్తి అని అభిప్రాయం. అలాగే ఒకచోట దేవుడు అనేమాట లేనిరోజుల్లో యావత్ప్రపంచం అందరిదిగా ఉండేదని భారతిదాసన్ అన్నాడు.

ఈలాంటి భావాలు తెలుగులో గురజాడలో కూడా కనిపిస్తాయి.

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్క-
మనుషులంటే రాయి రప్పకన్న కనిష్ఠం

'మీ పేరేమిటి' కథానికలో

"దేవుడు చేసిన మనుషుల్లారా
మనుషులు చేసిన దేవుళ్ళారా" అని ప్రశ్నించారు.

త్రిపురనేనివారు 'భారతిదాసన్'లాగే 'దేవమానవ సంవాదం' భూమికగా ధూర్తమానవ శతకం వ్రాశారు. సర్వసాధారణంగా అన్ని శతకాలలోను మానవులకు జరుగుతున్న అన్యాయాలనూ, అధర్మాలను తమ ఇష్టదైవానికి నివేదించుకోవడం వస్తువయితే మానవుడే మకుటధారియైన ప్రపంచంలో భగవంతుడే కవిరాజుగారికి కలలో కనిపించి తనపేరిట భూసురవర్గం సమాజంలోని ఇతర వర్గాలకు చేస్తున్న అన్యాయాలను విన్నవించుకుంటాడు. చివరకు ఇప్పటివరకూ చేసినవేవో చేశావు. వాటిని క్షమిస్తున్నాను. ఇకముందు ఇలాంటితప్పులు చేయకుండా లోగడచేసిన తప్పులను సరిదిద్దుకోవడానికి గట్టిగా ప్రయత్నించమని మందలించాడు.

భారతిదాసన్ బాల్యంలో కొన్ని భక్తి దైవసంబంధి గేయాలు వ్రాసినా లో మదరాసులో జరిగిన నాస్తికులసభలో 'తాను శాశ్వతమైన నాస్తికుణ్ణి' వ్రాసి చేవ్రాలుకూడా చేశాడు,

కవిరాజుగారు సూతపురాణం కాలంనాటికి ఏకేశ్వరోపాసకులు. భగవద్గీత నాటికి నాస్తికులని కొందరి అభిప్రాయం.

పౌరాణిక కథలు :

భారతిదాసన్, కవిరాజు ఇద్దరుకూడా పరంపరగావస్తున్న పౌరాణిక కథాంశాలను వినూత్నపంథాలో పరిశీలించారు. భారత భాగవత రామాయణాలలోని కథాంశాలను ఆర్యద్రావిడ సంగ్రామంగా భావించారు. భారతిదాసన్ సంజీవి పర్వతత్తిన్ సారల్తిల్‌లో క్రొత్తసిద్ధాంతం ప్రకటించారు.

ఈలాగే త్రిపురనేనివారు కురుక్షేత్రసంగ్రామం, శంబూకవధ, ఖూనీ, సూతపురాణం, భగవద్గీత మొదలయినవి వ్రాశారు.

కౌరవులకన్నా పాండవులు నీతివంతులని, పాండవులకు రాజ్యాధికారం లేదనిచెప్పడం కురుక్షేత్రసంగ్రామ నాటక కథాంశం. శ్రీరాముడు ఆర్యుడని, శంబూకుడు అనార్యుడని ఆకారణంగా ఆర్యుడయిన రాముడు అనార్యుడయిన శంబూకుని వధించాననడం శంబూక కథాంశం. వేనుడు నాస్తికుడయినా మానవత్వానికి ప్రతీకగా నిలిచినాడని, ఋషులు వర్ణాశ్రమధర్మాల్ని పరిరక్షించమంటే సర్వప్రాణులు సమానమనడంతో ఆర్యఋషుల కుట్రలవల్ల వేనుడు బలికావడం 'ఖూనీ'లోని కథాంశం. అష్టాదశపురాణాలు వ్రాసిన సూతుడు రామస్వామి కలలో కనబడి పురాణాలన్నిటిని తనకు అంటగట్టారని, అవన్నీ బూతుల బుంగలంటూ, సత్యాన్ని వెలికిదీసి సూతపురాణం వ్రాయమని ఆదేశిస్తే ఈ గ్రంథం వ్రాశారు. పెరియార్ పెంచి పోషించిన "ద్రావిడ వాదం" చౌదరిగారిలో కనిపించడం విశేషం.

అభ్యుదయ వాదాలు :

1935 నాటికి భారతదేశంలోని మేధావులు, రచయితలు మార్క్సిస్టు దృక్పథాలవైపు ఆకర్షితులయ్యారు. అయినా అప్పట్లో స్వాతంత్ర్య సంపాదన ప్రధానంకావడంతో రచయిత లెక్కువమంది కర్షక కార్మిక శ్రామికవర్గ అభ్యున్నతి వైపు కేంద్రీకరించలేకపోయారు. అయితే ఆ తరువాతనే వృత్తులపట్ల, కర్షక కార్మిక శ్రామికుల ఔన్నత్యంపట్ల సానుభూతి ప్రకటించిన రచనలు ఎక్కువగా

వచ్చాయి. భారతిదాసన్ 1964 దాకా జీవించినవాడు కావడంవల్ల కవిరాజు 16-1-1943లో పరమపదించడం కారణంవల్ల ఆ కవిని శ్రీశ్రీతో పోల్చడం సబబు.

భారతిదాసన్ ఊసరక్షేత్రాన్ని సస్యశ్యామలంచేసి గాదెల నింపేవారి కండ బలిమిని, రాళ్ళనుకొట్టి కొండలనుచీల్చి ఎన్నో ఆయుదాలను తయారుచేసేవారి హస్తనైపుణ్యాన్ని, నిశ్వాసం బంధించి సముద్రంలో మునిగి ముత్యాలుతెచ్చేవారి ఉచ్ఛ్వాసాన్ని ఘనంగా కీర్తించాడు. అలాగే అనేక వృత్తులవారిని అవులు మేపే వారిని, మగ్గం నేసేవారిని, గొడ్డలిపట్టినవారిని, చివరకు బుట్టలల్లేవారిని, సున్నం పూసేవారినికూడా వర్ణించాడు. అయితే అతని రచనల్లో వస్తుచిత్రణకంటే కూడా వారి మనోభావాల చిత్రణ ఎక్కువగా కనిపిస్తుంది. ఉదాహరణకు

ఓ ఫ్యాక్టరీ సైరనా
ఇంకా ఎందుకు ఊరకున్నావు
ఐదు గంటలు కావచ్చింది

— ఆలైత్తొళిళాళి (కర్మాగారం కార్మికుడు)

ఎండను కాస్త
నెమ్మదిగా రమ్మనండి

—కోడాలిక్కారన్ (గొడ్డలివాడు)

అయితే శ్రీ శ్రీ 'కవిత'కు ప్రాధాన్యం ఇవ్వలేదు. కవితాత్మ మంచిదిగాని సమస్యను పక్కదారికి పట్టిస్తుంది. అంచేత

కమ్మరి కొలిమి కుమ్మరి చక్రం
జాలరి పగ్గం సాలెల మగ్గం
శరీర కష్టం స్ఫురింపచేసే
గొడ్డలి రంపం కొడవలి నాగలి
సహస్ర వృత్తులు అన్నాడు

శ్రీ శ్రీకి రష్యాపై రష్యాప్రజల అభ్యున్నతిపై ఎంతో ఆదరణ వున్నట్లే భారతిదాసన్‌కు రష్యా జీవితంపై అవగాహన వుంది. "ఉరుసియావిలుం ఇందియా విలుం" (రష్యాలోనూ ఇండియాలోను) అనే కవితలో

కంకులు కోయను కొడవలియంట రష్యాలో
మెడలు త్రుంచను కొడవలియంట హిందూదేశంలో

పాలనచేసే కార్మికుని సుత్తి
అక్కడ ఇనుపముద్దను చిదుముతుంది
ఇక్కడేమో పొద్దుగాటి సుత్తి
ఇనుపపెట్టెను పగలగొడుతుంది
అక్కడేమో అంతా అందరిది
ఇక్కడేమో పేదకార్మికునికి
సగం సగం

భారతదాసన్‌కు 'రాజకీయ పరిభాష'ల గురించి 1947 నాటికే తగినంత పరిజ్ఞానంవుంది. 'అరసియల్ వగ్గైయిన్ అయల్మొళి పెయర్గళ్ (రాజకీయాలలో ఇతర భాషాపదజాలం) అనే కవితలో సోషలిసం, కాప్టలిసం, కమ్యూనిజం, ఫాసిజం, నాసిజం, న్యూటిలిసం అనేవాటిని చాల సులభంగా రమ్యంగా చెప్పాడు.

పాడి పశువులు రెండుంటే
పక్కింటివారి కొక్కటివ్వడం సోషలిజం

పాడి పశువులు రెంటిలో
ఒకదాన్ని అమ్మి
గూళి ఎద్దును కొనడం కాపిటలిసం

ఆ రెంటిని ప్రభుత్వాధికారులకిచ్చి
అవసరానికిమాత్రం 'పాలు' పుచ్చుకోవడం కమ్యూనిజం

పెట్టుబడిదారీవిధానం ప్రపంచాన్ని ఏలా పీడిస్తుందో బాధితులు ఆలోచించవలసిన విధానమెట్టిదో రమ్యంగా చెప్పాడు భారతిదాసన్.

ఊరిలోగాని దేశంలోగాని ప్రపంచంలోగాని
లెక్కపెడితే శ్రామికులు సముద్రమంత
పెట్టుబడిదారులు నీటిమీద తెప్పలాంటివారు

—తళై ఆరు

పెట్టుబడిదారీవిధానం నశించాలని సోషలిజం ఆచరణకురావాలనే ఉద్దేశ్యంతో భారతిదాసన్ 'పుదియ ఉలగు సెయ్యోమ్' (కొత్తప్రపంచం సృష్టిద్దాం) అనే కవిత వ్రాశారు. అది యించుమించు శ్రీశ్రీ మరోప్రపంచంలాంటిదే.

సరికొత్తలోకం సృష్టిద్దాం
హీనలోకాన్ని వేళ్ళతో పెకలిద్దాం
ఎవరెన్ని చెప్పినా సోషలిజాన్ని
ఎనిమిది దిక్కుల చాటిచెబుదాం

ఘర్మజలానికి ధర్మజలానికి
ఖరీదు కట్టే షరాబు లేడోయ్ అని అంటే

భారతిదాసన్ : వియర్వై కడలిన్‌కాట్చి (చెమట కడలిదృశ్యం)
శరీరాన్ని పిండి స్రవింపజేసిన
ప్రతి చెమట బిందువులోను
ఈ ప్రపంచమంతా వారిదేనని గ్రహించాను

దోపిడీకి గురిఅయిన సమాజం తిరగబడవలసిన అవసరంగురించి శ్రీశ్రీ 'పదండి ముందుకు పదండి త్రోసుకు' అనే గేయంలో హెచ్చరించినట్లే భారతిదాసన్

పరుగెత్తి పారిపోయే పేదలు
హఠాత్తుగా
తన్నేవారయితే
పరుగెత్తేవారు
పైనుండి కర్రపెత్తనం చేసేవారు
సమానులయి పోతారు

అలాగే సాయన్‌ద తరాసు (వ్రాలిన త్రాసు) కవితలో

కొందరుమాత్రం బతుకుతుంటే
అనేకులు శ్రమించే తీరాలంటే
అలాంటి లోకం నశించిపోయినా బాగు

శ్రీశ్రీ చెప్పనిది భారతదాసన్ వ్యక్తంచేసిన భావం గమనించతగ్గది. ఇందు లోనే మరోచిత్రం—

దొరతనంకూడా దొడ్డవారికి సాయంచేస్తుంది
శ్రామికులపై కత్తులు నూరుతుంది.

ఇంతేకాకుండా శ్రామికజనం పెట్టుబడిదారులను గద్దించి అతగడంకూడా భారతిదాసన్‌లో కనిపిస్తుంది. తొళిలాలర్ విన్నప్పం (కార్మికుల విన్నపం)లో

మా శరీరంలో రక్తం ఉడుకెత్తకమునుపే సామాజిక
దృష్టితో మీ ఆస్తిపాస్తుల్ని మాపరం చేయండి

శ్రామికులు, మేస్త్రీలు, రాళ్ళుకొట్టేవారు, ఓడపనివారు, కమ్మరులు, కుమ్మరులు, గొడుగులు తయారుచేయువారు, అశుద్ధాన్ని మోసేవారు, కవితలో విన్నపం చేయడం విశేషం.

ఏమయినా శ్రీ శ్రీ కవిత్వంలోని వేగం, 'పాట్టి' అనుబంధం, రచనలోని శబ్దశక్తి భారతిదాసన్‌లో కనిపించవు.

భారతిదాసన్ ప్రత్యేకతలు :

భారతిదాసన్ ఒక ప్రచారకవి. పైగా పత్రికలు నడిపినవాడు. సినీ రంగంతో పరిచయమున్నవాడు. రాజకీయ నాయకులతో అనుబంధమున్నవాడు. అతని కవితలలో ప్రకృతి, తమిళస్తుతి, ప్రేమ, దేశభక్తి, పిల్లల పాటలు కనిపిస్తాయి. వీటిలో ప్రకృతి, ప్రేమ పాటలలో సుందరమయిన భావసంపద మనల్ని ఆకర్షిస్తుంది.

"పూర్ణచంద్రుడు సుందరుడయిన చంద్రుడు
ఆకాశంలో పైపైకి ఎగబాకుతున్నాడు.
పొదిగిన పాతదనంలో కొత్త ఆలోచన పొడమినట్లు"
అంటుమించు గురజాడ "పాత కొత్తల మేలు కలయికను" స్పష్టం చేస్తుంది.

"అస్తమానం చీకటిచేత శుష్కించిన లోకం చూశాను
అదే మోస్తరు ఆకాశం చూశాను దిక్కుల్ని చూశాను
ఆ వెనుక నల్ల చీకటి నవ్విందేమో
పగలబడి నవ్విన కాంతిముత్యమా వెన్నెలా
జారకుండ కారకుండ సౌందర్యమంతా చేర్చి
చల్లచేసి కాంతినిచ్చి ప్రకృతికాంత గగనంలో
చిత్రించిన చిత్రవర్ణమా"

అని వెన్నెలను చంద్రుని వర్ణించడం.

భారతిదాసన్‌లో పరస్పర విరుద్ధ భావాలున్నప్పటికిని ఆ కవి 'విశ్వైక్య భావం' నుండి దారి తప్పలేదు. ఉలగమున్నేట్రం (విశ్వోన్నతి) కవితలో

విశ్వమా సర్వోన్నతిని పొందు
ఉన్నవాళ్ళకంతా నీవే తల్లివి
కయ్యాలెందుకు కొట్లాటలెందుకు
వైమనస్యాలెందుకు' అని ప్రశ్నించాడు.

ఈలాగే మరికొన్ని భావాలు:

"తనకొడుకు తన ఇల్లాలు తన ఇల్లు
తన సంపాదన సర్వస్వం తనకంటూ ప్రలాపించేవాడు
చిన్నదయిన 'ఆవగింజ' లాంటివాడు"
"నిర్మల హృదయం, ప్రేమ హృదయం, విశాల హృదయం
ప్రపంచ వాసులంతా ఒక్కరే అనే భావనలోనే ఆనందం"

"సజ్జనులున్న దేశాన్ని బలవంతులు హీనంగా చూసే మాలిన్యభావం భూలోకంపై పడే ఉరుములాంటిది" పేరిగై (భేరి)

ఏది ఏమయినప్పటికిని 'భారతిదాసన్' ఒక మహాకవి. ఒక భాషాభిమాని. హేతువాది. ఈ శతాబ్దంలో మరచిపోలేని మహావ్యక్తి. కనుకనే తమిళనాడు అతనిపేర విశ్వవిద్యాలయమే నెలకొల్పింది. ఈ సందర్భంలో త్రిపురనేని సుబ్బారావుగారి మాటలు అవశ్యం స్మరింపతగ్గవి.

"ప్రతి తరమూ తనకు కావలసిన నాయకుణ్ణి తనే సృష్టించుకుంటుంది. సమకాలీన సామాజిక వాతావరణంతో రాజీపడలేని ఏ విప్లవ హృదయమో విజృంభించి, తిరగబడి, సంఘంలో పరిమాణాలు తెచ్చి కొత్తమార్గాలు చూపుతుంది. తనలోని కుళ్ళును తనే భరించలేని సమాజం - తనలోనుండి ఒక నాయ నాయకుణ్ణి ఎన్నిక చేసుకుని అతనిచేత క్షాళితం చేయబడుతూ ఉంటుంది. అలాంటి మహాపురుషుడే భారతిదాసన్."

## ఉపకరించిన రచనలు

తెలుగు :

1. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు - ప్రయోగములు - —డా॥ సి. నారాయణరెడ్డి
2. కవిరాజు జీవితం - సాహిత్య —త్రిపురనేని సుబ్బారావు
3. త్రిపురనేని రామస్వామి చౌదరి నూతన పురాణము - ఒక పరిశీలన - —మొవ్వ లలితకుమారి
4. తెలుగులో జాతీయోద్యమ కవిత్వము —డా॥ మద్దూరి సుబ్బారెడ్డి

తమిళం :

1. తమిళ్ ఇలక్కియ వరలారు —డా॥ సి. బాలసుబ్రమణియన్
2. నాళ్ మలర్గళ్
3. భారతిదాసన్ ఇశైయముదు
4. ముల్లైక్కాడు

(భారతిదాసన్ శత జయంతి ఉత్సవాలలో తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో జరిగిన కార్యక్రమంలో చదివిన వ్యాసం).

# తాళ్ళపాక అన్నమయ్య - ఇతర వాగ్గేయకారులు

సాధారణంగా భాషలలోని సాహిత్యం రెండు రకాలు. మొదటిది శిష్ట సాహిత్యం. రెండవది జానపద సాహిత్యం. ఈ రెంటికి వారధి లాంటిది పద కవిత. జానపద సాహిత్యం పదకవితకు పుట్టిల్లు. శిష్ట సాహిత్యం మెట్టిల్లు. ఆంధ్ర వాఙ్మయంలో విస్తారమయిన పదకవిత వుంది. అయితే సేకరించినవి తక్కువ. ముద్రణాభాగ్యమందున్నవి మరీ తక్కువ. ఇప్పటికి బిచ్చగాళ్ళనోట కొంత కొనవూపిరి పోసుకుంటూ వుంది.

తాళ్ళపాక అన్నమయ్య పదకవితా పితామహుడు. అన్నమయ్య సంకీర్తనలు చాలవరకు రాగిరేకుల్లో దాగివుండటం, త్యాగరాజస్వామి శిష్యపరంపరలాగా అన్నమయ్యకు లేకపోవడం, ఇతర వాగ్గేయకారుల రచనలకున్నంత ప్రచారం లేకపోవడంవల్ల అన్నమయ్య సంకీర్తనలకు వ్యాప్తి లేకపోయింది. సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, వేటూరి ప్రభాకర శాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మల అవిరామ కృషితో, సంగీతజ్ఞులనేకుల దృష్టి పడటంతో అన్నమయ్య కీర్తనలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ కారణంవల్ల అన్నమయ్య ఎంతటి విశిష్టుడో, ఇతర వాగ్గేయకారులకు ఏ మాత్రం తీసిపోడో సాహిత్య సంగీత మర్మజ్ఞులకు తెలియ డానికి వీలయింది. ఈ ప్రయత్నంలో ఒక భాగమే అన్నమయ్యను తమిళ కన్నడ ఆంధ్ర వాగ్గేయకారులతో సరిపోల్చడం - ఇదే నా ప్రసంగ ధ్యేయం.

**అన్నమయ్య - సంస్కృత వాగ్గేయకారులు :**

సంస్కృత వాగ్గేయకారులకు తలమానికం లాంటివాడు జయదేవుడు, అతని కృతి గీతగోవిందం, రాధాగోవిందుల ప్రణయ, విరహ, విశ్లేష, కలహ, ఖండన, సానునయ, సంవిధానాల ద్వారా జీవబ్రహ్మైక్య సంధాన వేదాంతం వ్యంజితమవుతుందని పెద్దలంటారు. భారతదేశమంతట వ్యాపించిన ఈ భక్తి వాహినికి గంగోత్రి లాంటిది గీత గోవిందం.

అన్నమయ్య సంకీర్తనల్లో రాధామాధవ కీర్తనలెన్నో వున్నాయి.

'అతి శోభితేయం రాధా
సతత విలాసవశా రాధా' 4-48

రాధా మాధవ రచన సకలజన
సాధు వేదమే జగమున కలిగె 11-2-70

రాధా మాధవ రతి చకితమితి
బోధావహం శ్రుతి భూషణం 3.664

గీత గోవిందంలో వున్నట్టే విరహ, విశ్లేష, కలహాలు అన్నమయ్య సంస్కృత సంకీర్తనల్లో కనిపిస్తాయి.

జానామ్యహం తే సరస లీలాం
నానావిధ కపట నాటక సఖత్వం
ప్రలపన వచనైః ఫలమిహ కిం
చలచల కుడ్య శోధనయా కిం.

జయదేవుని తరువాత చెప్పుకోదగినవాడు లీలాశుకుడు. ప్రణయ శృంగారంలో అవస్థా భేదాలను ప్రదర్శించి జయదేవుడు మానవ మనస్తత్వానుగుణమైన రూపక నిర్మాణం చేస్తే లీలాశుకుడు రాధాకృష్ణుల ప్రణయానికే గాక సామాన్య జీవుల ఆరాటాన్ని జతచేసి వ్రాశాడు. వాగ్గేయకార ప్రపంచంలో శ్రీరామ, బాలకృష్ణ సంకీర్తనలు విస్తరించడానికి లీలాశుకుడు మార్గదర్శి. బిల్వమంగళుని

"యంశైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌద్ధాబుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైన శాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోయం నో విదధాతు వాంఛితఫలం శ్రీదేవకీనందనః"

శ్లోకం అనుసరించి అన్నమయ్య

"ఎంతమాత్రమున నెవ్వరుదలచిన అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచిచూడ పిండంతె నిప్పటి యన్నట్లు
కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మమనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవుడనుచు
సరి నెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
శ్రీ వేంకటపతి నీవైతే చేకొనిఉన్న దైవమని
ఈవలనే నీ శరణనియెద" అని కల్పించారు.

సంస్కృతంలో సంకీర్తనలు వ్రాసినవారిలో శివనారాయణతీర్థులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఉపనిషత్ బ్రహ్మయోగి, శ్యామాశాస్త్రి, ముత్తుస్వామిదీక్షితర్ మొదలయినవారు ప్రముఖులు. దీక్షితర్ ప్రతి కృతిని 'మంత్రంగా' భావించడం ఆస్తికుల విశ్వాసం. అన్నమయ్య సంకీర్తనలుకూడా అలాంటివే. అంచేతనే మనుమడు.

"నందవర కులాగ్రణి యైన వైష్ణవోత్తముడు
సవరించు మురవైరి సంకీర్తనములు
కువలయంబున పేరుకొన్నమాత్రమున
తలచిన భూత బేతాళ పిశాచ
ములు పారిపోవ నిమ్మల శుభంబెసగ
విని కనియును లోన వెరగందికొనుచు

అని తన ప్రత్యక్ష అనుభవాలను జతచేశాడు.

అన్నమయ్య సంస్కృత సంకీర్తనలుకూడా వ్రాయడంతో తరువాతి వాగ్గేయకారులందరు తెలుగు సంకీర్తనములతోబాటు సంస్కృత కీర్తనలుకూడా వ్రాశారు,

వాటిలో నారాయణతీర్థుల తరంగాలు, గోపన్న కలయే గోపాలం, దీనదయాళ్ కీర్తనలు, సుబ్రహ్మణ్యకవి భజేహం భవాని, నమశ్శివాయ తే నమో భవాయ, ఉపనిషత్ బ్రహ్మయోగి రామతరంగం, త్యాగరాజస్వామి సామజవరగమన, మానససంచరరే, శ్యామశాస్త్రి పాహి శ్రీ గిరిజాసుతే, శంకరీశంకరు మొదలయినవి లెక్కకులేనన్నివి వ్రాశారు.

ఒక మహానదిలో అనేక ఉపనదులు కలిసినట్టుగా ఎందరో వాగ్గేయకారుల ధర్మాలు అన్నమయ్యలో కనిపిస్తాయి. వైరుధ్యాలున్నా సమానత్వం నిలుపుకున్న వాడు. ప్రౌఢంగాను సరళంగాను చెప్పగలిగిన వాగ్గేయకారుడు అన్నమయ్య. వాగ్గేయకారులలో ఉత్తమ కవితాంశకలవాడు అన్నమయ్య. అతని భావుకత అనంతం.

తాళ్ళపాక అన్నమయ్య - ఆళ్వారులు :

తాళ్ళపాక అన్నమయ్య నందవరీకుడు. స్మార్తుడు. ఘనవిష్ణువు పంచ సంస్కారాలు చేయడంతో తిరుమలలో వైష్ణవుడయ్యాడు. ఆపై అహోబలంలో ఆదివన్ శఠగోపయతీంద్రుల దగ్గర ఉభయవేదాంతం నేర్చుకున్నాడు. అన్నమయ్యకు విశిష్టాద్వైత మత్రప్రవక్తలయిన రామానుజులన్నా, ఆళ్వారులన్నా చాలా గౌరవం. అన్నమయ్య తిరుమలకు వెళ్ళే మార్గంలోని త్రోవ భాష్యకారులను

ఈతని కరుణనేకా యిల వైష్ణవుల మైతి
మీతని వల్లనే కంటి మీ తిరుమణి
యీతడే కా వుపదేశ మిచ్చె నష్టాక్షర మంత్ర
మీతడే రామానుజులు యిహపర దైవము

అన్నమాచార్య చరిత్ర పీఠిక. పుట-17

అని కీర్తించారు. ఆలాగే

కారి మార సుతుని చక్కని మాటలకు జొక్కి
చూరగా వేదాల గుట్టు చూచినవాడు
తీరని వేడుకతో తిరుమంగయాళవారి

అరడి ముచ్చిమి గూటి కాసపడ్డ వాడు
పెరియాళువారి బిడ్డ పిసికి పై వేసిన
విరుల దండల మెడ వేసినవాడు 11-2-55

అని తిరుమంగైయాళ్వారును, పెరియాళ్వారును ఘనంగా కీర్తించాడు.

వైష్ణవభక్తి సాహిత్యమునకు విశిష్ట ప్రచారం చేసినవారు ఆళ్వారులు. వారు పన్నిద్దరు. వారందరు శ్రీమన్నారాయణుని దివ్యాంశాలతో జన్మించినవారే. అన్నమయ్య స్వామి నందకాంశంతో జన్మించాడని విశ్వాసం. పేయాళ్వార్ కూడా అలాంటి అంశతో జన్మించినవాడు తిరుమళిశై ఆళ్వార్ రాజాజ్ఞను ధిక్కరించినట్లే అన్నమయ్య సాళువ నరసింహరాయల ఆజ్ఞను తూలనాడాడు. తిరుప్పులియూర్‌లో తిరుమళిశై ఆళ్వార్ మహిమలను ప్రదర్శించినట్లే అన్నమయ్య కూడా కొన్ని మహిమలు చూపాడు. తొండరడిప్పొడియాళ్వార్ 'తిరుప్పళ్ళి ఎళుచ్చి' పాడినట్లే అన్నమయ్య వేంకటేశ్వరునికి మేలుకొలుపులు పాడాడు. కులశేఖరాళ్వార్ రాముని అభిమానించినట్లే అన్నమయ్య శ్రీరామనామ సంకీర్తనలెన్నో వ్రాశాడు. తిరుమంగైయాళ్వార్ అనేక క్షేత్రాలను దర్శించినట్లే అన్నమయ్య కర్ణాటాంధ్ర ప్రాంతాలలోని దేవాలయాలను దర్శించి దివ్యదేశాల సంఖ్యను పెంచాడు. తిరుప్పాణాళ్వార్ వీణ మీటుతూ భగవద్గుణగానం చేసినట్టే అన్నమయ్య దండె మీటుతూ భక్తిని ప్రదర్శించాడు. ఆళ్వారులలో అన్నమయ్యకు చాల సన్నిహితంగా కనిపించేవారు పెరియాళ్వార్ నమ్మాళ్వార్లు కులశేఖరాళ్వారులు.

నమ్మాళ్వారు వైశాఖ మాసంలో విశాఖ నక్షత్రంలో జన్మించాడు. అన్నమయ్య కూడా అంతే. ఇద్దరికి 16వ ఏట విష్ణు సాక్షాత్కారం కలిగింది. ఆళ్వారులలో అత్యధిక సంఖ్యలో పాశురాలు పాడిన ఘనత నమ్మాళ్వారుకున్నట్టే ఆంధ్ర వాగ్గేయకారులలో అన్నమయ్య అత్యధిక సంకీర్తనలు పాడినవారిలో మొదటివాడు. అన్నమయ్య వేంకటేశ్వర సాక్షాత్కారానంతరం సంకీర్తన యజ్ఞం మొదలెట్టినట్లే నమ్మాళ్వారు పాశురాలు పాడడం ప్రారంభించాడు.

తులసీవనంలో జన్మించిన గోదాదేవిని శ్రీరంగనాథునికర్పించి పెరియాళ్వార్ మామగారయినట్లే పద్మసరోవరంలో పొడమిన అలమేలు మంగాంబికను వేంకటేశ్వర స్వామికిచ్చి పెండ్లిచేసి మామయయ్యాడు.

మధురకవి ఆళ్వార్ తన గురువైన నమ్మాళ్వారును 'కణ్ణినుమ్ సిరుత్తాంబు' అని కీర్తించినట్లే అన్నమయ్య 'చూడు డిందరికి సులభుడు' (2-117) అని తన గురుభక్తిని ప్రకటించుకున్నాడు.

ఆళ్వారులందరు ఒక కాలానికి సంబంధించినవారు కారు. ఒకే మనస్తత్వం కలవారు కారు, ఒక్కొక్క విషయాన్ని భిన్నరీతులలో భావించినవారు. అన్నమయ్య వారిని అనుకరించినపుడు గాని అనుసరించినపుడు గాని ఒకరినే ధ్యేయంగా, మాతృకగా భావించలేదు. అందరిని అనుకరిస్తూ తన ప్రత్యేకతను నిలబెట్టుకున్నాడు. వాటిలో కొన్నిటిని పరిశీలిద్దాం.

**తిరుమల ప్రశంస :**

వైష్ణవులకు ఆరాధ్యమయిన క్షేత్రం తిరుపతి. తొండరడిప్పొడియాళ్వార్, మధురకవి ఆళ్వార్ తప్ప ఇతరులందరు తిరుమలేశుని, తిరుమలను పొగడినవారే. వారి పాశురాలలోని ఈ భావాలకన్నిటికి తలమానికంగా అన్నమయ్య,

> కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
> తెట్టలాయ మహిమలే తిరుమల కొండ
> వేదములె శిలలై వెలసినది కొండ
> యేదెస పుణ్యరాసులే యేరులైనది కొండ 9-182

అని వర్ణించాడు.

**అన్యస్తుతి విముఖత :**

పూదత్తాళ్వార్, పేయాళ్వార్, మధురకవి ఆళ్వార్ మినహా ఇతరులందరు అన్యస్తుతిపట్ల వైముఖ్యం ప్రదర్శించినవారే. పొయ్‌గై ఆళ్వార్ 'వాయవనై యల్లదు' అనే పాశురంలో నా నోరు వెన్నునితప్ప అన్యులను కీర్తించదు. వసుధ కొలిచినవానికితప్ప ఇతరులకు వందనం చేయవు అని వర్ణించాడు. తిరుమళిశై ఆళ్వార్ 'నాక్కొండు మానిడం పాడేన్' – ఈ నాలుకతో మానవులను పాడను అని నిష్కర్షగా చెప్పాడు. తొండరడిప్పొడి ఆళ్వార్ 'సేవియేన్ ఉన్నైయల్లాల్' అనే వాక్యంతో నిన్నుతప్ప ససేమిరా ఇతరుల్ని సేవించను అన్నాడు. కులశేఖ

రాళ్వార్ 'హే గోపాలక హే కృపాజలనిధే' శ్లోకంలో 'హే గోపీజననాథ పాలయ పరం జానామి నత్వాం వినా' అని చెప్పాడు. తిరుమంగై ఆళ్వార్ 'వేంకటమామలై మేయ అయనడి యల్లదు మత్రరియేన్' వేంకటాద్రిలో వాసంచేసే యాదవుని పాదములుతప్ప వేరేమీ ఎరగను అన్నాడు. ఇక నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళిలో వాయ్‌కొండు కీర్తనలో స్వామిని కొనియాడిన నోటితో ఇతరుల్ని పాడనని చెప్పాడు. అన్నమయ్యలో నరస్తుతి పై ముఖ్యానికి సంబంధించిన వాక్యాలెన్నో కనిపిస్తాయి.

నరహరి కీర్తన నానిన జిహ్వ
పరుల నుతింపగ నోపదు జిహ్వ —అన్నమాచార్య చరిత్ర

పసురమై వెతలేని పాటుపడవచ్చుగాక
కపివో నొరుల పొగడగా వచ్చునా 5-223

తలరాయిగాగ నెందరికి మొక్కెడిని
తెలివిమాలిన యట్టిదేహి 1-201

వాత్సల్యభక్తి :

దేవకీ కౌసల్యలు పరమాత్మ స్వరూపులయిన తమ బిడ్డలపై చూపిన అనురాగవిశేషమే వాత్సల్యాసక్తి. పెరియాళ్వార్ సంకీర్తనలలో ఈలాంటివి ఎక్కువ. శిశుచేతలకు మురిసిపోతూ, ఆటలకు తబ్బిబ్బు అవుతూ, మారాములకు విసిగిపోతూ వ్రాసిన పాశురాలెన్నో. అన్నమయ్య వాత్సల్య సంకీర్తనల్లో కొన్నిట అన్నమయ్య యశోదగా కనిపిస్తాడు. కొన్నిట పెరియాళ్వార్‌గా కనిపిస్తాడు.

సారెకు నంటకురే జడనందురు
ధీరుడాత డున్నతపు దేహియట
బాయట పెట్టకురే పశులుపారెడి పొద్దు
ఓయమ్మ బాలులకు వొప్పదందురు

ఆకసము చందురునిద్దె వెన్నముద్దయంట
ఆకడ చెయిసాచి యందంగరాక
శ్రీకాంతతోడం గూడి శ్రీ వేంకటాద్రి ఎక్కి
పైకొని పెచ్చుపెరిగి ప్రౌఢయె కృష్ణుడు
నీలపుం గంటసరులు నేరేడు పండ్లంటా
గోలయై నమలబోయి కొరుకరాక
ఖోలనవి మెత్తగాను ఖోలచియిమ్మని తల్లి
చేలకొంగు పట్టుతీసి చెప్పరాని కృష్ణుడు
నీరాటలోనం దన నీడచూచి బాలుండట
రారమ్మని పిలిచి రాకుండంగా
కారించి కడవనీరు కలంచి వెదకీ
పూరక కానకే పొంచివున్నాడు కృష్ణుడు 3-530

దాస్య భక్తి:

అనన్యమనస్కులై భగవంతునికి దాస్యం చేయడమే దాస్యభక్తి. ప్రహ్లాదుడు భాగవతంలో 'చక్రిదాస్య'మని చెప్పాడు. ఆళ్వారులలో పొయ్‌గై ఆళ్వార్, మధురకవి ఆళ్వార్ మినహా ఇతరులందరు దాస్యభక్తిని ఘనంగా కీర్తించారు. ఏళ్ పిరప్పుం ఆళాగి అంజాపెరుక్కు అరుళ్ (ఏడేడు జన్మలలోను దాసుడనై నీ పాదాలను సేవించేభాగ్యం ప్రసాదించు) అని పేయాళ్వార్ ప్రార్థిస్తే, ఎన్నరంగ నక్కుడియార్గళాయ్ (నా రంగనికి దాసులై) అని కులశేఖరాళ్వార్ అంటే గర్భవాసకాలం నుండి నేను నీ దాసుడనని పెరియాళ్వారు సవినయంగా చెప్పాడు. కులశేఖరాళ్వారు 'త్వద్భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతిమాం స్మర లోకనాథ' అని ముకుందమాలలో చెప్పిన వైనాన్ని అన్నమయ్య

కందువ శ్రీ వేంకటేశ కడు నీ బంటు బంటుకు
సందడి బంట నవుటే చాలదా నాకు (8-23)

అని స్పష్టం చేశాడు.

కైవల్యమున కంటె కైంకర్యమెక్కుడు (7-249)

శ్రీ వేంకటేశు చూచినవారి శ్రీపాద
సేవకుండై వుండ చేరినం జాలు (2-352)

మధురభక్తి :

వేదాలలో యోషాజారా భావరూపంలోను, బృహదారణ్యకోపనిషత్తులో సతీపత్ని భావరూపంలోను మధురభక్తి చోటుచేసుకున్నట్లు పండితులు భావిస్తారు. జీవులంతా నాయికలు. దేవుడొక్కడే నాయకుడు. నాయిక నాయకుని పొందుకోసం పరితపించినట్టు జీవుడు పరమాత్మని సాన్నిధ్యంకోసం పరితపిస్తాడు. ఈ తపనల్లో శృంగారం ప్రధానాంశం. శైవులు సంయోగశృంగారానికి వైష్ణవులు విప్రలంభ శృంగారానికి ప్రాధాన్యమిచ్చినట్లు పండితుల నిష్కర్ష. ఆళ్వారులలో కులశేఖ రాళ్వార్, తిరుమంగై ఆళ్వార్, పెరియాళ్వార్, నమ్మాళ్వార్, అండాళ్ రచనల్లో మాత్రమే మధురభక్తికి సంబంధించిన అంశాలు కనిపిస్తాయి. వీటిలో మోహం, విరహం, మన్మథపూజ, దౌత్యం, ప్రణయకోపంలాంటివి ప్రధాన అంశాలు.

కులశేఖరాళ్వార్ 'వాసుదేవా వున్ వరవు పార్తే' అనే పాశురంలో తన కోసం నాయకుడువస్తాడని ఎదురుచూస్తున్న నాయికను వర్ణించాడు. ఆ నాయికకు తెలుసు నాయకునికి తనపై మనసులేదని. నమ్మాళ్వార్ తన నాయకుని రప్పించు కోవడంకోసం చెలికత్తెను పురమాయించినట్లు 'అమరర్ పెరుమానై క్కండు' అనే పాశురంలో చెప్పాడు. ఇక ఆండాళ్ అయితే తన తాపాన్ని, మోహాన్ని మేఘాలతో చెప్పుకుంటుంది 'మేగంగాళ్! వేంగడత్తు తన్నాగ తిరుమంగై తంగియ సీర్ మార్వర్కు' అనే పాదాలలో. తాళ్ళపాక అన్నమయ్య తానే అలమేలుమంగగా, కొన్నిచోట్ల తానే సఖిగా భావించుకుని కీర్తనలెన్నో వ్రాశాడు.

ముదము దొలకెడి యట్టి మంచి వయసున మనకు
తుదలేని వేడుకలు దొరకు టెన్నడురా 12-54

కడు మోహమున సిగ్గు గదియు టెన్నడు లేక
యెడలేని కూటము యెన్నటికె లేక
విడువ కీటువలెనె తిరువేం[illegible] టేశుడు నీ[illegible]
వడి దలచి నా కడకు [illegible] టెన్న[illegible] 12-[illegible]

నాయికా నాయకులు అనురాగవతులయినపుడు 'దౌత్యం' సాన్నిహిత్యాన్ని పెంచుతుంది. ఈ దౌత్యాన్ని వ్యక్తులు నడపవచ్చు లేదా అచేతన వస్తువయినా కావచ్చు. ఆళ్వారుల పాశురాలతో తిరుమంగైయాళ్వార్, నమ్మాళ్వార్ భ్రమర దౌత్యాన్ని, మనోదౌత్యాన్ని, శుకదౌత్యాన్ని చెప్పారు. అలాగే నమ్మాళ్వార్, ఆండాళ్ మేఘదౌత్యాన్ని చెప్పారు. నమ్మాళ్వార్ 'హంస దౌత్యాన్ని' కూడా చెప్పాడు. అన్నమయ్యలో చాలచోట్ల సఖీదౌత్యమే కనిపిస్తుంది. నాయిక పడుతున్న అవస్థలను వివరించి నాయకునికి ఆశపుట్టించి అతనిని రప్పించే ప్రయత్నం ఇందులోని భాగం.

వచ్చేయవయ్యా వేగుదాకా జాగులేల
కొచ్చి చెలులము నేము కొండేలు చెప్పేమా 19-220
ఎదురుగా హంస నంపి ఇంటిలోన నున్నదిదే
కదిసి మన్నించరాదా ఘనత మీర 17-180

ఇవేగాక ఆళ్వారుల రచనలలో మిన్నగా భావింపబడే పల్లాండు, తిరుప్పళ్ళి ఎళుచ్చి మొదలయినవి అన్నమయ్యలో కూడా కనిపిస్తాయి.

పల్లాండు అనే మాటకు తమిళంలో బహు సంవత్సరాలని అభిప్రాయం. పెరియాళ్వార్ తనకు సాక్షాత్కరించిన శ్రీమన్నారాయణమూర్తిని దర్శించి ఆనంద పారవశ్యంతో అతని పాదాలకు, అవినాభూతులయిన భక్తులకు హృద్ స్థానంలోని శ్రీదేవికి చేతుల్లోని శంఖచక్రాలకు శాశ్వతరక్ష కోరడం పల్లాండు. రక్షను 'తిరుక్కాప్పు' అనడం వైష్ణవ సంప్రదాయం. శ్రీ వైష్ణవుల భగవదారాధనలో పల్లాండు కడపటి ప్రార్థనాగీతం. దీనిని 'మంగళంగా' చెప్పడం అలవాటు.

గుట్టున కోరిక లెల్ల కొల్లవట్టె నీ
పట్టపు దేవికి పల్లాండు పల్లాండె

అలరు మేడలోన అలమేలు మంగ నిదె
అలయికదీర ప్రేమ నలర జేసి
కలసి వేంకటేశ కౌగలించుకొనే నిదె
పలుమారు మీకు మీకు పల్లాండు పల్లాండె 3-256

ఆళ్వార్లు నృసింహ రామకృష్ణాది మూర్తులను భక్తి ప్రపత్తులతో కీర్తించి నట్లే అన్నమయ్య కీర్తించాడు. అహోబిలవాసంతో నారసింహభక్తి, మధురభక్తి కారణంగా కృష్ణభక్తి, ఆదర్శజీవితం కారణంగా శ్రీరామచంద్రుని మీద భక్తి అలవడింది. ఆళ్వారులందరి సమ్యగ్ రూపమే తాళ్ళపాక అన్నమయ్య.

**అన్నమయ్య - కన్నడ 'హరిదాస' వాగ్గేయకారులు :**

కన్నడానికి తెలుగుకూ వున్న అనుబంధం ప్రాచీనమయింది. భౌగోళికంగా రెండూ ఒకదాని కొకటి పక్కన పక్కనేవున్న భూభాగాలు. చారిత్రకంగా రెండు ప్రాంతాల్ని ఒకే రాజకుటుంబం చాలకాలం పరిపాలించింది. లిపి సామ్యం రెంటి లోనూ వుంది. అంచేతనే శ్రీనిడుదవోలు వారు ఈ భాషల్ని కవలపిల్లలుగా ఒక రెమ్మలో పూచిన రెండు పూవులుగా భావించారు. ఈ అవినాభావ సంబంధం సంకీర్తన సాహిత్యంలోనూ కనిపిస్తుంది.

కన్నడంలో విశిష్టమయిన వీరశైవయుగంలో శివశరణులు ఎన్నో గేయాత్మక రచనలు చేశారు. వాటిని వీరశైవ విద్వాంసులు 'శాస్త్ర' మని వ్యవహరించారు. ఇవి చాల వరకు వచన సంకీర్తనాలు. ఈ వచన సంకీర్తనల స్ఫూర్తితో కన్నడంలో అచలానందులు, ఆద్యులు, నరహరితీర్థులు, శ్రీపాదరాయలు సంకీర్తనలు వ్రాశారని పండితులు భావిస్తున్నారు. వీరిలో శ్రీపాదరాయలు అన్నమయ్య కంటే కొంచెము పెద్దవారు. వీరిద్దరికి సాళువ నరసింహరాయల పరిచయం వుంది. సాళువ నరసింహరాయల అభ్యున్నతికి ఇద్దరూ తోడ్పడినవారే. అన్నమయ్య ఆశీస్సులతో దండనాథుడయిన సాళువ నరసింహరాయలు చక్రవర్తి కాగలిగాడు. ఆలాగే శ్రీపాదరాయల ఆశీస్సులతో నరసింహరాయలు బ్రహ్మహత్యాదోషమును పోగొట్టుకొనగలిగాడు. శ్రీపాదరాయలు కోలారుజిల్లాలోని 'ముళబాగిలు' మఠాధిపతి. అన్నమయ్య శ్రీపాదరాయలిద్దరు పరస్పరం కలుసుకొన్నారో లేదో తెలియదు గాని వీరిద్దరి రచనల్లో ఎన్నో సామ్యాలు కనిపిస్తాయి.

శ్రీపాదరాయలు అన్నమయ్యలు సంకీర్తనలు వ్రాయడానికి 'నాలాయిర దివ్యప్రబంధ' పఠనం స్ఫూర్తి కలిగించి వుండవచ్చు. తమిళ పాశురాలను పాడే వారిని 'అరైయార్' అనడం అలవాటు. వారు కులోత్తుంగుని కాలం నుండి కనిపిస్తారు. దేవుని శేషవస్త్రాన్ని 'రుమాలుగా' చుట్టుకొని చేతిలో తంబూర

పట్టుకుని, కాలిలో గజ్జెలు కట్టుకుని, చిరుతలు వాడుతూ పాడడం అనాటి వైష్ణవ భక్తుల వేషం. ఈ వేషం అన్నమయ్యకు నచ్చివుండవచ్చు. దేవాలయాలలో దివ్య ప్రబంధం పారాయణం చేసేలాగున పూజావిధానాలలో కన్నడ సంకీర్తనలకు ప్రాధాన్యం కల్పించడం శ్రీపాదరాయల ఆశయం కావచ్చు.

శ్రీపాదరాయలు ద్వైతమత ప్రచారకులయితే అన్నమయ్య విశిష్టాద్వైత మత ప్రచారకుడు. మతవిషయంలో రెంటికి పెద్ద తేడాలేదు. ద్వైతులు విఠలునికి ప్రథమ నమస్కారం అర్పిస్తే విశిష్టాద్వైతులు శ్రీరంగ, కంచి, తిరుపతి దేవుళ్ళను తమఇలవేల్పుగా భావిస్తారు. అయితే హరిదాసులందరు విఠలునితోబాటు తిరుమలేశుని సేవించినవారే. అందువల్లనే కన్నడంలో దేవరందరె తిమ్మప్ప గురువందరె మంచాలెయ రాఘప్ప – దేవుడంటే శ్రీనివాసుడొకడే. గురువంటే మంత్రాలయం లోని రాఘవేంద్రుడే అని చెప్పుకుంటారు. శ్రీపాదరాయలు భూషణకె భూషణం, స్మరిసిదవరను కాయ్వ, 'హరే వేంకటశైల వల్లభ' అనే సంకీర్తనలలో వేంక టేశ్వరుని కీర్తించినట్టే అన్నమయ్య విఠలుణ్ణి కీర్తించాడు. పైగా విఠలుణ్ణి వేంకటేశ్వర అభేదంగా గుర్తించాడు. ఈ ప్రయత్నంతో విశిష్టాద్వైతం, ద్వైతం కన్నడాంధ్ర ప్రాంతాలు సన్నిహితమైనాయి. ఇదొక ప్రశాంత విప్లవంలాంటిది.

అన్న : ఎలమి శ్రీ వేంకటేశుడితడే పదారువేల
చెలులతో కూడినాడు శ్రీవిట్టలేశుడు
బల్లిదపు శ్రీ వేంకటపతివై పాండురంగాన
చల్లగా నెలకొంటివి జయవిఠ్ఠలేశ్వర 10_171

ఈ మూరితా పాండురంగ మిరవై వుండినవాడు
కామించీ మూరితి శ్రీ వేంకటగిరి నున్నవాడు 11_1_203
"పండరి నామము పరమ పావము"

పల్లవి, అనుపల్లవి, చరణం అనే సంకీర్తన పద్ధతి శ్రీపాదరాయలవారిలో స్పష్టంగా కనిపిస్తుంది. చరణాంతంలో కొన్ని పదాల ఆవృత్తి నియమం కూడా కన్నడ సంకీర్తనల్లో కనిపించే సమానాంశం. అన్నమయ్య సంకీర్తనలు రాగి రేకులలో భద్రపరచబడినట్లు శ్రీపాదరాయల సంకీర్తనలు భద్రపరచలేదు. పైగా

వారు మఠాధిపతులు కావడంవల్ల ప్రజలతో సన్నిహిత సంబంధం చాల తక్కువ. అంతేకాక తరువాతివారయిన వ్యాసరాయ, పురందరదాసాదులు గురువును మించిన శిష్యులయ్యారు.

కన్నడ హరిదాసులలో 'పురందరదాసులు' వారిది పేచీలేని పెద్ద పీటలాంటిది. వ్యాసరాయలంతటివారు 'దాసరందరె పురందరదాసరయ్యా' దాసులంటే పురందర దాసులవారే అని మనసా చెప్పినవారు. అన్నమయ్య వృద్ధాప్యసమయంలో పురందరదాసు కలుసుకొన్నాడని ఐతిహ్యం. పరస్పరం సంభావించుకున్నారని అన్నమయ్య మనుమడు అన్నమాచార్య జీవితచరిత్రలో స్పష్టం చేశాడు.

అన్నమయ్య సంకీర్తనలకు పురందరదాసు సంకీర్తనలకు చాల పోలికలు కనిపిస్తాయి. అన్నమయ్య తాను దర్శించిన ప్రతి దేవతామూర్తిలో శ్రీనివాసుని చూచినట్లే పురందరదాసు ప్రతి రూపంలోనూ విఠలుణ్ణి దర్శించగలిగాడు.

కండె నా నిన్న వెంకట నెంబ విఠలన

వేంకటేశ్వరుడనే విఠలుణ్ణి నేను దర్శించాను. ఈతడే 'కూసుకండెనమ్మ' అనే కీర్తనలో మహావిష్ణువు వడ్డికాసులవాడై శేషగిరిమీద నిలిచాడని, బలిని వంచించి కంచిలో నిలబడ్డాడని, గోవుల్ని కాచి జగన్నాథంలో వున్నాడని, పాలు పెరుగు కడవల్ని పగులగొట్టి ఉడిపిలో వున్నాడని వర్ణించాడు. వేంకటేశ్వరుడు కాంచన బ్రహ్మ, ఉడిపి శ్రీకృష్ణుడు అన్న బ్రహ్మ, పురందర విఠలుడు నాదబ్రహ్మ.

భగవంతుని దొంగగా, దివ్యఫలంగా ఇద్దరూ భావించారు. నామసంకీర్తనను ఔషధోపమానంతో చమత్కరించారు. వాత్సల్య సంకీర్తనలలో జానపదుల కథల్ని ఇద్దరూ పొందుపరచారు.

చందమామ పాడి తల్లి సరి పొత్తుకు రమ్మంటే
చందురు చూచి కృష్ణుడు సన్నచేసెను
ముందర చంద్రుడు వచ్చి మొక్కితే యశోద చూచి
ముందెలా యంటినో యని మరచి వెరగందెను 10-285

తల్లి ముత్యాలహారం కూరుస్తూ వుంది. కృష్ణుడు తచ్చాడుతున్నాడు. తల్లి తదేకధ్యానంలో తన్ను పట్టించుకోలేదని రెండు ముత్యాలను పట్టుకెళ్ళాడు. తల్లి గమనించలేదు. ముత్యాలు కూరుస్తుంటే తక్కువ వచ్చాయి. పనివాళ్ళని అడిగింది. చివరకు కృష్ణుని అడిగింది. కృష్ణుడు తల్లి చేయిపట్టుకుని పెరటికేసి నడిచాడు. అక్కడ ఒక చెట్టు మొలిచివుంది. చెట్టంతా ముత్యాలట. ఈ భావంగల

'ఏను హేళలె నాను కృష్ణనమహిమె' కీర్తన కన్నడదేశంలో చాలా ప్రసిద్ధమయిన కీర్తన. మరికొన్ని సామ్యాలు

| | | |
|---|---|---|
| అన్న : | ఊరక దొరకునా వున్నతోన్నత సుఖము | 6-104 |
| పురం : | సుమ్మనే బరువుదే ముక్తి | కీ. 79 |
| అన్న : | నూతులు త్రవ్వగ భేతాళములు పుట్టె | 6-8 |
| పురం : | తోడలు బావి భేతాళ హొరటితు | కీ. 191 |

సంకీర్తనల్లో సంస్కృతవాక్యాలను పొందుపరచే పద్ధతి అన్నమయ్యదే

| | | |
|---|---|---|
| అన్న : | దండన బుద్ధులు 'ద్వాసుపర్ణ' వున్నదిగాన | 6-121 |
| | పైకొని తద్విష్ణోఃపరమై యుండగను | 2-232 |
| పురం : | మిథిలేశ 'మమ కించి న్నదహ్యతే' ఎంబంతె ఇరబేకు | (కీ. 404) |

ఈలాగే పాదాంతపదాలయిన చింత-ఫల-సాక్షి-మనసా-లాలి వంటివి పురందరదాసులోకూడా లెక్కలేనన్ని కనిపిస్తాయి.

**అన్నమయ్య - కనకదాసు :**

హరిదాసులలో 'కనకదాసు'కు ప్రత్యేకస్థానంవుంది. వ్యాసరాయలు మెచ్చుకున్న హరిదాసు అతడు. కురబకులానికి చెందినవాడయినా దాసకూటంలో ఒకడుగా వెలామణి అయిన వ్యక్తి. పురందరదాసాదులకు పూజనీయుడయిన భక్తాగ్రేసరుడు.

అన్నమయ్యకు కనకదాసుకు కొన్ని పోలికలు కనిపిస్తాయి. ఇద్దరూ గ్రామీణజీవితంపై ఆసక్తివున్నవారు. ఇద్దరూ శిష్ట, పామరజన ప్రీతికరమయిన

రచనలు చేసినవారు. కనక దాసు నలచరిత్ర, నవధాన్యచరితె వ్రాయడం గుర్తించ దగ్గవి. కనకదాసు ఆరాధ్యదైవం కాగినిలోని ఆదికేశవుడయినా తిరుమలేశుని మనసారా కొల్చిన హరిదాసు. అన్నమయ్య సంకీర్తనల్లో కల్యాణకీర్తనలెన్నో కనిపిస్తాయి. అయితే స్వామి తన కల్యాణం దర్శించమని కనకదాసును కోరినట్టు, ఆమేరకు కనకదాసు తిరుమల చేరుకున్నట్టు, ఆనాటి ఆలయాధిపతులు కనకదాసును గుర్తించలేనట్టు, అప్పై కనకదాసు కోపపడగా స్వామి తనంతతాను ప్రసాదాలు తెచ్చియిచ్చినట్లు, ప్రసాదం గిన్నె కనబడకపోగా ఆలయాధికారులు పట్టుకున్నట్టు ఐతిహ్యం. అన్నమయ్య దశావతార కీర్తనలలో "ఉక్తివైచిత్రి" ముఖ్యమయింది. హరిదాసులలో పురందరదాసు, కనకదాసులు ఈ ఉక్తివైచిత్రికి ముగ్ధులై ఎన్నో పదాలు వ్రాశారు.

అన్నమయ్య: ఏమిసేయవచ్చు కర్మమిచ్చినంతే కాని లేదు
తాము సేసినంతవట్టు తమకు పోరాదు
ఇట్టునట్టు మిట్టిపడ్డా యించుకంతా లేదు వీపు

బట్ట గట్ట మోపు మోచి పాటువడ్డాలేదు
తట్టువడ లోకమెల్లా తవ్వుకొనినా లేదు
తెట్టె తెరువున నోరు తెరచినా లేదు 1-55

అని సామాన్యమానవుడు పడే అగచాట్లను స్వామికి జతచేసి చెప్పాడు. పై కీర్తన లోని 'నోరు తెరచినా లేదు' అనడం నరసింహస్వామిని తెలియజేస్తుంది. ఈ అంశాన్ని ఎన్నుకొని లేదా భావించుకుని కనకదాసు అత్యద్భుతమయిన కీర్తన వ్రాశాడు.

'ఏను కారణ బాయ తెరది పేళలో
దాన వాంతక ఆహోబల నారసింహనె'

"వేదాలు దొంగలించినవానిని ఏలాగయినా మట్టుపరచాలని నోరు తెరిచావా? మంథర పర్వతం మోస్తు బరువు మోయలేక నోరు పెగల్చావా? భూమిని చాపచుట్టగా పట్టుకెళ్ళినవాణ్ణి చంపి పగదీర్చు కొన్నానని నోరు తెరిచావా. బలిచక్రవర్తి దగ్గిరికి దానంకోసం వెళ్ళి నోరు తెరిచావా. పట్టుదలతో క్షత్రియుల్ని పీచమణచ

డానికి నోరు తెరిచావా. కటుకున్న ఇల్లాలు కనబడకపోతే ఏం చేదామా అని నోరు తెరిచావా. అందమయిన అమ్మాయిల్ని చూస్తూ నోరు తెరిచావా. గుర్రమెక్కి దట్టిస్తూ నోరు తెరిచావా" అని చమత్కార గర్భితంగా దశావతారాలను వర్ణించాడు

అన్నమయ్య 'అంత హితులా అన్నలును తమ్ములును' అని ఇహలోక బాంధవ్యాలను నిరసిస్తే కనకదాసు పౌరాణిక సాక్ష్యాధారాలతో ఎవరికీ ఎవరూ హితులు కారు. కాలలో [illegible] ఆదికేశవుడొకడే హితుడని 'ఆరు హితవరు ఎందు నంబబేడ' కీర్తనలో ; వాళ్ళాడు [illegible] హితుడందామా? ప్రహ్లాదునికి ఎలాంటి తండ్రి! గుర్తించండి [illegible] హితాన్ని [illegible] వని అందామా? కుంతి కర్ణునికి ఏం ఒరగబెట్టింది. కొడుకు హితాన్ని కోరేవాడా? కంసుడు కన్నతండ్రిని చెర పట్టాడు కదా, సహోదరుడు హితం కోరేవాడా? సుగ్రీవుడేం చేశాడు? వాలి ఏం చేశాడు. అంచేత రక్తసంబంధీకు లయిన బంధువుల్ని నిజంగా నమ్మవద్దు. ఆదికేశవుని నమ్మినవారికే సుఖం. అతడే అందరికి హితుడు.

కులంగురించిన 'ఎత్తిపొడుపులు' విమర్శలు అన్నమయ్య కనకదాసులలో చాలా కనిపిస్తాయి.

కందువగు హీనాధికము లిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ

కులమెంత కలిగినా కూడించు గర్వంబు 9-83
జాతి యందేది అంత్య జాతి యందేది
జాతులన్నిట ఆత్మ సర్వేశుడు
తెలివి గలదాకా తెగని మరుగులివి

తెలిసి నంతట మీద తీరు సంశయము 2-136

వట్టి నట రాజసాలు వర్ణాశ్రమములును 10-235

కనకదాసు : కులకుల వెన్నుతిహరు
కులవ్యావుదు సత్యసుఖ వుళ్ళ జనరిగె" కీర్తనలో

తామర బురదలో పుట్టడం లేదా? పద్మనాభునికి అర్పిస్తున్నాం కదా? పశుమాంసం నుండి పాలుపుట్టడం లేదా. బ్రాహ్మణులు స్వీకరిస్తున్నారు కదా? మృగాల దేహాల నుండి కస్తూరి పుట్టడం లేదా. బ్రాహ్మణులు పూసుకుంటారు కదా. ఆత్మ ఏ కులం? జీవుడు ఏ కులానికి చెందినవాడు? తత్త్వేంద్రియాల కులా లేవి?"

అన్నమయ్యను హరిదాసులను సామూహికంగా పరిశీలిస్తే మనకెన్నో సామ్యాలు కనిపిస్తాయి. విఠలునిలో వేంకటేశ్వరుని దర్శించడం అన్నమయ్య దృష్టి. శ్రీపాదరాయలు, వ్యాసరాయలు మఠాధిపతులయితే పురందరదాసాదులు గృహస్థులు. కనుకనే వారి రచనల్లో సాంసారిక జీవనప్రాముఖ్యం కనిపిస్తుంది. అన్నమయ్యలాగే పురందరదాస, కనకదాసాదులు విస్తృత దేశసంచారం చేసిన వారు. ప్రజల్లో భక్తిభావం ప్రబలడానికోసం జానపదగేయ వరుసలను వాడుకుని వైష్ణవ తత్త్వాన్ని విశదీకరించారు. కన్నడ హరిదాసులందరు అన్నమయ్యలాగే సంస్కృత సంకీర్తనలు వ్రాసినవారే. అంకిత పద్ధతి. విభిన్న రాగాల ప్రయోగం. సంగీతంలో వివిధాంశాలు మొదలయినవి ఏకకాలంలో అన్నమయ్యలోను, హరిదాసులలోను పరిణతి చెందింది. భాషావిషయంలో వీరు గ్రాంథిక (?) కీర్తనలు వ్రాయలేదు. మతప్రచారంలోనూ అంతే. అందువల్లనే కన్నడరాష్ట్రంలో మారు మూలల్లో కూడా హరిదాసుల 'దేవరనామగళు' వినిపిస్తాయి.

**అన్నమయ్య - ఆంధ్ర వాగ్గేయకారులు :**

ఆంధ్రదేశంలో వచనరచనకు, భజన సంకీర్తన పద్ధతులకు పరమాచార్యుడు, ప్రపితామహుడని కొనియాడబడిన తొలి వాగ్గేయకారుడు కృష్ణమాచార్యులు. అన్నమయ్యకు కృష్ణమాచార్యులు ఎన్నో విధాల మార్గదర్శి. శిఖాయజ్ఞోపీతం, కటిసూత్రం, కాషాయ వస్త్రం. లలాటంలో తిరుమణి, తిరుచూర్ణం, దండె మీటుతూ కనబడడం లాంటివి అన్నమయ్యలో కనిపిస్తాయి. సింహాచలంలో వుంటూ చాతుర్లక్ష సంకీర్తనలను కృష్ణమాచార్యులు రచించగా అన్నమయ్య తిరుమల తిరుపతి కేంద్రంగా చేసుకుని ముప్పది రెండువేల కీర్తనలను వ్రాశాడు. కృష్ణమాచార్యుని రచనలలో కొన్ని పదుల కీర్తనలు మాత్రం దక్కితే అన్నమయ్యవి సుమారు పన్నెండువేల దాకా కనబడుతున్నాయి. కృష్ణమాచార్యులు ఆంధ్రదేశంలో వైష్ణవ పుణ్యక్షేత్రాలన్నిటిని దర్శించినట్టు అన్నమయ్య కూడా

దర్శించాడు. కృష్ణమాచార్యులు తన సంకీర్తనంలో వర్ణించినట్లు అన్నమయ్య కురువరతినంబి, అనంతాళ్వారు మొదలయినవారిని ప్రత్యేకించి కీర్తించినాడు. కృష్ణమాచార్యులకు పదారవయేట స్వామి సాక్షాత్కారమయినది. ఇవేగాక ఇరువురి రచనల్లోను కొన్ని సామ్యాలు కనిపిస్తాయి. మచ్చుకు—

హరిభక్తిలేని విద్వాంసుని కంటెను హరికీర్తనము సేయునతడె కులజుండు శ్వపచుండైన నేమి? ఏ వర్ణంబైన నేమి?

అన్న: వేదములు చదివియును విముఖుడై హరికథలు
నాదరించని సోమయాజి కంటె
ఏదియును లేని కులహీనుడైనను విష్ణు
పాదసేవకుడు వో బ్రాహ్మణోత్తముడు
పరమమగు వేదాంతపఠన దొరికియు సదా
హరి దలచని సన్యాసి కంటె
మరగి పసురము దినెడి మాలయైనను వాడె
పరమాత్మ కొలిచినను బ్రాహ్మణోత్తముడు 11-3-117

కృ: దేవా! గీత ప్రబంధములచేత మిమ్ము మెప్పించెదనంటినా
కిన్నర కింపురుష గరుడ గంధర్వ సనక సనందన సనత్కుమార
పరమ భాగవతులు, నారదాదులు మీ సన్నిధినే యున్నారే.
విందులు పెట్టి మిమ్ము మెప్పించెద నంటినా విదుర భరద్వాజులు
శబరి మొదలయినవారు మీ సన్నిధినే యున్నారే

వారిధి దాటి మెప్పించ వాయుజుడ నేగాను
సారె చవుల మెప్పించ శబరిగాను....
ఘనముగ మోచి మెప్పించ గరుడుండనేగాను
సవ్వము పాడి మెప్పించ నారదుడ నేగాను

రాగ తాళాదులతో కృష్ణమాచార్యులు రామనామాలు, నృసింహనామాలు వ్రాసినట్లే అన్నమయ్య అనేక సంకీర్తనలను వ్రాశాడు. కృష్ణచార్యులు తన సంకీర్తనల్లో తళియ, అడియేన్, తిరువడిగళ్ మొదలయిన వైష్ణవ పరిభాషలను వాడినట్లే అన్నమయ్య కూడా విరివిగా వాడాడు.

అన్నమయ్య - త్యాగయ్య :

కొండలమధ్య పుట్టి కోనల్లో పెరిగి కొండలరాయనిపై నిండయినభక్తి నిలుపుకున్నవాడు అన్నమయ్య అయితే నదీతీరంలోపుట్టి నాదోపాసనచేసి తరించిన వాడు త్యాగయ్య. ఇద్దరిది పండితవంశం. ఇద్దరికి భార్యలిద్దరు. ఇద్దరు బాల్యదశలో ఇబ్బందులుపడినవారే. పూజావిగ్రహాలుపోగా ఇద్దరు భగవంతునికి విన్నపాలు చేసికున్నవారే. రోజుకొక్క కీర్తనవంతున వ్రాయడం అన్నమయ్య వ్రతమయితే వాల్మీకి రామాయణ శ్లోకాలను దీటుగా 24 వేల కృతుల్ని త్యాగయ్య వ్రాశాడని ప్రతీతి. అన్నమయ్య సంగీతసాహిత్యాలకు సమానస్థానం కల్పిస్తే త్యాగయ్య సంగీతానికి, ప్రత్యేకించి 'ధాతుకల్పన'కు అవకాశమెక్కువ ఇచ్చాడు. అన్నమయ్య సంకీర్తనల ఛాయలు త్యాగయ్యలో విరివిగా కనిపిస్తాయి.

| | | |
|---|---|---|
| అన్న : | పెద్ద తెరువుండగాను పెడగంతలుదీసుక<br>పొద్దువోక యడవులఁ బుంగుడయ్యేరు | 9-94 |
| త్యాగ : | చక్కని రాజమార్గములుండ<br>సందుల దూరనేల ఓ మనసా | 1-398 |
| అన్న : | ఎంత సోదించిచూచినా ఎన్నెన్ని చదివినా | 8-28 |
| త్యాగ : | ఎంత నేర్చిన ఎంత చూచినా<br>ఎంతవారలయిన కాంతదాసులే | 1-282 |
| అన్న : | సంసారమే మేలు సకల జనులకును<br>కంసాంతకుని భక్తికలిగితే చాలు | 9-159 |
| త్యాగ : | సంసారులైతే నేమయ్యా శిఖి పింఛావ<br>తంసు డెదుటనుండగ | 2-208 |

| | | |
|---|---|---|
| అన్న : | దొరకునా యితనికృప తుదిపదంబు | 1-353 |
| త్యాగ : | దొరకునా యిటువంటి సేవ | 1-440 |
| అన్న : | ఊరకే కల్గునా ఉన్నతోన్నతసుఖము | 6-104 |
| త్యాగ : | ఊరకే కల్గునా రామభక్తి | 1-190 |
| అన్న : | కనుగొను నీ విగ్రహమే గ్రహబలమిది నాకు | 6-109 |
| త్యాగ : | గ్రహబలమేమి శ్రీరామానుగ్రహబలమే బలము<br>గ్రహబలమేమి తేజోమయ వి<br>గ్రహమును ధ్యానించేవారికి నవ | 1-395 |
| అన్న : | తనువే గుడియట తలయే శిఖరమట<br>పెనుహృదయమే హరి పీఠమట | 6-62 |
| త్యాగ : | తనువే నీకనువైన సదనమురా రఘునాథ<br>స్థిరచిత్తము వరచామీకరపీఠము రఘునాథ | 1-127 |
| అన్న : | నీవంటి దైవాలు లేరీ నిఖిలలోకములందు | 10-240 |
| త్యాగ : | నీవంటి దైవమును షడానన నే నెందుగానరా | 2-11 |

'పాదేమునేము పరమాత్మ నిన్నును
వేడుక ముప్పదిరెండువేళల రాగాలను'

అని అన్నమయ్య సామవేదనాదవినోదుని కీర్తించినట్టే త్యాగయ్య 'శోభిల్లు సప్త స్వర సుందరుల భజింపవే మనసా!' అని హెచ్చరిక చేసుకున్నాడు. 'అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన రచనాంశము త్యాగయ్య'.

**అన్నమయ్య - క్షేత్రయ్య :**

అన్నమాచార్యుని తరువాత అంతటి వాగ్గేయకారుడు క్షేత్రయ్య. సంగీత సాహిత్యాలతో పదాభినయానికి ప్రాధాన్యంతెచ్చిన వాగ్గేయకారుడు క్షేత్రయ్య. అన్నమయ్య వేంకటేశ్వరుణ్ణి భజిస్తే వరదయ్య మువ్వగోపాలుని నమ్ముకున్నాడు. అన్నమయ్య కర్ణాటాంధ్ర తమిళప్రాంతాలలోని వైష్ణవాలయాలు సేవిస్తే వరదయ్య

ప్రధానంగా తమిళప్రాంతంలోని క్షేత్రాలను దర్శించినట్టు తెలుస్తుంది. అన్నమయ్య సంకీర్తనలు 22 వేలయినా 12 వేలు దక్కినట్టు క్షేత్రయ్య పదాలు 4000 అయినా సుమారు 400 మాత్రం దక్కాయి. అన్నమయ్య సంకీర్తనల్లో ఆనాటి రాజుల పేర్లు కనిపించవుగాని క్షేత్రయ్యపదాలలో మధుర, తంజావూరు, గోలకొండ పాదుషాలపేర్లు కనిపిస్తాయి. త్యాగయ్య ఆధ్యాత్మికభక్తికి అగ్రతాంబూలమిస్తే క్షేత్రయ్య 'మధురభక్తి'ని అభిమానించాడు. అయితే తెలుగు నుడికారంతో, భావ వ్యక్తీకరణలో సంఘటనను ఏరుకోవడంలో అన్నమయ్యమార్గంలో క్షేత్రయ్య నడిచాడని చెప్పడం సబబు.

అన్న : నాకుంజెప్పరె వలపు నలుపో తెలుపో

క్షేత్ర : వలపనే దెటువంటివస్తువో తెలియదే

అన్న : కొండలో కోవిలకుయ్య గుండెపగిలే

క్షేత్ర : కోడికూసె నయ్యయ్యో నా గుండె ఝల్లుఝల్లుమనెనే

అన్న : ఆపాటి చుట్టరికమదె చాలును
బాగుగ తా నేడనైన బతికితే చాలుగాక

క్షేత్ర : అక్కరో నను బాసినందు కాడితి నింతే
చక్కని మా మువ్వగోపాలు డెక్కడ నుండితేనేమి

అన్న : ఆడదాని బతుకింత అరడికద్దా

క్షేత్ర : అడపుట్టువు పుట్టు నన్నలయాంతుర

అన్న : చిత్తరువు వ్రాయబోతె చెలియకు నంతలోనె
హత్తి నీ రూపుతోచె

క్షేత్ర : ఊరకుండలేక గోర నే వ్రాసిన నీ రూపుగాతోచురా

తాళ్ళపాక అన్నమయ్య 'వేంకటేశ్వరుని కలిసిన అలమేలుమంగమ్మను

"పలుకుతేనెల తల్లి పవళించెను
కలికితనముల విభుని కలసినదిగాన" అని వర్ణిస్తే

క్షేత్ర: "కంచివరదుని కలసిన 'అమ్మవారి'ని

మగువ తన కేళికామందిరము వెడలన్

వగకాడ మా కంచివరద తెల్లవారె ననుచు"

అనుచు పడకిల్లువదలి పరవశంలోవచ్చిన వైనాన్ని వర్ణించాడు.

అన్నమయ్య సుమారు వందకుపైగావున్న రాగాలలో సంకీర్తనలు వ్రాస్తే క్షేత్రయ్య వాడిన రాగాలు 39 మాత్రమే ముఖారి, ఆహిరి, కాంభోజి రాగాలకు ఇద్దరూ ప్రాముఖ్యమిచ్చారు. అన్నమయ్యలాగే క్షేత్రయ్య శృంగార సంకీర్తనములలో ఆహిరి, కాంభోజి రాగాలను విరివిగా వాడారు. అన్నమయ్య శృంగార సంకీర్తన రచనాంశం క్షేత్రయ్య అనడం సబబు.

అన్నమయ్య – శాహజీ:

తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజైన 'ఏకోజీ' కుమారుడు శాహజీ. ఇతడు పూర్తిగా స్థానికులతో కలసిపోయి ద్రావిడభాషా కవిపండిత పోషకుడయ్యాడు. ఇతని రచనలు దాదాపు 20 దాకా వున్నాయి. ఇతని విష్ణుపల్లకి సేవాప్రబంధం, శంకరపల్లకి సేవాప్రబంధంలోని కొన్ని పదాలు అన్నమయ్య పదాల్ని తలపిస్తాయి. తాళ్ళపాక అన్నమయ్య అమ్మవారి పల్లకీ సేవను

"కులుకక నడవరో కొమ్మలాల

జలజల రాలీని జాజులు మాయమ్మకు

ఒయ్యన మేను గదలీ నొప్పుగా నడవరో

గయ్యాళి. 'శ్రీపాదతాకు కాంతలారా"

అని వర్ణిస్తే శాహజీ ఉమామహేశ్వరులు నాయికా నాయకులయిన శంకరపల్లకి సేవా ప్రబంధంలో

"కదలింపకు రోయి పల్లకి

కదలనీక రోయీ చాల

మృదువైన జంగమయ్య మేను నొచ్చీని

హరువున మెలమెల్లన అడుగు లిడరోయి
పురవైరికి బడలిక పుట్టవోయీని

అని స్వామి బడలికను వర్ణించాడు. అలాగే విష్ణు పల్లకి సేవాప్రబంధంలో

సొగసు పల్లకి చూడవే కలికి
తెగువను బోయలు దెచ్చిరి హరికి"

అని స్వామివారికి సన్నద్ధం చేసే పల్యంకోత్సవాన్ని వర్ణించాడు.

అన్నమయ్య - యాగంటి కవులు :

యాగంటి పదాలలో ఎక్కువ భాగం వ్రాసినవారు గార్లపాటి లక్ష్మయ్య. ఇతడు అన్నమయ్యకు పూర్వుడని, సమకాలీనుడని, తరువాతివాడని భిన్నాభిప్రాయాలున్నాయి. అయితే యాగంటి కవి ఒకడు కాడని మరికొందరున్నారని అందువలననే యాగంటి కవులనే వ్యవహారం. అయితే ఇద్దరూ రాయలసీమవాసులనడంలో సందేహం లేదు.

భగవంతుని యథార్థ స్వరూపం తెలుసుకోలేక ఇంతకాలం మోసపోయామని ఆవేదన చెందడం ఇద్దరిలోనూ సమానం. అలాగే 'సంసార నిరసన' కు సంబంధించిన వివరణ

యాగంటి : ఎందరో తల్లిదండ్రులు బిడ్డలెందరో మున్నెందరో సతులు
ఎందరో తోడ బుట్టువులు తనకెందరో

అన్న : అన్నలంటా తమ్ములంటా ఆండ్లంటా బిడ్డలంటా
వన్నెల అప్పుగొన్న వారులో వీరు

తగ బంధులా తనకు తల్లులను తండ్రులను
వగల బెట్టుచు తిరుగువారే గాక

యాగంటి పదాల 'ఏల'లను దృష్టిలో పెట్టుకుని అన్నమయ్య 'ఏలలు' వ్రాసినట్టు పలువురు పరిశోధకులు భావిస్తున్నారు.

యాగంటి : కానరాని అడవిలోన
వాన లేని మడుగు నిండె
వాన లేని మడుగు మీద - యేగంటి లింగ
మానరాని అగ్ని పొదమేరా

అన్న : మేడలెక్కి విన్ను చూచి
క్షూ డేననే యాసతోడ
వాడుదేరి వుస్సురందురా - వేంకటేశా
యాడనుంటి విందాకనుధా

ఈ ఏలల్ని అనుసరించి కందుకూరి రుద్రకవి, దళవాయి తిమ్మభూపాలుడు మొదలయినవారు ఏలలు రచించివుండవచ్చు.

ఆంధ్ర వాగ్గేయకారులలో అందరికంటె ఎక్కువగా కీర్తనలు వ్రాసిన ఘనత అన్నమయ్యదే. అలాగే లభ్యమయిన సంకీర్తనల నిష్పత్తిచూసినా అన్నమయ్య రచనలే ఎక్కువ విలిచాయని చెప్పవచ్చు. అన్నమయ్యలాగా విస్తృతంగా తిరిగిన వాగ్గేయకారుడు ఆంధ్ర వాగ్గేయకారులలో కనిపించరు. ఆధ్యాత్మిక, శృంగార సంకీర్తలనే విభాగంలో అన్నమయ్య వ్రాస్తే తరువాతివారు ఒక్క విభాగానికే పరిమితమయ్యారు. జానపదగేయ ఫణితులయిన లాలి, తుమ్మెద, సువ్వి, అల్లో నేరేళ్ల, గొబ్బి, జాజర, పోది, తందాన, ఏల, కోలాట, చందమామ, శోభన, హారతి, ఉయ్యాల, జోళ, మంగళగీతాలను సంకీర్తనలలో పొందుపరచడం అన్నమయ్య ప్రత్యేకత. అలాగే భాషావిషయంలోనూ స్వాతంత్ర్యం వహించిన వాడు అన్నమయ్య. తాను వైష్ణవుడయినా ఆనాడు ప్రచారంలోవున్న ఇతర వైష్ణవ శాఖలను ఆదరించి సమన్వయించి విస్తృతవైష్ణవం నిలిపిన వాగ్గేయకారుడు అన్నమయ్య

అపురూప మైనట్టి ఆధ్యాత్మ కీర్తన
లు భక్తితో నెవ్వడు పాడినాడు
చిత్తంబు గరగించు శృంగార పదముల
ననురక్తియై యెవ్వ డల్లినాడు

తనకు దీటగునట్టి తనయులు కలుగంగ
ధన్యుడై యెవ్వాడు తనరినాడు
సాహిత్య సంగీత సమ్మాన్య మూర్తియై
జగతిలో నెవ్వాడు సాగినాడు

దివ్య దేశాల నెవ్వాడు తిరిగినాడు
వైష్ణవంబును నెవ్వాడు వలచినాడు
శ్రీనివాసుని భక్తుడై చెలగె నెవడు
అట్టి యన్నమాచార్యుని కంజలిడుదు

# 'సుబ్రహ్మణ్య భారతి'

రష్యన్ రచయిత పుష్కిన్‌లాగా కేవలం నలభై సంవత్సరాలు మాత్రం జీవించినవాడు, అమెరికన్ రచయిత వాల్ట్‌విట్‌మన్ లాగా ఆడవారి కోసం అసంఖ్యాక రచనలు చేసినవాడు, బంకించంద్ లాగా దేశభక్తిని పెంచినవాడు, ఇక్బాల్ లాగా భారతీయతను అభిమానించినవాడు, గురజాడ అప్పారావుగారి లాగా పాత కొత్తల మేలు కలయికను మనస్ఫూర్తిగా కోరినవాడు తమిళ కవి సుబ్రహ్మణ్య భారతియార్.

సుబ్రహ్మణ్య కవి తమిళనాడు రాష్ట్రంలో తిరునెల్వేలి జిల్లా ఎట్టయాపురంలో 1882 వ సంవత్సరం డిసెంబర్ 11 వ తేదీన సామాన్య కుటుంబంలో జన్మించాడు. పసితనంలోనే తల్లిని కోల్పోయాడు. తండ్రి చిన్నస్వామి అయ్యర్ భారతియార్‌ను గారాబంగా పెంచాడు. 15 వ ఏట చెల్లమ్మాళ్‌ను సహధర్మచారిణిగా ఎన్నుకున్నాడు. 1921 వ సంవత్సరం సెప్టెంబరు 12 వ తేదీన ఏనుగుచాతబడి అకాలమరణం పాలయి అమరజీవి అయ్యాడు.

సుబ్రహ్మణ్య కవి బహుముఖ ప్రజ్ఞావంతుడు. బాల్యంలో ఎట్టయాపురం సంస్థానంలో అతడొక చిన్న ఉద్యోగి. కొంతకాలం మధురైలో తమిళపండితుడు. మరికొంతకాలం మదరాసులో పాత్రికేయుడు. ఇంకా కొంతకాలం భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో భాగం పంచుకున్న వీరుడు. అయినా ఇతని కీర్తి కవితల్లో నేటికి గుబాళిస్తూనే వుంది.

ప్రాచీన కవి లక్షణాలలో 'వైదుష్యం' ఒకటి. పాండిత్యం లేని కవిని ఆదరించడమో గౌరవించడమో కలలో కూడా కాని పని. ఆంగ్లాది భాషలతో పరిచయం, తర్క సంగీతాది శాస్త్రాలతో పరిచయం, తమిళంలో తరగని పాండిత్యం వల్లనే సుబ్రహ్మణ్య కవి పదకొండవయేటనే ఎట్టయాపురం సంస్థానంలో ప్రతిష్ఠాత్మకమయిన భారతి బిరుదాన్ని దక్కించుకున్నాడు. సమకాలీనులల్లో అసమానుడని నిరూపించుకున్నాడు.

'ప్రకృతికిన్ భాష్య ప్రణేతల్ కవుల్' అనడం మన సంప్రదాయం. వేదకాలం నాటి మహర్షులు, ప్రాచీన కవులు ప్రకృతిని చూచి పరవశించిన వారే. ప్రకృతిని ఉపాసించిన వారే. ప్రకృతి రామణీయకతను పద్యాలలో వివరించిన వారే. సుబ్రహ్మణ్య కవి ప్రకృతి ప్రియుడు. అతని దృష్టిలో ప్రకృతి చైతన్యపు ముద్ద.

ప్రపంచంలో జడ పదార్థమన్నది లేదు
మట్టీ రాయి జడములు కానే కావు
పాడు పల్లె దైవం ఎడారి కడలి దైవం
ఏడు లోకాలూ దైవం, ప్రతిదీ దైవం.

భారతి దృష్టిలో అసౌందర్యమన్నది అసలు లేదు. కనుకనే కాకి నలుపురంగులో కూడా కన్నయ్యను చూడగలిగాడు. సూర్యుని చుట్టూవున్న మేఘాలను బంగారు పడవలుగా, మండుతున్న బంగారు దీవులుగా దర్శించగలిగాడు. ప్రకృతి వర్ణనలలో వ్యంగ్యాన్ని సునిశితంగా చెప్పిన కవి భారతియార్. గాలికి సంబంధించిన కవితలో

"కొండ గాలి మంచిది
కడలి గాలి మందు
ఆకాశల నుండి వచ్చే గాలి మంచిది
ఊరి మీద వచ్చే గాలి విరోధి"

అనడంలో కలుషితమయిన మానవ మనస్తత్వం తెలుస్తుంది.

భక్తికి కవిత్వానికి దగ్గరి చుట్టరికం. ప్రాచీన కవులందరూ భక్తులే. అయితే భారతియార్ భక్తి కవిత్వం పలాయన మంత్రంతో ముడివడింది కాదు. నిరాశా జనకమయిన వాతావరణంలో పెట్టిన కేకలు కావు. తన్మయత్వంతో తన్ను తాను మరచిపోయేటట్టు చేసినవి కావు. అతడు ఇతర దేవతలను కొలిచినా ప్రధానంగా కాళికామాత ఉపాసకుడు. ఆ ఉపాసనలో సంప్రదాయ ధోరణులున్నాయి. సమాజాన్ని చైతన్యవంతం చేసే అభ్యుదయ భావాలు కూడా వున్నాయి. కనుకనే ఒక సారి భారతియార్

'సర్వమూ నీవయై కాళి సర్వత్ర నిండి వున్నావు
మంచి చెడ్డలు కాళి దైవలీలలు కావా'

అంటూనే

"పామును చంపే బలం శక్తి
దేశాన్ని కాపాడే జ్ఞానం శక్తి
నైచ్య నివారణోపాయం శక్తి
పతనాన్ని నిరోధించే పౌరుషం శక్తి'

అని ప్రబోధించాడు.

'కవనార్థ మ్ముదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి' అని చెళ్ళపిళ్ళ వారంటే 'మా వృత్తి కవన మల్లడం మాత్రం కాదు దేశానికి సేవ చేయడం' అని సాంఘిక బాధ్యతను ఇతరులకు గుర్తుచేసిన మహాకవి భారతియార్. ఈ దృష్టి కలవాడు కావడం వల్లనే ఎట్టయాపురం సంస్థానంలోని చిన్న ఉద్యోగాన్ని తనంత తాను వదులుకున్నాడు. జమీందారులకు ప్రబంధాలను వినిపించే బంధాన్ని తెంచు కున్నాడు. దారిద్ర్యం కారణంగా ఇతరుల దగ్గర ఊడిగం చేయడంవల్ల కవితకు తాను చాలా దూరమయినట్టు చాల పాటల్లో వాపోయాడు. కవితను ప్రేయసిగా భావించడం భారతియార్ ప్రత్యేకత.

కవితలో కాల్పనిక ప్రపంచం అనివార్యం. కాని అదే గమ్యం కాదు. వాస్తవిక జగత్తును మరచిపోవడం నేల విడిచిన సాము. భారతియార్ కుయిల్ పాట్టు (చిలుక పాట) లాంటివి వ్రాసినా, పాంచాలీ శపథం లాంటి ప్రాచీన ఇతివృత్తాల కవితలు వ్రాసినా నూతన సందేశం వినిపిస్తాడు. భారతదేశ దాస్యం పాంచాలి వ్యథలో ఉరకలు వేస్తుంది. పరులకు రాజ్యమప్పగించడం తగదనడంలో ధర్మరాజుపై దాడి కనిపిస్తుంది.

ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం విడిగా వున్నరోజుల్లో అఖండ భారతీయతను గుర్తించినవాడు భారతియార్.

సింగళ దీవికి సేతువు కట్టేము సేతువునేమో వీథిగ తీర్చేము
వంగదేశపు మిగులు నీటితో మధ్యదేశంలో పైరు చేసేము
సింధు నదిని పండు వెన్నెలలో చేర దేశపు వయసు కన్నెలతో
తేట తెలుగున పాట పాడుతూ పడవ నడిపి తిరిగి వచ్చేము

అనడం ఆ రోజుల్లో కవుల ఊహలకు కూడా రాని అపురూపమయిన భావన. అంతే కాదు. స్వాతంత్ర్యం వస్తుందా, అంతా వ్యర్థప్రయత్నమేనా అని గాంధి లాంటివారు కూడా సందేహిస్తున్న కాలంలో

"ఆడుదాం పాడుదాం
ఆనందప్రదమయిన స్వాతంత్ర్యం వచ్చేసిందని"

పాట వ్రాయడం దీర్ఘదర్శకత్వానికి నిదర్శనం. ప్రజాస్వామ్యం తప్పక వస్తుందని అతని భావన. అంచేతనే

'అందరూ సమానులు, సమధర్ములు
అందరూ ఈ దేశపు రాజులు
మనమందరం ఈ దేశపు రాజులం'

అన్నాడు. తమిళంలో దేశభక్తి గేయాలను భారతియార్ లాగా విరివిగా వ్రాసిన వారు లేరు. తెలుగులో గరిమెళ్ళ సత్యనారాయణ భారతియార్ లాంటివాడే.

కదిలేది, కదలించేది కవిత్వమవుతుంది. సాటిమానవుల అభ్యున్నతికి బాట వేసేదే ఉత్తమ కవిత్వం. ఆ అభ్యున్నతికి అడ్డగోడలైన జాతి మమకారం, దారిద్ర్యం, మూఢ విశ్వాసాలమీద భారతియార్ విరుచుకుపడిన పాటలెన్నో. సామాన్య వ్యక్తికి తినడానికి తిండి లేకపోతే ప్రపంచాన్ని కాల్చివేద్దాం అనడంలో విప్లవవాదం వినిపిస్తుంది. వేదాలను ఎంతగా అభిమానించినా సామాజిక దృష్టితో 'వేదం పుదుమై సెయ్' వేదం కొత్తది కల్పించాలని ఆదేశించాడు.

భారతియార్ తమిళుడే. తమిళాన్ని అభిమానించినవాడే. అయితే భారతీయతలో తమిళాభిమానం అంతర్వలయం. అతనికున్న అంతర్జాతీయ అవగాహన ఆనాటి కవులలో ఎవరికీ లేదు. రష్యాలో జార్ చక్రవర్తుల పతనానికి స్పందించి

'మహాకాళి పరాశక్తి కడగంట చూసింది రష్యాని
ఆవిర్భవించిం దొక విప్లవం'

అని జేజేలు పలికాడు. ఆలాగే బెల్జియం స్వతంత్రదేశమయినప్పుడు సంతోషించి 'బెల్జియం వర్ధిల్లాలి' అంటూ కవిత వ్రాశాడు.

భారతియార్ కవితకు సారళ్యం జీవం. జానపదగేయ వరుసలు ప్రాణం. అంతే కాదు భారతియార్ ఒక వర్గానికే కాకుండా అందరికి హితబోధ చేశాడు. చిన్నపిల్లలకు పాటలు. కోణంగి పాట, బండివాని పాట, బుడ బుక్కలవాని పాటలు ఉదాహరణలు. స్త్రీల అభ్యున్నతికోసం పెణ్ విడుదలై (స్త్రీ విముక్తి) పుదుమైప్పెణ్ (క్రొత్తరకం మగువ) లాంటివి వ్రాశాడు.

"లోకానికి మంచే చెబుతాను - నాకు
తెలిసిన సత్యాన్ని తప్పక చెబుతాను"

అని జీవితాంతం చెప్పిన కవి భారతియార్. సాహిత్యాన్ని శక్తివంతమయిన ఆయుధంగా మలచుకున్న తమిళ కవులలో భారతియార్ అద్వితీయుడు. అతని పంథాలో నడచిన వారెందరో. తమ పేర్లను గూడా మార్చుకున్న కవులు-ఉదాహరణకు భారతిదాసన్ లాంటివారు - తమిళనాడులో కనిపిస్తారు. తిరుపతి వేంకటకవుల శిష్యులనడం ఎంత గౌరవమో భారతియార్ పంథాలో నడవడం అంత గౌరవప్రదం.

ఒక్క మాటలో చెప్పాలంటే భారతియార్ భావ కవి, గేయ కవి, జాతీయ కవి, అన్నిటికి మించి మానవతా వాది. అభ్యుదయ కవి.

(ఆల్ ఇండియా రేడియో, కడప.)

11-4-91